వంతులు కొంద ఱున్నారు. వారే లేకుండునెడల ద్వాదశార్కు లుఁ దయింపవలసినదే! పుష్కలావర్తమేఘములు తెగిపడి వర్షింపవలసినదే బ్రహ్మ పునస్సృష్టికై తిరుగ నడుముఁ ద్రొక్కవలసినదే!——

ఇఁక మనుష్యులొనర్చు నేరములు మొదలగువానిఁగూర్చి కొంత విచారింతము. పెట్టిననాయ్యస్థానములను బెట్టుచునేయున్నారు. వేసిన న్యాయాధిపతులను వేయుచునేయున్నారు. చేర్చుకొనిన న్యాయవాదులను జేర్చుకొనుచునేయున్నారు. పెరుగుచున్న వ్యాజ్యములు పెరుగుచునే యున్నవి. పెంచుచున్న శిక్షాశాసనశాస్త్రములను బెంచుచునే యున్నారు. పెంచుచున్న రక్షకభటసంఖ్యను బెంచుచునేయున్నారు. పెరుగుచున్న నేరములు పెరుగుచునేయున్నవి. కట్టించుచున్న కారాగృహములను గట్టించుచునేయున్నారు. ఎదుగుచున్న కారాబద్ధుల సంఖ్య యెదుగుచునేయున్నది. నరహత్యచేసినవారిని జంపుటకు నానావిధయంత్రములు కల్పించుచునేయున్నారు. హత్యలు వృద్ధియగుచునే యున్నవి. నేరము శిక్షనొందినకొలఁది వృద్ధినొందుచున్నట్లున్నది. నేరమొనర్చుటవలన బీదల కన్నము దొరకుచున్నది.

అయినను ప్రత్యేకరాజకీయదండనము మాత్రమే నేరము నణగఁద్రొక్కఁజాలదు. దానికిఁ దోడు సంఘశిక్ష యుండవలయును. సంఘశిక్ష యనఁగ నేరగానితో నెవ్వరు జోక్యము కలుగఁజేసికొనకుండుట. అతనిని సభలోనికి రానీయకుండుట. అతనిని గౌరవింపకుండుట. అతనిని సంఘమునుండి యొకవిధముగ బహిష్కరించి యాతనిని సంఘాగ్రహపాత్రునిఁ జేయుట. పదిసంవత్సరముల కఠినశిక్షకంటెఁ బదిమంది సంఘమువలన నేరగానిఁగూర్చి వేయఁబడిన యనాదరణము నేరము నాపుటలో బలవత్తరమైనది.

రాజకీయదండనము గల యీనేరములకే సంఘదూషణము నేరము నడఁగించుటకుఁ గావలసివచ్చినప్పుడు, రాజకీయదండనము లేని మొదటఁజెప్పిన నేరములకు—మనుజుల మాయాప్రచారములకు—సంఘదూషణ (Social Odium) మావశ్యకమైయుండదా? ముఖ్యముగ నుండును. ఉండక తప్పదు. ఇట్టినేరములఁగూర్చియే మే మిఁక వ్రాయుచుందుము. నేరముల వెల్లడింతుము. వానిస్వభావముల విశదపఱతుము.

ఆహా! గృహకృత్యముల నాతని దుర్నయమును దలఁచుకొనఁగ, గడుపు మఱింత మండిపోవునుగదా? యెంత సేపటికిఁ దనసౌఖ్యము, తనకీర్తి, తనయారోగ్యము, తనయైశ్వర్యము తనయాయుస్సే కద! కేవలాత్మీయవాంఛాలంపటతాతిపంకిలాత్ముఁడు పరశ్రేయస్స్పృహాభావ స్వభావదుర్భరుఁడు సహనము బిగించుకొని జొల్లుఁ గార్చుకొనుచు జేతికఱ్ఱ టక్కుటక్కున నేలఁదాటించుకొనుచు దౌహిత్రుఁడు వారి చూపుచుండఁ దొమ్మిదవసారి గర్భదానపుపీటలపైని "హాహారా" యనుచుఁ దాను జదికిలఁబడును గాని పదుమూఁడేండ్లనిండని[illegible]కుఁ బునర్వివాహము దూష్యమని చెప్పును? ఈతనికి న్యాయాదాక్షిణ్యము లున్నవా? ఔచిత్యమున్నదా? హృదయమున్నదా? ఈతఁడు ప్రాణి కోటిలోనివాఁ డగునా కాదా? తా నెన్నితప్పుతిరుగుడులు తిరిగిన నది శిష్టాచారమా? తా నెన్నివంకరూఁతలు కూసిన నవి వేదాక్షర ములా? అవి మనకు దూష్యములు శిక్ష్యములు. నరకాహ్వము లునా? భగవంతునికిఁగూడ నిక్క మతిపోయెనా? అతనిచట్టములు గూడ నింతపక్షపాతప్రబలము లేనా? అతనినోట వెడలినశ్రుతులు గూడ మన కధోగతిప్రదములేనా? ఆహా! ఎంతదురన్యాయము! ఎంతదుర్నీతి మగవాని మనసే మనసా! ఆతనిమాటయే మాటయా? మన మాతనియానతుల శిరమున వహించి నోరు మూసికొని యుండ వలసినదా? మనకేమి సిగ్గుబిడియములు లేవా? ఆత్మగౌరవము లేదా? అహంకారము లేదా? అవస్తువులమా? అసువులు లేని మట్టిబొమ్మ లమా? అతనియిష్టానుసారముగఁ గామతంత్రము నిర్వహించుకొనుటకు మన మేమి పట్టితోలుతిత్తులమా? మనము సింగారించుకొని వాకిట నిలువఁబడఁగూడదా? మోకాలుచిప్ప లూడగొట్టుకొని పంచ పాళీలోఁ గూర్చుండవలయునా? వీధిలోఁబోవువారి నెవరినైనఁ జూడఁ గూడదా? కన్నులలో జీడిపెట్టుకొని గడపమూలలను గూర్చుండవల యునా? మన మెవరితోడనైన స్వేచ్ఛగ మాటాడఁగూడదా? నోటిలో లద్దిఁగొట్టుకొని యుండవలయునా? తాను—తాను, తన యిష్టాను సారముగఁ దిరుగుటా? స్వేచ్ఛగఁ గనఁబడినకాంతలతోఁ బరిహాస ముగా మాటలాడుటా? రాత్రులు రెండుయామములవఱకు నిల్లు సేరకుండుటా? చందనచర్చతో నత్తరపువాసనతో వచ్చి దేవుఁడా

# సాక్షి

## 5. గ్రహచక్రజ్యోతిషము.

నిన్నటి యలవాటు ననుసరించి జనులు మూఁగిరి. నేనుగూడఁ బోయి లోనఁ గూర్చుంటిని. "ఎండలప్పుడే మిగులఁ దీవ్రముగ నున్నవి! వైశాఖమాసమున నెట్లుండునో" యని నేను యాదృచ్ఛికముగఁ బలుక నంతవఱ కేమియు మాటలాడక యేదియో తనలోఁ దా నాలోచించుకొనుచుఁ దలవంచుకొని కూరుచుండియుండిన జంఘాలశాస్త్రి తటాలున లేచి యుపన్యాసపీఠ మెక్కి యిట్లు పలుకదొడఁగెను.

"కావా? ఎక్కువగుచునేయున్నవి. ఇఁకయు నెక్కువగును. భరించుటకైన శక్యముకాకుండ నెక్కువయగును. ఈనిదాఘతీవ్రత్వ మునుగూర్చి మనమేమో నిర్లక్ష్యముగఁ జూచుచున్నారము. మన కేమో చీమకుట్టినట్టులైన లేకుండనున్నది. ఇది యింతలో కోపద్రవమో కాసంతయైన మనవారెవ్వరు నాలోచింపరైరి. ఆ [illegible] ారు, యెంత యజ్ఞా నము. ఏసంవత్సరమున కాసంవత్సర మెండలు [illegible] ం తమవుచున్నవి. వర్షములు తగ్గిపోవుచున్నవి. భూమిలోనిసాం [illegible] ాని ప్రత్యేక భూగర్భమున నుండునగ్ని యధిక మగుచున్నది. [illegible] ము తనకుఁదగిన సములగుచున్నవి. మనుజులమాట చెప్పవలసినదేవి [illegible] లు మిగిలిపోవు జీవించినమనుజుఁ డెవఁడైన దైవమహాత్మ్యమున [illegible] రేనుగూడ నొక గాంచునెడల మనము మనుజజాతిలోనివారమ [illegible] శమున గుర్తు జాలఁడు. గేదెముందు లేతపెయ్య లెటులు [illegible]. అది తెల్ల మట్టు లగపడుదుము. మనకింక నెట్టికొంకనక [illegible] చి నాలెంపపై బాలిక రజస్వల యగుచున్నది. పదునాలు [illegible] టిని, వీరావేశ

# సావిత్రి

## 5. గ్రహచక్రజ్యోతిషము.

నిన్నటి యలవాటు ననుసరించి జనులు మూఁగిరి. నేనుగూడఁ బోయి లోనఁ గూర్చుంటిని. "ఎండలప్పుడే మిగులఁ దీవ్రముగ నున్నవి; వైశాఖమాసమున నెట్లుండునో" యని నేను యాదృచ్ఛికముగఁ బలుక నంతవఱ కేమియు మాటలాడక యేదియో తనలోఁ దా నాలోచించుకొనుచుఁ దలవంచుకొని కూరుచుండియుండిన జంఘాలశాస్త్రి తటాలున లేచి యుపన్యాసపీఠ మెక్కి యిట్లు పలుకఁదొడఁగెను.

"కావా ? ఎక్కువగుచునేయున్నవి. ఇఁకయు నెక్కువగును. భరించుటకైన శక్యముకాకుండ నెక్కువయగును. ఈనిదాఘతీవ్రత్వమునుగూర్చి మనమేమో నిర్లక్ష్యముగఁ జూచుచున్నారము. మనకేమో చీమకుట్టినట్టులైన లేకుండనున్నది. ఇది యింతలో కోపద్రవమో కాసంతయైన మనవారెవ్వరు నాలోచింపరైరి. ఆ ... ారు, ...మెంత యజ్ఞానము. ఏసంవత్సరమున కాసంవత్సర మెండలు ... తమగుచున్నవి. వర్షములు తగ్గిపోవుచున్నవి. భూమిలోనిసా... ...ాని ప్రత్యేక భూగర్భమున నుండునగ్ని యధిక మగుచున్నది. ...ము తనకుఁదగిన సములగుచున్నవి. మనుజులమాట చెప్పవలసిన దేవి... ...లు మిగిలిపోవు జీవించినమనుజుఁ డెవఁడైన దైవమహాత్మ్యమున ... ...రేనుగూడ నొక గాంచునెడల మనము మనుజజాతిలోనివారమ... ...శమున గ్రుద్ధు జాలఁడు. ...గేదెముందు లేతపెయ్య లెటులు ... అది తెల్ల మట్టు లగపడుదుము. మనకింక నెట్టికొంకనక ...చి నాలెంపపై బాలిక రజస్వల యగుచున్నది. పదునాలు... ...టిని, వీరావేశ

గ్రంథాదియందు స్పష్టముగఁ జెప్పియుంటిని. నేనుఁ బరబ్రహ్మమునం దనాదరణముగాని యాతని సేవించు నభిలాషగాని లేదు. నాయనా! మనము వ్రాసినది రామాయణముగాని పరబ్రహ్మాయణము కాదు. వ్రాసినది రామకథగాని పరబ్రహ్మకథ కాదు. పరబ్రహ్మమును గూర్చి వ్రాయఁదగినగాథ యేదియు లేదు. రాముఁడు పరబ్రహ్మమయ్యును కౌశల్య గర్భమునఁ బుట్టెనందువా? బాల్యలక్షణములగు రోదనాదిక్రియ లాచరించె నందువా! సుఖదుఃఖానుభవసామర్థ్యమున కుండఁదగిన మనుష్యవ్యక్తి కలిగె నందువా? సర్వవిధముల మనుజుఁ డయ్యెనని యొప్పుకొందువా? పరబ్రహ్మత్వమును బరిపూర్ణముగఁ బ్రచ్ఛాదింపఁ దలఁచుకొనియేకదా పరమపురుషుఁడు మానవుఁడుగ నయ్యెను. నరజన్మ మెత్తినయాతఁడు నరలక్షణము లగపఱుపఁదగునుగాని నారాయణలక్షణము లగపఱుపవచ్చునా? గొల్లవేషము వేసిన బాపనపగటిభాగవతుఁడు డొంకికఱ్ఱ చేతఁబూని పశువులఁ గాచుకొనఁదగునుగాని బ్రహ్మసూత్రపారాయణముఁ జేయవచ్చునా? శిష్టరక్షణార్థము దుష్టశిక్షణార్థము న్యాయపరిశీలనార్థము రాత్రులందు వీథులలోఁ దిరుగఁదగిన రాజు గోఁచియో గొంగళియో ధరించిన బిచ్చగాఁడై ముష్టిరూపు ముష్టిచూపు ముష్టిమాట గలిగి ప్రచ్ఛన్నుఁడై ప్రవర్తింపవలయును గాని కిరీటాంగదధారియై చతురంగసేనాసమేతుఁడై సర్వాధికారియై చరియింపవచ్చునా? రాధాకృష్ణవీథినాటకమునఁ గృష్ణవేషధారణ మొనర్చు పంగనామాలయయ్య బాడిదెకట్టెలమోపు నెత్తిపైఁ బెట్టుకొని ముక్కున నడ్డబొస యుంచుకొని ముఖారిరాగము పాడవలయునుగాని నాలాయిరము పఠింపఁదగునా? స్థితి కనుకూలమగు వేషము, వేషమున కనుకూలమగుభాష యుండుటతగునుగాని చాకివాఁడు సవారినెక్కి చాకిరేవునకుఁ బోవుట సందర్భముగ నుండునా? కాషాయాంబరధారి కళాశాస్త్రప్రశంస చేయఁదగునా? దేశకాలస్థితుల కర్హముగ నుండుటయే యధికయోగ్యతావధి—రాజునకు రత్నఖచితమగు కిరీట మెంత యర్హాలంకారమో యుప్పరివానికి నెత్తిపై మట్టితట్ట యట్టిది. విష్ణ్వాలయములో వేదఘోష మెట్లుతగునో వేశ్యావీథిని గీతసాధన మట్లు తగును. బాల్యావస్థలోని చిటిచిటిరోదనధ్వని యెంతముద్దో యుద్ధావస్థలో సమరశూరుని సింహగర్జన మంతముద్దు. నాయనా! పరబ్రహ్మతత్త్వ

మును నే నేడిపింపను లేదు. అది యేడువను లేదు. ఏడ్చినయాతఁడు పర బ్రహ్మత్వమును మఱచిన రాముఁడు. ఆతఁ డేడ్వఁదగినది కావుననే యేడ్చి నాఁడు. ఏడ్వఁదగినజ్ఞానముండి నేడ్వఁదగినస్థితి యేడ్వఁదగిన సాధనము లుండిన యాతఁ డేడ్వకుండుట దేశ కాలవిరోధమని నే నాతని నేడ్పించి తిని. నాయనా! ధీరోదాత్తుఁ డేడ్వఁదగునా? యని యధిక్షేపించితివి. ధీరోదాత్తుఁడు నల్లఱాయి కాఁడే? ఉక్కుతునక కాఁడే? వజ్రఫలకము కాఁడే? రక్తమాంసములును సుఖదుఃఖములు గలవాఁడే? మనుజకోటి లోనివాఁడే? బ్రతికియుండువాఁడు గాని ప్రాణహీనుఁడు కాఁడే? ఆప త్సహనశీలుఁడు, ధైర్యశాలి, శాంతుఁడే కాని కన్నీరు లేనివాఁడు కాఁడే? హృదయము లేనివాఁడు కాఁడే?

నాయనా! నీ వధ్యాత్మ రామాయణమున మాయాసీతను సృష్టించి యామెనే రావణుఁ డెత్తుకొనిపోయినట్లు చేసితివని చెప్పితివి. రామాయణమున కంతకు రసము సీతమ్మశోకముగదా? సీతమ్మనే రామాయణమునుండి తీసివైవ సాహసించితివా? ఎంతపనిచేసితివి? ఇఁక రామాయణమున జీవ మేమున్నది. మాయాసీత కల్లబొల్లి యేడ్పు లెవనిమనసు దూరును. భగవానుఁడైన శ్రీరామభద్రున కింక భార్యా వియోగ మేది? భరింపరాని యాపద యేది? సహియింపరాని దుఃఖ మేది? ఆమహామహునితో మనకు సహానుభూతి యేది? భార్యను భద్రముగ నొకచో దాఁచుకొని దొంగభార్యను లంకాధీశునకు బుద్ధి పూర్వకముగ నంటఁగట్టి "హాజానకీ! యెచ్చటకుఁ బోయితివి" యని నోట కఱచుటమాత్రమే కాని, కనులఁ జెమ్మయైన లేని, యెడఁదఁ గంపమైన లేని, గళమున గద్గదస్వరమైన లేని, హృదయమున రసమైన లేని—వట్టిదైన- చప్పనిదైన - రానిదైన-శుష్కమైనదైన- దెచ్చి పెట్టుకొనినదైన—నాట కపుటంగునకై బూటకముగఁ గన్నులు పొడిచి పొడిచి పుట్టించు కొనినదైన—దుఃఖచ్ఛాయాచ్ఛాయా లేశమును—దప్పనిసరిగ—చూచువారల మోసముచేయు నుద్దేశముతోఁ గనఁబఱచు రాముఁడు- మానవుఁడైన నేమి!—భగవానుఁడైన నేమి? పరబ్రహ్మమైన నేమి? ప్రజాభక్తి గౌరవాధికత నొందఁగలఁడా? ప్రాణి కోటిపూజాపాత్రత నొందఁగలఁడా? నారామాయణములోని రాముఁడు మనుజుఁడై యథార్థముగ వారింపఁబడిన యిల్లాలికొఱకు

కరుణముగ విలపించుట తప్పయినప్పుడు—నీరామాయణములోని రాముఁడు పరబ్రహ్మమై—యిట్టి కల్లబొల్లిగరిజెభాగవత మాఢ నీకుఁ దప్పుగఁ దోఁచలేదా? పరబ్రహ్మమై యుండుటయే కాక పర బ్రహ్మమని తాను దెలిసికొనిన నీ రామునికి శివధనుఃఖండన మెంతపని! అది మాయామానుషవిగ్రహమగు నారామునికి శ్లాఘాపాత్రము. పరబ్రహ్మమగు నీరామునకుఁ బితృవాక్యదీక్ష యేమంతఘనము—విస్మృతాత్మీయపూర్వజ్ఞానుఁడగు నారామున కది సర్వప్రజాశిరఃకంపనార్హము—పరబ్రహ్మమగు నీరామునికి సాకేతరాష్ట్రత్యాగ మేమంత గొప్ప? ప్రకృతిచ్ఛన్న తేజస్సంపన్నుఁడగు నాశ్రీరామచక్రవర్తి కది యత్యంత మహోదారతాసూచకము—పరబ్రహ్మమగు నీ రామునకు రావణవధ యేమంతవిశేషము—అమోఘసాయకుఁడగు నాకోదండ రామభూపతి కది యత్యంత పౌరుషప్రభాభాసకము; నాయనా! రాముఁడు పరబ్రహ్మమగును. కాని పరబ్రహ్మజ్ఞానమున రాముఁడు వర్తించుట రామునితప్పు. ఆతఁ డటు వర్తించెనని ప్రజకు బోధించుట కవితప్పు. ప్రజకేకాదు—నాకుఁగూడ — రామునిపరబ్రహ్మత్వముతో నంతజోక్యము లేదు— రాముఁడు రాజీవలోచనుఁడు— నీలమేఘ శ్యామలదేహుఁడు— జానకీనాథుఁడు— మాయెదుటఁ గనఁబడవలయును. మే మాతనికాళ్లల కన్నుల కద్దుకొందుము—ఆతఁడు మారక్షకుఁడు. ఆతఁడు మాగురుఁడు—ఆతఁడు మాతండ్రి—జానకమ్మ మా తల్లి—మేమందఱ మాతని బిడ్డలము. ఆతఁడు మాలోనివాఁడు—మే మాతని విడువఁజాలము. ఆతఁడు సర్వసద్గుణగుణాలంకృతుఁడు. మా తల్లిపైఁటచెఱఁగుబట్టుకొని కొందఱము—మాతండ్రిధనుఃకోటిని బట్టుకొని కొందఱము వారివెంటఁ బోవుదుము. జానకిం బాసి మారామచంద్రుఁ డేడ్వ మేముగూడ నేడ్తుము. ఆతఁడు దుష్టుఁడైన రావణుని పై బాణములేయ "మేమాయసురు నిట్లు తన్నుదుము." అని నిద్రలో నొడలు తెలియక బల్లపైఁ దన్నితిని. కాలుచిదుక మొఱ్ఱో" యని యేడ్చుచు లేచితిని.

# సాక్షి

## 7. పాశ్చాత్య నాగరకతామహాత్మ్యము.

శ్రీమద్రామాయణాఖ్యాత్మరామాయణ గ్రంథకర్త లగు ఋషులస్వప్నకలహములో సత్యమగు దెబ్బతగిలిన నేను మహాసభా భవనమున కీరాత్రి పోలేకపోయితిని. జంఘాలశాస్త్రియుపన్యాస ధోరణి మాసభకు సభ్యుల నాకర్షించుచున్నది. అతని వాచాలతావిషయికప్రఖ్యాతి మెల్లగఁ జుట్టుపట్టులనున్న యాంగ్లేయభాషాకళాశాలలకుఁగూడ వ్యాపించియుండుటచే: గాఁబోలు నీరాత్రి కొందఱు బాలురుగూడ వచ్చి సభ నలంకరించిరి. జంఘాలశాస్త్రి యిటులు చెప్పెనఁట. సభ్యులారా!

"ఈదినమున—ఊ—ఈదినము."

సభలోనుండి "ఈదినముకాదు. ఈరాత్రి యనుము" అను మాటలు; చప్పటలు.

జంఘా—ధీమంతులారా! సూర్యోదయమగు పిమ్మట రాత్రి యెక్కడిది? ఓ! ఇందఱు జ్ఞానసూర్యు లొక్కసారి మాయజ్ఞానతిమిర విచ్ఛేదనమునకై యిట నుదయించియుండ నింక మాకు రాత్రియెక్కడిది? ఇఁక మీవలన మాకుఁ బగలే! మీచదువులేమి? మీజ్ఞానములేమి! మీ వచోనైపుణ్యము లేమి? మీయధిక్షేపణ సామర్థ్యము లేమి? మీదేహదార్ఢ్యములేమి? మీమనస్థైర్యములేమి? మీమతాభిమానము లేమి? మీపూర్వాచారసాంప్రదాయవిశ్వాసములేమి? మీస్వభాషాభిలాషలేమి? మీబంధుమర్యాదవైఖరులేమి? మీ రెక్కడ, మే మెక్కడ! మీరు కాలిడినచోట మేము తలనిడుటకైన నవకాశ మున్నదా! మీరేమి సామాన్యులా? మీరు నవనాగరకతాకల్పవృక్షసుమములుగారా? నవనవశాస్త్రపారామృతఘుటికలుగారా! చిత్రచిరత్న

మునుబట్టి మావైద్యశాలలోఁగూడ శరీరచ్ఛేదనమునకై కొన్ని యాయుధముల నుంచితిమి. రెండుచీఁపురుకట్టలు, వేఁపబెత్తపుకట్ట, దూలగొండియాకు నూఁగుతోఁగలిపిన విభూతి, రెండుజతల యినుపగోళ్లు, గట్టిబిరడలుగల భూతాకర్షణ కాచపాత్రములు, నొక పట్టుకారును, మాశాలలో శల్యతంత్రసాధనసామగ్రిగా నున్నవి. ఈయాయుధములకుఁ గూడ వింతవింత పేరులు మాగురువుగారు కల్పించియుంచిరి. చీపురుకట్టకుఁ గాంతాకరవాలమనియుఁ, బేఁపబెత్తమునకు బాలబుద్ధవిద్ధిపినియనియు, దూలగొండిబూడిదె కుగ్రనారసింహమనియు, నినుపగోళ్లకుఁ గాలికావంత్రలనియు, సీసలకు క్షోణికుక్షి నిక్షేపములనియు, బట్టుకారునకు వీరాంజనేయమనియు, విచిత్రనామములను వస్త్వగౌరవపరిహారార్థముగను భూతరోగులకు భయాభివర్ధనార్థముగను గల్పించెను. ప్రతివైద్యశాలయందు శారీరశాస్త్రసంబంధములగు పటములు వ్రేలాడఁగట్టు నాచారమునుబట్టి యిచ్చట గూడ నాలుగుగోడలకు బాల—బగళ—మహిషాసురమర్దని—మళయాళ భగవతియను విగ్రహములు రంగులతో వేయఁబడినవి. అవిగాక మాగురువుగారి గురువగు గుంటుపల్లి గురులింగదేవరగారి విగ్రహ మొకటికూడ నున్నది. భూతభేదముల ననుసరించి భూమిపై వేయవలసిన వేలువేలు ముగ్గుల చిత్రపటములు కొన్నిమాత్రమే, యచ్చటచ్చట సుద్దతో వ్రాయఁబడియున్నవి. ఇవికాక తాళీదళసంపుట మొకటి యున్నది. అందులో నేమున్నదియో నాకుఁ దెలియదు.

మా గురువుగారు వ్యాఘ్రాజినముపైఁ బద్మాసనస్థులై నాసికాగ్రవిన్యస్తవిలోకనులయి కూరుచుండిరి. ఆయన నడిమివయసుగలవాఁడు. పిప్పళ్లబస్తి! పాషాణప్రతిమ! ఉక్కు వృకోదరుఁడు. నల్లని గరుసుగడ్డముచేఁ బ్రత్తికాయలవంటి గ్రుడ్లచేఁ దుప్పెపెదవులచే భ్రూమధ్యమునఁ బెద్దకుంకుమరేఖచే భయంకరమగు స్వరూపము గలవాఁడు, ఒక్కభార్యనంటఁగట్టుకొని లొడితెడు సంసారములో గుడు గుడు గుంచములాడుట కిష్టపడక బ్రహ్మచారియై లోకముమీఁద విఱుచుకొనిపడి తెగిపడ నుపకారము చేయుచున్నాఁడు. భూతభేతాళ పిశాచాదులతో నీతనికి జరిగిన హస్తాహస్తి పాదాపాది ముష్టాముష్టి యుద్ధము లనేకము లీతఁడు పొడిచినట్లు మొలచినట్లు వర్ణింపఁగలడు. దయ్యములు పిడికిటిపిడుగులచే

మునుబట్టి మా వైద్యశాలలోఁగూడ శరీరచ్ఛేదనమునకై కొన్ని యాయుధముల నుంచితిమి. రెండుచీఁపురుకట్టలు, వేఁపబెత్తపుకట్ట, దూలగొండి యాకు నూఁగుతోఁగలిపిన విభూతి, రెండుజతల యినుపగోళ్లు, గట్టి బిరడలుగల భూతాకర్షణ కాచపాత్రములు, నొక పట్టుకారును, మాశాలలో శల్యతంత్రసాధనసామగ్రియై యున్నవి. ఈయాయుధములకుఁ గూడ వింతవింత పేరులు మాగురువుగారు కల్పించియుంచిరి. చీఁపురు కట్టకుఁ గాంతాకరవాలమనియుఁ, బేఁపబెత్తమునకు బాలబుద్ధ్యుద్దీపిని యనియు, దూలగొండిబూడిదె కుగ్రనారసింహమనియు, నినుపగోళ్లకుఁ గాళికాదంష్ట్రలనియు, సీసలకు త్రిలోకీకుక్షి నిక్షేపములనియు, బట్టుకారు నకు వీరాంజనేయమనియు, విచిత్రనామములను వస్తుగౌరవపరిహారార్థముగను భూతరోగులకు భయాభివర్ధనార్థముగను గల్పించెను. ప్రతివైద్యశాలయందు శారీరశాస్త్రసంబంధములగు పటములు వ్రేలాడఁగట్టు నాచారమునుబట్టి యిచ్చట గూడ నాలుగుగోడలకు బాల—బగళ—మహిషాసురమర్దని—మళయాళ భగవతియను విగ్రహములు రంగులతో వేయఁబడినవి. అవిగాక మాగురువుగారి గురువగు గుంటపల్లి గురులింగదేవరగారి విగ్రహ మొకటికూడ నున్నది. భూతభేదముల ననుసరించి భూమిపై వేయవలసిన వేలువేలు మ్రుగ్గుల చిత్రపటములు కొన్ని మాత్రమే, యచ్చటచ్చట సుద్దతో వ్రాయఁబడియున్నవి. ఇవి కాక తాళీదళసంపుట మొకటి యున్నది. అందులో నేమున్నదియో నాకుఁ దెలియదు.

మా గురువుగారు వ్యాఘ్రాజినముపైఁ బద్మాసనస్థులై నాసికాగ్రవిన్యస్తవిలోకనులయి కూరుచుండిరి. ఆయన నడిమివయసుగలవాఁడు. పిప్పళ్లబస్తా! పాషాణప్రతిమ! ఉక్కు వృకోదరుఁడు. నల్లని గరుసుగడ్డముచేఁ బ్రత్తికాయలవంటి గ్రుడ్లచేఁ దుట్టపెదవులచే భ్రూమధ్యమునఁ బెద్దకుంకుమరేఖచే భయంకరమగు స్వరూపము గలవాఁడు, ఒక్క భార్య నంటఁగట్టుకొని లోడితెడు సంసారములో గుడు గుడు గుంచములాడుట కిష్టపడక బ్రహ్మచారియై లోకముమీఁద విఱుచుకొనిపడి తెగిపడ నుపకారము చేయుచున్నాఁడు. భూతభేతాళ పిశాచాదులతో నీతనికి జరిగిన హస్తాహస్తి పాదాపాది మూర్ధామూర్ధి యుద్ధము లనేకము లీతఁడు పాడిచినట్లు మొలచినట్లు వర్ణింపఁగలఁడు. దయ్యముల పిడికిటిపిడుగులచే

# సాక్షి

## 11. దివ్యయోగములు.

నేను సభాభవనమునకు వెడలలేదు.

జంఘాలశాస్త్రి యిట్లుపన్యసించెనని వింటిని.

“నేనుజూడని క్షేత్రములేదు. ఎక్కనిగుట్టలేదు. దాఁటనినదిలేదు. సేవింపని మహాపురుషుఁడు లేఁడు. పరీక్షింపని వింతలేదు. కనిపెట్టని ప్రకృతిలేదు. అనుభవింపని సుఖములేదు. పడనికష్టములేదు. ఆడని యాటలేదు. పాడనిపాటలేదు. వేయనిగంతులేదు. లేదు. ముమ్మాటికి లేదు. ఓ! ఎన్నికలాపములు! ఎన్నివిలాపములు! ఎన్నినాటకములు! ఎన్నిబూటకములు! ఎన్నివన్నెలు! ఎన్నిచిన్నెలు! ఎన్నిమంత్రములు! ఎన్నితంత్రములు! ఈదినమున విభూతిరుద్రాక్షమాలాధారినై చిలుము గొట్టము తడిగుడ్డ చేఁబూని గోసాయీలనడుమ, రేపు కిరీటాంగద భూషాధారినై సింహాసనమునఁ గరవాలము చేఁబూని శైలూషుల నడుమ, నీవారము చీపురుకట్టఁ జేఁబూని “హ్రాం హ్రీ” మ్మనుచు నట్టు మాడఁగొట్టుచు ననాథలనడుమ—పైవారము చిత్తారు చేఁబూని “రాం రా” మనుచు హరిస్మరణము చేయుచు భక్తులనడుమ నీపక్షము ఋషిపక్షుల రెట్టతోఁ బుటములుపెట్టుచు రసవాదజ్ఞులనడుమ పైపక్ష మేరుపిడకల పుటికలతో నెగళ్లు రగులఁజేయుచు యోగాభ్యాసకుల నడుమ, నీనెల హైదరాబాదులో “నాలి! దూలా! హాస్సేనుహాస్సే” యనుచు మ్లేచ్ఛులనడుమ, పైనెల బదరీనారాయణములో దేవీనవరాత్రములలో “నారాయణజే! భగవతిజే!” యనుచు సాధులనడుమ, పడుగు పేకగ—“సుల్తానీదాగ,” చక్రపుఁబలిటీలు గొట్టుచుండువాఁడను.

ఒకనాఁడు బదరీనారాయణమున నొకసిద్ధుని జూచితిని. అతని బ్రహ్మవర్చసము నాతనిశరీరసౌష్ఠవము వర్ణనాతీతములై యుండెను. ఆతఁడు మహానుభావుఁడని యాలోచించి యాశ్రయించితిని. ఆతఁ డొక్క చిన్న గుడిసెలో నుండెను. ఏవేవో యోషధు లప్పుడప్పుడు తెచ్చి నాకుఁ గనఁబడకుండ దొడ్డిలో వానిని నలిపి రసము తీసి యేవేవో మందులు చేయుచుండెడివాఁడు. "నాకుఁగూడ నేదైన బోధింపరాదా" యని యెంత ప్రార్థించిన నాతఁ డియ్యకొనలేదు—ఏలాగునైన నీతని రహస్యము లేవో తెలిసికొనవలయునని నేను భీష్మించి యటనే పీటఁ బెట్టితిని.

ఒకదినమునఁ బరమపదించిన యొకసాధువు కళేబరనిక్షేపమునకై యందఱితోఁబాటు నే నాశ్రయించుసిద్ధుఁడుగూడఁ బోయెను. నన్నుఁ గూడ రమ్మని యాతఁడు కోరెను. కాని యాతనిరహస్యముల నెఱుఁగ నదను వేచియున్న నేను శిరోవ్యథగనున్నదని చెప్పి తప్పుకొంటిని. ఆతఁ డక్కడ భూమిని త్రవ్వి సాధువును బూడ్చుచుండఁగా నేనిక్కడ నాతని పెట్టె నెక్కలంగి లోఁబూడ్చి పెట్టిన రహస్యములఁ బైకిఁ గొక్కరించు చుంటిని. ఏవియో కొన్ని ఘుటికలు, కొనిచూర్ణములు, కొన్ని లేహ్యములు, కొన్ని ద్రావకములు, కొన్ని గుళికలు కొన్ని లేపనములు కనఁ బడినవి—ఈతఁడు మహాదేహదార్ఢ్యసంపన్నుఁడుకదా! ఈ మందులతో నీతని కేమిప్రయోజనమో నాకు బోధపడలేదు. మందులపైఁ బేరులు లేవు. పేరులు తెలిసినవైనఁ బ్రయోగజ్ఞానశూన్యుఁడనైన నాకు వాని యుపయోగమేమి? ఏమందైన నోటిలో వేసికొనవలయునని బుద్ధిపుట్టి నదికాని యవి విషములో రసములో పాషాణములో యని భయ పడి యందులకు సాహసింప నైతిని. వానిని నిమ్మళముగఁ దీసి క్రిందఁబెట్టి యడుగునున్న మఱియొక యఱ నెత్తితిని. దానిలోఁ గొన్ని తెల్ల కాగితములు నొకసీసపుఁబుల్లయు నొక పుస్తకము నున్నవి. ఆత్రముతోఁ బుస్తకము నట్టె తెఱచితిని. సెబాసు! దొరకినదని చేటయంత మొగముఁగల వాఁడనై కొన్ని కాగితములపైఁ దద్గ్రంథస్థయోగములను వ్రాసి కొంటిని. తిరుగ నన్నివస్తువులను భద్రముగ యథాస్థానములనుంచి పెట్టెవైచితిని. ఇంక నచ్చటనుండ నిష్టత లేక దారిలో నష్టకష్టములఁ బడుచు హస్తినాపురము చేరితిని. అన్నప్రాశనమేకాని యక్షరాభ్యసన

జేయవలసిన సులభరీతు లెఱుఁగక తెలివితక్కువ తలతిక్క రోఁకటి
పాటల క్రిందఁ బెట్టి "కః కిమ్, కస్య, క్వాకిర్ కర్" అను ననావశ్యక
ములగు నకాలపు వెఱ్ఱియాకాంక్షల క్రిందఁ బెట్టి నిరంతరసంబంధమున్న
భాషావ్యాకరణములలోఁ దీర్ఘమునకుఁ దీర్ఘము ప్రసాదమునకుఁ బ్రసా
దము ననునట్లు భాషలో నెంతమాత్రము బాలుర ప్రవేశ మిష్టపడక
వ్యాకరణము భాషాంత మభ్యసింపఁ జేసి వ్యాకరణపాఠమును గట్టి
భాషాపాఠమునే చెప్ప వేదముల నపహరించిన సోమకాసురునాఁటి
వెఱ్ఱిపద్ధతులనే యవలంబించి భాషాపఠనమంతయుఁ బలువిధముల
పాడుసేయ బాలురు భాషాభ్యసనమునఁ బరమాసహ్యతాయుక్తు
లయిరి. అనివార్యపఠనపద్ధతిని బట్టి వచ్చిన ముప్పిది గదా? యని
యెంచి దేశభాషలు పైపరీక్షలకు స్వేచ్ఛాపఠనయోగ్యములుగఁ
జేయఁబడినవి.

జంఘూ—పైపరీక్షలకేనా? 4-వ ఫారం మొదలుకొని స్కూల్
ఫైనల్ వఱకు భాషాపఠనము నిర్బంధము సేయఁబడినదా? దాదా
పుగా 12 సంవత్సరము లున్న 4-వ క్లాసు పిల్లవాఁడు దేశభాషను వదలు
కొనవలసినదా? ఏదేశముననయిన నిట్లే జరుగుచున్నదా! మీ కింగ్లీషు
దేశభాషకదా? మీరు దేశభాష నిట్లే పరిత్యజింపఁ జేయఁబడిరా?
మీరు ల్యాటిను గ్రీకు మొదలగునాదిభాషలు నేర్చుకొనునప్పు డింగ్లీషు
భాషామాధుర్యముననే నేర్చుకొనలేదా? దానిని వదలి నేర్చుకొనిరా?
మీయభివృద్ధికి దేశభాష యావశ్యకమై మాయభివృద్ధి కాటంక
మయినదా? పోనీ (School Final) స్కూల్‌ఫైనల్ వఱకయిన
దేశభాషలు చదువకతప్పనివిగఁ జేసితిరేమో! పైపరీక్షలకు వాని
యనివార్యపఠన మంత యావశ్యకము కాదేమో యని మాలో మేము
కన్నులు తుడుచుకొందుమన్న నేదీ? కాకి కుక్క కథలు ముగిసినవెంటనే
మాభాషాపాండిత్యమున కాశ్వాసాంతమైపోయెనే! మాదేశీయగ్రంథ
పఠనదీక్ష కవభృథస్నానమై పోయెనే! తగిన భాషాగురువులు లేకుం
టచే భాషయందు బాలురకు వేదాంతము ముదిరినదా! ఆహా! ఇది
యెక్కడి హేతుకల్పనము? పూర్వభాషాపండితు లంత నిరుపయోగు
లనియే మీకుఁ దోఁచినదా? నలుబదియేఁబది వత్సరములలోపునఁ గలి
గిన నవలాకారకులు, చరిత్రకారకులు, శ్రవ్యదృశ్యప్రబంధకారకులు.

భాషాంతరీకరణసమర్థులగు దేశీయు లింకను మీరు చెప్పిన తిలతిక్క, తెలివితక్కువ, యొసఁగుబోదు గెలుఁగని కృతఘ్నుఁగపండిత స్థాణుజాతి వారివలన నిట్టి లోకోపకారకస్థితిలోనికి వచ్చినవారేకారా ? ఇట్టి వీరి కందఱకు నాంగ్లేయభాషాప్రవేశముకూడఁ గొంచెముగనో విశేషముగనో యున్నదికదా ? వీరందఱుఁగూడ నింగ్లీషుతోడ దేశభాషను నిర్బంధముగ నభ్యసించినవారగుదురా ? కాదా ? పూర్వపద్ధతి సంతుష్టికరమగుఫలము నీయకపోవుటచే నీనవీనపద్ధతి కల్పింపఁబడినది. అని మీరు చెప్పుచున్నారుగదా ? ఇది సాహసమైన మాటకాదా ? ఒకవేళ మీ రభిప్రాయపడునట్లు దేశీయభాషా గురువగు పండితుఁడు సమర్థుఁడే కాకపోవచ్చును. పురాతనపుఁ దుక్కే కావచ్చును. అతనిని బాగుచేయవలయును. అతనిని ప్రస్తుతస్థితి కుపయోగించునట్లు మార్పవలయునుగాని యాతనినిఁబట్టి మా బాలురకు భాషలనుండి బహిష్కారమా ? భాషలకుఁ బాఠశాలలనుండి బహిష్కారమా ?

నేను—మీభాషలను జదువుకొనవలదని మీబాలుర నెవ్వరిని ప్రతిబంధింపలేదు. ఇష్టమువచ్చినవారు చదువుకొననే వచ్చును. అట్టి స్వేచ్ఛవలన భాషాభిరుచి పుట్టును. బలాత్కారము లేదు.

జంఘా—వారి యిష్టమేమిటి ? ఇంటర్మీడియేటు క్లాసులోనికి వచ్చు బుద్ధిమంతుఁడైన బాలునకుఁ బదునారు సంవత్సరము లుండవచ్చును గదా ? తిన్నఁగ నాలుగుమాటలు మాటలాడుటకైన, శక్తి కలిగియుండఁడు కదా ? అట్టి బాలునను దేశభాషను మానుటకుఁగాని చదువుటకుఁగాని స్వేచ్ఛయా ? వానికిఁ దోఁచినచొప్పున మానవలసినదా? వాఁ డంతటి దీర్ఘాలోచనపూర్వకమగు కార్య మావయసులోఁ జేయఁగలఁడనియే మీ రనుకొందురా ? మీ రట్టివయసులో నట్టియాలోచనఁ జేసికొనఁగలరా ? బలాత్కారము చేసినందువలన భాషాభిరుచి గలుగదు. కాన స్వేచ్ఛ నిచ్చితి మని యిది యొక క్రొత్త సిద్ధాంతమా ? ఈసిద్ధాంతము మీయాంగ్లేయభాష కేల యుపయోగించుకొనఁగూడదు ? ఇక్కడఁ దిరుగ వ్యత్యాసమా ? ఇది మా దిక్కుమాలిన దేశభాషలకు మాత్రమే చెల్లవలసినదా ? రాజభాషయొకటియు దేశభాషయొకటియు నెప్పుడుగాని యెంతవయస్సుగల బాలునకుఁగాని

నిర్బంధపఠనీయములుగ నుండవలసినవే ! ఇతరవిషయములు స్వేచ్ఛానుసారములుగ నుండవచ్చును.

నేను—ఇంటర్మీడియేటు బి. యే. పరీక్షలను బోవుబాలురకు దేశీయభాషావ్యాసములం బరీక్ష యున్నది కాదా? అది చాలదా?

జంఘా—ఉన్నది ఉన్నది, ముమ్మాటికి నున్నది. భాష లీరీతిగా నుద్ధరింపఁబడుచున్నవా ? బాగు. భాష లక్కఱలేదా ? భాషలలోఁ బాఠములు మీరు చెప్పరా ? భాషాపరిజ్ఞానము చూచుటకై వ్యాసములలోఁ బరీక్షలా ? మీరు చెప్పనప్పుడు వారు నసుపుకొనన నప్పు డెక్కడనుండి భాషాపరిజ్ఞానము రాఁగలదు ? భాషాగ్రంథములు చదువకుండ భాషాపరిజ్ఞానము గల్గుసాధన మేమైన నున్నదా ? ప్రవేశపరీక్షకుఁగాఁబోలు పూర్వము రద్దుచేయఁబడిన యాంగ్లేయభాషాపఠన గ్రంథము తిరుగ నేల యంగీకరింపఁబడినది ? భాషాగ్రంథపఠనము లేకుండ భాషాభిజ్ఞానము కలుగ దనుసంగతి యాంగ్లేయభాషకు నిజమైనప్పు డది దేశభాషల కన్యథా యగునా? ఆంగ్లేయభాష నుద్ధరించుటకై యిప్పుడు తిరుగ గ్రంథపఠన మనివార్యముచేసినట్లే దేశభాషలఁ జావకుండఁ జేయుటకై యిప్పుడుకూడ నట్లు చేయరాదా ? చేయుట న్యాయముకాదా ? భాషాగ్రంథపఠనము లేకుండ భాషాభిజ్ఞానము లేదు. లేనప్పుడు లభింపని భాషాపరిజ్ఞానమునుగూర్చి వ్యాసపరీక్షలేల ? ఇవి యున్నలాభ మేమి ? ఇవి యుండుట లేనట్లుండుటకొఱకుఁ దప్ప నితరప్రయోజన మేమున్నది ? అదిగాక కన్నులకు గంతలుగట్టి కాదంబరి చదివిన బహుమతి నిత్తు నని చెప్పిన నెవఁడైనఁ జదువఁగలఁడా! కలకత్తాలో నున్నవానికిఁ గాళ్లకుఁ గట్టులుగట్టి కాశికిఁ బర్వెత్తిన యెడల గౌరవపత్రిక నిచ్చెద నని యనునెడల నాతఁడు పరుగెత్తఁగలఁడా ? సాధనములఁ జంపినతర్వాత ఫలములోఁ బరీక్ష యెట్లు? చేతిలోని కలము లాగుకొనినపిమ్మట వ్రాతపరీక్ష యుపయోగ మున్నదా ? వ్యాసలేఖనము సామాన్యమే ? ఎన్ని భాషాగ్రంథములు చదువవలయును ? ఎన్నిమాఱులు చదువవలయును ? ఎందఱచేతఁ జెప్పించుకొనవలయును ? ఎన్ని తప్పటడుగులు వేయవలయును ? ఎన్నిపాటులు పడవలయును ? ఎన్నివంకగీతలు గీయవలయును ? ఎన్నిమొట్లు తినవల

యును? భాషాపరిజ్ఞానసారమ్మును ప్రపంచజ్ఞానసారమునగు వ్యాసలేఖనము పదునాలు, పదునేడు సంవత్సరముల బాలునకు నిరాధారముగ, నిష్ప్రయత్నముగ, నిస్సాధనముగ, నాకాశ పంచాంగముగ రాఁగలదా? అన్ని దివ్యగ్రంథముల వ్రాసిన నాంగ్లేయగ్రంథకర్తలందఱు భాషాపఠనసాహాయ్యముననేకదా యట్టి యపూర్వలేఖనము నభ్యసింపఁ గలిగిరి? నేలపయిఁబలెనె సాము, నీఁదవలెనె లేఖనముండునా? నీళ్లలోఁబడి యొకప్పు డుక్కిరిబిక్కిరియయి యిటు కొట్టుకొని యిటుకొట్టుకొని మునిఁగి తేలి చేతులు కాళ్లు జాడించి తన్ను క్రమక్రమముగఁ దేల్చుకొని బారవేయఁగలవానికే యీఁతలోఁ బరిణతి కాని, యొడ్డునఁ గాళ్లు తడియకుండఁ గూర్చుండువానికిఁ బరిణతి గలదా? అటులే దేశీయభాషామహాగ్రంథ సుధార్ణవమునఁ బడి తద్ర సమునుఁ గొంత యుక్కిరిబిక్కిరి యగునట్లు త్రాగి యనేకసంవత్సరములు క్రిందుమీఁదుగ గింజుకొని తత్సన్నివేశమున కలవాటుపడి కడతేఱినవానికే వ్యాసలేఖమునఁ బరిణతిగాని భాషను దరిఁజేరనివానికిఁ గలదా? వ్యాసలేఖనకు గ్రంథపఠన సాహాయ్యము తప్ప నితర సాధన మేమైన నుండుట కవకాశమున్నదా? (Guides to Composition) (గయిడ్సు టు కాంపోజిషన్) అని యింగ్లీషువారిలో గ్రంథములున్నవి కాని మనలో లేవుగద? అవి యుండి వారి కేమి యుపయోగమో యవి లేకున్న మన కంతియే నష్టముకదా? అట్టిగ్రంథములు వ్రాఁతపద్ధతులను స్వల్పముగఁ జెప్పునుగాని భాషాసామగ్రి మీయఁగలవా? అదిగాక గంగాప్రవాహమువంటి లేఖన ధోరణి యట్టిపద్ధతులకు లొంగునా? పాకశాస్త్రము చూచి పొయ్యిలో నిప్పువేయువాఁడు తన్నుఁ గాల్చుకొనుటకు, గుణపాఠము చూచి వైద్యము చేయువాఁ డితరులను గాల్చుటకే కదా? కావున వ్యాసలేఖన మెప్పుడు పరిపూర్ణమో భాషాగ్రంథము లప్పుడే నిర్బంధపఠనీయార్హములు కాక తప్పదు.

నేను—దీని నిప్పుడట్లు చేసినయెడల నిర్బంధపఠనార్హవిషయము సంఖ్య హెచ్చగుటయుఁ దద్విషయికగురువులకుఁ బని హెచ్చుటయుఁ జదువుకొను బాలుర మనస్సులకు భారము హెచ్చగుటయుఁ దప్పక సిద్ధించును. ఇదియుఁగూడ నాలోచనీయాంశము కాదా?

జంఘూ—మిగిలినవి తగ్గించుకొనవచ్చును. బంధువుల పరమాన్నభోజనమునకై ముందుగఁ దల్లిని బస్తుపెట్టుదురా! తల్లిని గౌరవింపని జ్ఞానశూన్యుఁడు బంధువర్గాన కేడ్చినందువలన విశేషగౌరవమున్నదా? అట్టివాఁడు తాను బస్తుండుట మంచిది కాదా? మన భాషామాతను మనము మరలఁ దలఁచుకొన్నప్పుడు మనకు విస్మృతోఁ బనియేలేదు. మాతృభాషానిరసనముకంటె మౌఢ్యము మంచిది. మన భాషామాతయొక్క యభివృద్ధికి నుపయోగమునకు సంజీవనమునకు సదుపాయమునకు సౌఖ్యమునకే మన కితరోపవిద్యలుగాని మఱి యింకెందులకు? తల్లి చావు పిల్ల పోఁతపాలతో నారోగ్యముగఁ బెరుఁగఁగలదా? శవమున కలంకారము లేల? ప్రాముఖ్యమున బలాత్కారపఠనార్హత్వమున రాజభాష యెట్టిదో దేశభాషయు నట్టిదే! ఈభాషాద్వయముతరువాతనే యితరవిషయపఠనము. అంతేకాక తోఁక ముందు, మూతి వెనుకనా?

నేను—పూర్వపుఁ బద్ధతివలన ననఁగా నన్నియు నిర్బంధపఠనార్హములు సేయుటవలన నప్పటిబాలురజ్ఞానమునకు వైశాల్యమే కాని లోఁతు తక్కువగ నుండెనని కనిపెట్టఁబడినది. అనఁగా విశేష విషయములు వారికిఁ దెలియునుగాని యేవిషయమునన్నైనఁ బూర్ణముగఁ దెలియదు. అట్టి విద్యాపద్ధతి సంతుష్టిగ లేక బాలురజ్ఞానము స్వల్పవిషయిక మయ్యును గంభీర మగునట్లు చేయుటకై యీనవీన పద్ధతి యనఁగఁ దమ కభిరుచి గలవిషయముల స్వేచ్ఛానుసారముగఁ జదువుకొనుపద్ధతి కల్పింపఁబడి తదనుగుణ్యముగ పఠనవిషయములు ఖండములక్రింద విభాగింపఁబడినవి. విశేషవిషయములలో మిడిమిడి జ్ఞానమున్నవాఁ డెందునను దెలియనివాఁడే! కొలఁది విషయములలోనైనఁ బూర్ణముగఁ దెలిసినవాఁడు వానిలోనైనను దెలిసినవాఁడే యగును. దేశభాషలలో నభిరుచియున్నవా రాభాషలనే తీసికొని వానిలో నపూర్వపాండిత్యమును సంపాదించుకొనవచ్చును. పూర్వపద్ధతిని ననుసరించి తేలినవారు నూర్గురుకన్న నవీనపద్ధతి ననుసరించి తేలినవారు పదుగు రధికలోకోపకారకులు.

జంఘూ—ఏదీ? అట్లు తేలినవారేరి నాయనా! ఇఁక మునుఁగుట తప్ప తేలుట యేమిటి? దేశభాషాభిరుచిచే నేతరగతిలో నెందఱు

చేరిరో లెక్కలనుబట్టి తెలియఁగలదు. 1912-సం॥లో నింటర్మీడియేటు
టుకు 5823 రును బి. యే. కు 1012 గురును విద్యార్థులు గలరు. 1912-
1913-సం॥లో రెండవతరగతి కాలేజీలలో "నింటర్మీడియేటు పరీక్షలలో
మొదటితరగతిలో నరవము చదువుకొనువాఁ డొక్కఁడున్నాఁడు.
రెండవతరగతిలో నాగ్గురున్నారు. హిందూస్థానీశాస్త్రప్రధానగాలకంతకు
నాసంవత్సరములో బి. యే. తరగతిలో నొక్కఁడున్నాఁడు. భాషా
పాండిత్యము సంపాదించుకొనఁదలఁచి చదువుకొనువారు 71 మంది
తెనుఁగువారు, 15 గురు కర్ణాటకులు, 23 గురు మళయాళస్థులు, 27 గు
రుద్దభాషవారు నున్నారు. సంస్కృతము చదువుకొనువారు మాత్రము
282 మంది యుండుటచే నీనవీనపద్ధతి దేశీయభాషల కెంతమాత్ర
ముపయోగించుటలేదని స్పష్టపడుచున్నది" అని మొన్న జరిగిన వాద
ములో మ-రా-శ్రీ పాఠరేబిల్ శ్రీనివాసశాస్త్రులుగారు చెప్పినారు.
ఇదిగాక భాషాభిరుచిచే సందుఁ బూర్ణపాండిత్యము సంపాదించుకొన
వచ్చునని నీవు చెప్పితివే? అట్లు సంపాదించుకొనుట కవకాశము లేదు.
అట్టి తరగతులు బి. యే. కు నే కాలేజీలో నింకఁ బెట్టనే లేదు. "ఆన
ర్సు"కు మాత్రము ప్రెసిడెన్సీ కాలేజీలో నేర్పాటున్నది. దేశభాషల
తోటి యింటర్మీడియేటు పరీక్షకుఁ గ్రిష్టియనుకాలేజీలో నేర్పాటు
లేదు. ఏర్పాట్లుచూచిన ట్లున్నవి. చదువుకొనుచున్న పిల్లలసంఖ్య
చూచిన నట్టున్నది. ఆంగ్లేయవిద్యాపండితులగురువుల (Professors)
యొక్క పట్టుదల యటులున్నది. అదిగాక వీరి కింత దేశీయభాషా
వైషమ్య మెందులకు? వారిభాష కాదయ్యెను. వారు చదువుకొనిన
(Latin, Greek) లాటిను, గ్రీకు మొదల్గు నితరభాషలు కావయ్యెను.
వారి కెంతమాత్రము తెలిసినభాష కాదయ్యెను. అట్టి యంశములో
వారు తటస్థులుగ నుండుటకు బదులుగఁ దెలిసిన భాషాభిమానుల
యభిప్రాయముల నిరసించుట చింతకాదా?

నేను—ఈనవీనపద్ధతి నవలంబించి మూఁడుసంవత్సరము లయి
యుండును గాఁబోలు. ఇది యెట్లు నడచుచున్నదో బాగుగఁ గనిపెట్టుట
కింకఁ దగినంతయవకాశము గలుగలేదు. అదిగాక ముప్పది నలుబది
లక్షలవ్యయముచేఁగాని యీనవీనపద్ధతి ననుసరించిన యేర్పాటులన్నియు

జరుగవయ్యెను. అంతధనవ్యయ మొనర్చి తగినంతకాలము దీనినడకఁ జూడకుండ విడుచుట తగినపని కాదు. అందుచే నీకోరిక నెరవేరలేదని నీవు దుఃఖింపక యూరకుండుము.

జంఘా—మనకోరిక విద్యాసంఘమువారు తీర్చుటకు మన హృదయములకు శాంతియుండునా? వారు తీర్చుటకు మన మూర కుండువారము కాము. నిరంతరము ప్రార్థించువారము. దుఃఖింపక యూరకుండుమని యెంతసులభముగఁ జెప్పితివి? నానోటియొద్దనున్న యన్న మెవఁడైన నెగమీటుకొనిపోవ నేను గంటఁ దడి పెట్టువాఁడను కాను. నేను దున్నుకొని జీవించుపొల మెవఁడైన నాక్రమించుకొనఁగ నే నేడ్వను. నాయింటిలోని సర్వస్వము సకాంతాపుత్రకముగఁ జోరులు హరించిన నే నంత దుఃఖించువాఁడను గాను. కాని చేటలోఁ బడి "క్యారు" మనునది మొదలు హరి యని కాటిలోఁ బడువఱకు నుపయో గించుకొను దేశభాష కిట్టి—

ఇచ్చట జంఘాలశాస్త్రి—గద్గదస్వరముతోఁ గనులు దుడుచు కొని యూరకుండెను. ఆతనిహృదయమార్దవము గాంచి మేము తెల్లఁ బోయితిమి. కాలాచార్యులు, కవియు వాదములోఁ గూడ నప్పటికి నాకును జంఘాలశాస్త్రికిని జరిగినసంభాషణ చెరియొకఁడు వ్రాసెను. మిక్కిలి రాత్రియగుటచే ముగిసెను.

# సాక్షి

## 3. విమర్శక స్వభావము.

నే నీరాత్రి మాసభాకుటీరమునకుఁ బోవునరికి మాకవి యగు వాణీదాసుఁడు జంఘాలశాస్త్రియుఁ గోడిపుంజులవలెఁ గాళ్లుదువ్వుచు గొఱ్ఱెపొట్టేళ్లవలెఁ దలలువంచి బుసకొట్టుచు నాఁబోతులవలె అంకెలు వేయుచు మల్లులవలెఁ దొడలు దండలు జఱచుచుఁ బంజాబీ మైసూరీ పద్ధతుల పదవిన్యాసపు గమనికలతోఁ జేయిచేయి గలుపుకొనుటకు సిద్ధమైయుండిరి. కలహకారణము గోచరింపలేదు కాని వారిని శాంతి పఱచుటకుఁ బ్రయత్నించితిని. ఎందుల కీకచాకచికదనోత్కంఠత యని యడుగ వారెవ్వరును నామాటను వినిపించుకొనలేదు. కాని, కవి నిష్కారణకఠినముష్టిప్రహారము నోరులేని నడుమనున్న బల్ల కొక్కటి ప్రసాదించి యిట్లు గర్జించెను.

వాణీ—ఏమంటివి? నాకుఁ గవిత్వమే తెలియదా? అది లోక జ్ఞానమునఁగాని రాదా? దానికి దేశాటన మావశ్యకమా? ఆ! ఆసేతు హిమాచలపర్యంతము నీ వల్లలాడనిస్థల మున్నదా? కాలిదురద యే తీరినది కాని కవితాలేశమైన నంటినదా? కాలులఱచుట కవిత్వ మను కొంటివా? తిట్టినతిట్టు తిట్టకుండఁ దెంపులేకతిట్టు దిట్టరితనము నిరవశేష శబ్దజాలనిరాఘాటప్రయోగనిపుణత యనుకొంటివా? ఇదిగో! నీకబ్బినవి గండ్రతనము, పెంకితనము, తెగనీలుఁగుదనము, నుడుకుఁబోతుతనము, వెక్కిరింపుఁదనము, గయ్యాళితనము. గలలగలభేద మెఱిఁగి నీవు కవిత్వము చెప్పఁగలిగినప్పుడు నన్నధిక్షేపింపుము. అది నీకుఁ బదునాల్గు భువనములు దిరిగిన రాదు.

జంఘా—(వికటముగ నవ్వి) నీ వేడ్చుచున్న తెలివితక్కువ నిర్భాగ్యపు టల్లరిచిల్లరి యవకతవక యాసమ్మ యోసమ్మ యారిగ చొప్ప

యలుకుగుడ్డకవిత్వము నేఁ జెప్పలేక మూనివేయలేదు. గడియసేపు ఛందోగ్రంథ మేదైనఁ జూచితినేని సీసపేలపిండి పట్టిగడ్డి కల్లబొల్లి కాకి కూఁత కవిత్వము నాకవిత్వముచుట్టు ముమ్మారు త్రిప్పిత్రిప్పి దిగవిడుచుటకైనను బనికిరాకుండఁ జేయఁగలను. ఆ! అనుమతి లేక యూరకుండలేదు. గడియకుఁ గావడి గ్రంథములు చెప్పఁగలను. నాకవితాధారముందు గంగాధారను బిల్లకాల్వక్రిందఁ జేయఁగలను. ఆకాశము తూటుపడినట్లు——

వాణీ——ఏది! మగవాఁడ వైనయెడల నొక్కమత్తేభముఁ జెప్పుము. ఒక్కచచ్చుతేటగీతి చెప్పుము. అంతపని కెందులకు? మూఁడు ముక్కలు గద్యము చెప్పుము. ముచ్చటలుపట్టి చావునకు సిద్ధమగుదువో లేదో! ఆ! కుక్కకూఁత నక్కకూఁత యనుకొంటివేమి! దూరపుఁ గల్లవార్తల సోది లనుకొంటివేమి? డబ్బిచ్చువారియెదుట డుర్రుమని డమరుకము వాయించుట యనుకొంటివేమి? బిట్టపెట్టని వారిపై సనిమిదవ యట్టపుఁ బారాయణ మనుకొంటివేమి? లోకువ పందలయొద్ద "లొట్టాబట్టీయ" మనుకొంటివేమి? చెప్పుము. చెప్పక పోయినయెడల బ్రాహ్మణుఁడవు కావు.

జంఘా——నేనే కవిత్వము చెప్పునెడల నీదేవీస్తోత్రపుఁ గాగితములు నీపాడునాటకములు చిల్లరదుకాణములలోఁ బొట్లములక్రింద, దీపావళికిఁ బువ్వొత్తుల గొట్టములక్రింద, నాసుపత్రిలోఁ "బలాస్త్రి" పట్టులక్రింద నుపయోగపడునట్లు చేయనా? నేను గవినిగాను. కాఁదలఁచుకొనలేదు. నేను విమర్శకుఁడను. నన్నేమని చూచుచున్నావో? కవులగ్రంథముల కగ్గిపుల్లను; కవులముంగిటి మొండిచేయిని. కవుల పాలిఁటి తుపాకిపిక్కను. నోరుమెదుపుసరికి నోటిమీఁద నీడ్చికొట్టెదను. కవికి విమర్శకుఁ డెట్టివాఁడో యెఱుఁగుదువా? హె, హె, హె?

వాణీ——అప్రతిష్ఠ నాచంద్రతారకముగ సాఁగఁదీయుటలోఁ గవి కందినవాఁ డితఁడు బుట్టవలయును. నీవు చత్తువు. నేను జత్తును. కాని "జంఘాలజలదఝంఝామారుత" మని "జంఘాలకంఠనాళకృంతన" మని నేను జెప్పఁబోవు గ్రంథములు బ్రహ్మపునస్సృష్టివఱకు నిల్చి యుండవా?

జంఘా—"వాణిదాసవదన ఘూధూకార" మనియు "వాణీదాసవల్లకాడీయ" మనియు వానిపై నేనుజేయు విమర్శనములు పునస్సృష్టిలోఁగూడ నిల్చునని నమ్ముము. నీవు నానెత్తిమీఁదికి కెగిరిన యెడల నీ పితామహ ప్రపితామహుల నెత్తిమీఁదికి నే నెగురఁగలను. జాగ్రత్త.

వాణీ—నీవు మాతండ్రిని మాతాతను దలపెట్టిన నే నూరకుందునా ? మీ మేనత్త తురకవాని యుపాఖ్యానము లోకవిదిత మయినది కాదా ?

జంఘా—నీయక్క బంకోలుకంటెనా ?

అని లేచి యిద్దఱు కలియఁబడిరి. కాల్చి కుండలోఁ బడవేసిన సీమటపాకాయ పెట్లవలె టపటప ఘమఘమాంతర్గత చుర చుర తుసు తుసువిరావారభటీసాంప్రదాయమునఁ దుదకు బల్లక్రిందకుఁబడిన వీరు చిత్రవిచిత్రశబ్దప్రతిసృష్టినైపుణ్యమునఁ బ్రకాశించిరి. నేనును, నస్యభిక్షాదీక్షాపరిపూర్తి చేసికొని యప్పుడే వేంచేసిన కాలంచాస్యులు గలసి యాబల్లనెత్తి వారిరువురకుఁ గదనరంగమును విశాలమొనర్చితిమి. కొంతసేపటికి వారే సిగ్గుపడి లేచి తలలువంచుకొని కూరుచుండిరి. అప్పుడు నేను వారితో నిటులంటిని.

కవీ! నీవెఱ్ఱిపంచెఁజూచి బెదరువాఁడ వనియు, నుచితమగు లజ్జఁగలవాఁడ వనియు, జంఘాలశాస్త్రీ! పద్యముల కర్థము తెలిపిన యెడలఁ గవితావిమర్శనమున నీకుఁ దగుమాత్రపు నైపుణ్యము గల దనియు, మీయిద్దఱిఁగూర్చి నేను సువర్ణలేఖాపత్రికకు వ్రాసినమాట మీరిప్పుడు కల్ల యొనర్చితిరి. నీవు కవివి కావు. ఆతఁడు విమర్శకుఁడు కాఁడు. కవితావిమర్శకశాస్త్ర విమర్శవాదములో మీ రేడుతరముల వఱకుఁ బైకిఁబంపిన శాపబాణములఘాతములు దగిలి "యిట్టి తుచ్ఛులు, యిట్టి వంశనాశకులు మనకులమున నేల దాపరించిరో ?" యని మీ పితామహ ప్రపితామహాదులు విగతజీవు లెట్టు లేడ్వఁదగునో యట్టు లేడ్చుచుందురు. "ఏ పొరపాటుచేతనో, యే పని తొందరచేతనో యేశ్రమముచేఁ గలిగిన విసుఁగుదలచేతనో యేముదిమితనపు బద్ధకముచేతనో, యిట్టి కవివిమర్శకుల సృష్టించి మానవజాతికంతకు

నపయశస్సును గూర్చినవాఁడ నయితినిగదా” యని బ్రహ్మదేవు నెనిమిది కన్నుల నేకధారగ నేడ్చునట్లు చేయుటకు మీరు చాలియున్నారు. కుక్కలు పులివిస్తరాకుల పాతరయొద్ద రసోపేతవస్తుపరిశీలనవాదమునఁ దమ్ము దాము గఱచుకొని పీఁకుకొనుసుగాని వచ్చిన తమ తాత ముత్తాతల తోఁక వెంట్రుకల నెక్కలాఁగఁగలవా? కవీ! నీకుఁ గవిత్వము లేకపోయిన నేమి మునిఁగిపోయెను? విమర్శకుఁడా! నీకు విమర్శనాశక్తి లేకున్న నేమి మునిఁగిపోయెను! సృష్టికిఁ బరమాసహ్యకరమై బహు లజ్జాకరమైన మీ బ్రదుకులవలనఁ బ్రయోజన మేమి? వాణీదాసా! ఈనడుమ “సువర్ణలేఖా” పత్రికలో ముద్రింపఁబడిన “కవి” యను వ్యాసము నామూలాగ్రముగఁ జదువుకొని తదంతర్వర్ణితములగు శక్తులలో దేనినైన నీవు కలిగియుండనెడల నీవు కవి ననుకొనుము. జంఘాలశాస్త్రీ! విమర్శకుఁ డెట్లుండవలయునో సంగ్రహముగఁ జెప్పెద వినుము.

(కవి, తన్ను తా నెట్లు కవితావ్యాపారమున మఱచునో విమర్శన వ్యాపారమున నిన్ను నీవట్లు మఱవవలయును. అనఁగఁ గవిగాని కవివారుగాని నీకుఁగాని నీసంబంధులకుఁగాని తత్సంబంధులకుఁగాని యొనర్చిన యుపకారాపకారములను నీమనస్సునుండి తుడిచివేయవలయును. నేర్చుకొనఁదలఁచినది నేర్చుకొనుటకంటె మఱువఁదలఁచినది మఱచుట మనుజునకు సర్వథా కష్టతరమని యెంచఁదగును. కవి ప్రవర్తనములోని దోషాదోషములనుగూర్చి నీవు విశేషముగఁ దలపెట్టఁదగిన యావశ్యకత లేదు. ఆతని ప్రవర్తన మాతనికవిత్వమున కెట్టిమార్పు లెట్టివిలక్షణ విలాసములు కలిగించెనో యవిమాత్రమే నీవు చెప్పవలయును గాని తత్కవితాసాధుతాసాధుతానిర్ణయకార్యమునఁ దత్ప్రవర్తనము నీకేమాత్రము తోడుపడఁగూడదు. అడ్డు రాఁగూడదు.

అందఱహృదయముల దూరువాఁడు కవియైయుండ నీవు కవిహృదయమున దూరువాఁడవు. ఒకచో నన్నవస్త్రములకుఁ గఱవై పట్టి ముష్టిచిప్ప చేతఁ బుచ్చుకొని పైయాకు లెగిరిన కుటీరమునొద్ద నతఁడు కూలఁబడి యేడ్చుచుండును. ఉత్తరక్షణమున దాసదాసీజన పరివృతుఁడై రత్నఖచితకిరీటాంగదధారియై బంగారు సింహాసనమున

గూరుచుండి ప్రజాపాలన మొనర్చుచుండును. తదుత్తరనిమేషమున సం
బొత్తులలో మాత్రాద్యవలిప్తగాత్రుండై ప్రేలు నోటంబడక వెక్కి వెక్కి
యేడ్చుచుండును. తరువాత నంతలోఁ బరమదుర్నిరీక్ష్యబ్రహ్మతేజః
ప్రాంచితుండైన పరమహంసయై జగన్మిథ్యాతత్త్వమును బోధించును.
ఒకప్పుడు శక్రధనుస్సౌందర్యముననో, కలకంఠ పంచమారావసౌభాగ్య
ముననో, ప్రభాతవాతపోతస్ఫుటిక పారిజాతసౌరభముననో చొక్కి,
మఱఁగి, కరఁగి, మైమఱచి మాయమగును; అట్టి వేగుళ్లప్రాజరిని
యట్టి సర్వజగద్వ్యాప్తవ్యాపారపారీణునిఁ బట్టి కట్టిపెట్టి నీ పాత్రని
హృదయమున దూరవలయును. ఆతని హృదయమున నున్న యనేక
హృదయములఁ గాంచి బెదరక యాతని హృదయ మేదో కనుఁగొని
పరిశీలింపవలయును. ఒకప్పు డాతని హృదయ మేదో యాతఁ డెఱుఁగ
కుండుచో దానిని నీవు కనిపెట్టఁగలిగినయెడల నో విమర్శకుఁడా! నీవు
కవికంటె ఘనుఁడవు కదా ?

పరమార్థమునఁ గవిత్వ మనఁగ బహిరంతఃప్రకృతులను వాగ్దర్ప
మునఁ జూపుట. అట్టిచో నో విమర్శకుఁడా! నీకు బహిరంతఃప్రకృతి
జ్ఞానము యథోచితముగ నుండనక్కఱలేదా ? సర్వదా తెఱచియున్నను
జనసామాన్యమున కర్థము గాని చదువనయిన గాని యీ బాహ్య
ప్రకృతిమహాగ్రంథమును నీవు చదువకుండనే కవిగ్రంథవిమర్శనము
నకుఁ బూనుకొనుట నీకు దోషము కాదా ? సర్వదా మూసియున్న
మఱియొకపుస్తక మింతకంటెఁ బెద్దదియుఁ జిత్రమగునదియు నున్నది;
దానిలోని యుపోద్ఘాతమయినఁ జూడకుండ నీవు కవితావిమర్శన
మారంభించినచో నీవు మొదడుకలవాఁడ వనిపించుకొనఁగలవా ? ఉభయ
ప్రకృతిచిత్రపటమగు కవితాపత్రమును నీవు చేఁబూని యది మాతృకకు
సరిపోయియున్నదో లేదో చూచి తీర్మానించు గొప్పపని నీదైయున్నదే?
మనుజునిఁ జూచి యాతనిఁ బోలిన బొమ్మను వ్రాయవచ్చును గాని
యాబొమ్మ యేవంకలో మాతృకకంటె భిన్నమైయున్నదో కనిపెట్టుట
కష్టముగాదా ? విమర్శకుఁడా! నీపని కష్టయుక్తమే కాక ప్రమాద
యుక్తమైనదిగూడనగును. కవితాపటమును బ్రకృతితో సరిచూచునప్పుడు

నీవు పొరపాటుచేఁ గాని తప్పటంబుచేఁ గాని బుద్ధిపూర్వకముగ గాని తప్పు నొప్పుగా నొప్పు తప్పుగాఁ జేసినయెడల ప్రసన్నముఖమును జూచి పలుకవలసిన నీకు—సమస్థితినిఁ జేత ధరించి సత్యమాడవలసిన నీకు—జనులకు యథార్థకవితాభిరుచిని గఱపవలసిన నీకు—నెట్టి మహా దోషము సిద్ధించునో కొంచెమైన నాలోచించుకొంటివా? ప్రకృతి జ్ఞానము కలిగిన విమర్శకునికే యిట్టి ప్రమాద ముండఁగ నది లేని నీగతి యేదో యెవ్వఁడైనఁ జెప్పఁగలఁడా! కవి గట్టిన దేదో విడఁగొట్టుట విమర్శకునిపని యని చెప్పుదురు. "చన్ను లేటగిత్తమైనఁ జెప్పుము, నేను జెప్పునఁ గొట్టించుకొందును." అని కవి విమర్శకుని నధిక్షేపించుట కలదు; ఇది తప్పు. విమర్శకునకుఁ గవితాశక్తి యుండవలసిన యావశ్యకత యెంతమాత్రమును లేదు, "పప్పులో నుప్పెక్కువ" యని చెప్పఁగలవాఁడు పాచకుఁడు గావలయునా? రుచిగ్రహణపారీణుఁడు భోజనప్రియుఁడైనఁ జాలఁడా? పడమటగదికి దొడ్డిగుమ్మము లేని హేతువునను, పంచపాళిమూల తలకుఁ దగులుటచేతను, దక్షిణపుఁ దెఱపి మూసియుండుటచేతను, గృహము సదుపాయముగ లేదని చెప్పఁ గలవాఁడు, తాపి మూలమట్టము చేతఁ బూని తా నిల్లుగట్టువాఁడై యుండవలయునా? ఆరోగ్యాద్యంగసుఖపరిజ్ఞాని యయినఁ జాలఁడా? గాయకునిపాటలో నపస్వరమును గనిపెట్టఁగలవాఁడు ఖరహరప్రియ రాగ మాలాపింపఁగలవాఁడై యుండవలయునా? గానానుభవశీలుఁ డైనఁ జాలఁడా? అటులే—అటులే—అదేమి! కొంపలు సమీపమునఁ గాలుచున్నవి. లెండు చెప్పవలసిన దింకఁ జాలగా నున్నది. మఱియొక ప్పుడు మాటలాడుకొనవచ్చును.

మేము తొందరగ లేచి తలుపు తాళమువేసి యాతాపునకుఁ బరుగెత్తితిమి.

# సాక్షి

## 4. స్త్రీ స్వాతంత్ర్యము.

క్రిందటిసారి యాకస్మికముగ నాపివేసిన నపుంసకస్వభావమును గూర్చిన యుపన్యాసమునందలి శేష మీరాత్రి చెప్పఁదలఁచి నేను మా సభాకుటీరమునకు వచ్చుసరికి నడుగు లోపలఁబెట్టుటకు వీలులేనట్లుగ జనులు కిటకిట మూఁగియున్నారు. చెవులు నిక్కఁబొడుచుకొని యూపిరి యైనఁ దిన్నగ విడువకుండ మిగుల శ్రద్ధతో జంఘాలశాస్త్రి చెప్పుచున్న దానిని వినుచున్నారు. జంఘాలశాస్త్రి బల్లపై నిలుచుండి బ్రహ్మకాయమువలె నటుపటు నడచుచున్నాఁడు. నేత్రహస్తపాదాభినయము లవలీలగఁ జేయుచున్నాఁడు. వంగుచున్నాఁడు. ఎగురుచున్నాఁడు. తెయితక్కలాడుచున్నాఁడు. గిఱ్ఱునఁ దిరుగుచున్నాఁడు. వెనుకముందు చూడకుండ నుపన్యసించుచున్నాఁడు. ఈతని యుపన్యాసధోరణిని విని కాఁబోలు ప్రక్కయిండ్లలోనుండు జనులు కొందఱు విచ్చేసి నాకుఁ జోటులేకుండఁ జేసినారు. నే నీసమయమున లోనికి పోయిన నుపన్యాసకర్త కుత్సాహభంగముగ నుండునో క్రిక్కిరిసి కూరుచుండు సభాసదుల కసదుపాయముగ నుండునోయని వెలుపలనే నిలువఁబడి వినుటకు స్థిరపఱచుకొంటిని. నేను రాకముం దాతఁ డెంతసేపటినుండి యేమి చెప్పుచున్నాఁడో కాని నేను గుమ్మములోఁ గాలు పెట్టినది మొదలీతీరున జెప్పసాగెను.

“ఓ! పూచిన తంగేడువనము! పండిన దోసతోఁట! బంగారు తునకల గని! సెబాస్! చూచితీరవలయును. చూచి యానందించి తీరవలయును. ఏమి సంస్థానము! ఎంతసంస్థానము! తుదుము మొదలుకొని దేవతార్చనపఱకందఱు స్త్రీలు! ఓ! ఎక్కడవినిన గాజులగలగల; అందెలఝణఝణ; కాంచీఘంటికల గణగణ; ఎక్కడజూచినఁ జెక్కు

టద్దముల తళతళ; గబ్బిగుబ్బల పెళపెళ; తారహారముల మిలమిల, వేణీభారముల జిలజిల; ముద్దుమొగముల కలకల; ఎక్కడకుఁబోయిన నగరుధూపముల గమగమ, చందనచర్చల ఘుమఘుమ; మృగమదలేప ముల ఘుమఘుమ, ఏవి! చూచువారేరి? వినువారేరి! అనుభవించువా రేరి! ఆనందించువారేరి? మగపురుగైన నాసంస్థానములోనికిఁ బోఁగుఁ డదే! లాయములలోనివన్నియు గోడిగలే! ఆలానశాలలో నన్నియును నాఁడుయేనుఁగులే! వీథులలో నన్నియు నాఁడుకుక్కలే, యాఁడుగాడి దలే! ఇంటఁ దిరుగుపిల్లులన్నియు నాఁడువే! పిల్లలలోను నెలుకలలోను జీమలలోను మగ యాఁడు విభాగముఁజేసి మగజాతిని మూపిష్టి చుట కప్పటికిఁ బ్రయత్నములు జరుగుచున్నవి. అబ్బ! ఆసంస్థానమహారాజ్ఞి కేమిపంతము! మగజాతి యనఁగ నెంతపట్టుదల! యెంతకోపము! యెంత క్రౌర్యము! యెంత యసహ్యత! మగవానిఁ జూడదు వినదు స్మరింపదు సరికదా! మగవానిమాటయైన వినదే! మగవాని పేరైన వినదే! ఆమెకు మంత్రి యొక యాఁడుది. మీసాలువడివేసికొనుచు రాజకార్యనిర్వాహణ మొనర్చునియోగపుమంత్రిస్థానమునఁ గుంతలములు దిద్దుకొనుచుఁ గుంత రదన యొక్కతె నిలిచి వ్యవహరించుచుండెను. తలపాగలవారిబదులు రాగిడులవారును, సంగరక్షలవారిబదులు అవికలవారును, వలెవాటు కండువాలవారిబదులు వ్రాలుపైఁటలవారును, గచ్చుబిగింపులవారి బదులు గాగరాలవారును నర్హాసనములఁ గూరుచుండి జూకాలు కొంచె మూగులాడ కంఠహారములు బల్లలపైఁ బ్రాకులాడఁ గుడిచేతుల గాజులు వడఁకులాడ బొత్తుటీకెఁ చేఁబూని పటపట నక్షరాంకస్పష్టు బొనర్చుచున్నారు! చనుకట్లు బిగించికట్టి కాసెకోక కచ్చులుపెట్టి కత్తులు కటారులు కఱ్ఱలు చేతఁబట్టి సేవకస్త్రీలు పనిచేయుచున్నారు. పాఁడి పశువులయొద్దఁ గూరుచుండి మృదులములగు వ్రేళ్లతోఁ బాలుపిండ నలసినవారు గుఱ్ఱములవెనుక దృఢముగ నిలువఁబడి కొఱడాలూని సామి ఛేదించుచున్నారు. గోటినొక్కులు భర్తల చెక్కిళ్ల నుంచఁదగు వారు గొడ్డళ్లు చేఁబూని పర్వతములు విడఁగొట్టుచున్నారు. పుష్పహార ములచేఁ బ్రకాశింపవలసిన స్త్రీలరొమ్ములు తుపాకిపడమలచే నదుమఁ బడుచున్నవి. నేల యీనిన ట్లెక్కడఁ జూచిన స్త్రీలు! వివిధరూప లావణ్యసంపదలు, వివిధాభరణవైభవములు, వివిధవయఃపరిపాక

ములు, వివిధవర్ణ వైచిత్ర్యవిశేషములు, వివిధవాగ్ధోరణీనైపుణులు
వివిధచేష్టాసామర్థ్యములు, వివిధస్వభావగతులుఁ గలకాంతల గని
యగు నాసంస్థానము సర్వవిధముల శ్లాఘనీయమైయున్నది. ఒకనాఁ
డొకకాంత తన కౌఁగిటిలోనున్న తప్పొనర్చిన కాంతుని దొంగపట్టి గొట్టు
నట్లు డప్పుమెడఁ బెట్టుకొని వాయించుచు వీథులవెంటఁ దిరుగుచు
"ఈదినమున సాయంకాలము మూఁడుగంటలకు లక్ష్మీవిలాసమున
యోగినిగారి యుపన్యాస" మని యఱచెను. రాణిగారు మంత్రిగారు
మొదలగువారంద ఱుపన్యాసకర్త్రిగారిని చూచుటకు వచ్చియుండిరి.
ఆమె నాయంతపొడవుగలది. కోలమొగముగలది. బొన్నిఱొమ్ము గలది.
రోమశములగు పిక్కలుగలది. మోటుమొగముగలది. మగవాని
గొంతుక గలది. ఆమె నిలువఁబడి యీరీతిగ నుపన్యసింపసాగెను.

"సోదరీమణులారా! ఈదినమున నేనుపన్యసింపఁబోవు నంశము
మగవానిదుర్నయము, మగవానిఁ గూర్చి వ్రాయఁగూడదు. మాట
లాడఁగూడదు. తలపెట్టఁగూడదు. నిబంధనములు మనకున్నవను మాట
నిశ్చయమే. ఏజాతియుఁ బ్రపంచమునఁ బుట్టిన నెట్టి నీచజాతియు, సర్వ
దుర్గుణభూయిష్ఠమై యుండదు. ఒకటి రెండు సద్గుణములయినఁ గలిగి
యుండును. అటులే నరులలోఁ బురుషజాతికిఁ గూడ సద్గుణలేశము
లుండవచ్చును. అట్టి సద్గుణాలవములఁగూర్చి మనము మాటలాడఁ
గూడదు. వ్రాయఁగూడదు. తలపెట్టఁగూడదని నిబంధనల యభిప్రాయము
గాని యనంతములై యతిహేయములై యనితరసామాన్యములై
నధములగువారి దుర్గుణపరంపరలఁగూర్చి మనము ముచ్చటింపఁగూడదని
యభిప్రాయముకాదు. అట్లు ముచ్చటింపనియెడల వారిదుర్నయము,
దుష్ప్రవర్తనము, దురహంకారము, దురభిప్రాయము, దుర్గర్వము, దుష్ట
నస్కృత యెట్లు వెల్లడికాఁగలదు? యెట్లు పరమాసహ్యమగునట్లు బట్ట
బయలు కాఁగలదు? ఆజాతిపై నింతింతనరానిరోఁత కలుగఁగలదు. ఇంత
కంటె దుర్గర్వముండునా? ఇంతకంటె నాస్తికతయుండునా? ఇంతకంటె
విశ్వాసహైన్య ముండునా? తాను సృష్టికిఁ బ్రభుఁడఁట. ఇది దైవాధి
కారమును మీఁద వైచుకొనుట కాదా? పోనీ! ఎవనిదైన ద్రోహము
వానినే దహింపఁజేయును. మనకేమని యూరకుందమన్న మన స్త్రీజాతి
నంత యనాదరణము తా నేలసేయవలయును. మగవాఁడు సృష్టికిఁ బ్రభుఁ

డగుచో నాఁడుది ప్రభ్వి యగును కాదా? అట్టి యున్నతస్థితి మన కిచ్చి నాఁడా? ఇయ్యఁదగునో లేదో కాసంత యాలోచించినాఁడా? మన కంటె తన యాధిక్యమేమి యుండెను. అదిగాక పురుషుఁడు తటస్థుఁ డనియు సృష్టియంతయుఁ బ్రకృతిపై చిత్ర్యమే యనియును వేదాంత శాస్త్రము చెప్పునప్పుడు సృష్టికి యథా[illegible] [illegible] యగునట్టు గనఁబడుటలేదా? పోనీ! ఈశాస్త్రి వేదాంతుల విపరీతవచనములతో మనకు నిమిత్తము లేదనుకొందము! స్వస్వభావమును బరిశీలింపఁగ దైహికముగ మానసికముగ నాధ్యాత్మికముగఁ బరిశీలింపఁగ స్త్రీపురుష తత్త్వముల భేదమేమున్నది? లేనప్పుడు మనకు సమానస్వాతంత్ర్య మేల యీయరాదు. మనపై నధికారము తన కెవఁ డిచ్చినాఁడు? లేని యాధిక్యమును వహించి మనల నిగ్రహించుట కేమి కారణము? మనము మెత్తనివారమయి యాతఁడు చెప్పినట్లు వినుచు నాతని కుపచారములు సేయుటచేత నేకదా యాతనికిఁ గొమ్ములు వచ్చినవి. అతని నెత్తికిఁ గన్నులు వచ్చినవి. ఆతని తల గిఱ్ఱున దిరుగ మొదలుపెట్టినది. ఆతఁ డెగిరి మనశిరోభాగములఁ దాండవించుచు భాగవతమాడుచున్నాఁడు. మన సహనమే మనకొంపఁ దీసినది. మన గొంతుఁ గోసినది. మనము సహించిన కొలఁది చెలరేఁగుచున్నాఁడు. విద్యయంతయు నావశ్యకమైయుండఁ దనకు మాత్రమే కావలయునఁట; మన కక్కఱలేదఁట. తన కది జ్ఞానోపదేశక మగునఁట. మనకు దుష్ప్రవర్తనప్రోత్సాహకరమగునఁట. ఇంత సిగ్గుమాలినమాట మగవాఁడు చెప్పఁగలిగెను గాని ఛీ! ఛీ! తాను సర్వవిద్యాపారంగతుఁడై యుండియు, మనకు గుంటయోనమాలయినఁ దాను నేర్పి నాఁడా? ఏల? మనమే విద్య నేర్చినయెడలఁ దన యాధిక్య మడుగంటి పోవలసినదే. తన ఘనత కాలిపోవలసినదే కాదా? మనకుఁ దాను విద్య బోధింపలేదు సరే. అంతటితో నూరకుండెనా? స్త్రీవిద్య దూష్యమని సిగ్గులేక యుపన్యాసములు కూడ నీయ మొదలుపెట్టినాఁడే. మనకు గృహమే పాఠశాలయనియు, వంటయిల్లే పలకయనియు, నలుకు గుడ్డయే కలమనియు, పేడనీళ్లే సిరాయనియు, నలుకుటయే యక్షర లేఖనమనియు, బ్రొయ్యియొద్ద వంటఁజేయుటయే ప్రకృతిశాస్త్రమనియు, గంజివార్చుటయే గ్రంథరసగ్రహణమనియు నేమేమో నోట వచ్చి యుంపరాని మూర్ఖపు మాటలు సభలలో మర్యాదను, మనుష్యత్వ

మును విడిచి పలికెను గాదా? మన బుద్ధిబలముచేత సర్వోన్నత్యైక్య
భావముచేత—నిప్పుడిప్పుడు మనము నేర్చుచున్న విద్యనుగాంచి తాను
గన్నులలో నిప్పులు పోసికొనుచున్నాఁడే! మన కవిత్వమును జూచి
తా నేమనుచున్నాఁడో వింటిరా? మంచపునేతయఁట! చిటిచాప
యల్లికయఁట! చొప్పదంటుమోపఁట, కుడితిగోలెమఁట, ఛీ! ఛీ! తన
కవిత్వపుపస గొట్టిదో విద్యాగతులగు నాసోదరీమణు లందఱెఱుఁగనిది
కాదు. మనకు విద్య రానప్పు డతఁడు కవి యనియు, ఘనుఁడనియు, నతని
కవిత్వము రుచ్యమనియు నజ్ఞానముచే ననుకొంటిమి. ఇప్పు డాతని
పాండిత్యప్రభ బట్టబయలయినదా. ఆతని కవిత్వము ఘనత గట్టలయి
నదా? కారింగువకంటె గబ్బిలపుఁబెంటకంటెఁ గాకిరెట్టకంటె నతని
కవిత్వము కడు హేయమని యిప్పటికి మీకందఱకు స్పష్టమైనది కాదా?
ఈమీసాలకవులలో నూటికిఁ దొంబదితొమ్మండ్రు శుద్ధశుంఠ లని
యిప్పుడు మీకు వెల్లడియైనది కాదా? కవిత్వమన్న నగాధహృదయ
రసముగల యాఁడుది చెప్పవలయును. అనురాగములగని యగునాఁడుది
చెప్పవలయును. ఆహ్లాదపుబావి యగునాఁడుది చెప్పవలయును. అధిక
లావణ్యవతియగు నాఁడుది చెప్పవలయును. ఔచిత్యపురాశియగు
నాఁడుది చెప్పవలయును. అంతయేకాని మోటమొఱకుజాతికి మృదుల
కవిత్వ మబ్బునా? కఠినశుష్కమనస్కులకుఁ గ్రంథకవితాపరిపాక
మలవడునా? కల్ల కల్ల. ఇఁక నొక్క పదిసంవత్సరము లీరీతిగ మనము
విద్యాగ్రహణమునఁ గాలక్షేపము చేయునెడల నాతని చేతిలోనున్న
కలము కాగితము నాఁడుది తీసికొని యాఁడుదానిచేతనున్న సిబ్బి
గరిటె నాతని చేతిలో శాశ్వతముగా సర్వేశ్వరప్రీతికరముగఁ బెట్టదా?
కాలము సమీపించుచున్నది. ఆఁడుది మగవాఁడు కావలెను. మగవాఁ
డాఁడుది యయి తీరవలెను. అప్పుడుకాని మగవాని యొగురడఁగదు.
ఆతఁడు చేసినద్రోహమునకు ఫల మనుభవింపఁడు. ఓ! సృష్టి తలక్రిందు
కాఁదగియున్నది? సృష్టికిఁ బ్రభ్వివి నీవేకాని నేను ప్రభుఁడను కానని
యాతనినోటితో నాతఁడు మనకుఁ బాదాక్రాంతుఁడయి పలుకవలసిన
సుదినములు వచ్చుచున్నవి. తొందరపడవలదు. సోదరీమణులారా!
మీరు పట్టుదలను వదలకుఁడు! యేమైనసరే! కానిండు!

ఆహా! గృహకృత్యముల నాతని దుర్నయమును దలఁచుకొనఁగ, గడుపు మఱింత మండిపోవునుగదా? యెంతసేపటికిఁ దనసౌఖ్యము, తనకీర్తి, తనయారోగ్యము, తనయైశ్వర్యము లనయూఁచునన్నే కద! కేవలాత్మీయవాంఛాలంపటతాతిపంకిలాత్ముఁడగు పరస్త్రీయస్పృహానాభావ స్వభావదుర్భరుఁడగు సహపము బిగించుకొని జొల్లుఁ గార్చుకొనుచు జేతికఱ్ఱ టక్కుటక్కున నేలఁదాటించుకొనుచు దౌహిత్రుఁడగు వారి చూపుచుండఁ దొమ్మిదవసారి గర్భదానపుపీటలపైని "హాహారా" యనుచుఁ దాను జదికిలఁబడునుగాని పదుమూఁడేండ్లనిండుపువకుఁ బునర్వివాహము దూష్యమని చెప్పును? ఈతనికి నయూదాత్షిణ్యము లున్నవా? ఔచిత్యమున్నదా? హృదయమున్నదా? ఈతఁడు ప్రాణి కోటిలోనివాఁ డగునా కాదా? తా నెన్నితప్పుతిరుగుడులు తిరిగిన నది శిష్టాచారమా? తా నెన్నివంకరూఁతలు కూసిన నవి వేదాక్షర ములా? అవి మనకు దూష్యములు శిక్ష్యములు. నవశాస్త్రము లునా? భగవంతునికిఁగూడ నిట్లే మతిపోయెనా? అతనిచట్టములు గూడ నింతపక్షపాతప్రబలములేనా? అతనినోట వెడలినశ్రుతులు గూడ మన కధోగతిప్రదములేనా? ఆహా! ఎంతదురన్యాయము! ఎంతదుర్నీతి మగవాని మనసే మనసా! అతనిమాటయే మాటయా? మన మాతనియానతుల శిరమున వహించి నోరు మూసికొని యుండ వలసినదా? మనకేమి సిగ్గుబిడియములు లేవా? ఆత్మగౌరవము లేదా? అహంకారములేదా? అవస్తువులమా? అసువులులేని మట్టిబొమ్మ లమా? అతనియిష్టానుసారముగఁ గామతంత్రము నిర్వహించుకొనుటకు మనమేమి పట్టితోలుతిత్తులమా? మనము సింగారించుకొని వాకిట నిలువఁబడఁగూడదా? మోకాలుచిప్ప లూడగొట్టుకొని పంచ పాళీలోఁ గూర్చుండవలయునా? వీథిలోఁబోవువారి నెవరినైనఁ జూడఁ గూడదా? కన్నులలో జీడిపెట్టుకొని గడపమూలను గూర్చుండవల యునా? మన మెవరితోడనైన స్వేచ్ఛగ మాటాడఁగూడదా? నోటిలో లద్దిగొట్టుకొని యుండవలయునా? తాను—తాను, తన యిష్టాను సారముగఁ దిరుగుటా? స్వేచ్ఛగఁ గనఁబడినకాంతలతోఁ బరిహాస ముగా మాటలాడుటా? రాత్రులు రెండుయామములవఱకు నిల్లు సేరకుండుటా? చందనచర్చతో నత్తరపువాసనతో వచ్చి దేవుఁడ్లా

చుండెను. యోగినిని ముద్దుపెట్టుకొనువారు కౌఁగిలించుకొనువారు చేయిఁ బట్టుకొనువారునై సభయంతయును మహానందమగ్నమై యుండెను. సోదరులారా! నేను జరుగనియంశము చెప్పువాఁడను గాను—శ్వేతద్వీపమునఁ బ్రభవనామసంవత్సర చైత్రశుద్ధ పంచమినాఁటి సాయంకాలమునఁ నిట్టిసభ జరిగినది. నేను గాలిలోఁ బెరిగినవాఁడను గనుటచే విదేశవార్తలనుగూర్చి యసత్యకథలు చెప్పుదునని నామిత్రులను సాక్షి యభిప్రాయము. ఒకటి లేనిచే రెండుకల్పించువాఁడను గాను. అట్టి కవితాశక్తి లేనివాఁడను నేను విమర్శకుఁడను గూడఁ గానని యీ నడుమ సాక్షి నన్నధిక్షేపణ మొనర్చినాఁడు. అసంగతి లోకమెఱుంగును లెండు. విచారింపఁదగదు.

యోగిని నందఱు గౌరవించిరి. పురుషముఖావలోకనపరాఙ్ముఖతఁ గూర్చి తొంబదిమూఁడవసారి తిరుగ నందఱు శపథము చేసిరి. ఆరాత్రి గొప్పవిందు జరిగెను. స్త్రీలందఱు కోటలోనే భుజియించిరి. కొందఱు పాడిరి. కొందఱాడిరి. కొందఱు తా మొనర్చిన గ్రంథములఁ జదివిరి. ఇట్లనేకవిధములఁ గాలక్షేపము జరిగినది. అందఱు పోయి యెవరియింట వారు శయనించిరి. అది వసంతర్తుమధ్యభాగము. స్త్రీలు ముంగిళ్లనే శయనించుచుండిరి; చల్లనిగాలి వీచుచున్నది. రాత్రి నిశ్శబ్దముగ నున్నది. కాని యెక్కడనుండియో కాని దూరమునుండి తుపాకిచప్పుడు వినఁబడినది. ఒక్కగడియసేపటిలోఁ దుపాకులధ్వనులు గ్రామముచుట్టు వినఁబడసాగినవి. స్త్రీజనమంతయు నదరిపడి లేచి గలగల తిరుగుచున్నది. ఎవ్వరో యుద్ధమునకు వచ్చి గ్రామమును ముట్టడివైచినట్లు స్పష్టము. లంగాలు పైకి బిగించి దోపుకొనువారు కొందఱు, వూడినకచభారముల గట్టిగ ముడివైచుకొనువారు కొందఱు, నడుముల గంటలయొడ్డాణములుదీసి తోలు "పటకాల" ధరించువారు కొందఱు, సన్నరవికలపై దళవరిచొక్కాలు తొడుగుకొనువారు కొందఱు, మట్టెలు తీసివైచి పాదములకుఁ జర్మపాదరక్షలు తొడుగుకొనువారు కొందఱు, శస్త్రాగారమునకై పరుగెత్తువారు కొందఱునై గ్రామ ముల్లోలమయ్యెను. రాణిగారు మంత్రి కార్యదర్శిని మొదలగువారు యుద్ధాలోచనవిషయికసభ చేసిరి. మగవారితో యుద్ధమొనర్చి వారిజాతిలోఁ గొంతనైన మారణము చేయుటకుఁ దగినయవ

కాశము గలిగినదని యందఱు సంతసించుచుండిరి. ఇంతలోఁ గొందఱు సైనికులు ప్రవేశించి “ఆయుధాగారపుఁ దాళ మగపడదు. యోగిని యందులో శయనించుచున్నదని తెలిసి తలుపుతట్టి యెంతయల్లరిచేసిన నామె లేచి తలుపు తీయలేదు. ఆయుధములన్నియు నందులో నున్నవి. ఏమిచేయవలయును?” అని బిగ్గరగా రాజ్ఞీసన్నిధానమున నఱచిరి! “దానితాళము యోగిని కెవరిచ్చిరి? ఆమె దానిలో నేల శయనించుచున్నది” యని రాజ్ఞి పలుక ఆయుధాగారములోనున్న యుద్ధశక్తి దేవాలయములో స్త్రీలసమర్థతాశౌర్యములకై శక్తినిఁ బ్రార్థించుచు రాత్రి యచ్చటనే శయనింతునని చెప్పి యోగిని నాయొద్ద తాళమును దీసికొనిపోయినది” యని మంత్రి పలికెను. నాతోఁ జెప్పకుండ నీవట్లేల చేసితివని కోపముతో రాణి మంత్రి చేయికఱచెను. మంత్రి కోపముతోఁ గార్యదర్శిని గాజులు పగులగొట్టెను. ఎల్లవారలకు మతులుపోయెను. అందఱు నాలమునకు సిద్ధముగానే యున్నారు. ఆయుధములు లేవు. అందఱుపోయి శస్త్రాగారమునొద్ద బిగ్గరగ నఱచి, తలుపుగొట్టిరి; లోనుండి మాటలేదు. ఇనుపతలుపులగుటచేఁ బగులగొట్టుటకు చాల సేపు పట్టును. పురుషసైన్యములు ధామ్ ధామ్మని ధ్వనులతో లోపలఁ బ్రవేశించుట కారంభించిరి. అంతటఁ గొంత లటునిటుఁ బరుగెత్తుచు నినుపగరిటెలు కొందఱు, గడ్డపాఱలు కొందఱు, కఱ్ఱతెడ్డులు కొందఱు, రోకళ్లు కొందఱు, చీపురుకట్టలు కొందఱు, పాత్రములు కొందఱు, తిరుగఁటిగురుజులు కొందఱు, చేతుల కేదిసమయమున కందెనో దానిని ధరించి యుద్ధసన్నద్ధలై బారులుదీర్చి, చంపెదము. పచ్చడి చేసెదము. పొడిచెదమని రణావేశమునఁ గేకలు వేయుచుండిరి. యుద్ధకారణమేదో యెవ్వరికి గోచరింపలేదు.

ఇంతలోఁ బురుషుఁడగు రాయబారి యొకఁడు వచ్చి “మీరు బలాత్కారముగ మామగవాని నొకని మీసంస్థానమున కేల యీడ్చుకొనిపోయిరి? వానిని మాకుఁ దిరుగ నిచ్చెదరా? లేకున్నఁ జచ్చెదరా?” యని రాజ్ఞితోఁ బలికెను. “మనలో మగవాఁడెవఁడో కనుగొనుఁ” డని ప్రభ్వి యాజ్ఞ కాఁగా స్త్రీజనమంతయు మఱింత కలఁతనొందినది. ఏకాంత మట్టున కాకాంతకుఁ బ్రక్కనుండు కాంత పురుషుఁ డేమోయని సందేహము తోఁచసాగెను. అన్నివేల యాఁడువారిలో మగవాఁ డెవఁడో

కనుఁగొనుట యెట్లు? ఆదిగాక బలాత్కరించి యెవనినో తీసికొనివచ్చుట కల్లగాన నిది యుద్ధమున కొక్క మిషయని నిశ్చయపఱచుకొని "యుద్ధము చేసి చచ్చువారమే కాని వెనుకఁ దిరుగువారము కాము. కాని యిప్పుడు కారణాంతరములచే సిద్ధముగ లేము. తెల్లవాఱువఱకు నాగియుండిన యుద్ధ మొనర్తుము." అని రాజ్ఞి రాయబారితో ననఁగ నాతఁడు యుద్ధ మాగదని చెప్పిపోయెను. అంతట మంత్రియు మఱికొందఱు సభచేసిరి. "ఆయుధములు లేనిసమయమున యుద్ధము తప్పని పనియయ్యెను, చావుగూడ మనకల్లే యగునేమో? కావున సంధి మంచిది. మే మొక్క మగవానితో శాశ్వతముఁగ ముడిపెట్టుకొనువారము కాము. పెండ్లి ఫల మయిదుసంవత్సరములు మాత్రమే యుండఁదగినది. ఆమితిలోఁ గలిగిన యాఁడుపిల్ల మాది మగపిల్లవాఁడు మీవాఁడు. మాకు మీతో సమాన మగు స్వేచ్ఛ నంగీకరింపవలయును. ఈయేర్పాటుల కంగీకరించినయెడల మీతో మేము సంధిచేసికొందు" మని వారికిప్పుడు తిరుగ రాయబార మంపిన మంచిది. వారు సంధి కంగీకరింపక యుద్ధమే చేయుదమనినచో "నిరాయుధమగుమాతో సాయుధులగు మీ రసమయుద్ధ మొనర్చుట యన్యాయము. కావున మీరుగూడ నిరాయుధులై యుద్ధమునకు రండని వారికి రాయబారిచేతఁ జెప్పింపవలయును. అని మంత్రి రాజ్ఞితో జెప్పెను. అందుల కామె సమ్మతించి యట్లుచేసెను. రాయబారి తిరుగఁ బరుగెత్తుకొనుచువచ్చి "సంధి పొసఁగలేదు. యుద్ధము తప్ప" దని చెప్పెను. ఇంతలో లెక్కకుమీరిన పురుషులు తుపాకులవారు, కత్తుల వారు, సీఁటెలవారు, గండ్రగొడ్డళ్లవారు, కట్టికత్తులవారు, లోపలఁ బ్రవేశించిరి. శస్త్రశూన్యలగు కాంతలఁ జూచి పురుషులు తమశస్త్రము లూడ్చిరి. సంఘయుద్ధము దోష్మియగునని దానిని మాని ప్రత్యేక ప్రత్యేకముగ ముష్టియుద్ధమునకై తలపడిరి. ఒకపురుషుఁడు తనకుఁదగిన యోధనుదీసికొని సమర మారంభింపఁ దొడఁగెను. స్త్రీలు మిగిలిపోవుటచే కొంద ఱిద్దఱు ముగ్గురను దీసికోవలసి వచ్చెను. నేనుగూడ నొక సాగుడుకాళ్ళులచాన నేరుకొంటిని. అది నన్ను వీరావేశమున గ్రుద్దుటకై యుంకింపఁగ దానికి మెల్లగ నేను గిలిగింతఁ బెట్టితిని. అది తెల్లబోయి కొంచెము నవ్వుకొనుచుఁ దిరుగ మొగముముడిచి నాలెంపపై గొట్టఁబోవఁగ నామె చేయిపట్టుకొని ముద్దు పెట్టుకొంటిని, వీరావేశ

మేమయ్యెనో, అట్టహాస మేమయ్యెనో ఆమె గుసగుసలాడుచు మంద
హాసముఁ జేయుచు నన్నుఁ గౌఁగిలించెను. యుద్ధమునకుఁ బిఱికివాఁడనైన
నే నొక్కఁడనే యిట్లు చేసితి ననుకొంటిరేమో! మిగిలిన రణశూరు
లందఱు రవ్వంత పాఠభేదముగ నట్టిగ్రంథమునే చదువుచుండిరి.
ముద్దుల చప్పుడే కాని గ్రుద్దులచప్పుడే లేదు. కిలకిలలే కాని రొసరొసలే
లేవు. మందహాసములే కాని యట్టహాసము లేవు. కౌఁగిలింపులే కాని
కలియఁబడు తెగింపులే లేవు. సౌఖ్యపారవశ్యమే కాని సమరసమావేశమే
లేదు. ముందేర్పాటులఁగూర్చి వీరు వారి నడుగలేదు, వారు చెప్పలేదు.
గపుచిప్ లే కాని గడబిడలే లేవు. కాని యోగిని తలుపుతీయకపోవుట
కేమి కారణమో యని స్త్రీలందఱు వితర్కించి తిరుగఁ దలుపు గట్టిగఁ
ట్టిరి. అంతట లోపలితలుపు గొండ్లెముతీసి మీ కెదుటఁ గనఁబడు
చున్న జంఘాలశాస్త్రి వెలుపలకు వచ్చెను. నీ వెవ్వఁడవని వారు నన్న
డుగ "మిమ్మిట్లు మోసపుచ్చుటకు నేనే వీరి ప్రోత్సాహమున యోగిని
నైతిని. నేను రాత్రి యిట శయనింపలేదు. ఉపన్యాసానంతరము పోయి
తిరుగ వీరితోవచ్చి నాకుఁ దగినదానిఁ జూచుకొని యిందునఁ బ్రవే
శించితిని" అని చెప్పితిని. స్త్రీలందఱు నవ్వుకొనిరి. ఆఁడువారి కేమున్నది.
మగవారిపై నిష్టమున్నఁ గొండంత నేర మిందుపగింజంత! అన్యథా
యైనచో నిందుపగింజంత తప్పు హిమాలయపర్వతమంత. సోదరులారా!
సోదరులారా! రాత్రి చాలనైనది. శ్రమయిచ్చితిని. క్షమింపుఁడు." అని
జంఘాలశాస్త్రి పలికెను. అందరును పోయిరి. నేనుఁగూడ నింటికిఁ
బోయితిని.

# సాక్షి

## 5. గ్రహచక్రజ్యోతిషము.

నిన్నటి యలవాటు ననుసరించి జనులు మూగిరి. నేనుగూడఁ బోయి లోనఁ గూర్చుంటిని. "ఎండలప్పుడే మిగులఁ దీవ్రముగ నున్నవి, వైశాఖమాసమున నెట్లుండునో" యని నేను యాదృచ్ఛికముగఁ బలుక నంతవఱ కేమియు మాటలాడక యేదియో తనలోఁ దా నాలోచించుకొనుచుఁ దలవంచుకొని కూరుచుండియుండిన జంఘాలశాస్త్రి తటాలున లేచి యుపన్యాసపీఠ మెక్కి యిట్లు పలుకదొడఁగెను.

"కావా ? ఎక్కువగుచునేయున్నవి. ఇఁకయు నెక్కువగును, భరించుటకైన శక్యముకాకుండ నెక్కువయగును. ఈనిదాఘతీవ్రత్వమునుగూర్చి మనమేమో నిర్లక్ష్యముగఁ జూచుచున్నారము. మనకేమో చీమకుట్టినట్టులైన లేకుండనున్నది. ఇది యింతలో కోపద్రవమో కాసంతరైన మనవారెవ్వరు నాలోచింపరైరి. ఆ... ...యెంత యజ్ఞానము. ఏసంవత్సరమున కాసంవత్సర మెండలు ... తమగుచున్నవి. వర్షములు తగ్గిపోవుచున్నవి. భూమిలోనిసా... ...ని ప్రత్యక్ష భూగర్భమున నుండునగ్ని యధిక మగుచున్నది. ...ము తనకుఁదగిన సములగుచున్నవి. మనుజులమాట చెప్పవలసినదేమి ...లు మిగిలిపోవు జీవించినమనుజుఁ డెవఁడైన దైవమహాత్మ్యమున ... ...నేనుగూడ నొక గాంచునెడల మనము మనుజజాతిలోనివారమ... ...శమున గ్రుద్ధు జాలఁడు. గేదెముందు లేతపెయ్య లెటులు ... అది తెల్ల మట్టు లగపడుదుము. మనకింక నెట్టికొంకనక... ...చి నాలెంపపై బాలిక రజస్వల యగుచున్నది. పదునాలు... ...టిని, వీరావేశ

డేడాదికొడుకు నోడిలోఁబెట్టుకొని యతనితోపా టేడ్చుచున్నాఁడు. డోఁదరఁగొట్టిన యరఁటికాయవలె సుష్ణముచే నట్టియట్టె పక్వమై పరమ పదించుచున్నారు. ఇప్పటి దుస్థితియే యిట్టులుండ నిఁకముం దెట్టు లుండునో? యింతకును గారణ మీయెండ. సూర్యుని యాకర్షణశక్తి యధికమగుటచేత భూమి దినదినమునకు సూర్యుని సమీపించుచున్నది. మనతండ్రులనాఁటికంటె మననాఁడు మఱింత దగ్గఱకుఁ బోయినది. ఆహా! సోదరులారా! ఇఁక నెట్లుగాఁ బరిణమింపఁ దలఁచియున్నదో యాలోచించి నారా! నిమిషనిమిషమునకు మహాగ్నికుండమును సమీపించుచున్నది. ఎప్పుడో—ఏపగలు, మనము భోజనముచేయుచుండఁగనో! ఏరాత్రి— నిదురఁబోవుచుండఁగనో—గబుక్కున—మిడుత దీపములోవలె నీ రత్నగర్భ—ఈసాగరమేఖల—ఈవసుంధర—ఈసర్వప్రాణికోటి నివా సము—హోమకుండమున నాజ్యబిందువువలె—నాహా! ఆగ్రహారాజ ములో—నట్టెపడి యవిదిత స్వరూపముగ—నంతరించి పోవదా! పోవుటకేమైన సందేహామున్నదా? ఇంతమట్టునకు వచ్చిన పిమ్మట నాకా సంతపనియు మాత్రము కాకుండునా!

ఇదిగాక యీపత్రిక జూచితిరా! ఇది గ్రహగతులఁగూర్చి పాశ్చాత్యులచే వ్రాయంబడు గొప్పపత్రిక; దీనిలో నేమున్నదో వింటిరా. ఇఁకఁ గొన్ని సంవత్సరముల కొక గొప్పతోఁకచుక్క యవత రించునఁట. దానితోఁక యెన్నికోటుల యోజనములపొడవో యుండు నఁట. దానినడక విచిత్రమఁట. అదియొక క్రమము ననుసరించి పోదఁట. వెఱ్ఱియెత్తినయాతఁ డెట్లు ప్రవర్తించునో యది యట్లు తిరుగునఁట. అంతగొప్పతోఁకతో—నత్యున్నతథోరణితో — నాభీలవేగముతో — నది యొక్కటియాడ్చి మనభూమినిఁ గొట్టినయెడలఁ గాలితోఁ దన్నిన తోలుబంతివలె మనగోళ మెక్కడ కెంతవఱ కెట్టు లెగిరిపోవునో యాలోచించుకొనుటకైన నవకాశమున్నదా?

ఆత్రోపులో—నవని యట్టు లంతరిక్షమార్గముల నెగిరిపోవు చుండ మనగతి యేమి కావలసినదో కాసంత యాలోచించితిరా? చెట్టు దులిపినప్పుడు నేరేడుపండ్లు జలజల రాలినట్లు, చెప్పుఁదీసికొని యుంకించి మూతిమీఁదఁ గొట్టినప్పుడు నోటిపండ్లు రాలినట్లు భూమి నుండి — చెల్లాచెదరై — యథాయథలై — తల బీకనకాయలై —

యెగసిపడి—అదరిపడి—యంతరిక్షమున నుండి జలజల—జరజర—బిలబిల క్రిందకుఁ బడిపోమా! ఆ! క్రింద యెక్కడనున్నది—భూమిని వదలినవానికిఁ గ్రింద యెక్కడ నుండును? అట్లంతరిక్షమున నుండి డిబుకు డిబుకు నెన్నియుగములు దిగిపోవుదుమో? అదికాక—మాటవరుసకుఁ జెప్పుచున్నాను. తోఁకచుక్క దెబ్బతో భూమియ ట్లెగిరినపుడు మనము స్తంభములను గట్టిగాఁ బట్టుకొనికాని, మన భార్యాపుత్రాదుల నంగవస్త్రములచేఁ ద్రాళ్లచే మంచపుఁగోళ్లకుఁ గట్టిగఁ గట్టిగాని మనము భూమినుండి యెగసి పైకిఁ బడిపోకుండ జాగ్రత్త పెట్టుకొనఁగలమని యెంచినను మన కుపద్రవము దాటిపోయిన దను కొంటిరా? లేదు సోదరులారా! లేదు! ధూమకేతుపుచ్ఛతాడన మున నెగసిన యీగోళము తలఁపరాని తీవ్రమున—రంయిరంయి మని చెవులుగింగురుపడు భయంకరశబ్దముతో—నంతరిక్షమునఁ బోవు చుండఁగ—దాని దారి నడ్డువచ్చిన మఱియేయితర గోళముతో—రోద సీకుహర మదరునట్లు—టక్కుమను మహానాదముతో—తలపడి డీ డిక్కుగొట్టునో? పండుదోసకాయ విచ్చినట్లు మన గోళము విడిపోదా! మనము ఓక్ ఓక్కనుచు రక్తవమనములు చేసికొనుచు గొట్టములో నుండి వెన్నముద్ద లెగసినట్లు పై కెగిరిపోమా? మనగోళము వారు కొంద ఱితరగోళములలోఁ బడిపోవరా?

అదిగాక — యీపత్రికలో ముప్పదియేడవ పత్రమున నేము న్నదో చూచితిరా? ఇది వ్రాసినయాతఁడు మఱియొక పాశ్చాత్యుఁడు, ఈతఁడు ప్రకృతిశాస్త్ర పండితాగ్రగణ్యుఁడు. సూర్యునిలోనున్న వంట చెఱకు తగ్గిపోవుచున్నదఁట. అందుచేతనే సూర్యదీప్తి తగ్గుచున్నది. ఇట్లు కొంతకాలము జరిగిన పిమ్మట సూర్యుఁ డుద్దీపనసామగ్రిశూన్యుఁడై యారిపోవచ్చును. ఈతఁ డిట్లభిప్రాయపడుచున్నాఁడు. జరిగిన జరుగఁ గలదు. శాస్త్రవాక్యము ప్రమాణము. సూర్యుఁడే చల్లారిపోవునప్పుడు చంద్రుఁడు నక్షత్రములమాట లెక్కయేమి? ప్రపంచ మంత గాఢాంధ కారమయమగును గాదా? కన్నుకన్ను కనపడని యట్టి ఘోరతిమిరా వస్థలో—నొక్కటే కాళరాత్రి కాఁబోలు—పగలు రేయి విభాగము నశించునుగాదా—ఆహా! చలిచే నెట్లు వడఁకి పోయి, కొయ్యవారి పోవుదుమో? అన్నమువండుకొందమన్న—చలి కాఁచుకొందమన్న—

నగ్నిపుల్లలయిన వెలుఁగునో లేదో—సోదరులారా! ఒక్కసారి కన్నులు గట్టిగ మూసికొని యిట్టి యనంతరాత్రి సిద్ధించినదని మనలో నెంచు కొనుఁడు. ఒక గ్రుడ్డివానికి దారిఁజూపవచ్చునుగాని యందఱు గ్రుడ్డివారైనయెడల నేదిగతి?

దురంతమగు చలిచేఁ జావకుండ నిల్పినయెడల నన్నము వండుకొనుట కగ్ని లేనివారమై—యందుచే క్షుత్పిపాసాపీడితులమై—కడుపు మండుకొనిపోవఁగఁ—గరుణలేక—కనఁబడక నటునిటు కరములఁ దడుముకొనుచుఁ—గాంతలను గన్నవారినిగూడఁ బట్టుకొని కఱకఱ నమలి కడుపు నిండించుకొందుమేమో! ఆహా! ఈదురవస్థ తలఁచుకొననొడలు జలదరించుచున్నది. రణకంప మగుచున్నది. గుండె లవిసి నీరై పోవుచున్నవి. మఱియొక్క యుపద్రవముకూడ గాన్పించుచున్నది.

ఆరిపోయినసూర్యుని కాకర్షణశక్తి యుండునా? గ్రహచక్రవర్తికే యాకర్షణశక్తి యడుగంటినప్పు డితరగోళము లెట్లు లంతరిక్షమున నిలువ గలవు! పైనుండు గోళములన్నియుఁ బట్టులూడి యొక్కసారి తాటిపండ్లవలె మన గోళముపైఁ బడునేమో! అప్పుడేమియగునో! ఛీ! ఛీ! దుర్జ్ఞేయమగు నీసన్నివేశమును స్మరించినందువలననే నరముల బింకము వదలి కాళ్లు స్థానములు చెదఱి తలప్రాణము తోఁకకు వచ్చుచున్నది. ఇఁక నేను జెప్పలేను. ఈపత్రికను జూచినప్పటినుండియు నిరాహారుఁడనై మనసు చెదరియున్నాను" అని పెద్దనిట్టూర్పువిడిచి జంఘాల శాస్త్రి కూరుచుండెను; సభాసదులందఱు తెల్లఁబోయి దీర్ఘనిశ్వాసములతోఁ గూర్చుండిరి.

దిబ్బడివైచిన తనముక్కు నటునిటు బింకముగఁ బాయించి కుంభక రేచకసాధనమున బ్రకాశించు కాలాచార్యులు—పోఁగొట్టుకొనుటకు భార్యగాని పిల్లలుగాని సోదరులుగాని యెవ్వరునులేని కాలాచార్యులు గూడ నీయుపన్యాసానంతరమున—నేమో దీర్ఘాలోచనమున మునిఁగి యుండెను. సూర్యుఁ డారిపోవఁగఁ గలుగుగాఢాంధకారమున సస్యభిక్ష కెట్లుపోవచ్చునని యో యగ్నికారణము లేకుండ నస్యకార్య మెట్లు సిద్ధించుననియో మనస్సునఁ దటపటాయించుచుండెను గాఁబోలు. కవి యగు వాణీదాసుఁడును వెఱ్ఱివాలకముతో నుండెను. తోఁకదెబ్బ తగులుటచే నెగిరిపోవుచున్న భూమి గోళాంతరముతోఁ గొట్టుకొని

నప్పుడు తా నెగిరి యువతలిగోళములోఁ బడిపోవునప్పు డక్కడనుండు భాష తెలుఁగుగానియెడలఁ దనకవిత్వమున కచ్చట వ్యాప్తికలుగక పోయినయెడల నేమి బ్రదుకురా భగవంతుఁడాయని కాఁబోలు గాఢయోచనానిమగ్నుఁడయ్యెను. ఇఁక సభాస్తారులందఱుఁగూడ నెంతమాత్రము స్తిమితత లేకుండనున్నట్లు నాకుఁ గానిపించిరి. అనుభవింపకుండ నవనిలోఁ బూడ్చిపెట్టిన వరాలముంతమాట యేమియని కాఁబోలు నొక్కఁడును, బడుచుపెండ్లామును విడిచిపెట్టుట యెట్లు కాఁబోలునని యొకఁడును, ప్రస్తుతము జరుగుచున్న నావ్యాజ్యములో చచ్చునట్లు ప్రతివాది మీఁద "కోర్టు" వారు చెప్పవలసిన తీర్పు వినకుండనే యీ యాపత్తు వచ్చునాయని కాఁబోలు నొక్కఁడు, నెందులకయిన మంచిది, రావలసిన పద్దులు త్వరగ "వసూలు చేసికొనరాదా" యని కాఁబోలు నొకఁడు. నిటులే తలకొక్క వెఱ్ఱియూహమున—మనశ్శాంతి లేకయుండిరని నేననుకొంటిని. తూర్పుననున్న ఛత్రపురమునుండి మాసత్యపురమునకు నీళ్లకావిళ్లమోఁతచే జీవించుటకువచ్చిన యొక నాతి "అయ్యా! మా పిన్నమ్మ నిన్న నేను వచ్చుసరికిఁ గ్రొత్తగఁ బెట్టిన యావకాయ నెండ వైచుచున్నది. బాబూ! అది యెండకుండగనే సూర్యుఁ డారిపోవునా" యని నుదుటిపైనఁ జేయి పెట్టుకొని లోన గిజగిజఁ గొట్టికొనుచున్న జంఘాలశాస్త్రి నడిగెను.

ఈసమయమున నేదైనఁ జెప్పకుండునెడల నిట్టి మనస్థితి వీరికి వెంటనే నశింపదని యెంచి యిట్లు పలికితిని.

సోదరులారా! చలిచే వడఁకుచుండువాఁడు మంచుగడ్డ తలకుఁ గట్టించుకొనునా? తాపజ్వరముచే నార్తినొందు నాతఁడు మంచము క్రిందఁ గుంపటిని దాపుకొనునా? విషూచిచేఁ బీడింపఁబడువాఁడు నేపాళపుమాత్ర వేసికొనునా? చేటలోఁ బడినది మొదలు కాటిలోఁ బడువఱకు మనము ప్రత్యక్షముగ నిరంకుశముగ నేడువవలసిన యేడుపులు మనకుఁ జాలవా? మన నిత్యశోకమున కీనవనవానల్పకల్పనాకలాపనూతనరోదనకాండపారాయణముగూడఁ గావలయునా! సోదరులారా! మీకు మతులున్నవా? లేవా? దుఃఖనిరాససాధనమునకై సుఖమార్గావలంబనమునకై యుపయోగపడవలసిన బుద్ధిని చిత్రవిచిత్రదుఃఖబ్రహ్మాండసృష్టికై యుపయోగపఱచుచున్నారా? శత్రు

వులనుండి కాపాడుకొనుటకై యీయఁబడిన ఖడ్గముతోఁ గొంతుఁగోసి కొనువాఁడు మతియున్నవాఁడేనా? వచ్చినయాపదలనే వేదాంత విజ్ఞానమునఁ దొలఁగఁద్రోచికొనుట విధియయియుండఁగ - నట్లు త్రోచి వేసికొననివాఁడు మూఢుఁడై యుండఁగ—నెప్పుడో రాఁదలఁచిన—వచ్చునో రావో యని సందేహింపఁదగిన—వచ్చినను గలియుగము యొక్క నాలుగవపాదమందుగాని రా వీలులేని—యెప్పుడువచ్చినను సర్వనాశనమగుటచే విచారించువాని విచారమున కవకాశమీయని—చెప్పఁదగని—ప్రతిక్రియ చేయఁదగని-యాలోచింపఁదగని—యాపద లిప్పుడు వచ్చినట్లుగ నేడ్చువాఁ డెట్టివాఁడై యుండును. ఆకాశమునకు హద్దుగలదు. కాలమునకు మితిగలదు; గాని యట్టిమూఢచక్రవర్తిశిఖామణి మౌఢ్యమున కంతమున్నదా! ప్రాపంచికవస్తువు లస్థిరములు. నశ్వరములని యెఱుఁగుదురు కాదా? శాశ్వతపదార్థము నీలో నున్న దనికూడ నీవెఱుఁగుదువు కాదా! నీవస్థిరమైన దుచ్ఛబాహ్యవస్తువులందు కాక దానియందుఁ బఱపి తచ్చింతాలోలత నీవుండు నెడల—నీకుఁగావల సినదేమున్నది? ఏమహాతేజముముందు సూర్యుఁడు బొగ్గువలె నుండునో యట్టితేజమును నీవు చూడఁ దగినప్పుడు సూర్యుఁడారిపోయిన నీకేమి! గురుశుక్రులిద్దఱు డీకొని పొడిపొడియైన నీకేమి? పోకుఁడు! ఇంకను జెప్ప వలసినది చాలనున్నది. ఇట్టిజ్ఞానదశ—అయ్యయ్యో పోయెదరేమి? ఇట్టిజ్ఞానదశ యందఱకు సిద్ధింపదు. సాధ్యములగు దశలు చెప్పెదను. వినుఁడు. పోకుఁడు" నేనుజెప్పునది వారికి నచ్చకుంటచేఁ బోవు చున్నారో! లేక సిగ్గుపడియే పోవుచున్నారో నాకుఁ దెలియదుకాని తెప్పపాటుకాలములోఁ గవియుఁ గాలాచార్యులు నేను దప్ప మఱె వ్వరులేరు. శాస్త్రికూడ వారితోఁ జల్లగ జాఱినాఁడు. మేముకూడ నిండ్లకుఁ బోయితిమి.

# సాక్షి

## వాల్మీకి విశ్వామిత్ర రామాయణ విమర్శనము

నేను మానసభాకుటీరము చేరుసరికి జంఘాలశాస్త్రి యుపన్యసించుచుండెను. అంతకుముం దేమిచెప్పియుండెనో కాని నేను లోపల కాలు పెట్టుసరి కిట్లు చెప్పుచుండెను. "కాళ్లుతుడుచుకొనుట కెలుగుబంటి తోళ్లచ్చట దొరకునని గుంతకల్లునుండి వెనుకకురాక ముందునకై పోయితిని. హొసపేటలో రాత్రి రెండుయామములకు దిగి యచ్చట బండి కుదుర్చుకొని తెల్లవారుకడ నాల్గుగంటలకు మెల్లగఁ దుంగభద్రతీరమును జేరితిని. ఆనదిని దాఁటినఁగాని 'ఆనెగొంది' చేర వీలులేదు. వెదురుబద్దలతోఁగట్టి తోలుమూసినపుట్టిలోఁ గూరుచుండి నదిని దాఁటితిని. అచ్చట 'నది మిగులలోఁ' తని చెప్పిరి. ఎట్టయెదుట భయంకరమగు బోడిపర్వతము, కుడివైపునఁ గొంతదూరమున నది రాళ్లనడుమఁ బ్రవహించుటచే గలగలమను హోరు; నెడమవైపున నేదియో జీబురు మను భయోత్పాతబంధురాంధకారము మింట ముసుఁగువడి కునుకుచున్న చంద్రరేఖ పుట్టి యట్టునిట్టు లూఁగులాడఁ బిత్తవికారముతోఁ గూడిన గుండె దడగలిగి "ఏమిరా? భగవంతుఁడా! శిక్షానుభవమునకై బంకోలుపోవుచుంటివా?" యని నన్నొక్కసారి బలాత్కారముగ ననుకొనునట్లు చేసెను. ఎట్లో యానెగొంది చేరితిని. ఎక్కడఁజూచిన ప్రబల పాషాణరచిత మహావిపుల సింహద్వారములే! ఎక్కడఁజూచిన నాంజనేయాలయములే! ఎక్కడఁగాంచిన నేకశిలా నిర్మితాకాశ స్తంభములే! ఎక్కడఁజూచిన గ్రోఁతులుఁ, గొండ మ్రుచ్చులే. ఇది వాలికుమారుఁ డగు నంగదునిపట్టణ మందురు. ఇది వేదభాష్యకర్తయగు శాయన మాధవా

చార్యులవారిచే నిర్మింపఁబడిన విద్యానగర పురశ్రేష్ఠమునకు శివారందురు. తుంగభద్రకు నివి చెరియొకవైపున నున్నవి. విద్యానగరవిచిత్రము లనేకములుగలవు. వానిని వర్ణించుట మాపనికాదు. వానిని "సూయల్" వ్రాసినగ్రంథములవలన మీరు గ్రహింపఁగలరు. నే నిప్పుడు చెప్పఁబోవు నంశములు దానిలో వానికంటె విచిత్రములు. సావధానమనస్కులయి వినఁ బ్రార్థించుచున్నాను.

ఆనెగొంది యనునది కిష్కింధలో నొకభాగము. ఇంద్రపుత్రుఁ డగువాలి యేరాష్ట్రమును బాలించెనో ఆరాష్ట్ర మిదియే! ఇచ్చటనుండు కపిగోలాంగూలభల్లూకముల సంఖ్యలకు మితిలేదు. కొండలు మిగులఁ గ్రిక్కిరిసియున్నవి. ఇచ్చట వాలిపర్వతమున్నది. తారాపర్వతమున్నది. వాలి భండారస్థానమున్నది. ఋశ్యమూకపర్వతమున్నది. మతంగపర్వత మున్నది. మాల్యవంతమున్నది. పంపాసరోవరమున్నది. శబరి తపస్సు చేసికొనినగుహాయున్నది. వాలికాష్ఠమున్నది. ఇవియన్నియు 10 లేక 12 మైళ్ల యావరణములో నున్నవి. ఋశ్యమూక మొక్కద్వీపముగ శ్రీమద్రామాయణమున వర్ణింపఁబడియున్నది. ఆహా! వాల్మీకి యెట్లు వర్ణించెనో యట్లేయున్నది. ఇట్టిచిత్రములగు దివ్యక్షేత్రములను జూచుటకు స్థలజ్ఞులగు విద్వాంసుల సాహాయ్యమావశ్యకముగాన నే నిద్దఱు వైష్ణవులతో మైత్రిఁ జేసితిని. వారొక్కదినమునఁ గిష్కింధకాండము నందలి యొకశ్లోకమును జదివిరి. అది నాకు బాగుగ జ్ఞప్తిలేకున్నను దాని యభిప్రాయమిది. "సుదుగళారోహణమ్" అను నొకపర్వత మున్నదనియు దానిశిఖరమునకుఁ దూర్పుభాగమున నొకగుహా యున్నదనియు దానిలో "శీతజలాన్వితమగు హ్రదమున్న" దనియు నాపర్వతము "శిశునాగ సమన్విత" మనియు- దచ్ఛ్లోకాభిప్రాయమై యున్నది.

ఈవర్ణన మెంత యథార్థమో. నేను దెలిసికొనఁగోరి వారినిద్దఱిఁ దీసికొని మధ్యాహ్నమునఁ దాదాపుగా నొంటిగంటకు బయలుదేరితిని. అది వైశాఖమాసము. ఎండలు నిప్పులను వర్షించుచుండెను. కాలినరాళ్లపై నుండి కాలిపోవుచున్న నిండ్లనుండివలె గాలి దుర్భరముగ వీచుచుండెను. ఆనెగొంది కొక్కమైలులో నీశ్లోకమున వర్ణింపఁబడిన, నీ "సుదుగళారోహణ" పర్వతమున్నది. ఆపర్వతమునొద్ద బండిదిగి తదారోహణము సేయ మొదలిడితిమి. కొన్నిచోటులమాత్రము మెట్లున్నవి. అవియైనను

మిగుల నెత్తుగనుండెను. పర్వత మెక్కుసరికిఁ గాళ్లుపడిపోవునట్లయ్యెను. ఆయాసముచే గుండెలు గలవరపడెను. గ్రుడ్లనుండి గిరగిర నీరు దిరిగెను. "సుదుఃఖారోహణ" మని సార్థకనామము వాల్మీకి దీని కుంచినాఁడని యనుకొంటిమి. ఆపర్వతమునకుఁ బూర్వదిశయందు గుహయున్నదని పై శ్లోకమునఁ జెప్పఁబడియున్నట్లున్నదో లేదో యనిమాడ నక్లే యున్నది. ఆగుహాముఖమున విశ్రాంతికై కొంతసేపు గూర్చుంటిమి. దానిముఖము రెండుమూఁడు నిల్వులయెత్తుగలదిగను విశాలమైయున్నది. దానియందుఁ గూరుచుండిన మాకు—ఎండలో బహుకష్టపడి వచ్చిన మాకు—మిగులఁ జల్లగ నుండుటచేఁ బ్రాణములు హాయిగనుండెను. ఇట్లు పదినిముసము లయినపిమ్మట చలి యారంభమయ్యెను. అట్టియట్టి చలి యధికమగుటచే నేను గడగడ వడఁకనారంభించితిని. పదిబారల కవతల యగ్నివృష్టి గురియుచున్నది. గుహలోనుండు మేము చలిచేఁ గొరడు వారిపోవుచుంటిమి. నామిత్రులు నాకంటె దత్సన్నివేశమున కల వాటుపడినవా రగుటచే చిదుకులు గొన్నిఁటి నేరితెచ్చి శీతబాధా నివారణమునకై మంటఁజేసిరి. అంతట నొడలెల్లఁ గాచికొంటిమి. వంకరలుపోచున్న వ్రేళ్లు తిన్నఁబడెను. దగ్గఱకు నొక్కుకొనిపోవుచున్న దౌడలు వీడెను. ఒడలికిఁగుదుపువదలి కొంచెము కుదురుగలిగెను. ప్రాణముల నిట్లు స్వస్థానములఁ జేర్చిన కొంతసేపటికి శ్లోకమున "హ్రదం శీతజలాన్వితం" అని యున్నదిగదా? ఈగుహలో హ్రద మెచ్చట నున్నది యని నే నడుగ లోపలకుఁ బోవుదము రండని వారనిరి. అంత గుహాంతరప్రవేశమునకై మొదలిడితిమి. కొంచెము నిలువఁబడి లోనికిఁ బ్రవేశించితిమి. కొంతదూరమువంగి లోనికిఁ బోయితిమి. కొంతదూరము కూరుచుండి ముందునకు దేకితిమి. కొంతసేపు సాష్టాంగపడి రోకలిబండ వలెఁ బ్రాకితిమి. ఇట్లు కొంతదూరము పోఁగ నచ్చట గుహాద్వారము కొంచె మెత్తుగనుంటచే లేచికూరుచుంటిమి. గాఢాంధకారముగనున్నది. తిరుగ వల వలఁ జలియారంభమయ్యెను. నీటిమీఁదిగాలి జల్లున మొగములమీఁద విసరఁజొచ్చెను. నీటితుంపర పైనఁబడెను. చేతులతోఁ దడుమగ నిసుకయు మఱికొంతచాచి తడుమగ వ్రేళ్లవంకలుపోఁజేయు చల్లనినీరము చేతులకుఁ దగిలెను. నామిత్రుఁ డొక్కఁడు కూడఁదెచ్చిన చెంబుతోఁ గొంతనీరము ముంచెను. చలి యధికముగనుండుటచే వచ్చిన

ట-లనే తిరుగ గుహాద్వారముకడకువచ్చి యచ్చటఁ గూరుచుంటిమి. "శిశునాగసమన్వితమ్" అని శ్లోకములోనున్నది. పిల్లయేనుఁగులతోఁ గూడినదియని యర్థము. కాని యవియేవియుఁ గనఁబడలేదు. కాని, వర్షకాలమందు తిరుగ నాపర్వతమునకు రాఁగఁ గాలుపెట్టుటకైన నెడములేకుండునట్లు మూరెడేసి రోఁకలిబండ లాస్థల మంతటఁ బ్రాఁకుచుండెను. శిశునాగములనఁగఁ బిల్లపాములవలెనున్న యీపురుగులని కవియభిప్రాయమేమోయని మే మనుకొంటిమి.

బళ్లారిజిల్లాలోఁ దుంగభద్రకొకవైపున నీపేరుగలపర్వతము ప్రాగ్దిశాభాగమున గుహతోఁ దద్గుహాయందు చెరువుతో నున్నదని భాగీరథీతీరమున నాశ్రమమందుఁ దపస్సుచేసికొనుచుఁ బ్రాపంచిక పదార్థవిముఖుఁడగు నావాల్మీకిమహర్షి యెట్లు కనిపెట్టెనో? ఇన్నిధూమ శకటములుండి యిన్నియశ్వవృషభశకటములుండి యిన్నిబాటలుండి బాటసారుల కరణ్యము లింత బహుళముగ ఛేదింపఁబడి పర్వతము కిట్లు మెట్లుకట్టఁబడి యాత్రికులకిన్ని ప్రయాణసదుపాయములు జేయఁబడిన యీకాలములోనే యచ్చటకుఁ బోవుట మహాకష్టమగుచున్నది కదా! అట్టిచోఁ ద్రేతాయుగమున దండకారణ్య మతిప్రబలముగ నున్నప్పుడు చీమచొరఁబారుటకైన నచ్చటచ్చట నెడము లేకుండు నప్పుడు వాల్మీకి యీస్థలమునకు స్వయముగ నడచివచ్చిచూచి మరి వ్రాసెనని చెప్పుట కవకాశమున్నదా? నాకుఁ దోఁచదు. తపోబలముచే దివ్యజ్ఞానమహిమచేఁ దెలిసికొని వ్రాసియుండునని యూహింపవలసి యున్నది. ఒక్కయీపర్వతము వర్ణనమే యిట్లు సహజముగ నుండుట కాదు. ఏచెట్టునకాచెట్టు—ఏపుట్టకాపుట్ట—ఏగుట్టకాగుట్ట—ఏకొలని కాకొలను—ఏగుహకాగుహ—ఏమార్గమునకామార్గ మిట్టులే సహజముగ వర్ణింపఁబడియున్నట్లు నే నచ్చటి పెద్దలవలన వింటిని. ఇవి యన్నియుఁ జూచినవేనా! చూచుట కవకాశమున్నవస్తువులేనా!

ఈపర్వతమున కొక్కమైలులోపు దూరమున బంపాసరోవరమున్నది. దానితీరముననే భగవానుఁడగు శ్రీరామచంద్రమూర్తి సీతాదేవికొఱకతికరుణముగ విలపించినాఁడు. దానికి మిక్కిలి చేరువను శబరియుండు గుహయున్నది. ఆమె తపస్సుచేసికొన్న స్థల మెంత మనోహరముగ నున్నది! ఈ మహానుభావురాలు, శ్రీరామచంద్ర

దేవదర్శనమునకై చిరకాలము వేచియుండి యెప్పుడువచ్చునో యెప్పుడు వచ్చునో యని తలయెత్తి నిక్కినిక్కి యేనిముసమున కానిముసమే యెదురు చూచునట్టి మహాందోళనముతో ననేక సంవత్సరములుండి, ఆపురాణపురుషుఁడు—అజగద్భర్త-వచ్చుసరి కెదురుగఁబోయి కాళులు గడుగవలయునను మహాందోళనముతోఁ గమండలువున బంపాపవిత్రోదకమును బూరించి - యా శ్రీమన్నారాయణుఁడు — ఆ సర్వాంగసుందరుఁడు - ఆకలిగొనివచ్చునేమోయని - అందుచే మొగము వాఁడు బారి యుండునేమో తత్కారణమున నాతని వదనచంద్రమండలము కరుణామృత మొల్కుచుఁ బ్రసన్నముగ నుండదేమో యని-యాదాశరథి రాముని కాఁకలి యుపశమింపఁజేయుటకై మధురములై మంజులములై మఱిమఱి పరిపక్వములయిన ఫలములనుగోసి ఒకవేళ-కర్మము చాలక - ఆపండ్లలో నేదియైన యరుచిగఁగాని పుల్లగఁగాని యుండినచో నాపరమమంజులాంగుని పండ్లు పులిసిపోవునేమో యనుభయముచే నాపండ్లను గొంచెము కొఱికి రుచిచూచి నిస్సందేహముగఁ బ్రశస్తములని తోఁచినవానినే భద్రపఱచి యుంచి — ఆనీలమేఘశ్యామలాంగుఁడు — ఆయాజానుబాహుఁడు నేత్రపర్వముగ — రోమాంచకారణముగ—నెదుటఁ బడఁగనె యొడలు తెలియక సాష్టాంగపడి—

వాణీ—స్త్రీకి సాష్టాంగము శాస్త్రదూష్య మయ్యా! ఆసంగతి మీకుఁ దెలియదు కాఁబోలు! స్త్రీయురస్సీను భూమికిఁదగిలిన—

జంఘా—(పండ్లు కొఱుకుచు) చాలు! చాలు! మగని నపేక్షించి, ఆమగఁడు చచ్చినతరువాత మరియొకని నపేక్షించి పుత్త్రపౌత్త్ర ధనధాన్యాద్యైహిక సుఖముల నపేక్షించిన యాఁడు దట్లు చేయఁ గూడదుకాని సర్వసంగపరిత్యాగియైన యామె యట్లు చేసిన దోషము లేదులే! సాష్టాంగపడి ఆనందబాష్పములచే నాతని కాళులు గడిగి పైఁటకొంగుచేఁ దడియొత్తి పేముపుటికలలోఁ బెట్టిన యారువెలగ పండ్లు—తేనె యరఁటిపండ్లు—నొక్కొక్కటి యాతనిచేతఁ బెట్టి యాతం డారగించుచుండఁ గొబ్బరాకు వీవనతోఁ జల్లగ విసరి యాతని పాదములు మెత్తమెత్తగనొత్తి "మహానుభావా! అహల్యాశాపవిమోచనా! మోక్షప్రదాతా! నీకొఱ కెంతకాలము నుండియో వేచి యుంటిని. కన్నుల కఱవుదీర నొడలుప్పొంగిపోవఁ గాంచఁబడితివి.

సీతాపహరణమునుగూర్చి వింటిని. ఇచ్చటకు సుమా రొక క్రోశదూర
మున ఋష్యమూకమున సుగ్రీవుం డున్నాఁడు. ఆతనితో సఖ్య మొన
ర్చుము. ఆతనివలన సీతాన్వేషణకార్య మగును. నే నింతకంటె నీకుఁ
జెప్పవలసిన దేదియు లేదు. నాజన్మ మింకఁ గృతార్థమైనది. నిన్నుఁజూచిన
కన్నులతో వేఱువస్తువులను జూడలేను. నీకై ఫలము లర్పించిన
యీచేతులతో మఱియేపనియుఁ జేయఁజాలను. నీ కభిముఖముగ నడ
చిన యీకాళ్ళులతో నా కింక నుపయోగములేదు. నీవాక్యములు
వినిన యీచెవు లింక యితరధ్వనుల వినవు. నా కనుజ్ఞయిమ్ము. మహా
ప్రభూ!" యని ముమ్మా రాతనికిఁ బ్రదక్షిణ మొనర్చి—యదివఱ
ప్రజ్వలించుచున్న చితిలోఁబడి ప్రాణములు వదలిన యారామపాదార
విందభక్తశిఖామణి సమాధి అదిగో! ఆహా! యొడలు జలదరించు
చున్నదిగదా? సోదరులారా! రండురండు. ఇంకఁ జిత్రములఁ జూపిం
తును. అదిగో! వాలి కాష్ఠము. సాధువులు యోగు లెట్లు దానిచుట్టు
మూఁగుచున్నారో! దానిని ద్రవ్వి వాలియెముకల ముక్క లెట్లు తీసి
కొని కన్నుల కద్దుకొని దేవతార్చనపుఁ బెట్టెలలోఁ బెట్టుకొనుచున్నారో!
వాలి యెమ్ముకల కెంత పూజ్యత గలిగెను! ఈతఁ డేమి మహా
ఘనుఁడా? కాఁడు. ఈతని ఘనత రావణాసురుని జంక నిఱికించికొని
సప్తసముద్రముల ముంచిన హేతువుచేఁ గలిగినదా? లేదు. దుందుభి
రాక్షసుని ఖండించుటచే వచ్చినదా? లేదు. శ్రీరామచంద్ర భగవానుని
చేతిలో మరణము సిద్ధించుటచే వచ్చినఘనత. ఇటురండు. ఇటురండు.
ఇదియే వాలి సుగ్రీవ ద్వంద్వయుద్ధస్థలము. రామచంద్రమూర్తి సుగ్రీ
వుని మెడలో సంకేతమునకై గజపుష్పలత వైచెనని రామాయణమున
నున్నదే? అదిగో అదియె యాలత ఏనుఁగగ్రచ్ఛత్రీఁగె. దీనికి ముండ్లు
లేవు. అటుచూడుఁడు. సప్తతాళ విచ్ఛేదము చేసిన రామబాణము తీవ్ర
ముగఁబోయి చూపుమేరదూరముననున్న యాకొండను గొట్టుటచే
గునపముచేఁ బొడిచిన గోడవలె నెట్లు మొత్తపడినదో చూడుఁడు.
సోదరులారా! అత్యద్భుతమగు మఱియొక చిత్రము. ఈపుణ్యభూమిలో
నడుగు పెట్టువానికి మనస్సునకు వ్యాప్తియుండదు. బుద్ధి యట్లే స్తంభిం
చును. ఏదియో తెలియని చిత్తవృత్తి యారంభమగును. పరవశత్వమే
కాని స్వవశత్వ ముండదు. నాతండ్రియైన రామచంద్రుఁడు తిరుగుటచేఁ

బవిత్రమగు నీయరణ్యస్థలమును నేను మూఢుఁడనై త్రొక్కవలసినదా! కన్నుల కద్దుకొందును. ముద్దు బెట్టుకొందును. అడుగో! రామభద్రుఁడు! మాల్యవంతమున నట్టె తలయెత్తి చూచుచున్నాఁడు. అడుగో! నా రామయ్యతండ్రి! తుంగభద్రలో నాంజనేయునిచేఁ గాళ్ళు గడిగించుకొనుచున్నాఁడు. అడుగో సీతాపతి, సుగ్రీవున కేలు విశ్వాసమ్మున నిచ్చుచున్నాఁడు. అదిగో "హా! జానకీ" యనుధ్వని వినఁబడుచున్నది. నా తండ్రి యచ్చట నార్తుఁడై నా తల్లికొఱకు విలపించుచున్నాఁడు. హా! ఎంతకర్మము! "రామా! రామచంద్రా? రాజీవలోచనా!" యని యఱచుచు జంఘాలశాస్త్రి విఱుచుకొని పడెను. వాణీదాసుఁ డిది టక్కని యభిప్రాయపడెను. కాలాచార్యులు పాసము లేకపోవుటచేఁ గాఁబోలు నోటివెంటనే యుచ్ఛ్వాస నిశ్వాసములు గలవాఁడై యూరకుండెను.

జంఘాలశాస్త్రిని లేవదీసి బల్లపైఁ బరుండఁబెట్టితిని. కవియును గాలాచార్య లింటికిఁ బోయిరి. నేను శాస్త్రిసాహాయ్యమునకై సభాకుటీరముననే పండుకొంటిని. జంఘాలశాస్త్రి గాఢముగ నిద్రపోయెను. నే నీయుపన్యాసాంశములను మెల్లగ నాలోచించుకొనుచుఁ బండుకొంటిని. విచిత్రమగు స్వప్నము గలిగెను. అది యిట్లుండెను.

"నేను లేచి కూరుచుంటిని. ఒడ లట్టె లావయి బరువెక్కినది. ఎదపై నేమో కితకితలాడఁగఁ జూచుకొంటిని. తెల్లని పొడుగుగడ్డమున్నది. తలపైఁ జేవైచుకొనఁగ జడలున్నవి. ప్రక్కను గమండలువున్నది. క్రింద శార్దూలచర్మమున్నది. ఋషినైతి ననుకొంటిని. ఎదుట పండుకొన్న జంఘాలశాస్త్రి నావలెనే మారి ఋషియయ్యెను. అతఁడు నాతో నిట్లనియెను. "వాల్మీకిమహర్షి! నమస్కారము." "దీర్ఘాయుష్మమగుఁగాక! నీ వెవఁడ" వని నే నడిగితిని. నే నెవఁడనైన నేమి. నే నధ్యాత్మరామాయణకర్తను. రామచంద్రపరబ్రహ్మభక్తిచేతనే కాక నీవు రచియించిన రామాయణము సమీచీనముగ నుండకపోవుట వలన నే నొకదానిని రచియించితిని. రామచంద్రుఁడు పరబ్రహ్మము. అతనికి సుఖదుఃఖములు లేవు. అట్టి జగత్పూజ్యుని—నట్టి నిర్వికారుని సీతావియోగకారణమున నెట్లు లేడ్పించితివి! పామరాధమునికంటె నధికముగా నేడ్పించితివే? ఇది బ్రహ్మతత్త్వమున కర్హము గాదని యెంచవైతివి. మనుజుఁ డనుకొన్నను ధీరోదాత్తలక్షణములకు భంగ

మగునట్లు వ్రాసితివే? ఇది స్వాభావికముగ నున్నదా? నాగ్రంథమున నే నెట్లు చేసితినో యెఱుఁగుదువా? రాముని జ్ఞానసంపన్నతకు భంగము తీసికొనిరాలేదు. రాముని పరమార్థతత్త్వము నట్లే నిలిపితిని. అది గాక లోకపావనియగు సీతాలక్ష్మిని రావణాసురుఁడు బలాత్కరించి తీసికొనిపోయినాఁడని చెప్పితివి. ఇది దోషముకాదా? ఆపతివ్రత నాతనిచే నంటనీయవచ్చునా? మహాసాధ్వి నటులంటిన పాపాత్ముఁడు వెంటనే నశింపఁడా? కావున నే నీసందర్భమున నెట్లు వ్రాసితి ననఁగ నరణ్యవాసారంభమునందే రాముఁడు జానకితో నిట్లనియెను. "జానకీ! నే నొక చిత్రమగునాటక మాడఁ దలఁచితిని. నీవు వైకుంఠమున మన స్థానమున కేగియుండుము. నీకుబదులు నొక మాయాసీతను సృష్టింతును. దానినే యథార్థసీతయని భ్రమించి రావణుఁడు హరించును. ఈ సంగతి లక్ష్మణునికిఁగూడఁ దెలియనీయను." అని చెప్పెను. ఇట్టి కల్పనమువలన యథార్థసీతకు రావణస్పర్శము లేదు. పరమార్థజానకీ వియోగము లేనిరామునకు దుఃఖము లేదు. నీవుచేసినదోషముల నిట్లు నేను సవరింపవలసి వచ్చినది. రామభద్రుఁడు యథార్థముగఁ బరమాత్మ—జానకి నరచిత్తము—దశశిరస్సులుగలరావణుఁ డింద్రియదశకము. ఆంజనేయుఁడు గురుఁడు. శ్రీరామముద్ర తారకమంత్రము. రామదండయాత్ర పరబ్రహ్మకృపాప్రాప్తి. ఇది రామాయణమునకు వేదాంతార్థము. ఈయభిప్రాయమును నేను బోధించి వ్రాసితిని. రామాయణముననుండు పాత్రలలో సీతారాము లిద్దఱే ముఖ్యులు. వారిద్దఱిస్వభావములుకూడ నీగ్రంథమున సంతుష్టిగఁ జెప్పఁబడియుండ లేదు. నాగ్రంథ ముత్తరదేశమున మిక్కిలి వ్యాప్తమై యున్నది. నీగ్రంథము దక్షిణమున నున్నట్లు వినుచున్నాను. దక్షిణదేశముల నచ్చటచ్చట పారాయణమునకై నాగ్రంథ ముపయోగింతురుకాని యుత్తరదేశమున నీగ్రంథ మెవ్వ రుపయోగింపరు. ధారాళాంతఃకరణముగలవాఁడ నగుటచే నిట్లుచెప్పితిని. క్షమింపుము" అని పలికెను. అప్పుడు నే నిటులంటిని. "అధ్యాత్మరామాయణ గ్రంథకర్తా! నీ యభిప్రాయములకు, నీయంతరంగధారాళతకు, నీయాత్మగౌరవమునకు నన్నింటికంటె నధికమగు నీసీతారామచంద్రభక్తికి నే నానందించితిని. నాయనా! రామచంద్రమూర్తి భగవదవతారమని సీతాదేవి శ్రీమహాలక్ష్మియనియు నేను

గ్రంథాదియందు స్పష్టముగఁ జెప్పియుంటిని. నాకుఁ బరబ్రహ్మమునం దనాదరణముగాని యాతని నేప్పించు నభిలాషగాని లేదు. నాయనా! మనము వ్రాసినది రామాయణముగాని పరబ్రహ్మాయణము కాదు. వ్రాసినది రామకథగాని పరబ్రహ్మకథ కాదు. పరబ్రహ్మమునుగూర్చి వ్రాయఁదగినగాథ యేదియు లేదు. రాముఁడు పరబ్రహ్మమయ్యును కౌశల్య గర్భమునఁ బుట్టెనందువా? బాల్యలక్షణములను రోదనాదిక్రియ లాచరించె నందువా! సుఖదుఃఖానుభవసామర్థ్యమును కుండఁదగిన మనుష్యవ్యక్తి కలిగె నందువా? సర్వవిధముల మనుజుఁ డయ్యెనని యొప్పుకొందువా? పరబ్రహ్మత్వమును బరిపూర్ణముగఁ బ్రచ్ఛాదింపఁ దలఁచుకొనియేకదా పరమపురుషుఁడు మానవుఁ డయ్యెను. నరజన్మ మెత్తినయాతఁడు నరలక్షణము లగపఱుపఁదగునుగాని నారాయణ లక్షణము లగపఱుపవచ్చునా? గొల్ల వేషము వేసిన బాపనపగటిభాగవతుఁడు డొంకికఱ్ఱ చేతఁబూని పశువులఁ గాచుకొనఁదగునుగాని బ్రహ్మసూత్రపారాయణముఁ జేయవచ్చునా? శిష్టరక్షణార్థము దుష్టశిక్షణార్థము న్యాయపరిశీలనార్థము రాత్రులందు వీథులలోఁ దిరుగఁదగిన రాజు గోఁచియో గొంగళియో ధరించిన బిచ్చగాఁడై ముష్టిరూపము ముష్టిచూపు ముష్టిమాట గలిగి ప్రచ్ఛన్నుఁడై ప్రవర్తింపవలయునుగాని కిరీటాంగదధారియై చతురంగసేనాసమేతుఁడై సర్వాధికారియై చరియింపవచ్చునా? రాధాకృష్ణవీథినాటకమునఁ గృష్ణవేషధారణ మొనర్చు పంగనామాలయ్య బాడిదెకఱ్ఱలమోపు నెత్తిపైఁ బెట్టుకొని ముక్కున నడ్డబొస యుంచుకొని ముఖారిరాగము పాడవలయునుగాని నాలాయిరము పఠింపఁదగునా? స్థితి కనుకూలమగు వేషము, వేషమున కనుకూలమగుభాష యుండుటతగునుగాని చాకివాఁడు సవారినెక్కి చాకిరేవునకుఁ బోవుట సందర్భముగ నుండునా? కాషాయాంబరధారి కళాశాస్త్రప్రశంస చేయఁదగునా? దేశకాలస్థితుల కర్హముగ నుండుటయే యధికయోగ్యతావధి—రాజునకు రత్నఖచితమగు కిరీట మెంత యర్హాలంకారమో యుప్పరివానికి నెత్తిపై మట్టితట్ట యట్టిది. విద్యాలయములో వేదఘోష మెట్లుతగునో వేశ్యావీథిని గీతసాధన మట్లు తగును. బాల్యావస్థలోని చిటిచిటిరోదనధ్వను లెంతముద్దో యుద్ధావస్థలో సమరశూరుని సింహగర్జన మంతముద్దు. నాయనా! పరబ్రహ్మతత్త్వ

మును నే నేడిపింపను లేదు. అది యేడువను లేదు. ఏడ్చినయాతఁడు పర
బ్రహ్మత్వమును మఱచిన రాముఁడు. ఆతఁ డేడ్వఁదగినది కావుననే యేడ్చి
నాఁడు. ఏడ్వఁదగినజ్ఞానముండి నేడ్వఁదగినస్థితి యేడ్వఁదగిన సాధనము
లుండిన యాతఁ డేడ్వకుండుట దేశ కాలవిరోధమని నే నాతని నేడ్పించి
తిని. నాయనా! ధీరోదాత్తుఁ డేడ్వఁదగునా? యని యధిక్షేపించితివి.
ధీరోదాత్తుఁడు నల్లఱాయి కాఁడే? ఉక్కుతునక కాఁడే? వజ్రఫలకము
కాఁడే? రక్తమాంసములును సుఖదుఃఖములు గలవాఁడే? మనుజకోటి
లోనివాఁడే? బ్రతికియుండువాఁడు గాని ప్రాణహీనుఁడు కాఁడే? ఆప
త్సహనశీలుఁడు, ధైర్యశాలి, శాంతుఁడే కాని కన్నీరులేనివాఁడు కాఁడే?
హృదయము లేనివాఁడు కాఁడే?

నాయనా! నీ వధ్యాత్మరామాయణమున మాయాసీతను
సృష్టించి యామెనే రావణుఁ డెత్తుకొనిపోయినట్లు చేసితినని చెప్పితివి.
రామాయణమున కంతకు రసము సీతమ్మశోకముగదా? సీతమ్మనే
రామాయణమునుండి తీసివైవ సాహసించితివా? ఎంతపనిచేసితివి?
ఇఁక రామాయణమున జీవ మేమున్నది. మాయాసీత కల్లబొల్లి యేడ్పు
లెవనిమనసు దూరును. భగవానుఁడైన శ్రీరామభద్రున కింక భార్యా
వియోగ మేది? భరింపరాని యాపద యేది? సహియింపరాని దుఃఖ
మేది? ఆమహామహునితో మనకు సహానుభూతి యేది? భార్యను
భద్రముగ నొకచో దాఁచుకొని దొంగభార్యను లంకాధీశునకు బుద్ధి
పూర్వకముగ నంటఁగట్టి "హాజానకీ! యెచ్చటకుఁ బోయితివి" యని పైపై
కఱచుటమాత్రమే కాని, కనులఁ జెమ్మగిలిన లేని, యొడలఁగంపమైన లేని,
గళమున గద్గదస్వరమైన లేని, హృదయమున రసమైన లేని—వట్టిదైన-
చప్పనిదైన - రానిదైన-శుష్కమైనదైన- దెచ్చిపెట్టుకొనినదైన—నాట
కపుటంగునకై బూటకముగఁ గన్నులు పొడిచి పొడిచి పుట్టించు
కొనినదైన—దుఃఖచ్ఛాయాచ్ఛాయా లేశమును—దప్పనిసరిగ—చూ
చువారల మోసముచేయు నుద్దేశముతోఁ గనఁబఱచు రాముఁడు-
మానవుఁడైన నేమి!—భగవానుఁడైన నేమి? పరబ్రహ్మమైన
నేమి? ప్రజాభక్తి గౌరవాధికత నొందఁగలఁడా? ప్రాణి
కోటిపూజాపాత్రత నొందఁగలఁడా? నారామాయణములో
రాముఁడు మనుజుఁడై యథార్థముగ హరింపఁబడిన యిల్లాలికొఱకు

కరుణముగ విలపించుట తప్పయినప్పుడు—నీరామాయణములోని రాముఁడు పరబ్రహ్మమె—యిట్టి కల్లబొల్లిగరిమె భాగవత మూఢ నీకుఁ జప్పఁగఁ దోఁచలేదా? పరబ్రహ్మమె యుండుటయే కాక పరబ్రహ్మమని తాను తెలిసికొనిన నీ రామునికి శివధనుఃఖండన మెంతపని? అది మాయామానుషవిగ్రహమగు నారామునికి శ్లాఘాపాత్రము. పరబ్రహ్మమగు నీరామునకుఁ బితృవాక్యదీక్ష యేమంతఘనము—విస్మృతాత్మీయపూర్వజ్ఞానుఁడగు నారామున కది సర్వప్రజాశిరఃకంపనార్హము—పరబ్రహ్మమగు నీరామునికి సాకేతరాష్ట్రత్యాగ మేమంత గొప్ప? ప్రకృతిచ్ఛన్న తేజస్సంపన్నుఁడగు నాశ్రీరామచక్రవర్తి కది యత్యంత మహోదారతాసూచకము—పరబ్రహ్మమగు నీ రామునకు రావణవధ యేమంతవిశేషము—అమోఘసాయకుఁడగు నాకోదండ రామభూపతి కది యత్యంత పౌరుషప్రభాభాసకము; నాయనా! రాముఁడు పరబ్రహ్మమగును. కాని పరబ్రహ్మజ్ఞానమున రాముఁడు వర్తించుట రామునితప్పు. ఆతఁ డటు వర్తించెనని ప్రజకు బోధించుట కవితప్పు. ప్రజకే కాదు—నాకుఁగూడ — రాముని పరబ్రహ్మత్వముతో నంతజోక్యము లేదు— రాముఁడు రాజీవలోచనుఁడు— నీలమేఘ శ్యామలదేహుఁడు— జానకీనాథుఁడు— మాయెదుటఁ గనఁబడవలయును. మే మాతని కాళ్లల కన్నుల కద్దుకొందుము—ఆతఁడు మారక్షకుఁడు. ఆతఁడు మాగురుఁడు—ఆతఁడు మాతండ్రి—జానకమ్మ మా తల్లి—మేమందఱ మాతని బిడ్డలము. ఆతఁడు మాలోనివాఁడు—మే మాతని విడువఁజాలము. ఆతఁడు సర్వసద్గుణగుణాలంకృతుఁడు. మా తల్లిపైఁట చెఱఁగుబట్టుకొని కొందఱము—మాతండ్రి ధనుఃకోటిని బట్టుకొని కొందఱము వారివెంటఁ బోవుదుము. జానకింబాసి మారామచంద్రుఁ డేడ్వ మేముగూడ నేడ్తుము. ఆతఁడు దుష్టుఁడైన రావణుని పై బాణములేయ "మేమాయసురు నిట్లు తన్నుదుము." అని నిద్రలో నొడలు తెలియక బల్లపైఁ దన్నితిని. కాలుచిదుక మొఱ్ఱో" యని యేడ్చుచు లేచితిని.

# సాక్షి

## 7. పాశ్చాత్య నాగరకతామహాత్మ్యము.

శ్రీమద్రామాయణాధ్యాత్మరామాయణ గ్రంథకర్త లగు ఋషులస్వప్నకలహములో సత్యమగు దెబ్బతగిలిన నేను మహాసభా భవనమున కీరాత్రి పోలేకపోయితిని. జంఘాలశాస్త్రియుపన్యాస ధోరణి మహాసభకు సభ్యుల నాకర్షించుచున్నది. అతని వాచాలతావిషయికప్రఖ్యాతి మెల్లగఁ జుట్టుపట్టులనున్న యాంగ్లేయభాషాకళాశాల లకుఁగూడ వ్యాపించియుండుటచేఁ గాఁబోలు నీరాత్రి కొందఱు బాలురుగూడ వచ్చి సభ నలంకరించిరి. జంఘాలశాస్త్రి యిటులు చెప్పె నఁట. సభ్యులారా!

"ఈదినమున—ఊఁ—ఈదినము."

సభలోనుండి "ఈదినముకాదు. ఈరాత్రి యనుము" అను మాటలు; చప్పటలు.

జంఘా—ధీమంతులారా! సూర్యోదయమగు పిమ్మట రాత్రి యెక్కడిది? ఓ! ఇందఱు జ్ఞానసూర్యు లొక్కసారి మాయజ్ఞానతిమిర విచ్ఛేదనమునకై యిట నుదయించియుండ నింక మాకు రాత్రియెక్కడిది? ఇఁక మీవలన మాకుఁ బగలే! మీచదువులేమి? మీజ్ఞానములేమి? మీ వచోనైపుణ్యము లేమి? మీయధిక్షేపణ సామర్థ్యము లేమి? మీదేహదార్ఢ్యములేమి? మీమనస్స్థైర్యములేమి? మీమతాభిమానము లేమి? మీపూర్వాచారసాంప్రదాయవిశ్వాసములేమి? మీస్వభాషాభిలాష లేమి? మీబంధుమర్యాదవైఖరులేమి? మీరెక్కడ, మేమెక్కడ? మీరు కాలిడినచోట మేము తలనిడుటకైన నవకాశ మున్నదా? మీరేమి సామాన్యులా? మీరు నవనాగరకతాకల్పవృక్షకుసుమములుగారా? నవనవశాస్త్రసారామృతఘుటికలుగారా! చిత్రచిరత్న

గుణరత్నఖనులుగారా? జంగమజగజ్ఞానావతారములుగారా? మా చదువులు చిలుకపలుకులు, రోఁకలిపాటలు, వల్లెవేతలు, జందెపుమడతలు, మేము చదివిన గ్రంథములు మీరు నిరాదరించి నిరసించిన తాటాకుతుక్కు; మాజ్ఞానములు మీమనసులకు వెఱ్ఱివెఱ్ఱి తలతిక్కలు; మాపలుకులు మీచెవులకుఁ బలుకాకికూఁతలు; మాశరీరపాటవములు మీబుద్ధికిఁ బశుత్వములు; మామతాచారములు మీకు మౌఢ్యభూయిష్ఠములు; మాబిళ్లకచ్చమడతలు, బూడిదబుస్సనవేషములు, మీదృష్టికి నున్మత్తాలయమునుండి తప్పించుకొనిన వికృతాకారములు; కానిండు; మాకడుపులఁ బుట్టిన మీరు మాతలలపై నెగురుట మాకు సంతోషముకాదా? తండ్రులను బరాజయ మొందింపఁ గలుగు ప్రబలశూరులు తనయులుగాక మఱెవ్వరు?

కాని మీ రభ్యసించిన నాంగ్లేయభాషవలనఁ గొన్ని కొన్ని మార్పులు మీబహిరంతస్స్వరూపములలో గాఢముగఁ గలిగినవి. మీరు వినినను వినకున్నను, విని మీరు గమనించినను గమనింపకున్నను మీ కట్టి లోపములేవో తెలియఁబఱచుట మాకు విధియైయున్నది. మొదట వేషములఁగూర్చి చెప్పెదను. ద్విజుల కుండఁదగిన శిఖాయజ్ఞోపవీతములలో శిఖ యెగిరిపోయినది. ఎగిరి యెక్కడఁబడిపోయినదో యెఱుఁగ వీలులేదు. కాని పునర్వివాహమాడఁదలఁచిన విగతకేశలగు యువతుల తలలపైఁ బడినదని చెప్పుదురుకాని నమ్మ నర్హముకాదు. మీతల లిప్పుడు వికృతాకారము లయియున్నవి. ఆర్యావర్తదేశమున కట్టి యద్భుతశిరస్సమాజ మపూర్వము. ఓహో! వింతవింతలగు తలలరీతులుకదా? గొఱ్ఱెబొచ్చుతలలు, తాటిపంటిపీచులు, బల్లారికంబళ్లు, బొమ్మజెముడురుప్పలు, బంగాళాహంగులు, పంచపాళిదింపులు, పంపనపనాసడిప్పలు, బూరెలబొచ్చెలు, వలపలిసీమంతములు, దాపలిపాపిటలు, మాధ్యమిశమార్గములు, ఎదుటివడివ్రేతతిరుగులు! జిగురుగండెల నొక్కులు, అంటకత్తిరింపులు, కడముంతలు, బోరగలించినసానికలు, పెయ్యనాకుళ్లు బాలులారా! కోపపడకుఁడు! మీకనుదినమున్న దువ్వెనపని మీ కున్న సీమంతశృంగారము, మీకావశ్యకమగు తైలసంస్కారము నూతనగర్భాధానమునఁ బెండ్లికూఁతున కైన లేవుగదా? అయ్యయ్యో!

తలనంత గచ్చపొదను జేసికొంటిరేల ? అనుదినస్నానమున కవకాశము
లేదే ? తలలోని సూక్ష్మరంధ్రములకుఁ బవనస్పర్శము లేదే ? బట్ట
తడపు జల్లునకైనఁ జెమ్మగిల్లని యీచుట్టుగుడిసెల నింక నెన్నాళ్లీ నల
కట్టుకొని మోయుదురు. అయ్యయ్యో ! తలకుఁ జల్లనిగాలిసోకున బాగుగఁ
దగులదే ? గోష్పాదమంత జుట్టున్నవాఁడు శ్రోత్రియుఁడుగ మీకగ
పడగ గొఱ్ఱెతల యంతజుట్టున్నవాఁడు మాకెట్టు లగపడునో చెప్పవల
యునా ? నాయనలారా ! బోడి బలుసని మీరు వినియుంటిరా ? ఒడలి
బలుపునకుఁ దలబోడి యొక కారణము కాదా ? రక్తమాంసవిజృంభణము
కంటె రోమభూయిష్ఠత్వ మధికముగ నెంచుట బుద్ధికిఁ దగని యాలోచ
నము కాదా ?

నాయనలారా ! నావంక బాగుగఁ జూడుఁడు ! అదేమి ? అయ్య
వారలగారి నట్టిల్లువలె మీయలికములట్లు నట్టిట్టె యున్న వేమి ? తిలక
ములు లేవా? అక్కఱలేదా ? తలపై నంత గొంగళివంటిది మోయఁ
గలరుగాని రవ్వంతవిభూతిరేఖలు బరువయ్యెనా ! మీతండ్రులు
తిలకధారణము చేసికొనుట మీరు గాంచితిరిగదా ! మీముత్తాతలు
కూడ నట్లేచేసిరని వినియైన నున్నారుగదా? మీ కీస్వల్పాంశమున నింత
పంతమేల ? తలిదండ్రులయాచారము నిట్లు నిరాకరింపనేల ? అవలంబిం
చినయెడల గలుగునష్టమేమి? రాజు రాజచిహ్నముగఁ గిరీటమును ధరింప
వలదా ? ప్రధానుఁడుఁ దదుద్యోగచిహ్నముగ నలుపునిమూళ్ల పక్క
టెక్కపాగను ధరింప నక్కఱలేదా ? వేత్రహస్తుఁడు వెండిమద్దును
మోయనక్కఱలేదా ? ద్విజులకు ద్విజచిహ్నము లుండనక్కఱలేదా ?
అదిగాక శృంగనాదముల ధరించుటఁబట్టికదా యాతఁడు భట్టాచార్యుల
భటుఁడని మనము గుర్తింపఁగలుగుదుము. పులిరోలు "డవాలిని" బట్టి
కదా యాతఁ డొకజాతియుద్యోగిభటుఁ డని మన మానవాలు పట్టఁ
గలము. మీలో వైష్ణవులు శైవులుకూడ నున్నారుకదా ? మీమీ
యిష్టదైవముల చిహ్నములగు శ్రీపాదయుగ్మమునో విభూతిరేఖనో
మీనొసల దాల్పనక్కఱలేదా ? (సభనుండి "నాన్సెన్సు" అవి నిరుప
యోగములు అను కేకలు.)

నిరుపయోగము లనియే మానితిరా ? నిరుపయోగము లగు
వస్తువులను ధరింప నక్కఱలేదు కాఁబోలు ! నాయనలారా ! మీ

చొక్కాల మెడల కాప్రక్క నీప్రక్క నట్టి చెవులెందులకు ? ఆనుక్క చెవులలో ముత్తెపుచిప్పల తమ్మంటు లెందులకు ? మీా మెడలలో నా పట్టుపలుపు లెందులకు ? (సభనుండి హేహేహే నెక్ టైస్)—ఆవస్త్ర ధనుస్సులచే గొంతుకల కురు లెందులకు ? ఆహాహా ! మీాకంత రక్త నాళముల మొదళ్లెట్టు లిట్టి బిగింపువలనఁ బొంగియున్నవో చూచు కొంటిరా ? రక్తప్రవాహప్రతిబంధకము లగు నీ ముళ్లపేలికలను ధరించుట యావశ్యకమనియే తోఁచినదా ? అదిగో ? అదియేమి ? వెడలుపుగలదై వంగనిదై బింకమయినదై తెల్లనిదైన నదియేమి ? మెడ పట్టియా ? అబ్బో ! నాలుగంగుళముల వెడల్పుగలదై యున్నదే ! ఇదికూడ సొగసునకే ధరించితిరా ? దీని యెక్కువ వెడలుపుచే మీా మొగములు పై కెగసిపోయినవే ! మొగము వంచుకొందమన్నఁ బట్టి వంగదే? దీనివలన మీా మెడ లెట్లు సాగిపోవుచున్నవో కాసంత యాలో చించినారా ? కుత్తుకసింగారము నపేక్షించి కొంగ మెడను గొని తెచ్చు కొందురా ? మెడపొడుగైననేమి? మొగము వింతశోభగలదై యున్న దని సంతుష్టిఁ జెందఁదగునేమోయని యనుకొందమన్న నంతటితోఁ దెల్లవాఱదే ? సాగిన మెడ బీరకాయపీచువంటి నరముల సమ్మేళనము వలన లోన వ్రేలాడు హృదయకోశముయొక్క పైత్రాటినిగూడ సాగఁదీయునుగదా ? అందువలనఁ బ్రాణాధారమగు నాకోశరాజము నకు నలుగుడు గలుగదా ? అందువలన నూతనవ్యాధి యుద్భవింపదా ? ఆటణాల మెడపట్టి యలంకార మపేక్షించి యామరణాంత మొందఁ దగిన యారోగ్యమును బాడుచేసికొనుట ప్రతిభావంతులపనియేనా ? గొంతుచుట్టు ముచ్చటకై చేరి యీరీతిగ గొంతుఁగోయు నిట్టి వస్తువు లను మీారు ధరింప సాహసించితిరి; కాని లాభ మేమియు లే దని తిల కములను మాత్రము మానివైచితిరా ? సెబాస్ హేతుకల్పనమన్న మీాకే తగును.

జోడునాళముల తుపాకివలె జవునుబొంత యరఁటిపండువలె మీా కీ యిజారు లెందులకు ? ఆపాదరక్షలను గట్టిగ బిగించితిరి కాదా ? శీతప్రదేశమున మంచుగడ్డలలోఁ దిరుగవలసినవారి కిట్టి వసనధారణము గాని మంగలములో వేఁగుచున్న మన కెందులకు ? మనపెద్దలేర్పఱ చిన వస్త్రవైఖరియే మనకు సర్వోత్కృష్టముగ నున్నదే ? పెద్దలేర్ప

చుటమాట యెందులకు? మన దేశమున కది తగును. మన కది తగును. అన్నివైపులనుండి గాలితగులు దుస్తులు మనకుఁ గావలయును. అగ్ని బాధ తగుల వెంటనే యొక్కయూపున నూడఁదీయఁదగిన దుస్తులు మనకుఁ గావలయును. దేశమునుబట్టి మనుజుఁడు కాని మనుజునిబట్టి దేశము కాదే? మనుజునిబట్టి దుస్తుగాని దుస్తునుబట్టి మనుజుఁడు కాఁడే! మీ రిట్టి వస్త్రధారణమున నాంగ్లేయులు కాఁగలరా! పరీక్షిత్తొనర్చిన సర్పయాగములోని వైశ్వానరకుండమునుండి గిరటులో తప్పి వెలఁబడిన పాములవలె నత్యంతసన్నిహితుఁడగు సూర్యునివేడిమికి తాళి బ్రతికి యున్న మనము కమలి పొగచూరి కుమిలిపోయి నశింతుమే! మఱియొక మాట! ఒకనిమాటగాని నడకగాని వేషముగాని యనుకరించుట హాస్యాస్పదము కాదా! బ్రాహ్మణవేషమును ధరించి "హాగుంసశ్శుచి" యని పనసను జెప్పు పగటివేసపుసాతానిని జూచి బ్రాహ్మణుం డెట్లు వెకవెక నవ్వునో మన యాంగ్లేయవేషములు జూచి యాంగ్లేయు లట్లు నవ్విన నవ్వవచ్చును. ఔచిత్యమునకంటె నాధిక్య మేదియు లేదు.

ఇఁక మీ దేహదార్ఢ్యము లెట్లున్నవో పరీక్షింతము. మేము చదువుకొను దినములలో మే మొనర్చిన గురుశుశ్రూషయే మాకుఁ దగిన దేహసాధనముగ నుండెడిది. ఉదయమునఁ గాలకృత్యములకై రెండు మైళ్లకుఁ దక్కువ లేకుండఁ బాదచారమయినపిమ్మట గురువు గారి మొక్కలకు నీళ్లుత్రోడుట ప్రొయ్యిలోనికి గట్టెలు చీల్చుట బట్ట లుదుకుట మొదలగు వ్యాపారములతో మాకు దేహము గజిడిదేజి నట్లు గజిడిదేజి యుండెడిని. అంతట చెఱువునకో నదికో పోయి యీఁదు లాడి స్నానము చేసివచ్చి పాఠములు చదువుకొని భోజనమునకుఁ బోవు సరికి క్షుత్తు హాలాహలప్రాయమున నుండెడిది. సంపూర్ణమగు నాహారముచే సంతుష్టిగ నుండెడివారము. సాయంకాలమునఁ దిరుగ నడచివచ్చి పాఠములఁ బునశ్చింతనజేసి గురువుల పాదము లొత్తి తుంగచాపపై నొరుగుసరికి గాఢనిద్ర పట్టుటచే సుఖముగ తెల్లవాఱుకడ లేచెడి వారము. ఇట్టి గురుశుశ్రూష పారమార్థికమే కాక పాటవప్రదము కూడను. ఇప్పు డట్టి దావశ్యకము కాని హేతువుచే మీకు దేహ సాధన మంతగ లేదు. సాధనము చేయవలయునని నియమమున్నను మీరు ప్రాయికముగ దానిని దప్పించుకొందురు. మీయుదయయాత్ర

పడకగది మొదలు పెట్టితివటకే! ప్రక్కమీఁదనుండి లేచునపుడు "కృష్ణా కృష్ణా" యని యనుటకు బదులుగ "కాఫి కాఫి" యని లేచుచున్నారు. కాఫిని గర్భకోశమున నింపి దేహయంత్ర చలనమునకై సిగరెట్టులు ముట్టించుచున్నారు. ఆఁకలి కింక వేళ కాకుండనే "స్కూలు"కు వేళ యగుటవలన ముంగాళ్లపైఁ దొందరతో భుజియించుచున్నారు. మధ్యాహ్నము తిరుగ ఫలహార మొనర్చుచున్నారు. సరియగు దేహవ్యాయామము లేకుండ సాయంకాలమున నటులే భుజియించుచున్నారు. జేబుగడియారమునుబట్టి జీవయాత్రను జరుపుకొనుచున్నారు. రాత్రులు మీకు సరిగ నిద్రలేదు. మనస్సులకుఁ గఠిన పరిశ్రమమిచ్చి దేహముల శుష్కింపఁ జేసికొనుచున్నారు. రెండుచక్రములున్నగాని బండి నడచునా? మీకొక్కకాలెండిపోవుచున్నది. ఒక కాలు బోదకాలగుచున్నది. మనో దేహములు రెండును జెడుచున్నవి. వ్యాయామ శూన్యతవలనను, "గాఫీ" త్రాగుటవలనను మీకు మందాగ్ని యుద్భవించుచున్నది! సిగరెట్లవలన నుబ్బసము గుండె రోగము బుట్టుచున్నవి. మిగుల చదువువలన నతుల్యశ్రమము వీర్యనష్టము గలుగుచున్నవి. ప్రాణసారమగు వీర్యము సెడుటవలన మీ దేహములు సమస్తవ్యాధులకుఁ దావలములై యుండును. సహజవ్యాధి సంపదలు చాలకయా? నాయనలారా! అక్షివ్యాధి దక్షిణలు తెచ్చుకొంటిరి? ఎవనికో [illegible] గాజుల ధరింపనేల? అక్షివ్యాధి యమ్మవారువలె నంటురోగ మగుటచే మీ కిట్లు ప్రాకినదా? లేక యీయంధత్వము గూడ నలంకారమా! గ్రుడ్లగూబ మొగములు సొగసులనియే యభిప్రాయపడితిరా! గోకికొనఁగ గోకికొనఁగఁ గుష్ఠ బయలుదేఱునట్లు దగ్గగదగ్గ క్షయ బయలుదేఱునట్లు సొంతముగాఁ దెచ్చుకొనిన యంధత్వము తెగులై పరిణమించినది కాదా? తోటకూర కాడలవలె నొక విచిత్రమైన గడ్డివలెఁ దొందర తొందరగ నెదుగవలసినదినములలో మీ కీరోగములు గలుగుటచే ఖర్జూరపుకాయలవలె దిగఁజెరుఁగుచున్నారు. వడియములవలె నెండుచున్నారు. కర్పూరమువలెఁ గ్రమముగ హరించుచున్నారు. ఏమి వింత యాకారములతో నున్నారు. పిండిబొమ్మలు! శల్యసంఘములు! తోలు విగ్రహములు! బట్టలగుమ్మటములు! పుఱుగుజ్జులు! వేసవికాలపు గొల

భామలు! తీసివేతసరకులు, వానపాములు; దర్భపుడకలు! బాల్యత్వపు పిప్పియగు మీవలన మీకేమి ప్రయోజనము! లోకమున కేమి ప్రయోజనము. మీరింక భార్యలతోఁ గాఁపురములు చేసి సాంసారికసుఖ మనుభవింపవలసినవారు కదా! మీరే యిటులుండ మీకొడుకు లెటులుందురో? ఈదుర్బలాల్పనిస్సారశరీరములతో నింక నవమాసకములను డబ్బెత్తుగాండ్రను గనఁదలఁచితిరి కాఁబోలు! మీ వ్యాధులు మీతో నంతమొందునవి కావా! కవియొకఁ డీవిషయమున నిట్లు పలికినాఁడు.

గీ. అఖిలరోగార్తులయిన యీయయ్యవార
లనిలశూన్యతమోవృతస్వాలయముల
దిగఁబెరుఁగుతోలుబొమలతో దేవులాడి
యంధపంగు మూకాదులై యవతరింత్రు.

గీ. ప్రాణిబాధలు తగ్గింపఁ బ్రతినరునకు
నేకకర్తవ్యమైయుండ నిట్టివార
లట్లుసేయరు సరికదా యార్తినొందు
ప్రాణితతిసంఖ్యనే వృద్ధిపఱతు రయ్యొ?
ఇట్టిపాపులు సతిమెడఁ గట్టుత్రాడు
తమమెడను గట్టికొని యీల్గ ధరకు మేలు
త్రాట మెడబిగియించుకోఁ ద్రాసమైన
మొలనుగలత్రాడు త్రెంపిపోవలయు వనికి.

ఆకవియే మఱియొకచో నిట్లు పలికినాఁడు.

గీ. తనువునంటినరోగముల్ తనరువాఁడు
క్షేత్రమున నూడ్చి పంటనీక్షింపఁదగదు
జనుఁడనూచానరుగ్ణతాస్పదుఁడు వెనుక
కేడ్వదగును ముందునకు నేడ్పింపఁ దగదు.

నాయనలారా! మీరు పిల్లల కిచ్చునవి మేడలు, మిద్దెలు, భూవసతులు లేవుకాని యుష్ణరోగములు, సుబ్బసములు, మూర్ఛలు మాత్రమేయున్నవా? మీవంశములోఁ బిత్రీయ పితామహార్జితధనమిదియే చేయఁ దలఁచితిరా? చాలు! ఇఁకఁజాలు—మీమతాచారసంపత్తినిగూర్చి యింకఁ బలుకనిండు.

మడిబట్టలు మూలఁబడినవి—వెనుకటి పట్టుబట్టలు "వేస్టుకోటు" లుగ జన్మాంతరమొందినవి. పాదప్రక్షాళనము పనికిమాలిన పనియయినది. సంధ్యావందనము బహిష్కరింపఁబడినది—చిత్రగుప్తపూజ త్రోసివేయఁబడినది. ప్రాణాహుతులు పంచత్వమందినవి—భోజనకాలమునఁ గాళులు సేతులు తిరుగ శీతోదకమున నేల కడుగుకొనవలయునో, నుదుటిపై దళముగ గంధమో, తిరుమణియో, గోపిచందనమో, యేల ధరింపవలయునో తెలియని మీ ప్రకృతిశాస్త్రపారాయణప్రవీణులారా! తలయుఁ గాలుసేతులకొనలు నీళ్లు చల్లబడియుండుటచే శరీరరక్తము గర్భకోశమున బాగుగ వ్యాపించి దానిని వికసింపఁజేయును. జఠరాంతరద్రవములు సులభముగ వెలువడును. భుజించిన యాహారము సులభముగ జీర్ణమగును. మందాగ్నినివారణార్థమై జఠర వైశ్వానరోద్దీపనార్థమై పెద్దలు నిర్మించిన యీసదాచారమును మీరు నిరాకరించినారు. మతధర్మసాంప్రదాయములకు — శారీరసన్నివేశములకు— సంపూర్ణసంబంధ మున్నదనుసంగతి మీమెదడున కెక్కలేదు. భోజన సమయమునందు ఫాలమున నంతతిలకము లేదు. కాని యొడల 'హోఫార' మున్నది. నడుమునఁ బట్టుబట్టలేదు గాని కాలికి మేజోడున్నది. ఈ స్వేచ్ఛ చాలక కుర్చీలోఁగూరుచుండి బల్లపైఁ దినవలయునని త్రిశూలపు ముండ్లతోఁ దినవలయునని యాంగ్లేయభోజన మతముల కతిథులయి పోవుచున్నారు. గరిటెఁడు తులసితీర్థము పుచ్చుకొనుట కిష్టపడరు కాని కాచపాత్రెఁడు "సోడా" గడగడ త్రాగుచున్నారు. ఉద్ధరిణెఁడు పంచగవ్యమునకోర్వకుండురు. కాని కుక్కుటార్భకసారము నొక్క సీసానైన నూపిరివిడువకుండఁ ద్రావుచున్నారు. పాలమడ్డితోఁ జేసిన ముంజెలను ముట్టకుందురు కాని కల్లుమడ్డితోఁ జేసిన రొట్టెలను వడివ్రేసి నములుచున్నారు. మీయాహారణవైఖరు లిటులున్నవి. ఉండవలసినవారికైన మీలోనందఱకు యజ్ఞోపవీతములున్నవని నేననుకొనను. బ్రహ్మసూత్రార్థ విచ్ఛేదకులయి మీమతగురువులు ప్రకాశించుచుండ యజ్ఞసూత్రాంక విచ్ఛేదకులయి మీరు ప్రకాశించుచున్నారు. ఇట్టిసాంసారికసన్న్యాసులు, ఇట్టి ప్రాపంచికపరమహంసలు—ఇట్టి ద్విజశూద్రులు మీలో నెందఱు మహానుభావులున్నారో !

పడుక గదిలో గోడనున్న రవివర్మ "సుభద్రార్జునీయము"

చూతురుకాని, పడమటింట దేవతార్చనపీఠముననున్న సీతారామము
చూడరు. మల్లెపూవులు దెచ్చి యిల్లాలి కొప్పులోఁ బెట్టుదురు కాని
దేవతార్చనపుఁ బెట్టెమీఁద విసరియైన వేయరు. మెడలోఁ దోలు
సంచిని ధరింతురుకాని తులసిపేరుపై నైన నెత్తరు. "ఇది కళావరాసు,
ఇది యరఖాసు" నని యుత్సాహమున జేతులఁ బెట్టుకొందురుగాని
యిది సాలగ్రామము, ఇది నర్మదబాణమని భక్తితోఁ గన్నులఁ బెట్టు
కొనలేరు గద! 'వేల్సు' యేది యని యడుగ నిది యని పుడకతోఁ
జూపఁగలరుకాని వేణుగోపాల మిది యని యొక పుష్పమైనఁ తన్మూర్తిపై
వేయలేరుకద? సాలగ్రామములు కుక్కలను గొట్టుటకుఁ దగిన బొమ్మఱా
లనుచు నర్మదబాణములు 'Paper weights' గ విశేషించి యుపయో
గింపఁ గలవనియు మహాదేవతార్చనాసామగ్రి చిల్లర 'దుకాణ'
మనియు మనసు కసిదీరఁ దూలనాడుచున్నారు గదా? ధూపపుటా
రతికై తెచ్చిన నిప్పునుజూచి మా మదనగోపాలుఁడు "సిగరెట్టు"
ముట్టించుకొనునని పరిహాసమాడుచున్నారా! జేగంట వాయింపఁగ
దేవుఁడుగారి తిండికై 'First bell' యయినదని యధిక్షేపించు
చున్నారా? మా భగవంతుఁడుగారికిఁ బాకపుగారెలు పరమ ప్రీతి
యని గేలిసేయుచున్నారా? మాకృష్ణయ్యకు రాధ ప్రక్కలో లేనిదే
రాతిరి నిద్దురయే పట్టదని నిందించుచున్నారా? మా దేవుఁడు
బాత్రము—మీదేవుఁడు లక్కపుత్తై మాదేవుఁడే గట్టివాఁడని కాఱు
లఱచుచున్నారా? విగ్రహారాధనమే వెఱ్ఱి లన్నిటికంటె వెఱ్ఱి యను
చున్నారా? ఆహా! మీబుద్ధి వైభవమునకు మెచ్చఁదగును.

నాయనలారా! ప్రపంచమున మనసుకంటె చంచలమగు
వస్తువు మఱియొక్కటి లేదుగదా? దానిని నిశ్చలము జేయుట కెన్ని
పాటులు పడవలయును. సంగీతశాస్త్రపాండిత్యమున కవధి స్వరజ్ఞాన
మేకద? అట్టిస్వరజ్ఞానమును సంపాదించుకొనుట కెన్ని సరళిస్వర
ములు సాగదీయవలయును? ఎన్ని జంటస్వరములతో వెనుకకు
ముందునకుఁ ద్రొక్కులాడవలయును? ఎన్ని యలంకారములతోఁ
జేతులు తొడలు బగులునట్లు కొట్టుకొనవలయును? ఎన్ని గీతములతో
గింజుకొనవలయును?—ఎన్ని చౌకవర్ణము లెన్ని తానవర్ణములు వల్లె
వేయవలయును? అటుపైనకదా? పుణ్యమున్నయెడల స్వరజ్ఞానము

లభించుట! ఇన్ని మెట్లెక్కకుండ నెంతబుద్ధిమంతుఁడైన జ్ఞానము నందఁగలఁడా? అంతదనుక నెందులకు? మనకు భాషాపాండిత్య మొక్కసారి కలుగుచున్నదా? గుంటయోనమాలవద్ద నెన్నినాళ్లు చెవులపట్టులు దినుచుఁ గూలఁబడి యుండవలయును? తరువాత గుణితముతో నెన్నాళ్లు కూర్చుండ వలయును? అట్టియట్టి క్రమక్రమముగ నొక మెట్టు తరువాత నొక మెట్టెక్కినపుడుగదా భాషాజ్ఞానము లభించుట! ఇది "ఓ" ఇది 'ా' వెలుపలగిలక యని మనగురుఁడు మనకుఁ జెప్పినప్పుడు ఇది "ఓ" కాదు ఇది 'గిలక' కాదు. అని నిరాకరించినయెడల మనకు భాషాపాండిత్యము సిద్ధించునా? అది "ఓ" యని నమ్మవలయును—దానిని నోటఁ బలుకవలయును. దానినిఁ జేత వ్రాయవలెను. దానిని మఱియొకదానితో మేళవింపవలయును. అన్ని శాస్త్రముల కిట్టి సంకేతములు గలవు. కన్నునకు నచ్చినప్పుడుకదా—మనసునకు నచ్చవలసినది! తరువాతఁ గన్ను సహాయములేకుండ మనసే పనిచేసికొనఁగలదు. అట్టి సామాన్యశాస్త్రజ్ఞానసంపాదనమునకే యింత సంజ్ఞావిశ్వాస మావశ్యకమయినప్పుడు నిర్గుణసమాధి యూరక తనంతతాను లభింపఁగలదా? సాకారవస్తుపూజ యుండక తప్పదు. ఈసంజ్ఞయే పరమాత్మయని యెవ్వఁడు చెప్పుటలేదు. ఆర్యావర్తచిత్రపటమున కుత్తరపు నల్లగీత హిమాలయపర్వతమని మీ రనుచున్నారా? లేదా! ప్రాలేయాచలము పటముపైకి దిగివచ్చినదని మీరుమాత్ర మనుకొనుచున్నారా? ఈయంశము గూర్చి మతోపన్యాసములలోఁ గాలాచార్యులుగారు ముందు జెప్పెదరు. ఆవశ్యకమగు విగ్రహారాధనమును మీరు నిందింపకుఁడు.

ఈయంశమునే యొక కవి యిట్లు పలికినాఁడు.

గీ. వర్ణతతిఁ జూచి వ్రాసియుఁ బలికి మరి గు
ణించినను గాని పాండిత్యమెటులు రాదొ
మొదట నట్టులు విగ్రహపూజ లేక
ముక్తిసాధనమగు భక్తి పుట్టదెపుడు.

గీ. ఈవు కృష్ణుఁడవని రాధ యెంచుకతనఁ
గృష్ణపరిరంభ సౌఖ్యంబె యొనసె రాధ

విగ్రహమె దేవుఁడని భక్తి విశ్వసింప
దైవసాన్నిధ్య సౌఖ్యమందంగ నగునె ?

విగ్రహమునందు మీకు విశ్వాసములేదు. నిర్గుణ సమాధికి శక్తి లేదు. నడమనుబడి యుభయభ్రష్టులై చెడిపోవుచున్నారు. మిగుల దుర్దశలో నున్నారు. మిమ్ము మీరే కాచుకొనవలయును. ఇదికాక మీరు మఱియొక వ్యాధిచే బాధపడుచున్నారు. జాతిభేదము సర్వసౌఖ్యాభివృద్ధికి నభ్యంతరముగ నుండుటచే దానిని నిర్ధ్వంసము సేయవలయునని జూచుచున్నారు. సర్వమహాజనులందఱు కలసి యొక గొడ్డుమీఁదఁబడి దానిని పీకుకొని తని యొక్క బానలో నిక్కి యొక్క కడముంతలోఁ గలిసి పీల్చినదైన నది యైహికమున సౌఖ్యముకాదు. ఆముష్మికమున క్షేమముకాదు; అదికాక ప్రపంచ మున్నంతకాలము జాతియో దానివంటిది మఱియొకటియో నిలువనే నిల్చునుగాని మీరనుకొనినదశ యెన్నటికి రానేరదు. ఈయంశమునుగూర్చి కూడ నా మిత్రుఁడు కాలాచార్యులు ముం దుపన్యసించును కావున నేను దానినిఁ గూర్చి యింతకంటెఁ జెప్పఁదలఁచుకొనలేదు. నాయనలారా! మీయాచారసంపద యింత సౌభాగ్యవంతమై యున్నది.

ఈదినమున మీ దేశభాషాభిమానమునుగూర్చి కూడ చెప్పఁదలంచితిని గాని యిదివఱకే యాలస్యమగుటచే దానిని మానితిని. నాయనలారా! మన మార్యావర్తదేశమునఁ బుట్టితిమి—ఇది కర్మభూమి; కర్మమువలనఁగాని భక్తిజ్ఞానము లంకురింపవనియు, ముక్తిశ్రేణిక కదియే మొదటిమెట్టనియు నమ్మకముగలవారము వైదికకర్మములు మన కత్యావశ్యకములు. దైవభక్తి, మతాభిమానములు, వేదకర్మానుష్ఠానము, రాజభక్తి, భాషాభిలాష మొదలగు సత్తమోత్తమ గుణముల కాటపట్టు లగువారికడుపులఁ బుట్టినవారము—ప్రపంచమం దున్న జాతులలో నొక్కొక్కజాతి కొక్కొక్కవిషయమునఁ బూర్ణాభిమాన ముండును. ఒక జాతికి విద్యాభిమాన మధికము. మఱియొక జాతికి వ్యాపారాభిమాన ముండును. ఇంకొక్కజాతికి రాజకీయతంత్రాభిమాన ముండును. మనజాతికిమాత్రము మతమే సర్వము— మతము మనలో నున్నది. మనము మతములో నున్నాము. మనకు జుట్టులో మతము. బొట్టులో మతము. కట్టులో మతము. మతశాసన

సంబంధములేకుండ మనము తుమ్మలేము. ఆవులింపలేము. క్షురకర్మము నేయించుకొనలేము. స్నానము చేయలేము. తినలేము. భార్య యొద్ద శయనింపలేము. పిల్లలఁ గనలేము. తుదకుఁ జావలేము. చచ్చిన తరువాతఁగూడ మతసంబంధము వదలనే వదలదు. మనకస్థిమాంసములు మతమయములై యున్నవి. రోమకూపములు మతమయములై యున్నవి. మనముమానిన సంధ్యావందనము చివరఁజెప్పవలసిన ప్రవరలలోఁ జేర్పఁబడిన మహర్షులు—వసిష్ఠ విశ్వామిత్ర వాలఖిల్య జమదగ్న్యాదిమహర్షులు— తపస్తేజస్సామర్థ్యతులితాంభోజభవులగు మహర్షులు—జ్ఞానశాంతి దాంతిధననిక్షేపులయిన మహర్షులు—మనవంశములకాదిపురుషులై యఖండశోభామూర్తులై ప్రకాశించుచున్నారు. అట్టివారికడుపులఁ బుట్టిన మనకు—వారి దైవభక్తిలో—వారిసత్యశీలతలో— వారివైదికాచారసంపన్నతలో—వారియింద్రియనిగ్రహములో— వారితపశ్శక్తిలో— వారిమతాభిమానములో—లక్షాంశమైనఁ గోట్యంశమయిన మనకుండనక్కఱలేదా? మనవంశములో—నిట్టి వికృతవేషులు—నిట్టిదుర్బలశరీరులు—నిట్టి విధినిషేధవిచికిత్సాశూన్యులు—నిట్టి సదాచారపరాఙ్ముఖులు—నిట్టి మతసాంప్రదాయపరిహాసకులు—నిట్టివారు—జన్మించిరేల ? యని యామహర్షులు గన్నీరు విడువకుండునట్లు ప్రవర్తించుటకంటె మనము వారికిఁ జేయఁగలయుపకార మేమున్నది ? అట్లు చేయకున్న మనయార్యనామమునకు సార్థకత యేమున్నది ? నాయనలారా ! మీరందఱట్టివారని నాయభిప్రాయ మెన్నఁడు కాదు. మీలోఁ గొందఱు పూర్వాచారపరాయణతయు మతాభిమానాదులు గలవారై యున్నారు. అట్లుకానివారగు కొందఱఁ గూర్చి మాత్రమే యీయుపన్యాస ముద్దేశింపఁబడినది. నామాటల వలన మీరు కోపమొందకుఁడు. పగలేదో రాత్రియేదో తెలియని ప్రాఁజదువుబాపనయ్య యింతకంటెఁ బలుకఁగలవాఁడా”—

జంఘాలశాస్త్రి యుపన్యాసమును ముగించెను. బాలురులేచి పోవుచు వారిలోవా రేమనుకొనిరో పూర్ణముగ వినఁబడలేదుగాని "Nonsense" "so and so" "mere blindness" "good voice without much sense" "Arrogant fellow" అని యేమేమో యిట్టిమాటలు వాణీదాసునకు వినఁబడెను,

# సాక్షి

## 8. భూతవైద్యము.

సభాశాలలో జనసంఘము కిటకిటలాడుచున్నది. జంఘాలశాస్త్రి యిట్లుపన్యసించెను. "నే నెఱుఁగుదును. నాకు స్వానుభవ మున్నది. నే నావిద్యలోఁ గృషిచేసినవాఁడను. మీ కందఱకు నయ్యంశములఁ గూర్చి సందేహజ్ఞానముకాని నాకు నిశ్చయజ్ఞానము. అధశ్శయనబ్రహ్మచర్య వ్రతములుజేసి గురుశుశ్రూష యొనర్చి కాయక్లేశపడి, పిశాచ విద్యాపారగుఁడ నైతిని. మాగురువుగా రిప్పటికి నొకయూర జీవించి యున్నారు. నే నొకసారి క్రొత్తఁగ నాపురమునకుఁ బోయితిని. అచ్చట మారీచశాస్త్రి యనునొకభూతవైద్యుఁ డున్నాఁడు. నేనుబోయి యాయ నను దర్శించితిని. నామాటలనుబట్టి వైఖరినిబట్టి బ్రహ్మచారి నని యాతఁడు గ్రహించి నావంటివాఁడు తనకు శిష్యుఁడుగ నుండుట మంచిదని యనుకొనుటచేఁ గాఁబోలు నన్నుఁ దనయొద్ద నుండుమని కోరెను. నేను సమ్మతించితిని. మఱునాఁ డుదయమున మాభూతవైద్య శాలను దెఱచితిమి. రెండు బుట్టలతో నూలుదారములముళ్లు మూఁడు పళ్లికలతో తాటాకులముక్కలు, రెండు మూకుళ్లతో బూడిద, మూఁత లేని దేవదారుపెట్టెలోఁ గొన్ని రాగిరేకులు, రెండుకడముంతలలో పసుపు, వెదురుగొట్టములో నెఱ్ఱని యక్షత లున్నవి. ఇవి మాశాలలోని యౌషధములు. నూలుదారములని తాటాకులని మాలో మేమనుకొనిన యెడల రోగులకు మాచికిత్సయం దనాదరణముగనుండునని మాయౌషధములకు మాగురువుగారే కొన్ని వింతపేరులను గల్పించెను. ఇవికాక ప్రతి వైద్యశాలయందుఁ గోఁతకై కొన్నియాయుధములుండు నాచార

మునుబట్టి మావైద్యశాలలోఁగూడ శరీరచ్ఛేదనమునకై కొన్ని యాయుధముల నుంచితిమి. రెండుచీఁపురుకట్టలు, వేఁపబెత్తపుకట్ట, దూలగొండియాకు నూఁగుతోఁగలిపిన విభూతి, రెండుజతల యినుపగోళ్లు, గట్టిబిరడలుగల భూతాకర్షణ కాచపాత్రములు, నొక పట్టుకారును, మాశాలలో శల్యతంత్రసాధనసామగ్రిగా నున్నవి. ఈయాయుధములకుఁ గూడ వింతవింత పేరులు మాగురువుగారు కల్పించియుంచిరి. చీపురుకట్టకుఁ గాంతాకరవాలమనియుఁ, బేఁపబెత్తమునకు బాలబుద్ధివర్ధినియనియు, దూలగొండిబూడిదెకుగ్రనారసింహమనియు, నినుపగోళ్లకుఁ గాళికాదంష్ట్రలనియు, సీసలకు క్షోణీకుక్షి నిక్షేపములనియు, బట్టుకారునకు వీరాంజనేయమనియు, విచిత్రనామములను వస్త్రగౌరవపరిహారార్థముగను భూతరోగులకు భయాభివర్ధనార్థముగను గల్పించెను. ప్రతివైద్యశాలయందు శారీరశాస్త్రసంబంధములగు పటములు వ్రేలాడఁగట్టు నాచారమునుబట్టి యిచ్చట గూడ నాలుగుగోడలకు బాల—బగళ—మహిషాసురమర్దని—మళయాళ భగవతియను విగ్రహములు రంగులతో వేయఁబడినవి. అవిగాక మాగురువుగారి గురువగు గుంటపల్లి గురులింగదేవరగారి విగ్రహ మొకటికూడ నున్నది. భూతభేదముల ననుసరించి భూమిపై వేయవలసిన వేఱువేఱు ముగ్గుల చిత్రపటములు కొన్నిమాత్రమే, యచ్చటచ్చట సుద్దతో వ్రాయఁబడియున్నవి. ఇవికాక తాళీదళసంపుట మొకటి యున్నది. అందులో నేమున్నదియో నాకుఁ దెలియదు.

మా గురువుగారు వ్యాఘ్రాజినముపైఁ బద్మాసనస్థులై నాసికాగ్రవిన్యస్తవిలోకనులయి కూరుచుండిరి. ఆయన నడిమివయసుగలవాఁడు. పిప్పళ్లబస్తా! పాషాణప్రతిమ! ఉక్కు వృకోదరుఁడు. నల్లని గరుసుగడ్డముచేఁ బ్రత్తికాయలవంటి గ్రుడ్లచేఁ దుట్టెపెదవులచే భ్రూమధ్యమునఁ బెద్దకుంకుమరేఖచే భయంకరమగు స్వరూపము గలవాఁడు, ఒక్కభార్యనంటఁగట్టుకొని లోడితెడు సంసారములో గుడు గుడు గుంచములాడుట కిష్టపడక బ్రహ్మచారియై లోకముమీఁద విఱుచుకొనిపడి తెగిపడ నుపకారము చేయుచున్నాఁడు. భూతభేతాళ పిశాచాదులతో నీతనికి జరిగిన హస్తాహస్తి పాదాపాది మూర్ధామూర్ధి యుద్ధము లనేకము లీతఁడు పొడిచినట్లు మొలచినట్లు వర్ణింపఁగలడు. దయ్యముల పిడికిటిపిడుగులచే

మడమలపోటుపులచేఁ బల టొక్కాయింపులచే నీతని శరీర మింత గట్టి పడినదని యాతని నమ్మకము. ఈతఁ డొక చాకిదాని పిశాచనిష్కృతికై దాని యింటికిఁ బోయి యాతంత్రమున సఫలుఁడై యుండ నాచాకిత నావేశించిన పిశాచము దాని భర్తరూపము నట్టె ధరించి గొబ్బునఁ గాలిన యిస్త్రీపెట్టెను వెనుకపాటున వచ్చి యీతనివీపుపై నంటించెనఁట. ఆమచ్చ యిప్పటివఱకు మొండిచేట యంత నిల్చియున్నది.

ఆతఁడు నేనును నాయుదయమునఁ బిశాచశేషజాలలోఁ గూరుచుంటిమి. ఇంతలో నొక శూద్రకాంత వచ్చి తన సవతి తనుఁ దీసికొని తినుచున్నదనియుఁ దనకుఁ జూలు నిలువనీయదనియుఁ జెప్పెను. ఆమె కాతఁడు చేయిచూచి "జంఘాలశాస్త్రీ! భూతనాడి తప్పనిసరై నెంత విసరుచున్నదో చూడు" మని యామె చేతిని నాచేతిలోఁ బెట్టెను. నేను జూచి యూరకుంటిని. అంత మాగురువుగారు శాస్త్రిని నెగ దిగఁ బరికించి "శాస్త్రీ! ఈమెకుఁ గార్పాసకలతాబంధమును శాంకరాంగరాగలేపనమును గావలసియున్న" దనెను. ఆ పెద్దమాటలను విని యామె గతి డిల్లవడి "ఏదో గట్టిపని చేసినఁగాని యిల్లు నిలువఁబడుసాధనము లేదండి" యని కన్నీరు పెట్టుకొనెను. గురువుగారి, యీసంస్కృత సంజ్ఞల యర్థము నే నెఱింగినవాఁడ నగుటచే ముళ్లనూలు పోఁగొకటి యిచ్చి దీనిని జేతఁ గట్టుకొమ్మంటిని. మూఁకుళ్లలోనున్న బూడిదెలోఁ బిడికెఁ డిచ్చి దీనిని రాత్రులందు గర్భమునకు రాచికొమ్మని చెప్పితిని. ఆమె పోవుచుండఁగనే యొక వృద్ధవైశ్య బాలికను గనఁబఱచి యిది తన మనుమరాలనియు దీనిని మేనత్తకొడుకున కిచ్చుటకు స్థిరపఱచుకొనిరనియు నాతఁడు మరణించుటచే మఱియొకనికి వివాహము చేయఁబడినదనియు మేనత్తకొడుకు దయ్యమై దీనిని బట్టుకొని మగనియొద్దఁ బండుకొననీయఁడనియుఁ దానే దీని రక్తమాంసము లాడిచి చంపుచున్నాఁడనియుఁ జెప్పెను. అంతట గురువా బాలికచేయిఁ జూచుచుండఁగ నామె క్రేగంట నాతనిఁ జూచి కొంత యిగిలించెను. నేను దెల్లఁబోయి చూచుచుండఁగ "ఈయిగిలింపు పిశాచలక్షణమునుమా!" యని నాతోఁ బలికి ఈభూతము "హాత్తు హూత్తుల" వదలి పోవునది కాదు. ఈమెను గొంతకాలమువఱకు భర్తను జూడ నీయఁదగదు. ఈమెను బ్రతిరాత్రియు నేడుగంటల కిచ్చుటకుఁ దీసికొని రమ్ము. ఈమెను మ్రుగ్గులోఁ గూరుచుండఁ బెట్టి తాడనపీడ

నము లాచరించి కచాకర్షణ మొనర్చి యొక జాముసేపువఱకు ఊపిడి పెట్టినఁగాని యీవికారము వదల" దని వృద్ధవైశ్యతో నాతఁడు బలికెను. బాలవైశ్య యీమాటలు విని పట్టలేక కిసుక్కున నవ్వెను. "వెకిలిదయ్య" మని గురువుగారు నన్ను సమాధాన పఱచిరి. వృద్ధాంగన యందుల కంగీకరించెను. ప్రస్తుత శాంతికొఱకు గ్రంథపత్రశకలమొకటియు హేమరజము కొంతయు నిమ్మని నాతో గురువుగారనఁగ నొక తాటియాకుముక్కను గొంతపసుపు నామె కిచ్చి యీపసుపు మొగమునకు రాచికొమ్మనియు నీతాటియాకుఁ గొప్పునఁ బెట్టుకొమ్మనియుఁ జెప్పితిని. వారు పోయినవెంటనే యొక బ్రాహ్మణ వితంతువు పదునాఱు సంవత్సరముల పడుచునుగూడ వెంటఁబెట్టుకొనివచ్చి యిది తన చెల్లెలనియు నంకిలిచే నింక వ్యక్తురాలు కాలేదనియు దానిభర్త రెండవపెండ్లివాఁడనియు నాతనికి వెనుకటి కళత్రమువలనఁ బిల్లలు లేరనియు నింక నేమేమో చెప్పఁబోవుచుండఁగ మాగురువుగారా పిల్లను చేతఁదిగిచి యొడిలోఁ గూరుచుండఁ బెట్టుకొనెను. నాకొడలు చచ్చినట్లయ్యెను. ఆపిల్ల లేచిపోవుటకు గింజుకొనినను మాగురుజీ యామెను గట్టిగఁ జేతుల నదిమిపెట్టి "ఫట్ ఫట్" మని యేదో మంత్రించి యొకగడియసేపటికి వదలిపెట్టెను. "గ్రంథశకలత్రయ మా పిల్ల కిమ్మని" నాకు సెలవగుటచే నిచ్చితిని. ఇది యేమి సేయవలయునని వితంతువు నన్నడుగ నేను వెఱ్ఱిమొగము వైచుకొని పిశాచాధ్యాపకునివంకఁ జూచితిని. "ఇవి సమర్తచీటులనియు నివి పొత్తికడుపునకు గుడ్డపేలికతో మూఁడురాత్రులు కట్టకొనవలయు" ననియు నాతఁడు సెలవిచ్చెను. వారు పోయినవెనుక నొక వెలమదొరగారు తమవీథిలో నొకయింటిలో బాలింతరాలు చనిపోయినదనియు న్నామె బ్రహ్మరాక్షసిని యయ్యె ననియు నాయిల్లు మరణనక్షత్రదుష్టతచే విడువఁబడినదనియు నాయింటిప్రక్కనుండి తనభటుఁ డొక రాత్రి చుట్టలకొఱకంగడికిఁ బోవుచుండఁగా నాబ్రహ్మరాక్షసిని వానియెదుటఁబడి ఱొమ్ముపై నొక్కచఱపు చఱచినదనియు నాతని వక్షస్స్థలము వాచి యెఱ్ఱఁబడుటయే కాక యారక్కసి గోళ్లగీరుల యానవాళ్లుకూడ నందుపై నుండెననియు నాతఁ డేడ్చుచుఁ దన యింటికివచ్చి రెండురక్తవమనములు చేసికొని యారాత్రియే మరణించెననియు నప్పటినుండియు నావీథిలో

సాయంకాలమయిన పిమ్మట జనసంచారము పూర్ణముగఁ గట్టఁ బడిన
దనియు, నావీథిజను లీకారణమున మిగులఁ బరితాపము పడుచున్నా
రనియు నిట్టి యుపద్రవము శీఘ్రముగ నివారించినఁగాని జనులకు మన
శ్శాంతి యుండదనియుఁ జెప్పెను. మాగురువుగారు రీసంగతి నిదివఱకే
వింటిననియు దానినిగూర్చి యొన్నడును గోరియుండకపోవుటచే నేను
బనిచేయలేదనియు మాఱుపలికెను. "గురువుగారి సెలవైనయెడల నే నీ
రాత్రి పోయి చూతు" నని నేను బలుక పెలమదొరగారు "బ్రతుకఁ
దలఁచుకొనలేదా" యని యొకసక్కెముగఁ బలికెను. "ఇతఁడు నా
శిష్యుఁడు, భూతవిద్యారహస్యములు బాగుగ నెఱిఁగినవాఁడు. ఈతని కే
నాపిశాచికి నే నొక్క లేఖ నీరాత్రి పంపించి దాని స్థితి దాని జాడలెట్టు
లుండునో కనిపెట్టి యటుపైన నావశ్యక మగునెడల నేనే యిచ్చటను
వచ్చి యన్నియుఁ జక్కపెట్టెదను. ముందుగ నేనే వచ్చుట గౌరవము
నకు లక్షణము కాదు. మత్యావలసినగూర్చి దొరగారికిఁ దెలియని
యంశము లేమున్న" వని మాగురువుగారు దొరగారితో ననెను.
దొరగారు వెడలిపోవునప్పుడు మాగురువుగారు "సెలవుతీసికొందు" నని
చెప్పఁగఁ దల యొకవంకకు దబాయించి కుడిచేతిని వెల్లగిల్లఁజాచి, వ్రేళ్ళ
యిగిలింపకటి యొరువుతెచ్చుకొని ఊఁ ఊఁ అని రెండుమాటలు ముక్కు-
ముందు భటుఁడు దారిచూప నాతఁడు నడచిపోయెను.

ఆరాత్రి నేను బదునొకండుగంటలు దాఁటినవెనుక నొక్కఁడను
పిశాచవీథికి బయలుదేఱిపోయితిని. ఇండ్లతలుపులన్నియు బిగించియుం
డెను. మనుజుల యలికిడియైన వినరావయ్యెను. భయంకరముగు నిశ్శ
బ్దము ప్రబలియుండెను. గాఢాంధకారము క్రమ్మియుండెను. పురపారి
శుద్ధ్యసంఘమువారి వీథిదీపమైన లేదు. శ్మశానములో నడచుచుంటినని
నాకుఁదోఁచినది. గుండెలు పీచుపీచు మనుచున్నవి. ప్రాణము లఱచేతిలో
నున్నవి. తిరిగి వెనుకకుఁ బోవలయునని యనుకొంటినిగాని మొదటనుఁ
బుట్టిన పెంకితనము ముందునకుఁ ద్రోచెను. దొరగారు చెప్పిన యింటి
యొద్దకు వచ్చుసరికి "ఉవ్వూఉవ్వూ" మను విసరుతో, "రంయిరంయి"
మనుధ్వనితో నెదురుగ దయ్యము వచ్చి దబాలున గుండె లవియునట్లు
కొట్టినది. కెవ్వుమని యొక్క చావుకేక వైచితినిగాని దెబ్బ తగులుట
తోడనే రెండుచేతులతో గట్టిగ నాయెదనదిమికొని గట్టిగఁ బట్టుకొంటిని.

చేతులక్రింద భూతము పీకుచున్నది కఱచుచున్నది. వెఱ్ఱిపట్టు వదలక యొక్కపరుగున గురువుగారింటికివచ్చి నిదురనుండి యాతని లేపి యీ వృత్తాంతమంత చెప్పఁగ నాతఁడదరిపడి క్షోణీకుక్షినిక్షేపములలోఁ బెట్టుదమని వానిని దెచ్చి యెదుటఁ బెట్టి చేతులపట్టు నిష్కళముగ సడలఁజేయుమని పలికిరి. వడకుచుఁ బట్టువిడిచితిని. ఒక పెద్దగబ్బిలము తుఱ్ఱున నెగిరి మళయాళభగవతి విగ్రహముపై వ్రాలెను. మే మిద్దఱము తెల్లఁబోయితిమి. "మొదట నన్నుఁ గొట్టినప్పు డది బ్రహ్మరాక్షసి స్వరూపముననే కొట్టెననియు కామరూపిణి యగుటచే నేను బట్టుకొనినతోడనే స్వరూపము మార్చి ఋషిపక్షియయిన" దనియు మాగురువుగారి వాదము. ఎటులయినను నాధైర్యమునకు మెచ్చి నన్ను విశేషానురాగమున నాతఁడు చూచుచుండెను. "గబ్బిలపుగాథ రెండవకంటివానికిఁ దెలియఁ గూడదు సుమా" యని నన్ను హెచ్చరించెను.

ఆయూరిలోనే పడమటివీథిలో నొకబాలవితంతువున కొక్క విచిత్రమగు కామినీగ్రహ మావేశించినదనియు నది తన కిదివఱ కెన్ని సాధనములు చేసినను స్వాధీనమైనది కాదనియు తేపటియుదయమునఁ దాను తత్ప్రదేశమునకుఁ బోవుదుననియు నన్నుఁగూడ రమ్మనియుఁ బలికెను. తెల్లవారిలేచి యటకుఁ బోయితిమి. ఆకామిని చిత్రము చూడఁదగినదే కాని చెప్పవీలులేదు. మేము పోవుసరి కాచిన్నది మూఁడు మేజువాణులంత కలకలము చేయుచున్నది. తానే పాట, తానే యభినయము, తానే వెనుకహంగు. తానే చిప్పతాళపుఁదాటింపు. తానే యుపాంగపుశ్రుతి. అంతలో మొగ్గలు. అంతలో శివశక్తిగంతులు. అంతలో గావుకేకలు. తందనపదములు. "ఈకామిని పూర్వమున వేశ్య సుమా ?" యని నాతో మాగురువుగారు నిస్సంశయముగఁ బలికిరి. అంతలో నాచిన్నది "ఓం నారాయణాయ విద్మహే వాసుదేవాయ ధీమహే !" యని స్పష్టముగ స్వరయుక్తముగఁ బలుకగ మాగురువుగారు తా నిప్పు డనినమాట-పూర్వపక్షమైనదని కాఁబోలు. సందేహముతో నీకామినికి వేశ్యాజన్మపూర్వము వైదికజన్మము నుండితీఱవలయును. లేదా వైదికుఁ డెవ్వఁడైన దానియందలి యభిమానము వదలక మరణించి దాని నావేశించి యుండవలయును. "వాసుదేవాయ ధీమహేతన్నో విష్ణుః" అని యామె మెఱపు మెఱసినట్లెగిరి నాపిఱ్ఱపైఁ దన్నెను. మేము వచ్చిన

ట్లొరగంటను గనిపెట్టినది కాఁబోలు. ఆమె తన ఘోషణలో మమ్ముఁ
జూడలేదని యనుకొంటిమి. క్రొత్తవాఁడవైన నేనుగూడ భూతవైద్య
మునకే వచ్చితినని నన్నుఁ బన్నినది కాఁబోలు! గ్రుడ్లు నీరుగారఁగ గురువు
గారివంకఁ జూచితిని. "తొందరపడకు చూచితివా! అంతటితో సంతో
షింపఁదగినది. ఆనఘుఁడు నాకుఁ బంట్లు పడఁదీసెను అని కొప్పుపట్టుకొని
మీఁదఁబడఁగ "ఆ ఆ" యని నోరు తెఱచి యరచెను సరికిఁ గారుతో
నాముందువన్ను బిగఁబట్టి యటునిటుఁ బోకాయించెను. ఇప్పుడే మ
హుగ్ర నారసింహావేశమ మొనర్తును" అని మాలగొండిశిఖరాన నిలిచి
"హ్రాం, హ్రీం, ఫట్, ఫట్" అని యేమేమో చదువుచు నామెను సమీ
పింపఁగ ఖామోష్—ఖబర్ దార్ చలోజావ్. హై కిడానూక్ ఠా ఠా
హుం" అనుచుఁ బంతిరిమంచపు స్తంభమునఁ దీసి మీఁదికి వచ్చెను. అంత
గురువుగారు రెండుమూఁడడుగులు వెనుకకు వైచి "చూచితివా? ఇంక
దయ్యముకూడ నున్నది. ఒక దయ్యమునకు దారియిచ్చిన మనస్సులో
నన్నిదయ్యములు ప్రవేశించును. ఇప్పుడు నే నెందులకు వెనుక మరలి
తినో వింటివా? పిశాచములు రెండుమూఁ డావహించుటచేత వానిలో
వానికి మాయోపాయములఁ గలహము పెట్టిన గొడవల సందుని
నొకటి కొట్టుకొని తుదకన్నియుఁ బారిపోవును. అట్టి యేకతంత్రము
మంచిదేమో యని యాలోచించుచున్నాను" అని నాకీభూతవిద్యారహ
స్యమును బోధించెను. కనఁబడిన బట్టనెల్ల తగులఁబెట్టుట, కనఁబడిన
మనుజులనెల్ల కొట్టుట మొదలగు భయంకరచర్య లామె చేయుటచేత
నామెకుఁ బ్రత్యేకముగ నుండుటకు వసతిచేసి యింటివారెవ్వ రామె
యొద్దకు భోజనము తీసికొని వచ్చునప్పుడుతప్ప పోవుట మానుకొని
నారు. మే మిద్దఱమే యిప్పు డామెసన్నిధి నుంటిమి. కలియఁబడి
యామెను నాలుగు తన్నవలసినదని ప్రేటుఁదిన్నవాఁడనుగాన నాతనినిఁ
బ్రోత్సహించితిని. కాని యాతని చికిత్సాపద్ధతి భిన్నముగా నున్నది. మే
మిద్దఱ మక్కడనుండి యేమియుఁ జేయలేక యింటికిఁ బోయితిమి.
దారిలోఁ గానఁబడిన యామె తండ్రితో "జంఘాలశాస్త్రిని తీర్థమిచ్చి
రాత్రిపంపుము" అని మాగురువుగారు పల్కెను. ఆమెను జుట్టుపట్టుకొని
నేలమీఁదఁ గొట్టవలయునని నా కుత్సాహముగ నున్నది. తీర్థపుగిండి
[illegible]ని రాత్రి పోయితిని. ఆమె ప్రత్యేకముగ నివసించు స్థలమున

మఱెవ్వ రుండుట కవకాశము లేదు. కావున నేను జరజర లోనికిఁ బోయితిని. ఆమె పడుకగది తలుపు వోరగ నుండెను. నిద్రపోవుచున్న దేమో యని తలుపు కన్నములోనుండి లోనికిఁ జూచితిని. మఱియొక భూతవైద్యుఁ డెవఁడో లోన నామెను మంత్రించుచున్నట్లు నాకుఁ గనఁబడినది. ముంగురులను జేతితోఁ బట్టుకొనినాఁడు. ఎదుట నొక సీస యుంచినాఁడు. మూతి పొడుగుచేసి ముందునకు వంగి "ఉహ్హా" నుటకు సిద్ధముగ నున్నాఁడు. మారణహోమ మారంభించినాఁడనియుఁ గామినిని సీసలోఁ దలవెండ్రుకల చిన్న జడతోఁ గూడఁబెట్టి భూమిలోఁ బ్రాతిపెట్టుటకై యిట్లు చేయుచున్నాఁ డనుకొంటిని. "ఉహ్హా"నుటకై ముందునకుఁ జాఁచిన మూతితోఁ దళుకుమని నాకన్నులు మిఱుమిట్లు పడునట్లు బింకమైన యొక్క ముద్దును—ఫర్లాంగున్నర పొడుగుగల ముద్దును బెట్టుకొనినాఁడు. ఎదుటి సీసలోని దామెబుగ్గలకు రాచుట చేత నది యవనీకుక్షినిక్షేపము గాదనియు సత్తురువుబుడ్డి యనియు గ్రహింపవలసి వచ్చినది. తెప్పపాటుకంటెఁ దక్కువ కాలములో నామె విడుచుకొని యాతనిపైఁ బడినది. అకామిని యమెరికాఖండమువఱకు నొక్కటేపరుగు. నేనుగూడ నింటికిఁ బరుగెత్తి యీయంశములు గురువుగారితోఁ జెప్పితిని. గదిలో నున్నయాతఁ డెవ్వఁడో నే నెఱుఁగను. "అతనికి గడ్డముండెనా ? యజ్ఞోపవీతమున్నదా ?" యని గ్రుచ్చి గ్రుచ్చి గురువుగారు నన్నడిగిరి. ఆమెలో నున్న మహమ్మదీయ పిశాచమే పైకి వచ్చెనో లేక బ్రాహ్మణపిశాచమే వచ్చెనో యని యాతనికి సందేహము విడువలేదు. మఱునాఁటి యుదయమున నాచిన్నదాని యింటనుండి యొక ముసలిదాసివచ్చి కన్నుల నీరు పెట్టుకొని మా గురువుగారి యెదుట నిలువఁబడెను. "ఏ" మని యడుగ "పోయిన"దని యామె బదులుచెప్పెను. "జంఘాలశాస్త్రీ! ఇంతపని నిన్ననే జరుగునని నే ననుకొంటి సుమా ? నామంత్రముల కిక్కడతప్ప నెక్కడను నడ్డు కాలేదు. బ్రహ్మాస్త్రము పనికిరానప్పుడు బ్రదుకుయోగము లేదనుకొన వలసినదికాదా ! ఆమె తెల్లవాఱుసరికిఁ జచ్చిపోవునని నే ననుకొనినట్లా యయిన"దని గురువుగారు నాతో నైచ్యానుసంధానము ముచ్చటింప అగ "చచ్చిపోలేదండి, చాకలివానిని దీసికొని పోయినదండి" అని య వచ్చిన

చెప్పెను. గురువుగారి మొగము వెల్లఁబోయెను. ఆమె యింటికి మఱలి పోయెను. నామది దయ్యముల నమ్మకమునుండి తిరిగిపోయెను.

నాయనలారా! ఇట్టిదయ్యములు లేవు. మనబుద్ధులే దయ్యములు. ఈదయ్యములు విద్యచేత, సత్సహవాసముచే, దైవభక్తిచే, జ్ఞానముచే వదలవలసినవికాని మంత్రించిన మినుపగింజలచేఁగాని చీపురుకట్టలచేఁగాని ప్రాతచెప్పులచేఁగాని వదలునవికావు. పిశాచములు బ్రహ్మరాక్షసులు లోకమునందే యున్నారు. విద్యనేర్చి న్యాయమైన జీవనోపాధిని సంపాదించుకొనక కనఁబడినవారినెల్ల [illegible] యుంచి సూత్రపాతములు చేసి యాచించి పొట్టపోసికొనుచు నాకేచోటన్ననుఁ గాలునిలువక వెఱ్ఱికుక్కవలెఁ దిరుగుమనుజులే భూతములు. ఉచితానుచితత లేక పట్టినపట్టువిడువక పరస్త్రీయనుమానముగాంచి సహింపనేరక యెంతసేపు స్వోదరపోషణార్థమై దేవులాడుచు నానాస్తోత్రములు హద్దులేక చేసికొనుచుఁ గవులను బండితులను గాయకులను నిష్కారణముగ దూఱుచుఁ బరిపాలించు ప్రభువులఁగూర్చియు బతివ్రతలఁగూర్చియు లేనిపోనితుచ్ఛప్రసంగములు సేయుచుఁ గాలక్షేపము చేయునరులే పిశాచములు. నీతికై పరోపకారమునకై ఇంద్రియనిగ్రహమునకై యహంభావనిరసనమునకై బ్రహ్మజ్ఞానసంపాదనమునకై పాటుపడక స్త్రీలంపటులై యాశాపాశబద్ధులై దుష్టవ్యసనాసక్తులై పరాపకారతత్పరులై గ్రామ్యసుఖాసక్తులై ప్రబలగర్వాతిరేకులై యొడలెఱుఁగక తిరుగు మనుజులే బ్రహ్మరాక్షసులు. వీరికంటె దయ్యము లీలోకమున లేవు” అని జంఘాలశాస్త్రి కూరుచుండెను.

అంతట వాణీదాసుఁడు లేచి యిట్లు చెప్పఁదొడఁగెను.

“లేవని సిద్ధాంతముగఁ జెప్పుట మిగుల సాహసము. సృష్టి యనంతము. దానిలో నెంత లనిర్వచనీయములు. అవాఙ్మానసగోచరములు. మనబుద్ధికందని యంశము మిథ్యయనఁ దగదు. ప్రపంచమునందున్న జీవులు సంఖ్యాతీతములై యున్నవి. అవయవములు లేనిజంతువులున్నవి. చలనమే లేనిజంతువులున్నవి. అట్టిచో శరీరము లేని జంతువులు మాత్ర మేల యుండఁగూడదు? గాలిలోనున్న జీవులనన్నిటి మనము చూచుచున్నామా? చూడలేని హేతువున లేవనుచున్నామా? నిశ్శరీరమంగు శక్తులుండిన నుండవచ్చును. భగవంతుఁ డింత యనంత కల్పనచేసిన

వాఁడై యుండ వానిని మాత్రము చేయలేఁడని చేయలేదని యెట్లు చెప్పఁ గల్గుదుము ? అవియే దయ్యములు కాని యవి మనల బాధించునవి కావు. అవి పురుషులకు గర్భమునిచ్చి స్త్రీలకు గర్భనిచ్ఛిత్తి నిచ్చునవి కావు. (సభనుండి)—పురుషులకు గర్భము లేమిటో తెలియలేదు. (అనిధ్వనులు).

"జలోదరములని నా యభిప్రాయము. దయ్యములు మనకేవిధములైన యపకారములు సేయలేవు. ఉపకారాపకారసామర్థ్యము, రక్షణశిక్షణాధికారములు భగవంతునివి కాని జీవులవి కావు. కావున దయ్యములు మనల బాధించునవి కావు. కాని లేవని చెప్పనీలులేదు. ఉండిననుండవచ్చును." అని చెప్పి కోపమూపున జంఘాలశాస్త్రిని జూచికూరుచుండెను.

అంతట జంఘాలశాస్త్రి రోసరోసలాడుచు లేచి యిట్లనియెను.

సృష్టివైఖరీజ్ఞానముగల కవిగారిప్పుడు చెప్పినమాటలలో వారి ప్రాపంచికజ్ఞానమును విని యోగకఱచుట మానినందులకుఁ జింతిల్లుచున్నాను. పెద్దపురుగులు చిన్నపురుగులఁ జంపుచున్నవి. కప్ప పురుగులను జంపుచున్నది. పాము కప్పను మ్రింగుచున్నది. దుప్పి పామును నములుచున్నది. పెద్దపులి దుప్పిని వధించుచున్నది. శరభము సింహమును జంపుచున్నది. సింహము తేఁచును జంపు చున్నది. తోఁచు పెద్దపులిని జంపుచున్నది. ఇట్టులే యొకజంతువును మఱియొకటి పీకుకొని తినుచున్నది. ఇట్టి శత్రుత్వమే సృష్టిరహస్యముకాని సామరస్యము కాదు. మనుజుఁడన్ని జంతువులఁ జంపుచున్నాఁడు. వీనికంటె సర్వనాశకుఁడు ప్రపంచమున లేఁడు. దయ్యములే యుండినయెడల సృష్టిక్రమానుసారముగ నవి మనుజులను బీకుకొని తినక తప్పదు. తిరిగి మన మారీచశాస్త్రులు, "మన యుగ్రనారసింహములు, మనవీరాంజనేయములు," సిద్ధము కావలసి యున్నవి. భూతవైద్య తంత్రము సర్వమిథ్య యని నేను కొన్ని నిదర్శనములు మాత్రమే స్వానుభవమునఁ జెప్పితిని. గ్రంథవిస్తరభీతిచే నూరకుంటిఁగాని వందలకొలఁది నిదర్శనములు చెప్పఁగలను. మీరందఱొక్క యీమాటనే పాటింపఁదగును. పిశాచావేశమని చెప్పఁబడిన స్థలమునందు మేధాసంబంధమైనదియో జననకోశసంబంధమైనదియో యొక రోగముగాని లేక ప్రబలమైన మోసముగాని యున్నదని నిశ్చయముగ నమ్మవలయు" నని జంఘాలశాస్త్రి యూరకుండెను. సభ ముగిసెను.

# సాక్షి

## 9. వేదాంతోపన్యాసము.

---

జంఘాలశాస్త్రి సభలో నిట్లు పలుకుచుండెను.

నేనొకయూరు పోయితిని. ఆయూరి కాకస్మికముగ నొకవేదాంతి వచ్చెను. ఆతఁడు మిగులఁ దెలిసినవాఁడని యెన్నైన నొక యుపన్యాస మిమ్మని యాయూరిజనులలోఁ బ్రముఖు లాతనిఁ గోరిరి. ఆతఁ డందుల కియకొని యూరనున్న యొకదేవాలయమునఁ గూడిన సభికులతో నిట్లు పలికెను.

"సోదరులారా! ఏదైనఁ జెప్పుమని మీరు నన్నుఁ గోరితిరి. మీకుఁ దెలియనిదానిని నేనుమాత్ర మేమి చెప్పఁగలను? ఏదైన వింతయైనది చెప్పినఁగాని మీకు హితవుగనుండదు కదా? న్యాయ మాలోచింపఁగ లోకములో మనచర్యకంటె వింతయైనది మఱేదియు లేదు. సాయంకాలమునకు భోజనములోనికి వ్యంజనము లేమైననున్నవో లేవో యని పగలే చూచుకొని వానినిఁ దెచ్చి యప్పటికొఱకు జాగ్రత్త పెట్టుకొనుచున్నాము. ఇతరదినములలోఁ జవుకగ దొరకని యల్లము నిమ్మకాయలు మొదలగువానిని సంతనాఁడే సేకరించి పైవారపుదినములకొఱకు భద్రపఱచుకొనుచున్నాము. మాసాంతమున సేవకుల కీయవలసిన వేతనముల మొత్తములను, నీటిపన్నుల మొత్తములు మొదలయినవానిని ముందే తీసి వేఱుగనుంచి మిగిలినయాదాయమునే వ్యయపఱచుకొనుచున్నారము. వర్షకాలము వచ్చుచున్నది. వంటచెఱకు దొరకదు. దొరికినను బచ్చిపుల్లలతోఁ బ్రొయ్యి మండదు. భోజనముల కిబ్బందికలుగునను భయముచే వేసవికాలమునందే ముందునకు సరిపడినకఱ్ఱల నెండఁబెట్టి భద్ర

పడుచుకొనుచున్నాము. వర్షకాలమున నటునిటుపోయి దూరలు మొద
లగు నాహారపదార్థములను దెచ్చుకొనవీలుగలుగని మూటగాయలను
వడియములను నప్పడములను బెట్టుకొని యటుకలమీఁద యూరిపెట్టు
కొనుచున్నాము. క్షేత్రధాన్యములు వచ్చినప్పుడే కొని పెట్టి ముందుసంవత్స
రమున కంతకు సరిపోవునట్లు మూఁటగట్టి గాదెలలోఁ బోయుచున్నాము.
పురులఁ గట్టుచున్నాము. మనమే మనము పెండ్లియగునప్పటికి కొడుకుల ప్రక్కల
లోనికి భార్యలుండనియెడల వారిసంసారమునకు సుఖము సమకూరఁ గొఱఁతవచ్చునని
పదునాలుగేండ్లకే యెనిమిదేండ్లపిల్లలను వారికి ముడివెట్టించుచున్నాము.
ఇట్లు మనము సర్వప్రాపంచిక వ్యాపారములలోఁ గూడ ముందుగఁ గొలఁది
కాలములోనేమి, దీర్ఘకాలములోనేమి, రాఁబోవు నావశ్యకము దూర
దృష్టిచే గ్రహించి యట్టియావశ్యకముండిన మనము సుఖముగనుండుట
కెట్టి యెట్టి యేర్పాటులు చేయవలయునో యట్టివానిని మిగుల శ్రద్ధతో
దీక్షతోఁ బ్రస్తుతమందే యాచరించుచున్నాము. మీరు పైసంవత్సరము
నకై గోనెల కెక్కించిన గోధుమలు కొఱుకువఱకు, మృతి మీఁ గొంతుఁ
గొఱుకకుండఁ గలదను ధైర్యము మీకుఁ గలదా? మీరు భద్రపఱచిన
యప్పడములు మీ భార్యలు నిప్పుపైవైచి కాల్చువఱకు మిమ్ము మీ
కొడుకులు చితిపైఁ బెట్టి కాల్పకుండుదురను నమ్మకము మీకుఁ గలదా?
మీరు విత్తనములకై వేఱుగ దాఁచియుంచిన మినుములు భూమిపైఁ బడక
ముందే మీ యాత్మశాంతులకొఱకు మీ మాసికపు బ్రాహ్మణులకై
మాషచక్రముల క్రింద నుపయోగింపఁబడ వనువిశ్వాసము మీకుఁ
గలదా? అంతవఱ కెందులకు? మీరు మీవంటవారితో సాయంకా
లమువఱకు దాఁచియుంచుమనిచెప్పిన నెల్లియాకు మజ్జిగపులుసు మీ
నోటఁబడకముందుఁ గుశసంయుత గంగోదక మవసానతీర్థముగ మీ
నోటఁబడదని మీకు నమ్మకము గలదా?

ధర్మరాజుపరిపాలనమున రాజదర్శనార్థమై యర్థస్వీకరణార్థమై
వచ్చిన యాచకు నొకని రేపురమ్మని ధర్మరాజు చెప్పఁగ భీమసేనుఁ డా
మాటవిని యేమిచేసెనో వినలేదా? ఢంకా భేరీపటహ కాహళఘంటా
దిరవములు మ్రోఁగింపఁజేయలేదా? అటులేల చేసితి వని యడుగ
"హస్తినాపురరాష్ట్రము రేపటివఱకు నిల్చియుండుననియు నది పూజ్యు
లగు ధర్మరాజుగారి భుజపీఠముననే రేపటివఱ కుండుననియుఁ దెల్పెను.

గదా! రాష్ట్రమునకు రాష్ట్రజనులకు ననుఁగుఁదమ్ముఁడనయిన నాకు నింతకంటె శుభోదర్కమగు వార్త యేమున్నది!" అని యాతఁడు ప్రత్యుత్తరమిచ్చెను. ఆమాటలు ధర్మరాజువిని సిగ్గుపడి యాయాచకునిఁ బిలిపించి సఫలమనోరథునిఁజేసి పంపెను.

ముం దెప్పుడో మీరలు నొకకవనిఁగుఁ గూఁతురు ఋతుమతి యగుననియుఁ బైరుసూళ్ళపాటలు వచ్చుననియును మారికాపీడ పొచ్చుగుననియు దూరదృష్టిచే గ్రహించువారగు మీరలు ఇట్లు గ్రహించి యేమేమో ప్రయత్నము లొనర్చుచుండి యాచరింతురు మీరలు నేఁటివలె మిమ్మెప్పు డాశ్రయించి యట్టె గుటుక్కున మ్రింగుట కనుసన్నకు మాత్రమే నిరీక్షించియున్న మృత్యువు నెదుర్కొనుట కేమయిన ప్రయత్నము లొనర్చుచున్నారా? చిత్తనిగ్రహకము లేదా? “స్వస్థశరీరులము ఎప్పుడో కాని యింతట నెక్కడచత్తు” మని యనుకొనుచున్నారా? వ్యయాధిపతిదశలో సప్తమాధిపత్యాంతర్దశ వచ్చునప్పుడో శని ద్వాదశ జన్మములకు వచ్చునప్పుడో ప్రాణములు శరీరమునుండిపోవుటకుఁ గారణము లేదని యూహించుచున్నారా? గోచరముల భేదించుటకు గువ్వ రాలెంత? పాపాత్ములున్నకంటె మీధాతువులు ప్రబలములగునా? కాల మాసన్నమగునప్పుడు దవిడమే ఘటాళియగు మందు మీలెక్క యేమి? మిమ్ముఁ గొంతకాలము బ్రదుకనిచ్చునని మీరూహించిన యష్టమాధిపతులు లగ్నాధిపతులు మహాకాలచక్రమున నస్వతంత్రులై పడి మనవలెనే గిరగిరఁ దిరుగుచు గిజగిజకొట్టుకొనుచు నోరుమూసికొని యే నిముసమున కానిముసము నిర్యాణమును నిరీక్షింపవలసినవే కావా? తాము గతిలేక యేడ్చుచుండ మీ యేడుపును మాన్పింపఁ గలవా! ఏతృటి కాతృటియే కవిచెప్పినట్లు “చావు నిక్కంబు బ్రదుకుట సందియంబె” కదా! ఈనిముసమున కేవిధములయినమరణలక్షణము లగపడకున్నను, హఠాత్తుగఁ బిడుగు మీఁదఁబడునో మ్రింగుచున్న మెతుకు తప్పుదారినే పోవునో—యొంటిపూస తేలే కుట్టునో—శత్రువుచేతి తరవారితోఁ దల తళుక్కని యట్టెయెగిరియేపోవునో—టిక్కుటిక్కునఁ గొట్టుకొనుచున్న లోనిగడియారము చప్పుననిలిచియేపోవునో—యెట్లు చెప్పఁగలము? మరణమిట్లనుక్షణము మనవెనుకనేయుండి మనభుజముల మీఁదనుండినిక్కినిక్కి వంకఁగఁజూచి మనలవెక్కిరించుచుండఁగాదీనివైపు

చూచుటమాని చింతపండుబుంగలున్న పెణకలవంకఁ జూచుటయేల? కాలి క్రింది త్రాఁచు గఱచుట కొండి వేయుచుండఁగా నుండవింటిబద్దతోఁ జెట్టు ననున్న పిట్టను గొట్టు వేఁటకాఁడు కాటికడవాఁడే కాదా ? జ్ఞానమేపాటి దైన లేచివాఁడే కాదా ? వానికి సన్నిహితసన్నస్థితి తెలియకపోవచ్చును కాని మన కీసహస్రశీర్షి కాసంకలితపర్వకసదసద్వివేకము తెలియును గాదా ? తెలిసియుండియు నిట్లు మూఢవక్రవర్తిశిఖామణుల మగుట తగునా ?

కన్ను తెఱువనికడుపులోనిగ్రుడ్డు మొదలు కట్టి చేఁబుచ్చు కొనిన కన్నులు లేని కడువృద్ధునివఱకు కాలహస్తులై మనకన్నులయెదుట వయోదార్ఢ్యాదివివక్షత లేకుండఁ బ్రాణు లెగిరిపోవుచుండ మనము శాశ్వతముగ నీ దిక్కుమాలిన కొంపలఁ గనిపెట్టికొని యుండఁగల మను కొనుటకంటె వెఱ్ఱియున్నదా ? సోదరులారా ! అన్నివింతలకంటె వింత యిదియే. దీనినిగూర్చి యొకకవి యిట్లు పలుకుచున్నాఁడు.

గీ. ఐహికము లశాశ్వతములం చనుచు మనుజు,
లంద తెఱఁగిన యంశమే ; యంత నెపుడు,
మఱచుసంగతి యదియొండె, మఱవకుండ
నాచరించెడువాఁడె జ్ఞానాధికుండు.

భగవంతుఁడు మనకొసఁగిన జ్ఞానలేశమును జనపనార సంచుల మూఁతులు బిగించుటలో నుపయోగపఱుపక దైవప్రార్థనములకై మన నోళ్లను దెఱచుటలో నుపయోగింపవలయును. మనకున్న స్వల్పబుద్ధిని ప్రథమ ద్వితీయ తృతీయ గర్భాదానములలో వమ్ముసేయక వైదికోత్తమ కర్మవిధానమున నుపయోగింపవలయును. మనకున్న కాసంత చాకచక్య మును గాళులకుఁ జేతులకు బంధములు వైచుకొని సంధిసంధి కొక్క సంకెలఁ దగుల్చుకొని పట్టుపురుగువలె లోలో గుడుగుడుకుంచము లాడుచుఁ గాలము వృథవోనీయకుండ మనల బిగించిన దూముళ్లను గట్టిముళ్లను నేనుఁగుమెలఁతలను నిమ్మళముగ సడలఁజేసికొని స్వేచ్ఛగ నంటియంటని కుమ్మరిపురుగువలె సంచరించుటకై యుపయోగించవల యును. నాయనలారా ! మన యిచ్చటియునికి మూఁడునాళ్ల ముచ్చటదైన లేదు. ఈమాత్రపు సౌభాగ్యమున కీకార్పణ్యము లేల ! ఈయసూయ లేల ! ఈకడుపుమాడ్చుకొనుట లేల ! ఈదాఁచిపెట్టుట లేల ! ఈజంఝాట

భక్తిగాని జ్ఞానముగాని యొక్కజన్మమున నంకురించునదికాదు, సత్కర్మానుష్ఠానమున నవి క్రమముగఁ బ్రబలవలయును. కర్మప్రాబల్య మునుగూర్చి యొకకవి యిట్లు పలుకుచున్నాఁడు.

గీ. సౌఖ్య మొందఁగఁదలచిన జనుఁడు సతము
చిత్తశుద్ధిని సుకృతులే సేయవలయు,
పాపకర్మములను జేయువాని కెప్పు
డాత్మసౌఖ్యము చేకూర దయ్య నిజము.

గీ. ఎంతో నమ్మించి నీలో వసించునట్టు
లున్న ప్రాణమె నినుఁ బాసి యుఱుకునపుడు
నీది యని చెప్పఁదగు వస్తు వేది యిచట
నపుడు నీవెంటవచ్చెడు నర్థి యేది?

గీ. ఏదియునుగూడ రావన్ని యిచటె నిలుచు
సుతులు భ్రాతలు బంధువుల్ సుతలు సతులు
తోడఁబుట్టులు హితులు నీతోడ రారు
ధనము రాదయ్య మొలత్రాడయినను రాదు.

గీ. వాఙ్మనఃకాయముల దేనివలననైన
నీవు చేసినకర్మమే నీది సుమ్ము;
ఇదియె వదలక నిన్వెంబడించు నద్ది
నీది యనఁదగినది మఱియేది లేదు.

గీ. నీడలాగునఁ గర్మంబు నిన్నువిడువ
దెపుడు దుష్కృతు లుపసంహరింపఁబడవు
ధర్మకార్యంబు లెపుడు వ్యర్థములుకావు
భావి ఫలదానకలనావిభవము లగును.

గీ. అందుచేతనె పుణ్యకార్యంబు లెపుడు
జనులు సేయఁగవలయు; నీజననమందు
నాచరించు పుణ్యము ఫలమందు ముందు
కర్మ ముత్తరఫలమూలకంద మెపుడు.

సోదరులారా! అశాశ్వతమగు నీజీవనమునందు విశ్వాసముంచక "నారాయణ" యని యిప్పుడే యనిన నపశకునమని యాలోచింపక,

చేయఁదలఁచిన సత్కృతులను ముందెప్పటికో యట్టిపెట్టికొనుచుండక పది సంవత్సరములు గాఢముగ గ్రామ్యసుఖ మనుభవించిన పిదప ప్రాపంచిక వైముఖ్యమును వైరాగ్యమును బొందవచ్చునని పానపాత్రలు కేలఁబూని ప్రసవపర్యంకముల నెక్కక; యుత్తమక్షణమునైన సన్నుక—యిప్పుడే యీక్షణమందే—కాలుచున్న కొంపలోనుండి జనులు వెలపలఁబడి నట్లు—సంసారబంధములనుండి దూరదూరముగఁ బయటకు యత్నింప వలయును. మనకాంతలు మనలవేచువారే కాని ప్రోచువారుకారు. మనకొడుకులు మనతనువుల మన్ను జేయువారే కాని మన యజ్ఞానము సున్నఁజేయువారు కారు. నీకెవ్వరితోడను పనిలేదు. నీవొక్కఁడవే! నీ కొక్క శ్రీమన్నారాయణమూర్తితోడనే పనియున్నది. ఆతఁడే నిన్నుద్ధ రించువాఁడు. ఆతఁడే యాపద్రక్షకుఁడు. ఆతఁడే యుత్తమగతిప్రదాత. ఆతఁడే దర్శనీయుఁడు. ఆతఁడే ధ్యేతవ్యుఁడు. ఆతనినే స్మరించి పూజించి ధ్యానించి కన్నులఁ జూచి మహానందమున క్షేమమఁబడి యుండుము. ఆతఁడు సర్వప్రపంచమున నిమిడియున్నాఁడనియు, నాతనిలో సర్వ ప్రపంచ మున్నదనియు; నాతఁడు నీలో నున్నాఁడనియు నీ వాతనిలో నున్నావనియు, బరమభక్తిచే గ్రహించి, సంసారమందున్నను సాంసారిక లంపటతాశూన్యుఁడవై పాడుచుఁ బ్రాణముల విడుచు హంసవలె భగవన్నామమును బాడుచుఁ బరమోత్సాహమున భగవత్పాదారవింద లగ్నదృష్టితో బ్రాణములను విడువుము. లేదా యింకొక్క మెట్టెక్కఁ గలిగితివేని—యొక్కట కష్టపడితివేని—"సర్వం ఖల్విదం బ్రహ్మ" మను వాక్యమును చిలుకపలుకులవలెఁగాక సిద్ధానుభవముతో ననుసంధించి నేనే బ్రహ్మమను జ్ఞానమును బొంది తరించుము.

"ఓం శాంతి శ్శాంతిః."

అని పలికి యావేదాంతి కూర్చుండెను. సభముగిసెను. నేను సత్రములోనికి భోజనమునకై పోయితిని. ఆసత్రములో ననేకజనులు కూడఁ గుటుంబములతో నేవేవో యాత్రలు సేయుచు బసచేసిరి. వారు కూడ నీ యుపన్యాసమును నావలెనే దీక్షతో వినినవారే! సత్రములోఁ గ్రమ్ముదల తక్కువగాన నీజనులు వారిభార్యలు మాటలాడుకొనిన

మాటలు నాకు సులభముగ వినఁబడినవి. "ఇంత యాలస్యమైనదేమి ?" యని భార్యయడుగ "మూఁడునాళ్ళ ముచ్చటయైన యీపొరలింతల కాలస్యమేమి ? శీఘ్రమేమి ?" యని విసుగునలలో భర్త బదులు చెప్పెను. ఇంకొకవైపు కూర్చుండిన దంపతులలో భార్య "మాఅమ్మ కడుకులనన్ను తీసికొని వచ్చితిరి కారేమి?" యని భర్త నడుగఁ "దలలో జ్ఞానము లేనప్పుడు కడుపులో నడుకులేల?" యని విరుద్ధముగఁ బల్కెను. అతని అత్తగారామాటలువిని "ఔనమ్మా ! నీకుఁ గూఁతు నిచ్చుటే మొదటి అజ్ఞానము. తరువాత నీకొంపలోఁ బొట్టకూటికై చేరుటయే రెండవ యజ్ఞానము. నీచేత మాటలుపడుచు నిక్కడ నుండుటయే ముమ్మాటికి మూఁడవయజ్ఞానము" ఇట్లని మాటతీసికొని "రైలుస్టేషను" వద్దకుఁ బోయెను. ఆదంపతు లామెను శాంతింపఁజేయుటకై కూడఁ బోయిరి. ఆసత్రములో మఱియొకభాగమున నొకభార్య "ఇటు పిలుచుచుండఁగ నటుబోయెదరేల?" యని గద్దింప "మీరు మమ్ము వేఁచువారేకాని ప్రోచువారుకా" రని భర్త ధుమధుమ లాడుచు బదులు చెప్పెను. లోపల వంటసేయుచున్న యింకొకకాంత గుమ్మము నొద్ద మోఁకాళ్లపైఁ దలమోపి దిగులుపడి కూర్చుండిన భర్తను "ఏమండోయి" యని పిలిచి "వడియములు నేతిలో వేయింపనా ?" యనఁగ "వేఁగిన వడియము నానోటఁబడుసరికి నేను మృత్యువునోటఁ బడకుండఁగల ననువిశ్వాసమెట్లు?" అని భర్త ప్రత్యుత్తరము మూల్గుచు నిచ్చెను. ఈవడియముల వైరాగ్యము, ఈయడుకుల యాభిముఖ్యాభావము, "ఈ ప్రేఁమప్రోచుల" వెట్టిథోరణి, వేదాంతోపన్యాసోద్భవ తాత్కాలిక ప్రాపంచిక విముఖతా విలాసమాహాత్మ్య మహాంభోధి బుద్బుదములని నేననుకొంటిని. వీరి శీచలిజ్వరపు పాలి రెండుజాములు మాత్రమేయుండి యూఁపి విడుచుననియు వీరికి సహజోష్ణతాసన్నివేశము సంభవించు వెంటనే యిట్టిపాలి తిరుగరాకుండ వీరిభార్యలే తియ్యని నేలవేముకట్టు మాత్రలు వేయుదురనియు నే నెఱిఁగినవాఁడ నగుటచేఁ దటస్థుఁడనై యూరకుంటిని. ఇంతలో రైలుస్టేషనుకు బోయిన వితంతువు పుత్త్రికాజామాతలతో సత్రములోనికిఁ దిరుగ వచ్చి "వీనియిల్లు మాసిపోను ! వీని

వేదాంతము మండ! పండువంటి కాపురములు కడద్రోయుటకు బయలు
దేరినాఁడా? అత్తగాండ్ర నారడి పెట్టుట కవతరించినాఁడా? నాకుఁ గనఁ
బడినాఁడు కాఁడు లేనియెడల రోఁకలిపుచ్చుకొని తల చిదుకఁబోదుతు"
నని వేదాంతి నష్టమైన తిట్టు తిట్ట మొదలుపెట్టెను. ఇల్లాండ్రంద
ఱువితంతూపన్యాసకర్త్రిగారి వేదాంతపు విఱుగుడుమాటలు వినుటకై
చుట్టుచేరిరి. అందఱు తలకొక యక్షత యావేదాంతి తల్పముపై వైచి దీవిం
చిరి. నాదృష్టి యామునిపుంగవుపైననే యుండుటచే నాతని స్వప్నమునఁ
గాంచితిని. ఆమహానుభావుఁడు నాయెదుటఁ గాషాయాంబరధారియై
జటామౌళియై నిలువఁబడెను. "వచ్చితివా? సంసారఘాతుకా! నపుంస
కాధమా!" యని యావితంతువు ముసలాయుధయై యొక్కపోటతని
మూతిపైఁ బొడిచెను. ద్వంద్వరహితుఁడగు తాపసాగ్రగణ్యుఁడు ముసి
ముసినగవులతో నాయనాథను గౌఁగిలించుకొనెను. తళుకుమనునంతలోఁ
దెల్లనిముసుఁ గెగిరిపోవ నామెను నల్లనిముంతకొప్పులవడెను. రాగిపట్టెలు
రత్నకంకణములుగ మారెను. అడ్డకట్టుపై కచ్చబిగింపాదేశమయ్యెను.
చేతిలోని రోఁకలి క్రిందఁబడి మంచ మయ్యెను. ఇల్లాండ్రందఱీయపూ
ర్వదంపతుల మంచముచుట్టు చేరి మిథునపువిడెములు తీసికొనువారును
మువ్వగోపాలుపదములు పాడువారును నన్యోన్యముగ గంధములఁ
బూయించువారునైరి. గడియక్రింద నడుకులకై మిడుకులాడిన యాబోడి
పన్నీటి మిఠాయి నాహరించు పూఁబోఁడి యయినది! కాలమహిమ!
చెప్పుదెబ్బఁదిన్న విప్రనారాయణునకు విటత్వము వదలి భక్తత్వము
వచ్చినట్లు రోఁకటిపోటుతిన్న వేదాంతికి లోకాతీతత్వము వదలి ప్రాకృ
తత్వము వచ్చినదికాఁబోలు! అని స్వప్నధోరణిని నేనేమో యనుకొను
చుండఁగా చెవులు గింగురుమను నొకధ్వనితో మేల్కొంటిని. అది యాఱు
గంటల ఫిరంగిధ్వని. తెల్లవాఱినది. కనిన దుస్స్వప్నమునకుఁ బరితపించి
కాలకృత్యముల నిర్వర్తించుకొని పెద్దరెడ్డిగారియింట బసచేసిన
వేదాంతిగారినిఁ జూడఁబోయితిని. రెడ్డిగారు వాకిటిలోనే దటపటా
యించుచుండి "వేదాంతినిఁ జూచితిరా" యని యాతఁడే నన్నడిగెను.

లేదని నే నంటిని. కొంతసేపటి కచ్చటికి జనులనేకులు బిలబిలమూఁగిరి. వర్తకునియింటిలో రత్నాభరణముల చేపెట్టె కనఁబడదు. కాపురము చేయుచున్న కోడలు కనఁబడదు. మహామాయగా నున్నది. అంతట నేమియుఁ దోఁచక యందఱు విచారించు చుండఁగ నద్దఱు రక్షకభటులు ప్రవేశించి "వేదాంతివేషమున నిచ్చటకు వచ్చినవాఁ డేఁడీ?" యని యడిగిరి. పారిపోయినాఁడని చెప్పఁగ వారు విచారించి యాతఁడు ప్రాత నేరగాఁడనియు నీనడుమనే యాతఁ డొకపిల్లను గొంతునులిమి మెడ లోని నాను తీసికొన్నాఁడనియు నాతనిఁ బట్టుకొనుటకై వచ్చితి మనియు నాతని యూరిచ్చుటకు మిగులదూరముగ నున్నదనియుఁ జెప్పిరి. నర హత్యచేసినవాఁ డింత సావకాశముగ నూరూర నుపన్యాసము లిచ్చు చుండుట సహజము కాకపోవుటచే వారు కొంత యసత్యమాడి యుందు రని నే ననుకొంటిని కాని నాయూహము తప్పయినందులకుఁ జింతిల్లు చున్నాను.

మిత్రులారా! వేదాంతపువింతచరిత్రమును వింటిరి కాదా? ఆహా! ప్రపంచవైఖరి యెట్టులున్నది! ఎక్కడఁ జూచిన మోసము. ఇంద్ర జాలము. టక్కు; మతవేదాంతములలో నివి మఱింత ప్రబలుచున్నవి. ఏవిషయములలోఁ గేవలము, సత్యము నాంతరపారిశుద్ధ్యము పరిపూర్ణ ముగ నావశ్యకములో వానియందే, కనుకట్టు, గారడి కడు నధికముగ నున్నవి. మెడలో రుద్రాక్షలు. మదిలో మదిరాక్షులు. వదనమున బ్రహ్మసూత్రపారాయణము. మదిలో మకరికాపత్రలేఖనము. పగలు పరి శుద్ధభస్మరేఖాలంకారము. రాత్రి ప్రమదాలాక్షారసా లంకారము. ఒక చెవినిఁ బావనోంకారనాదము. ఒకచెవిని గాంచీఘంటికా క్రేంకార నాదము. ఎడమచేతఁ బ్రత్యక్షపార్థివలింగస్థాపనమును,కుడిచేతఁ బ్రచ్ఛన్న వితంతుశిరఃపరామర్శనము. నాలుకపై నమృతము లొలుకు భూతదయా బోధకమగు వాగ్వైఖరి. చేతిలో వెచ్చనిరక్తపు చుక్కలు గ్రక్కు భూతమారణ మగుతరవారి. చేత నాముతాడికల్లుముంత, నోట (Temperance movement.)

ప్రజలలోఁ దఱచుగ బహిరంగస్వరూపముల కింత పరస్పరా సందర్భత కానిపించుచున్నది. చిత్తమునందలిది జిహ్వాపై లేదు. జిహ్వాపై

నున్నది చేతలేదు. శృతిదారివేఱు, పాటదారివేఱు, లయదారివేఱైన గానశ్రాద్ధమువలె నున్నది. మిత్రులారా! ఈదినమున శ్రాద్ధభోక్తగఁ బోయితిని! ఆవడలలో వైచినది గోత్రపెరుఁగగుటచేఁ గాఁబోలు గొంతు పోయినది. ఇఁకఁ జెప్పలేను.

వాణీ—పైతృకక్రియలలో గోత్రపెరుఁ గుపయోగింపరాదను సంగతి మీ రెఱుఁగరు కాఁబోలు?

జంఘూ—కొన్ని యుపయోగింపఁ గూడదను నియమము మన కున్నది. కాని యమ్మి మోసముచేయఁగూడదను నియమము గొల్ల వాండ్రకు లేదని మీరెఱుఁగరు కాఁబోలు. (అని లేచిపోవును.)

వాణీ—గోత్రబత్త పెరుఁగుల భేదము తెలియని మూఢుఁడు లేఁడనుచు నేమేమో సణగుకొనుచు వాణీదాసుఁడు పోయెను.

సభ ముగిసెను.

# సాక్షి

## 10. దివ్యజ్ఞానమతము.

జంఘాలశాస్త్రి యిట్లుపన్యసించెను.

ఉత్తరదేశమందలి ప్రధాన యాత్రాస్థలములలో హరిద్వార మొక్కటి. ఆపట్టణమున నేనాఱుమాసము లుంటిని. అక్కడి కొక్క నాఁడొకబైరాగి నడువీథిలోఁ గొందఱుజనులకు హిందీభాషలో నుపన్యసించెను. ఆయుపన్యాస మాంధ్రమునఁ గొంచెము హెచ్చుతగ్గుగ నిటు లుండును.

“సర్వేంద్రియాణాం నయనం ప్రధానం” అనునది సత్యము. సర్వబాహ్య ప్రపంచవస్తురూప వర్ణభేదజ్ఞానప్రదాత యీనేత్రమే! ఇది జ్ఞానేంద్రియములలో నగ్రగణ్యమైనది. ఐహికకార్యనిర్వహణ పటిష్ఠతయం దిదియెంత ప్రాధాన్యముకలదియో యాముష్మికకార్యకలనాఘటనాపటుత్వమున నిది యంతప్రాధాన్యముకలదియని నమ్మవలయును. కంటికున్నశక్తి యింతింతనరాదు. మనుజులనేత్రములకేకాక మనుజేతర జంతువుల నేత్రములకుఁ గూడ గొప్పశక్తికలదు. డేగకన్ను సర్వపక్షిసంఘాతలోకములో నక్షీణతీక్ష్ణతాదుర్నిరీక్ష్యమై యున్నది. దీని కంటితేజ మావరించినతోడనే మిగిలినపక్షులు తెపతెపలు చల్లార నరములపట్లు జాఱి సంధులబంధములు సాగిపోవఁ జైతన్యములు మందగింప నట్టె క్రుంగిపోవును. తేఱనోటిమెకపుఁగంటిపచ్చమంట భగ్గుమనఁగనే కొండయంత కుంజరము కీచుమనుచుఁ దుండమును నాల్గుచుట్టలుచుట్టి యంగిటఁ గ్రుక్కుకొని కాళులు లటలటలాడఁ గాయమంతయుఁ గంపమొంద ముడుచుకొని ముడుచుకొని వెనుకకాళ్లమీఁదఁ గూలఁబడి

సమీపప్రభుఁ డొకఁడు కొంత సైన్యముతో నీతనియూరు ముట్టడించెను. ఈతనికిఁ దుపాకులు లేవు. కత్తులు లేవు. కటారులు లేవు. సైన్యము లేదు. ఆర్జించినయాస్తి యొక్కయగ్నికీలశాస్త్రిలు. ఆతనినే యుద్ధమునకుఁ బంపెను. ఆతఁ డొకసారి సైన్యమంతయుఁ గలయం జూచి రేపు యుద్ధ మారంభింతమని యా సైన్యముతోఁ జెప్పి కోటలోనికిఁ బోయెను. "ఈజంగమయుల రాయఁ డంగవస్త్రము చేఁబూని యుద్ధము చేయుట యేమి" యని శత్రుసైన్యమున నందఱు పకపకనవ్విరి. ఆరాత్రి సైన్యముల గుడారములలోఁ బెద్దజ్వాల—సైన్యములోఁ గొందఱకుఁ బార్శ్వశూల—కొందఱకుఁ బక్షవాతము—కొందఱకు శిలామేహము—కొందఱకు జలోదరము—కొందఱకు విషూచి—కొందఱకు నక్కమోరులు—కొందఱకుఁ బొలచేరులు గలిగి సర్వసైన్యము బీభత్సమై యథాయథలై పీనుఁగు పెంటలై పోయెను.

ఇట్టి యద్భుతనేత్రసామర్థ్యము కలుగుజనుల క్వాచిత్కముగ నుందురు. కొందఱకన్నులు చీఁకటిలోఁ జూడఁగలవు. కొందఱకన్నులు దూరదర్శినీయంత్రసాహాయ్యశూన్యముగ కుజగోళములో నేమున్నదో చెప్పఁగలవు. ఇట్టివిపరీతప్రకృతులు వీనియాలోచనముతో మన కిప్పుడు నిమిత్తము లేదు. జనసామాన్యమునకున్న నేత్రసాధనముఁ గూర్చియే మాటలాడుదును.

ఒకఁడు భోజనము చేయుచుండఁగ మఱియొకఁడుపోయి యాతని కెదురుగఁ గూర్చుండి యాతని పళ్లెమువంకఁ జూచుచుండు నెడల నోటికి స్వేచ్ఛగ నాతఁ డెత్తుకొనుచున్న కబళమును సందేహముతో నోటఁబెట్టుకొని యది ధారాళముగ మ్రింగుడుపడకపోవుటచే నాతఁడు కొంచెము కెక్కు కెక్కుమనును. ఒకఁడు స్వేచ్ఛగ వ్రాసికొనుచుండ మఱియొక్కఁ డాతనియొద్దకుఁబోయి యెదురుగఁ గూర్చుండి యాతని కాగితమువంక దూరమునుండియైనఁ జూచుచుండు నెడల దుడుకు లెక్కువ కాఁగ నడినడిపంక్తులు ప్రబలగఁ గలము పఱపఱలు గాసంత యడఁగిపోవును. ఒకఁ డుత్సాహమున నేమో కూనురాగములు దీయుచుఁ గూర్చుండ నొక్కఁడు వచ్చి యాతని కెదురుగఁ గూర్చుండి చూచుచుండు నెడల నాతని గొంతురవము కీఁచు క్రిందదిగి యందులో వెలితిలోఁ జేరిన కొంతకంప మారంభముగాఁగ చప్పఁబడి చల్లారును. ఒకఁడు

తదేకదృష్టిగలవాఁడై చదువుచుండఁగ వాఁడొకఁడువచ్చి యెదు
రుగఁ గూరుచుండి యాతనిపుస్తకముఁ జూచుచుండునెడల నాతని
కాగ్రంథములోనివాక్యము లర్థవిచారమునకు లొంగకపోవుటచే వెను
కకు ముందున కాతఁడు తిరుగుచు పేజీలను తిఱుగవిప్పిన ముందువచ్చు
నది తోఁచక, గ్రంథమునందున్నది విడిపోయిన యొక్కొక్కసారి రెండు
పుటలుకూడఁ ద్రిప్పినట్లు తెలియును. ఆయనకు పుస్తకపఠనమునకు "స్వస్తి
ప్రజాభ్యః" చెప్పవలసినదగుచుండును. మన స్త్రీలలో సరసములుకూర్చి
పనిచేయు నాతనిదృష్టి కన్నులఁ బడకయు యూరకే దోషములు
గలుపుచుండఁగఁ జూచుచుండునెడల "దా" ను "పా" గాఁ గృహ
ప్రవేశము చేయును. త్రాసువిని వట్టిసుతో ముడిఁబెట్టును. జన
సామాన్యసుఖప్రసిద్ధములగు సీసావాహనములవలన నొకని కన్ను—
తేఱఁబాఱఁజూచుచు నొకనికన్ను—నటియొకనికిఁ జేతికి బంధమగును.
ఒకనికిఁ గాలిసంకెల యగును. నటియొకనికి నోటికిఁ దాళమగును.
ఒకనినేత్రమునకు బట్టతెరయగును. ఒకనిస్వేచ్ఛను భంగపఱచుటలో
నొకనిమనస్సును గలఁతపఱచుటలో, నొకబుద్ధిని వడిప్రేసి వశ్యముచేసి
కొనుటలోఁ గన్నున కన్నులశక్తిగలదు. చిత్తరువుల వ్రాయువాఁడు
తాను వ్రాయుచున్న బొమ్మకుఁ గన్నులు దిద్దునప్పుడుగాని కన్ను వ్రాయఁడు.
అట్టికన్నే ముందు వ్రాసినయెడల నాతనిచెయి ముందుకువచ్చు ముందున కింక
నడువనే నడువదు. ఆతనిబుద్ధి తానుస్పష్టించిన కంటిచే నాకర్షింపఁబడి
విగ్రహనిర్మాణమున విశేష చాకచక్యమును గనఁబఱుపనేరదు. నిర్జీవ
మగునేత్రమునకే యింత జనచిత్తవశీకరణపాటవముండుచో నిఁకఁ జెప్ప
వలసిన దేమున్నది.

ఒక్కొక కాంతకన్ను మనస్సుఁబడఁ బన్నీరు చిలికినట్లు మనదేహ
మెల్ల చల్లఁబడును. ఒక్కొక్క కాంతకన్నునుండి వెడలిన కిరణములు
మనకళ్ళు కితకితలుపెట్టి మనల కెకెక నవ్వఁజేయును. ఒక్కొక కాంత
కంటిమెఱుపుతీఁగె మనకు గళపాశమై యామెవెంట మనల నీడ్చును.
ఒక్కొక కాంత కంటిమంట మన దుష్టద్వేషములనన్ని దహింపఁజేయును.
ఒక్కొక కాంత కంటిదివ్యతేజము మనల నామెకుసాష్టాంగపడి మ్రొక్కఁ
జేయును. "ఆకాంత మన యింటిలోఁ బ్రవేశించిన వేళవిశేషముచే మా
కదృష్టముపట్టిన" దని కొందఱనఁగ మీరు వినియున్నారు. అట్టి కలిమికిఁ

గారణము కాంతామాహాత్మ్యముకాదు. కాలమాహాత్మ్యముగాదు. కంటిమాహాత్మ్యము. "ఆచిన్నవాడు పుట్టిన వేళవిశేషమున మాకు నిత్యకళ్యాణము, పచ్చతోరణముగ నున్న" దని కొందఱందురు. "ఈ గుఱ్ఱమునుగొన్న వేళవిశేషమున మా కధికారము ప్రబలిన" దని కొందఱందురు. కులాంగనన్నైనసరియే, స్త్రీనైనసరియే, గుఱ్ఱమయిన సరియే చేసినదేమియులేదు. ఏమిచేయఁగలిగిన నేమిచేసిన నట్టి యద్భుతానిర్వచనీయాధికశక్తిసంపన్నమైన కన్నే !

సమరసన్నాహ సంయుక్తమై సకలసేనాసమూహమునకు రణరంగోత్సాహ మిచ్చునది సేనాధిపతికన్ను. వారికత్తులకు దేగువ, వారికన్నులకు గుఱి, వారిహస్తములకు బిగువు, వారిమనసులకు దూకుడు, వారిగృహచింతలకు మఱపు, వారిప్రాణములకు వైరాగ్యబోధన మొక్కసారి యిచ్చునది సేనాధిపతికన్నే; బాలురకుఁ బాఠములం దాసక్తి, తగని యాటలందు విరక్తి, సత్యమం దభిలాష, యసత్యమం దీర్ష్య—సోమరితనమం దనిష్టము పాటుపడుటలో నిష్టము నొసఁగునది గురువుగారి బల్లమీఁదనుండు బెత్తముకాదు, బాలురమీఁదికన్ను; కన్నగాండ్రను నరహత్యనేరగాండ్రను దమతప్పుల నొప్పుకొనఁజేయునది తోడపాసెపు గారుకాదు, కుములుపోటుల రోకలిబండకాదు, కంఠకోద్దండగళబంధముకాదు, రక్షకభటాధికారికన్ను; భక్తకు మతాచారవిరుద్ధకార్య వైముఖ్యము నతిథిసత్కారాభిసంధి దేవతా పూజాగౌరవము, పరసతి పరాఙ్ముఖత్వము, ప్రాపచింతాశూన్యత్వ మిచ్చునది భాగవత పురాణపఠనము కాదు; భగవద్గీతాపారాయణము కాదు; బ్రహ్మసూత్రభాష్యాధ్యయనము కాదు; భార్యకన్ను ; ప్రజలకు సంతుష్టిని క్షేమమును రాజభక్తిని మనశ్శాంతిని దేహసౌఖ్యమునుఁ బాపభీతిని బరమార్థరక్తిని గూలంకషముగ నిచ్చునది రాజ్యవిస్తీర్ణతకాదు. ప్రబల చతురంగ సేనాసమూహసమర్థతకాదు. సర్వదోషశిక్షణసంశిక్షాకచక్య సంయుక్తశాసనశక్తి కాదు. బహురత్నభర్మాదిసంకీర్ణభండారపరిపూర్ణత కాదు. పరాహింవిభేదనాభావముగఁ జూచు పరిపాలకుల కన్ను. కత్తికి లేనివాడి, నోటికిలేని వాగ్ధాటి, కుసుమమునకులేని మార్దవము, మంచునకులేని శైత్యము, వేగవతికిలేని ప్రవాహశుగత్వము, హిమాలయమునకులేని యౌన్నత్యము, కంధికిలేని గాంభీర్యము కంటికున్నవి. ఉన్నవి

ముష్టాటికున్నవి. వేలుమాటలేల? సర్వప్రపంచశాసనప్రతిష్ఠమైనది కత్తికాదు. కలముకాదు. కన్ను—

కంటికున్నశక్తిగలుగుట చేతనే కాబోలునో కొంచెము మాహింతము. పుష్పమునుండి పరిమళమను నొకశక్తి వెడలి చుట్టుప్రక్కల విరియు చున్నది. దీపమునుండి తేజశ్శక్తి యంతటను వ్యాపించుచున్నది. చంద్రుని నుండి శైత్యశక్తి సకలదిక్కుల [illegible]. అట్టులె కంటినుండి పరిమళముకంటె తేజముకంటె శైత్యముకంటె వింతయైన యొకమర వగాహశక్తి యుత్క్రమించుచున్నది అది విద్యుచ్ఛక్తివంటిది. మానుషిక విద్యుచ్ఛక్తి యిదియే! సమస్తశక్తిమంతమగుశక్తి యిదియే! ఇట్టిశక్తియే ప్రాణమునకుఁ బ్రాణము. ఈవిద్యుచ్ఛక్తి నఖాగ్రముల నుండియుఁ గేశాగ్రములనుండియుఁ గూడ వెలువడును. అందుచేతనే గోళ్లుకొనలు గలుగునట్లు పెంచుకొనువారు [illegible] నందుదురు. తలవెండ్రుకలు విరియఁబోసికొనక ముడిపెట్టుకొనువారలును నందుదురు. కాని నఖకేశాగ్రములనుండి వెడలిన శక్తికంటెఁ గంటినుండి వెడలినశక్తి మొత్తమున హెచ్చు. కంటికంటె మృదులతరమయిన యంగము లేకుంట చేతను గన్నే మనస్సునకు బాహ్యప్రపంచమునకును ముఖ్యసంధానకర్త యగుటచేతను గంటినుండి వెడలెడు శక్తి యధికతరమయినది. ఈశక్తి మనుజునకు లోపల నిండియున్న సంత యారోగ్యము. అంత యాయుష్యము. ఇది స్పృశ పోసియుంచగినది కాదు. ఇది ప్రపంచమున ననేకవిధములుగ నుపయోగింపఁబడుచున్నది. తేలుకుట్టులో పాముకాటులో బెట్టిప్రేతులో దయ్యపుపాటులోఁ బనిచేయుశక్తి యిదియే! మంత్రపఠన మనునది మనోనిశ్చలత్వమునకే కాని బాధా నివారణ ప్రభావమంతయు నీశక్తిదే! పక్షవాతములను బాగుచేయుటలోఁ జచ్చువాతములను జయించుటలో దీనికున్న ప్రతిభ యవర్ణ్యము. వ్రణబాధచే నిద్రాశూన్యులయి గోండ్రించువారి కింతకంటె మత్తుమందులేదు. మనము మనస్సులో నిశ్చలముగ నేది సంకల్పించుకొని యామానసిక విద్యుచ్ఛక్తిని మననేత్రములగుండ బరపుదుమో యా సంకల్పము నీశక్తి సఫలము చేయుచున్నది. ఈముక్కాలిపీట మా[illegible]డెత్తు పైకి లేవవలయునని, లేవకతప్పదని లేచితీరవలయునని మనము నిశ్చలముగ నిజముగ నీరంధ్రముగ్గ మనస్సున సంకల్పించుకొని యా

పీటపై నిరంతరముగ నిబిడముగఁ గొంతసేపు చూచుసరికి బల్ల లేవ వలసినదే! అట్లు నే ననేకపర్యాయములు పరీక్షించితిని. ఈతని కారోగ్యము కలుగవలసినదని మనము నిర్నిద్రదీక్షతో సంకల్పించుకొని యాతనిపైఁ గంటివిసరులు రెండు, చేతియూపులు రెండు ప్రయోగించుసరి కారోగ్యదశ యారంభింపవలసినదే! మాగురువుగా రొకసారి "రైలయి" మనుచు వచ్చుచున్న రైలుబండిని నడిమిదారిలో దీశక్తిచే నాపిరి. నేను బ్రత్యక్షముగఁ జూచితిని. మీ కాశ్చర్యముగ నవిశ్వసనీయముగఁ గూడ నుండఁగలదు. మనస్సునకుఁగల యత్యద్భుతశక్తిని మీ రెఱుఁగకుండుటచే మీకట్లుతోఁచుట వింత కాదు. తపస్సు చేసికొనిన యొక బ్రాహ్మణునిపైఁ గొంగ రెట్టవైచినది. కోపమున నాతఁడు కన్నులఁ దెఱచి పైకిచూచుసరికిఁ గొంగచచ్చి గుబుక్కునఁ గ్రిందఁగూలెను. కోపపుఁ జూపునకుఁ గొంగ చావునకు నెంత సంబంధమున్నదో యోచించితిరా? ఇక్కడ కత్తిలేదు. కఱ్ఱలేదు. ఉండలబద్దలేదు. చేతిలో బెడ్డయైనలేదు. "హూష్" అని యాబ్రాహ్మణుఁ డఱచెనేమో? అదిరిపడి యది చచ్చినదేమోయనుకొనఁగ నాతఁడు మాటలాడనైనలేదు. కోపపుఁజూపుతప్ప ప్రయోగించిన దంతకంటె నేమియులేదు. దానితోడనే కొంగచచ్చినది. నహుషు శాశీవిషుఁ జేసిన దీశక్తియే! అహల్యను ఱాయిగఁ జేసిన దీశక్తియే! సగరపితామహులను బుగ్గిగఁ జేసిన దీశక్తియే—మహాత్ములు నిమీలితనేత్రులై మహాతపస్సమాధినుండియుండి కన్నులు తెఱచుసరికి నిదివఱకు బాహ్యప్రపంచోద్గమనవ్యాపారనిరోధన యుక్తమగు శక్తి యొక్కసారి యుబ్బెత్తుగ, ఝంఝామారుతవేగతుల్యముగ నిరాఘాటోద్రేకముతో వెలువడును. అప్పుడు మనస్సునఁ గోపమే వారికుండునెడల నెదుటిప్రపంచ మొక్కసారి భస్మము కావలసినదే!

అంతదూర మెందులకు? గర్భవతినిజూడఁ గ్రొత్తఁగఁబోవువాఁడు రిక్తహస్తుఁడై పోక రుచ్యమగు ఫలముగాని యేదైన నొకచిత్రవస్తువు గాని తీసికొనిపోవలయునని చెప్పుదురు. ఒకప్రాణి కింకొకప్రాణి యుదన మగుటచేతను, భగవంతునిచేతిలోనున్న సృష్టిశక్తి యామెగర్భమునఁ బ్రవేశించుటచేతను, నామెకంటినుండి ప్రబలమగుశక్తి ప్రవహించుచుండును. గర్భవతికేదైనఁ దినవలయునని మహావాంఛ సంతతము మనమున నుండునుగావున నాహారణోద్దేశముతో వెడలిన తచ్ఛక్తికి మనుజు

ఎదుటఁబడక యాశక్తి నొకఫలమునైఁ గాని భక్ష్యమునైఁ గాని ప్రస
రింపఁజేసి తన్నుఁ గాచుకొనవలయును. నూతన వితంతువర్ణనమునకై
పోవువాఁ డొకబట్టను ముం దామెనేత్రముల కడ్డవేయవలయునని
చెప్పుదురు. లోకమున నొకజనునకైన నాపత్తుగంగ "లోకమున నింద
ఉండఁగా నాకే యిది రావలయునా? వారికి రాదా? నాకేల రావల
యును?" అని యనుకొనుట మిక్కిలి సహజము. అయితే యీనూతన
వితంతువు "లోకమున నింక నిన్ని లక్కలుండఁగ వారి మగఁడు చావ
రాదా? వీరిమగఁడు చావరాదా?" యని మహాందోళనమున మహో
ద్రేకమున ననుకొనును. ఆస్థితిలో నామె కంటియెదుట మొదటఁ బడిన
కాంతచేతిలో దిగఁబడుపుబట్ట లేకుండనామె మగఁడును చచ్చినందులకు
మఱునాఁ డామె నూతిలో దిగవలసినదే!

రాజులలోఁగూడఁ గొందఱకు మహాశక్తిసంయుక్తమైన కన్నుం
డును. రాజదృష్టి మిగుల చెడుపనువాడునై కలదు. దాని కొక ప్రక్క
నుండవలసినదే కాని యెదుటఁగనుండరాదు. రాజులు వీధులలో స్వారులఁ
బోవునప్పుడు బ్రాహ్మణులస్వస్తివాచ్యములు ఘోషములతో భట్టులొన
ర్చిన తత్పూర్వరాజన్య స్తుతుల సమీచీనవర్ణనావిన్యాసాడంబర గుంఫిత
గద్యపద్యావళీ పఠనప్రబల ధ్వానములతో బయలుదేరవలయును.
వారట్లు వీధులలోఁ బోవునప్పు డొకని పయోధరోత్తుంగ చంద్ర
శాలా సదనమునుగాని పయోధరోత్తుంగ చంద్రముఖి వదనమునుగాని
చూచి దానిని దాను హరింపవలయునని వారి కెట్లు దుర్బుద్ధిపుట్టునో
యని "నీతండ్రి మహారాజు. ఆతఁడు చేసిన గ్రామహర్మ్య దానము
లిన్నియా? నీతాత శ్రీరామచంద్రమూర్తివలె నేకపత్నీవ్రతస్థుడు. పర
నారీసోదరుఁడు. నీవుకూడ సద్గుణసమాజమున వారిని బోలుటయే కాక
మించవలయు" ననుచు భట్టులు వారిచెవులయొద్ద నుత్కంఠ నినాదము
లతోఁ జదువుటయు "సత్యమాడవలయును. వ్యభిచరింపఁగూడదు.
త్రాగఁగూడ"దను వైదికశాసనముల నుదాత్తానుదాత్తాద్యుచిత స్వరపరి
పాకమున బ్రాహ్మణులు పఙ్క్తులుదీర్చి యేకశ్రుతితోఁ గలిపిన కంఠము
లతో నాలుగరఁగునట్లు పఠించుటయు సదాచారములుగ జరుగుచున్నవి.
ఈయాచారముల కాదికారణ మత్యున్నతవిద్యుచ్ఛక్తి.

విగ్రహారాధనయందుఁగూడ నీశక్తి యొకవిధముగ నుపయోగింపఁబడుచున్నది. దేవాలయస్థ విగ్రహమునకుఁ బ్రథమమునఁ బ్రాణప్రతిష్ఠచేయుదురు. ఇదిగొప్ప వైదికకర్మము. సత్యవాక్యధురీణులు, శమదమాది సంపన్నులు, మితభాషులు, వేదవేదాంగ వేత్తలు, నిశ్చల నిర్వికార మనస్కులు, ప్రబలస్వచ్ఛ విద్యుచ్ఛక్తి పరిపూర్ణులు నగు ననేక ద్విజు లొకమంచిదినమున నాదేవాలయమునకు, స్నానాదికృత్యములు నిర్వర్తించుకొని పరిశుద్ధులయి విచ్చేసి కర్ణపేశలములై యమృతమయములయిన యాగమవాక్యము లుచ్చస్వరముతోఁ జదువుచు బ్రాణప్రతిష్ఠాకర్మము నాచరింతురు. పూజావిగ్రహమునందు వారందఱొక్కమారు తమనేత్రములనుండి వెలువడినవిద్యుచ్ఛక్తిని బ్రవేశపెట్టుటయే ప్రాణప్రతిష్ఠానుష్ఠానము. అట్లాచరింపఁబడిన విగ్రహము సంపూర్ణశంపా మహాశక్తిసంపద్వంతమై భక్తహృదయయాకర్షణ నైపుణినిర్నిద్రమై, దివ్యతేజోలోకతాపత్రయ నిర్వాపణ దక్షతాక్షీణమై యుండును. ఆవిగ్రహమునుండి యత్యద్భుతకిరణములు వెలువడుచుండుటచేఁ దద్దర్శనమునకుఁ బోవువారు తచ్ఛక్తిసంతర్పణార్థముగ ఫలములో పానీయములో భక్ష్యములో తీసికొనివెళ్లవలయును. నందికి శంకరునికి నడుమనుబోయినయెడలఁ బాపమని చెప్పుదురు. శంకరస్వరూపమునుండి వెలువడు మహోదార సౌదామినీ శక్తిప్రవాహము నందీశ్వరాభిముఖమై ప్రవహించును. సంతతము నారికేళాభిషేచనమునఁ జల్లబఱచినను శాంతినొందని మహాతీక్ష్ణశక్తి యామూర్తినుండి యవిచ్ఛిన్నముగ నుద్గమించును. ఎట్టి సంసారలంపటునకైన నెట్టి దుర్మనస్కునకైన నెట్టియుగ్రస్వభావునికైన శంకరాలయములోనున్న క్షణమయినను వైరాగ్యరేఖ సుమనస్కత, చిత్తశాంతత యుదయింపక తప్పదు. శంకరదర్శనము చేయకమునుపే యిట్టి యనుభవము స్వల్పముగ లభింపఁగలదు. స్వచ్ఛమై చల్లనైన నీరుగల చెఱువులలో నవగాహనము చేయునాతనికి శరీరము పరిశుద్ధమై చల్లబడుట యాశ్చర్య మేమున్నది. దుర్గంధభూయిష్ఠమగు వస్తువు నగరుధూపాది ద్రవ్యసౌరభమునఁ గూర్చినయెడల దానికిఁ దాత్కాలికముగనైన సౌగంధ్యము లభించుట వింతయేమున్నది? అటులే ప్రాణప్రతిష్ఠాకాలమునఁ బరిశుద్ధులగు బ్రాహ్మణులు పలికిన భవతారక సాధనములగు ప్రాఁజదువుల పరమపావనశక్తిచే నిండిన వాయువుగల దేవాలయము

గలము. ఇవి యన్నియు మహాత్ముల రహస్యములు. ఇంతకంటె వానిని గూర్చి చెప్పఁదగదు. నేను మహాత్ములదర్శనముచేసి వారిని గొంత కాలము సేవించినవాఁడను. పర్యవసానమునఁ జెప్పవలసిన దేవనఁగా అంగసౌందర్యమునకేమి, యారోగ్యమునకేమి, యదృష్టమునకేమి, యధి కారమునకేమి, గ్రైశ్వర్యమునకేమి, యన్నిఁటికంటె నగ్రగణ్యమగు నాముష్మికమునకేమి అతీయే సర్వము.

అని యాతఁడు చాలించి సత్రమునకుఁబోవ నేనుఁగూడ నాతని వెంటఁబోయి యాతని నాశ్రయించి "నేను మీతో వచ్చెదను నాకు మహాత్ములదర్శనము గలుగఁజేసెదరా ?" అని యాతనిని గోరితిని. కొంతదూరము పోయితిమి. తుద కాతఁడు నాకగపడలేదు. సాహాయ్య శూన్యతచే నిరుత్సాహమొందక యేమైనసరేయని ముందునకుఁ బోయి తిని. కొంతదూరముపోవఁగ నొకగుడిసెలో నొకయోగినితోఁ గలిసి సులకమంచము బిగించుచున్న యాబైరాగినిఁగాంచి "స్వామీ! వదలి పెట్టితిరేల" యిని యడుగ "నిన్ను నేనెఱుఁగను పో" యని గద్దరించుచు నినుపకారు నొకదానిని నాపై విసరెను. ఆదెబ్బతో నక్కడనేపడి సొమ్మ సిలితిని. నేను జచ్చితినని వారూహించియుండిరి. కొంత రాత్రికి స్మృతి రాగఁ గన్నులు దెఱచితిని. ఇద్దఱు మాటలాడుకొనుచుండిరి. వారిలో నొకఁడు బైరాగి. రెండవవాఁడెవఁడో నాకుఁ దెలియలేదు.

బైరాగి—మహాత్మా! నింతప చేసితిరి? ఈశరీరముతోడనే బృహ స్పతిగోళములోనికి వెళ్లితిరా ?

మహా—అష్టైశ్వర్యసిద్ధి సంపన్నుఁడనైన నాకు శరీరప్రతిబంధ మేమున్నది ? కాని గురుగోళములోనున్న చిత్రము లెచ్చటను లేవు సుమా !

బైరా—కటాక్షించి సెలవిచ్చెదరా ?

మహా—ఒక్కటే విశేషము. అక్కడ జనులందఱు నాస్తికులు. అక్కడి స్త్రీపురుషుల కొక్కటే శరీరము. వహావ్వా ఏమిచిత్రము? నిత్య సంభోగము. మరతలఁపులవలె వారందఱట్టెకలసి యట్టెవిడిపోవుదురు. ఈదిక్కుమాలిన ప్రపంచముకంటె సహస్రవిధముల సుఖ మచ్చట నున్నది. కాని యదేమి ? లోపల మూల్గువారెవ్వరు ?

బైరా—యోగినిగారికి నొప్పులువచ్చుచున్నవి. హరిద్వారమునకీనడుమఁ బురిటిసామగ్రికై కదా పోవలసివచ్చెను.

మహా—ఇదియే పెద్దచిక్కు. మన మాత్మతో సంభోగించినను కడుపు దేహమునకే వచ్చుచున్నది.

బైరా—ఈలుకలుకలుకంటె తమ రుపదేశించినపద్ధతియే మంచి తెలివిగలది. జంబాటములేనిది. సులభసాధ్యము. పరాపేక్షారహితము. ధనవ్యయశూన్యము. దేశకాలపాత్ర నియమరహితము.

మహా—కరతల సులభమేనా? ఐహికములగు నన్ని సౌలభ్యములటుంచు. ఇంద్రియనిగ్రహమున కదియే మొదటిబందుకట్టు. విరాగతా విద్యకు "ఓంనమశ్శివాయ" అపవర్గమహాపథమున కదియే యారంభపు మజిలీ. దానికంటెఁ దారకమార్గమున్నదా? కాని యాచరించుచున్నావా?

బైరా—మూఁడువందలవఱకుఁ బునశ్చరణ (అమ్మయ్యో! చచ్చితి) అను ధ్వని వినఁబడును.

మహా—అదేమి? అదేమి?

బైరా—తాము లోనికిఁదయచేసి మంత్రించినగాని వీలులేదు.

ఇద్దఱట్లు లోనికిఁబోయిరి. ఏపూర్వజన్మ మహాపాపముననో యిట్టి మాటలు వినవలసివచ్చినదని లోలోన నేడ్చుచు నక్కడనుండి వెనుకకు మఱలితిని. దారిలో శీతజ్వరముచే బాధపడి చావుతప్పి తుదకు స్వగ్రామముఁజేరితిని—నాయనలారా! సంసారులగు మనకుఁ గారణాంతరములచేఁ గొంతకాలము భార్యలవిడిచి యుండవలసివచ్చినప్పుడు నిద్రలోఁ బ్రమాదవశమున వీర్యపతనమగునెడల తద్దోషనివారణార్థమై యెన్నెన్ని హోమములోచేసి యెన్నెన్ని ప్రాయశ్చిత్తములోఁ బడసి యెన్నెన్ని శాంతులో యాచరింపవలయునని వేదములు ఘోషించుచుండఁగా— అదేమి? అదేమి? పామే? కఱ్ఱతెండు. ఊరకుందురేల? చంపుడు. చంపుడు—సర్పము చచ్చినది. సభ చల్లారినది—

# సాక్షి

## 11. దివ్యయోగములు.

నేను సభాభవనమునకు వెడలలేదు.

జంఘాలశాస్త్రి యిట్లుపన్యసించెనని వింటిని.

"నేనుజూడనిక్షేత్రములేదు. ఎక్కనిగుట్టలేదు. దాటనినదిలేదు. సేవింపని మహాపురుషుఁడులేఁడు. పరీక్షింపని వింతలేదు. కనిపెట్టని ప్రకృతిలేదు. అనుభవింపని సుఖములేదు. పడనికష్టములేదు. ఆడని యాటలేదు. పాడనిపాటలేదు. వేయనిగంతులేదు. లేదు. ముమ్మాటికి లేదు. ఓ! ఎన్నికలాపములు! ఎన్నివిలాపములు! ఎన్నినాటకములు! ఎన్నిబూటకములు! ఎన్నివన్నెలు! ఎన్నిచిన్నెలు! ఎన్నిమంత్రములు! ఎన్నితంత్రములు! ఈదినమున విభూతిరుద్రాక్షమాలాధారినై చిలుము గొట్టము తడిగుడ్డ చేఁబూని గోసాయీలనడుమ, రేపు కిరీటాంగద భూషాధారినై సింహాసనమునఁ గరవాలము చేఁబూని శైలూషుల నడుమ, నీవారము చీపురుకట్టఁ జేఁబూని "హ్రాం హ్రీం" మ్మనుచు నట్టు మాడఁగొట్టుచు ననాథలనడుమ—పైవారము చిత్తారు చేఁబూని "రాం రాం" మనుచు హరిస్మరణము చేయుచు భక్తులనడుమ నీపక్షము ఋషిపక్షులరెట్టతోఁ బుటములుపెట్టుచు రసవాదజ్ఞులనడుమ పైపక్షము మేరుపిడకల పుటికలతో నెగళ్లు రగులఁజేయుచు యోగాభ్యాసకుల నడుమ, నీనెల హైదరాబాదులో "నాలి! దూలా! హాస్సేనుహాస్సే" నను చు మ్లేచ్ఛులనడుమ, పైనెల బదరీనారాయణములో దేవీనవరాత్రములలో "నారాయణజే! భగవతిజే!" యనుచు సాధులనడుమ, పడుగు పేకగ—"సుల్తానీదాగ," చక్రపుఁబిలిటీలు గొట్టుచుండువాఁడను,

ఒకనాఁడు బదరీనారాయణమున నొకసిద్ధుని జూచితిని. అతని బ్రహ్మవర్చసము నాతనిశరీరసౌష్ఠవము వర్ణనాతీతములై యుండెను. ఆతఁడు మహానుభావుఁడని యాలోచించి యాశ్రయించితిని. ఆతఁ డొక్క చిన్న గుడిసెలో నుండెను. ఏవేవో యోషధు లప్పుడప్పుడు తెచ్చి నాకుఁ గనఁబడకుండ నొడ్డిలో వానినినుంచి రసముతీసి యేవేవో మందులు చేయుచుండెడివాఁడు. "నాకుఁగూడ నేమైన బోధింపరాదా" యని యెంత ప్రార్థించిన నాతఁ డియ్యకొనలేదు—ఏలాగునైన నీతని రహస్యము లేవో తెలిసికొనవలయునని నేను భీష్మించి యటనే పీటఁ బెట్టితిని.

ఒకదినమునఁ బదముపదించిన యొకసాధువు కళేబరనిక్షేపమునకై యందఱితోఁబాటు నే నాశ్రయించుసిద్ధుఁడుగూడఁ బోయెను. నన్నుఁ గూడ రమ్మని యాతఁడు కోరెను. కాని యాతనిరహస్యముల నెఱుఁగ నదనువేచియున్న నేను శిరోవ్యథగనున్నదని చెప్పి తప్పుకొంటిని. ఆతఁ డక్కడ భూమిని త్రవ్వి సాధువును బూడ్చుచుండఁగా నేనిక్కడ నాతని పెట్టె నెక్కలాగి లోనఁబూడ్చి పెట్టిన రహస్యములఁ బైకిఁ గొక్కరించుచుంటిని. ఏవియో కొన్ని గుటికలు, కొన్నిచూర్ణములు, కొన్ని లేహ్యములు, కొన్ని ద్రావకములు, కొన్ని గుళికలు కొన్ని లేపనములు కనఁబడినవి—ఈతఁడు మహాదేహదార్ఢ్యసంపన్నుఁడుకదా! ఈ మందులతో నీతని కేమి ప్రయోజనమో నాకు బోధపడలేదు. మందులపైఁ బేరులు లేవు. పేరులు తెలిసినవైనఁ బ్రయోగజ్ఞానశూన్యుఁడనైన నాకు వాని యుపయోగమేమి? ఏమందైన నోటిలో వేసికొనవలయునని బుద్ధిపుట్టినదికాని యవి విషములో రసములో పాషాణములో యని భయపడి యందులకు సాహసింప నైతిని. వానిని నిమ్మళముగఁ దీసి క్రిందఁబెట్టి యడుగునున్న మఱియొక యఱ నెత్తితిని. దానిలోఁ గొన్ని తెల్ల కాగితములు నొకసీసపుఁబుల్లయును నొక పుస్తకము నున్నవి. ఆత్రముతోఁ బుస్తకము నట్టెతెఱచితిని. సెబాసు! దొరకినదని చేటయంత మొగముఁగలవాఁడనై కొన్ని కాగితములపైఁ దద్గ్రంథస్థయోగములను వ్రాసికొంటిని. తిరుగ నన్నివస్తువులను భద్రముగ యథాస్థానములనుంచి పెట్టెవైచితిని. ఇఁక నచ్చటనుండ నిష్టతలేక దారిలో నష్టకష్టములఁ బడుచు హస్తినాపురము చేరితిని. అన్నప్రాశనమేకాని యక్షరాభ్యాసన

మెఱుఁగని యజ్ఞులను గొందఱను శిష్యులుగఁజేర్చుకొని యక్కడ నొక యపూర్వభాగవత మాడితిని. వారిలో నొకనిఁ జేరఁదీసి వానికి రహస్య ముగ నిట్లుబోధించితిని. "మనకుఁ బ్రయాణముల కింకఁ బడవ లక్కఱ లేదు. ధూమశకటము లక్కఱలేదు, "మోటారు" బం డ్లక్కఱలేదు. మింటిగుమ్మటము లక్కఱలేదు. సర్వసాధనసామగ్రీ శూన్యముగ నొక త్రుటికాలములో యూరోపుఖండమున నేప్రదేశమునైన నీక్షింపఁ దలఁచినయెడల నక్కడకుఁబోయి వ్రాలఁగలము" నావిద్యార్థి వింత వింతగఁ జూచుచు వెఱ్ఱిమొగము వైచుకొని "అట్టి మంత్రములున్న నాకుఁ జెప్పుఁడని నాకాళులఁ బట్టుకొనెను. మంత్రములు కావు—కేవల తంత్రములు. సత్యదృష్టి, మనోనిశ్చలత, భూతదయ, దేహదార్ఢ్యము, దైవవిశ్వాసములేని యీపాపకాలములో మంత్రములు పనికివచ్చునా! వానికాలమే పోయినది. వానిగౌరవము నశించినది—వానితో నింకఁ గార్యము లేదు. కాని తంత్రములు దేశకాలపాత్రాబాధితములు. తంత్రసామర్థ్యమునకు మనుజులయంగదార్ఢ్యముతోఁగాని యంతరంగ స్థైర్యముతోఁగాని సంబంధములేదు. ఏలయనఁగ నీతంత్రము లోషధీ సామర్థ్యోద్దీపకములు. ఓషధులలోనిశక్తి యుర్వియు నోషధీశుఁ డున్నంతకాల ముండకతప్పదు. నేను జెప్పఁబోవునవి పరమహంసయోగ ములు, బైరాగిచిటుకలు, గోసాయిగుళికలు—ఇదిగో "సర్వజగద్ర హస్యసార" మనుగ్రంథము. ఈగ్రంథమును నే నొక గొప్పసిద్ధునియొద్ద సంపాదించితిని. నీవు యోగ్యుఁడవుగఁ గానఁబడుచుంటివి. కావున నీ కొక్కరహస్యమును జెప్పఁదలచితిని కాని నేను నీకు దీనిని బోధించితి నని నీవెవ్వరితోడను జెప్పఁదగదు" అని నేనంటిని—అంతట నాతఁడు- సంధ్యావందన సంపర్కము స్వప్నముననైన నెఱుఁగని యాతడు గాయ త్రితోఁ బ్రమాణముచేసెను. అంత పుస్తకమునుదీసి నేనిట్లు చదివితిని.

"సీతనూలుదారంబులు చిదుకఁగొట్టి
గాడిదెగడపాకురసానఁ గలిపికాఁచి
తత్కషాయంబు చిట్టాముదమునఁగూర్చి
కాళ్లరాయంగ నాకాశగమన మిచ్చు"

(ఖేచరాధ్యాయము, జాబాలికృతము)

ఈయోగమే ప్రవరాఖ్యునిపై సిద్ధుఁ డుపయోగించినది. అగాధ మనుచరిత్రమునఁ గలదు. కాని యందున నిందున నొక్క భేద మున్నదని నేను బుద్ధిచేఁ గనిపెట్టితిని—ప్రవరాఖ్యుని పాదలేపము మంచుచేఁ గరఁగిపోయినది. ఇందునఁ బట్టాముని యుండుటచేఁ గడిగినపైన సులభముగాఁ బోవునది కాదు." అని చెప్పితిని. అయినను నాఁ డా లేపనమును సిద్ధపఱచి యాతనిని మొండిగోడపై నెవ్వరుచూడకుండ నిలువఁబెట్టి యాలేపనము నతనికాళులకు రాచికొని ప్రణవధ్యానమును జేసి నిశ్చలమనస్కుఁడతోఁ బోవలసినయూరు దలఁచుకొని గుసగుసని చెప్పితిని—"మక్కాకుఁ బోవలయును మహాప్రభూ!" యని యాతఁ డొక యెగురెగిరెను. నాకేమో కన్నులు చీఁకటులు పడినట్లయ్యెను. ఎగిరిన యాతఁడు కనఁబడలేదు. ఏమిరా యని యదిరిపడిచూడఁగ గోడప్రక్క నున్న గాదెక్రింద మూలుగు వినఁబడెను. కృతాన్యస్వస్థుఁడైన నాతనిని బైకిలేవఁదీసి "నిశ్చలాంతరంగము నీకుఁ గుదురలేదు. అదిగాక మన దేవతలు మక్కాను సహింతురా ? పరమహంసక్రియోపదేశము నీకుఁ బనికిరా" దని చెప్పి లేపమునకై తెచ్చిన యాముదము కొంత నాతని గాయములకు రాచి పంపితిని. ఆతఁ డెవ్వరితోడను జెప్పలేదు.

కొన్ని దినములు పోయినపిమ్మట నొకఘోటక బ్రహ్మచారిముండకొడుకును—మొఱ్ఱఁడువంటి వానిని నాశిష్యులనుండి యేఱిచి రహస్యముగ "నీకు స్త్రీవాంఛయున్నదా ?" యనియడుగ నాతఁడు దబ్బాటుజల్లువలె నొక్క యేడుపేడ్చి కన్నులు పులకించి "ఉన్నదే అది ! ఉన్నదే అది" అని ద్విరావృత్తిగఁ బలికించి "పెండ్లియయినయెడల పెండ్లియయినయెడల"—ననుచుఁ బండ్లుబిగించి యొడలు దులిపి పిడికిళ్లు బిగియఁబట్టి యొకకాలెత్తి నేలపై బింకముగనడచి కుడిముష్టితో నెడమముష్టిమీఁద గుబుక్కున నొకగ్రుద్దు గ్రుద్దుకొనెను. అతని తీవ్రతఁజూడఁగ నాతనికిఁ బరిణయమయినయెడలఁ బ్రళయమంత భయంకరచర్య యేదో యాతఁడు చేయఁదలఁచినట్లు నాకగపడెను. ఈగ్రంథమున స్త్రీవశ్యమునకుఁ గొన్ని యోగము లున్నవి. చదివెదను వినుమంటిని.

గీ. పగట నేకాదశినిఁ జంపఁబడినతొండ
నాల్క నుడుము నెత్తుట మర్దనం బొనర్చి
పొడుము చిటికెంతపసపుతోఁ బొందు పఱచి

కలికమునువేయ లొంగనికాంతలొంగు.

గీ. పేడపురుగుల నెండలోఁ బెట్టి చంపి
తెల్ల జిల్లేడు సత్తుతోఁ ద్రిముఖగ్గైన
బొమ్మజెముడు నూఁగునఁగూర్చి పొలఁతికోడల
చందనముతోడఁ బూయ స్త్రీజయము నిజము.

(వశీకరణ కిరణము.) (మదనమార్తాండము. చార్వాకకృతము.)

"మొదటిది కలికము రెండవది చర్చ—ఈరెంటిలో నీవు దేని నొనర్పఁగల" వని యాతని నడిగితిని. "కలికము కొంత సూక్ష్మమైనది. గంధచర్చ—స్థూలకార్యము—నాబుద్ధి కిది నచ్చినది. కార్యమున్నను, గోలుమన్నను, లక్ష్యపెట్టక కలియఁబడినట్లైనఁ బూసెదను" అని యాతఁడు మాఱుపలికెను. అప్పుడతనికే సిద్ధముగ నుంచిన గంధ మాతని కిచ్చితిని. అతఁడు నడుమున కంగవస్త్రము గట్టిగ బిగించుకొని యజ్ఞోప వీతము నడుమునఁ జుట్టఁబెట్టి శవదహనమునకుఁ బోవువాఁడువలె వీథి లోనికిఁ బోయెను. వేశ్యావీథికిఁ బోయెను. ఇంతలో నొకవేశ్య తెలు కులయింటికిఁ గాఁబోలు నూనెకై పోయి యాతఁ డింట లేకపోవుటచేఁ గాఁబోలు తిరుగఁ వట్టియిత్తడిచెంబును జేఁబూని యింటికి మెల్లఁగఁ బోవుచుండెను. ఆప్రశస్తమైన పుణ్యకాలము వృథపోనీయఁగూడ దని యెంచి యీవింత పెండ్లికొడుకు దానిని వెంబడించి వెనుకపాటున నెఱ కఁడు పందిపైఁ బడినట్లుపడి చర్మ మొలుచునంతటి సంరంభముతో నిశాత నఖముఖవిజృంభముతో నాగంధమును దాని రవికంచు నడుముకట్టు నడిమిప్రదేశమున గట్టిగ రాచెను అంత నాకులటాశిరోమణి భయమున ఘుర్ఘురించుచు వెనుకఁదిరిగి వీరవిటాగ్రేసరుఁడైన యాతనిఁజూచి కోప మునఁ జేతనున్న యిత్తడి జగన్నాథపుఁజెంబుతో నెత్తిపైఁగొట్టెను. ఆతనితల్లి కడుపుఁజలువచే తత్పాత్రప్రఘాతము తలనుండితప్పి యపస వ్యభుజముపై నశనిపాతమువలెఁ బడెను. ఆబాహువు గూటినుండి తప్పి పోయి "లటలట" వ్రేలాడఁజొచ్చెను. ఆచేతిని రెండవచేతితోఁ బట్టు కొని యుత్కంఠమున నోండ్ర పెట్టుచుఁ గుమ్మరియొద్దకుఁబోయి హస్తము నసువులనుగూడఁ దిరుగగూటఁ జేర్పించుకొనెనని మఱునాఁడు నాయొద్దకువచ్చి పూర్వదినాపూర్వచరిత్రను బూసగ్రుచ్చినట్లు చెప్పి "స్త్రీవశీకరణమునకేమిగాని తగుపాటి ధనవశీకరణమైన" దనిచెప్పి

కిసుక్కున నవ్వెను. "అదేమి? యని యడుగ నావేశ్యకుఁ బ్రక్క యెముకలపై గంధమును దాను బట్టించుచుండ "అవి కెలోనుండి జాతి యొకపాపులా కాదు—సూనెకొఱకు దాఁచినది కాఁబోలు—తనచేతిలోఁ బడెనని యాతఁడు చెప్పెను. "విలాసముగఁ జందనచర్చ యొనరుపవల యునుగాని పెట్టికుక్క పీకిన ట్లోల చేసితి" వని నే నడుగ "గాఁగర చూచుసరికి గాబరయగుచుండె బాబూ!" అని పశ్చాత్తాపతప్తుఁడయ్యెను.

మఱికొన్ని దినములు పోయినపిమ్మట నొకశిష్యుని రహస్యముగఁ బిలిచి నీకు రాజవశ మేమైన సిద్ధించుచున్నదా యని నే నడుగ నాతఁ డిట్లనియెను. "నే నిచ్చటనుండు ప్రభువుని పురోహితుని పుత్త్రుఁడను. నాతండ్రి మీఁద నాతనికిఁ గోపము గలిగెను. రాణిగారికి సీమంత మహోత్సవకాలమందుఁ బొరపాటుచొప్పున మాతండ్రి కేశఖండన మంత్రమును జదివెను. అంతటినుండి యాతనిని గోటలోనికి రానిచ్చుట లేదు. మనసొమ్మేమిపోయినది? మహాలయములో మంగళసూత్రధారణ మంత్రమే చదువవచ్చును. నాతండ్రిసని నాకిమ్మని రాజుగారి నాశ్రయించుచుంటిని. ఇచ్చెదరని కర్ణాకర్ణిగ వినుచుంటిసిగాని తగని యాలస్యమగుచున్నది." అంతట "రాజవశీకరణమునకు నేనేమైనఁ జేసిన నీకిష్టమేనా?" యని నే నాతనినడుగ "సింతకంటెఁ గావలసినదే"మని యాతఁడనెను. "అంతట సర్వజగద్రహస్యసారము" నుండి యీదిగున యోగమును జదివితిని.

గీ. బల్లితోఁక యుడుతచెవి పాముకుబుస
మూఁగ్గువేరు జంబుకదంత ముల్లిపొట్టు
రాసభపు జూలు వెంట్రుక రాగిమురుగు
నందునిచి పూన రాజవశ్యంబు నిజము.

(రాజపద్ధతి—సర్వసాధన నిక్షేపము. శునశ్శేఫకృతము.)

అదివఱకే సిద్ధపఱచియుంచిన కడియ మాతనిచేతఁ దొడిగి రాజ [illegible] బొమ్మని చెప్పితిని. "రాజున కెదురుగ నిలువఁబడి రాజదృష్టి నీపైఁ బడుసమయమున మురుగును గొంచెము కదపు" మని సిద్ధౌషధ ప్రయోగపద్ధతినిగూడ బోధించితిని. అతఁడు మహానందమునఁ గోటలోనికేఁగెను. మొదటిద్వారము దాఁటఁగనే రాజుగారిని జూచెను. అతఁడచ్చట నేనుఁగుల బరీక్షించుచుఁ బరివారముతో నిలువఁబడినాఁడు.

ఆతని కెట్టయెదుట నిలిచి తెప్పపాటైన లేకుండ నాతనివంకఁ జూచు చుండెను. రాజు తన్నుఁ జూచుటతోడనే మురుగును గదపుకొనవలయు నని తాను యత్నించెను. కాని చేయికదపిన నది కదలదయ్యెను. కట్టు కొయ్యవలె నెట్టయెదుట నిలువఁబడిన యాతని మఱియొకసారి రాజుగారు చూడఁగఁ గుడిచేతిని ముందునకు ముష్టిమూసి చాఁపి యెడమచేతితో మురుగును బైకిఁ ద్రోచెను. రాజుగారు రోసరోసలాడుచుఁ దిరుగ నాతనివంకఁ జూచిరి. అంత మురుగును మూఁడుమాఱులు పైకిఁద్రోచి బింకముగ నిలువఁబడెను. "ఏమీ! ఈపొగరుఁబోతు పురోహితుని కొడుకు మమ్ముఁ గొట్టుటకు వచ్చినాఁడా? తన్నుఁ" డని ప్రభువువా రనఁగ, నక్కడ నున్నవారందఱు పక్షపాతము లేకుండ శక్తివంచన గలుగకుండఁ గరము కఱ్ఱ కాలివిసరుల నాతనిఁ గటాక్షించిరి. ఆతఁ డీసంగతి మఱునాఁడు నాతోఁ జెప్పెను.

కొన్ని నాళ్లిట్లు పోనిచ్చి మఱియొకశిష్యుని రహస్యముగఁ జేరఁ బిలిచి యిటులంటిని. "నీవు ధైర్యస్థైర్యములు గలవాఁడ వగునెడల నొక గొప్పసిద్ధౌషధయోగనిదర్శనము నీసాహాయ్యమునఁ జూడవలసి యున్నది." "అద్దే! అట్లే" అని యాతఁ డడిగిన వెంటనే టక్కుమని ప్రత్యుత్తర మిచ్చెను. అంత సిద్ధౌషధరాజీయమునుండి యీక్రింది యోగమును జదివితిని.

సీ. ఆఁదూడరేణంబు గేదెమూత్రముతోడఁ
  గలయనూఱుచు రెండుతులము లెత్తు
ప్రమిదలలోఁ బెట్టి పల్లవపుటమిచ్చి
  తద్భస్మమును శ్వేతతామ్రచూడ
వస్త్రియందునఁ బెట్టి వసుధాపుటము రెండు
  రాత్రులఁ బెట్టి తర్వాత దిగిచి
నలిఁజేసి దానిని నల్లపిల్లికిఁ బెట్టి
  యాపిల్లి కార్జంబు నతిఁయుగము
గీ. నొంటెపాలనుమర్దించి యొక్కజాము
మంచిదిగుడాయినూనెలో మఱుఁగనిచ్చి
బుడియఁగట్టిన యానూనె నొడలికంత

పూసికొనఁగ సత్ప్రశస్యుఁడౌ పురుషుఁ డిలను.

(తురీయాధ్యాయము) (తిరస్కరిణీపారిజాతము ; గాలవకృతము)

"ఈతిరుగుళ్ళన్నియుఁ దిరిగి యీజీవహత్యలన్నియుఁ జేసి, యీపాటు లన్నియుఁబడి—తుదకు—యీప్రయోగమును జేసినాను. దీనిని నీవు దేహమునకుఁ బట్టించుకొనినయెడల నెవ్వరికిఁ గనఁబడవు. పూచికొనిన రెండుయామములను గూడ పనిచేయును." అని నే నాతనితో నంటిని. "నేను దీనిని పూచికొని రెండుయామములు మీయొద్దనే యుండెదను. అప్పటికి మీకు నేను గనఁబడకుండు నెడల సిద్ధమైనదేకదా" యని యాతఁడు పలికెను. "తిరస్కారమెఱిఁగిన నాకు నీమందు పనిఁ జేయదు. నీవందులకు మఱెవ్వరినైనఁ జూచుకొనవలయును" అని నేను బ్రత్యుత్తరమిచ్చితిని. అంతట నాతఁ డానూనె నింటికిఁగొనిపోయి రాత్రి నఖశిఖాపర్యంతము ప్రబలముగ మర్దనముచేసికొని యింక గూడ మీఁదఁ గలదని తనకుఁ దోఁచినవెంటనే లేచి "అమ్మా! అమ్మా!" యని తల్లిని గాఢనిద్రనుండి లేపి "నీ కేమైన నెదుటఁ గనఁబడుచున్నదా?" యని యామె నడుగ "పోరా! నాకేమియుఁ గనఁబడుటలేదురా!" యని యామె బరువెక్కి విడనికన్నులతో బొంగుచు బదులుచెప్పెను. "అద్దీ" యనుచు నానందించి నిశ్శంకముగ నతఁడు వీథివెంట వెడలిపోయెను. ఆసిద్ధౌషధ మాతనిచేతఁ బెట్టుసరి కాతని స్వభావమును నేను బొత్తిగ నెఱుఁగను. అతనికి దాని నేల యిచ్చితినిరా యని తరువాత మిక్కిలి పశ్చాత్తాపపడవలసివచ్చినది. ఎందుచేత ననఁగా నాతఁ డామఱునాఁటి యుదయమునఁ గారాబద్ధుఁడై యుండెనని వింటిని. ఒకవర్తకునియింటి కాతఁ డారాత్రి కన్నమువైచి కొంతధనమును గొంతస్వర్ణాభరణచయమును హరించుచుండఁగా వర్తకునితల్లి లేచెను. అదృశ్యరూపమున నుంటినని పూర్ణమైన నమ్మకముగల యాతఁ డామెయెదుట మొద్దువలె నిలువఁబడెను. కాని యేక్రీనీడనైన దాగియుండుట కావశ్యకత యాతనికి లేకపోయెను. అంతట నామె తన తలక్రిందనున్న పీట యాతనిపై విసరివైచెను. "కనఁబడనివానినైన నెంతగట్టిగఁ గొట్టినావే!" యని కాఁబోలు నాతఁడు తీవ్రకోపమున నామెగొంతుపై నొక్కత్రొక్కు త్రొక్కెను. అంతలో నిద్దఱుముగ్గురు జనులులేచి "పట్టుకో! పట్టుకో!" యని కేకలువైచిరి. "మీమొగము! కంటికిఁజిక్కనివాఁడు చేతికెక్కడ

జిక్కుసుర!" యని నిశ్చయముగ నచటనే నిలువఁబడెనఁట. అతని చేతిలోఁ దుపాకియుంటచే నంతధైర్యముగ నిలువఁబడినాఁడనియు నాతని గ్రహింప యత్నించినఁ జంపుననియు భయపడి కాఁబోలు వారు మఱింత కేకలు వైచిరి. వారు తన్నుఁ దరిఁ జేరకుంటఁ గాంచి తన యస్పృశ్యత్వమును మఱింత స్థిరపఱచుకొని హరించిన సైకము సంగస్త్రమున పూటగట్టుచుండెనఁట! గృహప్రభుఁ డీయల్లరి విని లేచివచ్చి యాతనిఁ బట్టుకొని రక్షకభటుల యధీనునిగఁ జేసెను. ఈహాస్యలన్నియు నాఁటిసాయంకాలమున కానోట నానోట నాకుఁ జేరెను. వస్తునితప్లి యూరాత్రి మనణించెను. ఆతని కండమూను వీపులలో శాశ్వతశేషు విధింపఁబడుటచేత సిద్ధౌషధమహిమచే నార్యావర్తదేశమునఁబుట్టున కస్పృశ్యరూపుఁడయి యుండెను.

ఎంతరహస్యప్రసక్తమైన నేనున్నను నెవ్వఁడో సృష్టిరహస్యవిద్యా పారగుఁడగు సిద్ధమూలికాభిషగ్వరుఁడు గ్రామమునకువచ్చి నాఁడని కింవదంతికలిగినట్లు నేను విని యచ్చటనుండి పాఱిపోయితిని. నాయనలారా! ఈగ్రంథమున నింక ననేక విచిత్రయోగములున్నవి; అవియన్నియుఁగూడ నిటులే కోఁతి పిల్లని బట్టుకొని పిల్లి కాలితో నిప్పులలోనున్న పనసగింజను దీయించినట్లు పరముఖముగాఁ బరీక్షించితిని. ఒట్టునకైన నొక్కటియు నిక్కముకాలేదు. గ్రంథకర్తల కీమతిమాలినతనమేమో! తక్కువశ్రమముతో మహాకార్యములు కావలయునని ప్రతిమనుజునకు సహజముగ నుండును. అందుచే "నేవస్తువులో నేమి యున్నదో యేయేవస్తుమేళనమున నెట్టినెట్టి వింతశక్తులు కలుగునో? ఏమో? అయినఁ గాఁగూడదా?" యను వెఱ్ఱి జనులను మిక్కిలి బాధించుచున్నది; ఇట్టి మహాజ్ఞానమునకు లోనైనవారము మనమే కాదు. ఇతరదేశీయులగు మనసోదరులుకూడ నున్నారు. రోముదేశస్థులు కూడ నిట్టి నమ్మకములుగలవారే! ఇదిగో దానికిఁ దార్కాణముగ "సర్వజగద్రహస్యసారము"నుండి కొంచెము చదివెదను.

'Bubo, a screech owl is a bird well enough known which is called "Magis of the Chaldss" and Hysophus of the Greeks. There be marvellous 'Virtues of this owl for, if the heart and right foot of it be put upon a man sleeping, he shall say anon to thee whatever thou shalt ask him. And this hath been proved of late time of our brethren. And if

any man put this under his arm hole, no dog will bark at him but keep silence; and if these things aforesaid joined together with a wing of it, be hanged up to a tree, birds will gather together to that tree."

"When thou wishest that thy wife or wench show to thee all that she hath done, take the heart of a dove and the head of a frog and dry them both and bruise them into powder and lay them upon the breast of her sleeping and she shall show thee all that she hath done but when she shall wake, wipe it away from her breast that it be not lifted up.

"Take an adder's skin aud auri pigmentum and Greek pitch of Reuponhicum and the wax of new bees and the fat or grease of an ass and break them all and put them all in a dull seething pot full of water and make it to see the it at a slow fire, and after let it wax cold, and make a taper and every man that shall see light of it shall seem headless" The secrets of nature set forth by Albertus Magnus in Latin, newly translated into English imprinted at London by me William Copland.

నాయనలారా! వింటిరా! ఈయజ్ఞానస్థితి యెంతయద్భుతముగ నున్నదో! ఈగ్రంథమునందున నపూర్వ యోగములను సహేతుక పూర్వపక్షముచే గౌరవింప సక్కఱలేదు. వానియెడల యథోచితమగు నిందను గనంబఱచుటయే తగును. దీనికి ప్రశస్తమగు పూర్వపక్ష మీగ్రంథమును బహుళముగ ప్రతి సేయుటయే. ఈగ్రంథము నాయొద్ద నిరువది సంవత్సరములనుండి పెట్టెయడుగునc బడియున్నది. జెఱ్ఱి యొక్కటి యీనాడిన మా పెట్టెలోనికిc బోవుటచే దానికొఱకా పెట్టెలోని వన్నియుc దీసి వెలుపలc బడవైవవలసివచ్చెను. ఈపుస్తక మపుడు నా కన్నులంబడెను. దీనిసంగతియే నేను మఱచిపోయితిని. "కాలాచార్యా! నీచేతికిచ్చిన ప్రాతతాటాకిటు తెమ్ము" అని యాతని నడుగ నాతని చేతికిc దానినిచ్చెను. "హోమము చేయుటకుc దెచ్చితివేమోయని యను కొంటిని. ఇందులకే" అని పలికెను. వాణీదాసుc డిచ్చిన యగ్గిపుల్లచే "సర్వజగద్రహస్యసారము" నంటించి తాటాకుపైc బెట్టెను. సద్గ్రంథము బుగ్గియయ్యెను. సభ ముగిసెను.

# సాక్షి

## 12. సారంగధరనాటకప్రదర్శనము.

---

జంఘాలశాస్త్రి యిట్లుపన్యసించెను.

నిన్నను నేను నాటకప్రదర్శనదిదృక్షాయత్తచిత్తుఁడనై నాటకశాలకు రాత్రి తొమ్మిదిగంటలకుఁ బోయితిని. గ్రామమునఁ బంచిపెట్టఁబడిన నాటకీయ కరపత్రములలో సరిగాఁ దొమ్మిదిగంటలకు నాటక మారంభమగునని వ్రాయఁబడియుండుటచేత నావేళకే పోయితిని. చమురు డబ్బామూఁత నూడఁదీయుటకై దానిమీఁద బిసుకనిప్పు పెట్టి చాకలివాఁడు కాఁబోలు "నుఫ్ ఉఫ్" మనుచున్నాఁడు. నాటకరాజ కూరుచుండు కాకి బంగారు సింహాసనమున కూడినకా లపీసుకుచుఁ గస్తురి కాఁబోలు టక్కుటక్కు మనుచున్నాఁడు. ఎరువు దెచ్చిన బల్లలకుఁ గుర్చీలకు నడుగునఁ బెల్లను, నాటకరంగాధ్యక్షుఁడు కాఁబోలు, మసిబొగ్గుతోఁ బఱపఱలాడించుచున్నాఁడు. అదివఱకు రాతిపై నూఱిన కత్తినిఁ దోలుముక్కపై మంగలి కాఁబోలుఁ గంటికి జోడు పెట్టుకొని తటతటలాడించుచున్నాఁడు. "ఏకమేవాద్వితీయంఖల్విదంబ్రహ్మ" మను వేదాంతన్యాయము ననుసరించి దురవగాహమై యజ్ఞాతతేజస్కమైన యొకదీపము కాఁబోలు పాకనడుమను ధుమధుమలాడుచున్నది. రంగస్థలమునఁ దెరదింపఁబడియేయున్నది. దానిలోపలినుండి "సఫేదుపొట్లమేదిరా! నీగొంతుకఁగోయ" యనియుఁ "చాకలిముండకొడు కింక బట్టలు తీసికొనిరాలేదా" యనియు "గడ్డమునకీమాత్రపు మాపున్ననేమి "పౌడర్" మీఁద బలిచిపాఱిపోకుండ నుండునటరా!" యనియు దిక్కుమాలినగడ్డాలు! తగులఁబెట్టిననైన మెతకవాసన పూర్వజన్మ వాసనవలె వదలదురా" యనియు "కంతిసాని

గళ్లచీర, కమ్మలజత ఎరవుదీసికొని వచ్చినవాఁ డెవఁడురా" యనియుఁ "బూసలకోటు నన్ను వేసికోనీయనియెడల నే నీరాత్రి వేషము వేసిన యెడలఁ బిల్లికి మగఁడ" ననియు "కోటులో నేమున్నదిరా? గాడిదె గుడ్డు! నోటిలో నుండవలెఁగాఁబోలును" యనియును బలువిధములగు రసములతోఁ బలువిధములగు పదములు, కీచు, బొంగు, వెలితి, నత్తి, లొడుగు మొదలగు నాట్యశాస్త్రజాతి లక్షణములతో నాటకశాల దాఁటి నాలుగువీథులు దాఁటిపోవునట్టి ధ్వానంకారములతో బయలువెడలినవి. "అందర్ ఖామూష్" అని నాటకసంఘాధ్యక్షుఁడు నాగుండె లదరున ట్లొక్కచాపుకేక వైచినాఁడు. ఇంతలో నంగవస్త్రధారియైన యొక్కఁడు తెల్లముగ బూడిదపట్టించిన మొగముతోఁ దలకట్టుత్రాళ్లు మెడప్రక్కల వ్రేలాడుచుండఁ గృత్రిమ స్తనసౌభాగ్యమును గుసుంబా రవికలో నడచి బిగించి, పైటలేకుండ నోటిలో లాడితెడుచుట్టను సింగారించి త్రిలోకానందకర దివ్యమంగళ విగ్రహముతోఁ దెరప్రక్కనుండి వెలుపలకు వచ్చేసి "ప్రాంప్టింగునకు రెండవపుస్తకముఁ దీసికొని రావైతివి. చావుమంటివాఁడవు? నీస్టేజి మేనేజరి యేడ్చినట్లే యున్నది." అని తీండ్రించి పలికి యంతలో నన్నుఁజూచి యఱ్ఱిగ్గుపడి చేతులు రవికకడ్డు పెట్టుకొని నోటిచుట్టతోడనే తెఱలలోనికిఁ బోయెను. "అప్పుడే టిక్కెట్లు యమ్మక మారంభించిన "రాస్కెల్" నిటు చెవిఁబట్టుకొని లాగుకొనిరమ్ము పండ్లురాలఁగొట్టెదను." అని యధికారి కారవమున నాటకాధ్యక్షుఁడు కాఁబోలు లోనుండి యఱచెను. ఇంతలో నొక తెరప్రక్కనుండి యరగడ్డ మొకటి కొంతసందేహించుచు వెనుకకు ముందునకుఁ బటపటాయించుచున్నది. ఇంకొకప్రక్కనుండి యొక బొత్తిముక్కలో మూఁడుపావుల వంతు మట్టునకు మఱియొక తెరప్రక్కనుండి లటుకునఁ బోటకరించి యద్దబొసనున్న కల్లకెంపుతో జిగజిగ మెఱయుచుండెను. తళుకుమనునంతలోఁ దుసుక్కుమని తుమ్మొకటి యాద్వారద్వయగహ్వరమునుండి బాగుగదట్టింపని "తూటా" సంబంధమగు బుసబుసోద్రేకగుంఫనారబ్ధ హాశాజ్జటిల ధ్వానముతో బయలువెడలఁగఁ గెంపుటద్దబొస నిరాఘాట పవనఘాటిచేఁ గాఁబోలుఁ గ్రింపఁబడిపోయె ననుకొంటిని కాని నాదిపొరపాటు. అది ముక్కు పట్టులేక జారినసింగారము కాదు. నోటిపట్టు లేక జారినసిగరెట్టు. నటకులను బాహాటముగఁ జూడఁదలఁచి నేనురాగ

నా ప్రారబ్ధవశమున నటకులు నన్నిట్లు దొంగచాటునఁ జూచుచుండిరి. దీపాలు పెట్టకుండనే పాకలోనికి దూఁపురించిన నాటకపుమొగమెఱుఁగని యీ యనాగరకవ్యక్తి, యీపల్లెటూరి వేషము, యీ యాంగ్లేయ భాషాజ్ఞానశూన్యత యెక్కడనుండి వచ్చెనోయని నన్నుఁజూచి కాఁబోలు వెంటనే "హీ హీ హీ" యని సకిలింపు మొదలు పెట్టిరి.

ఆదినమున గ్రామమునఁ బశువులసంతయగుటచే సాధారణపరి పోషణాపటిష్టమగు నితరగ్రామస్థలోకము కొంత నాటకదిదృక్షచే వచ్చినది. పాఠశాలలలోఁ జదువుకొను బాలురుగూడఁ గొందఱువచ్చి యటునిటు నా సమీపముననే కూర్చుచుండిరి. వారిలో వారేమి మాటలాడుకొనుచుండిరో నాకు బాగుగ వినఁబడలేదు. కాని నడుమనడుమ మాత్రము కొన్ని కొన్ని మాటలు, "పట్టుపలుపులు" "పంపనపనాసడిప్పలు" "పగలు రాత్రి యెఱుఁగని ప్రాంతచరువులబాపనయ్య "Arrogant Fellow" యనుచు నింకేమేమో వినఁబడెను. ఇంతలో "డొక్కచీల్చి తాలుగోట్టినను" అని పెద్దయిగిలింపుతో నొకకేక వినవచ్చినది. స్త్రీలకుఁ బ్రత్యేకముగ నుంచినస్థలమునకున్న ద్వారమునొద్ద "నేను గూరుచుండెదను. నేను గూరుచుండెద" నని యిద్దఱునటకులు లఘువులయినమాటలచే నూతనసమరసమవాకారమునకు నాందీ పూజచేసి గురువులగు వృద్ధులచే భరతవాక్యముచెప్పిరి. వారిద్దఱును గాకుండ మఱియొకని నక్కడ గూరుచుండుటకు సధ్యక్షుఁడు నియమించెను. కాని గడియ గడియ కొక నటకుఁడు—ఖండకరకాశ్యపసదృశకేశ్యసమువాఁడో—హేమకుంచలరోచమాన కాచనేత్రములవాఁడో వృశ్చికపుచ్ఛచ్ఛవివిచ్ఛేదిశ్మశ్రులతారశ్మలవాఁడో — కమఠపృష్ఠపరిపాటీ సమశిరోవాటివాఁడో—స్త్రీలున్న యాస్థలమునకు వచ్చి "మీ కన్నియు సరిగా నున్నవికదా!" యనియు "దగయగునెడల సోడా" సిద్ధముగనే యున్నదనియు "మీరటునిటుపోఁదలఁచినయెడలఁ బ్రత్యేకముగ మీసదుపాయము కొఱకుంచిన యాస్థలమునకుఁ బోవచ్చు" ననియు "మీకుఁ గ్రిందిభాగముననున్న గోతిని దాఁటి దూలముచేఁ గప్పి పైన గడ్డి బాగుగ వేయించి చాపలుపఱిపించినను మీకేమైన గ్రుచ్చుకొనునేమోయని భయపడుచున్నా" ననియు నిటుయేదోయొక్కొక్కఁ డొక్కొక్క క్షేమసమాచారవార్త నాకాంతలకు విన్నవించుచుండెను, కాని యెక్కడ

పందొమ్మిది ఆఁ తొమ్మిదిగంటలకు నాటకము మొదలుపెట్టుదుమని డప్పు
ముఖమున వెల్లడించితిమి. కాని యనంతమగు కారణములచే—ఆ? ఆఁ!
కారణాంతరములచే నట్లుజరుపలేకపోయితిమి. కాన మీరు క్షంతవ్యులు
కాదు. మేమే కాంబోలు" నని పలికి పోయెను. "ఇప్పుడయినఁ ద్వరగ
నారంభింపనియెడల మీరు హంతవ్యు" లని గొప్పవాఁడో సభనుండి కేక
వైవఁగ "చప్రహో"యని తెరచాటునుండి మఱుకేకవచ్చెను. వేఁపాకు
వేసి మీదినముకాదు కాఁబోలునని నాయుఁడు బెంగపెట్టుకొనెను.
అంతట గ్రామసంచారమునఁ గృహస్థులయి నలువురు పత్రికభటులు
"టిక్కట్లు" లేకుండలోనికివచ్చిరి. వారినెత్తిపాగల యెఱుపునుబట్టియుఁ
జేతిదుడ్ల నలుపునుబట్టియుఁ బడమటిచెప్పులకిర్రునుబట్టియుఁ వారి కీయ
నన్యసామాన్యగౌరవము గలిగినదని వింటిని. ఆనాటిరాత్రి సారంగధర
నాటక ప్రదర్శనము; ఆలస్యకారణమున నాందీప్రస్తావనలు విడువఁబడు
టచేఁ దన్నాటకకవి యెవ్వఁడో తెలియలేదు. గ్రామమునఁ బంచిపెట్టఁ
బడిన కరపత్రములలోఁగూడఁ గవిప్రశంసలేదు.

మొదటి యంకమున రాజరాజనరేంద్రుఁడు నతనిప్రధానుఁడు
నుద్యానవనమునఁ బ్రవేశించి వేదవిహితకర్మములఁ గూర్చియు వర్ణా
శ్రమధర్మ పరిపాలనముఁ గూర్చియు జనులక్షేమమునుఁ గర్షకుల
పంటలఁగూర్చియు ధాన్యములధరఁగూర్చియును ముచ్చటించుకొనిరి. రాజ
కార్యవిముఖుఁడై విలాసముగ నుద్యానముననున్న రాజున కీసంభాషణ
మెందులకో నాకిప్పటికిని బోధపడలేదు. అంతటఁ జిత్రాంగియు నొక
దాసియు నచ్చటకువచ్చిరి. వారచ్చట కెందులకువచ్చిరో వారికిఁ దెలి
యదు. వారిని బుట్టించిన బ్రహ్మకుఁ దెలియదు. అంతట రాజు తొంద
రతో లేచి ప్రధానుని జేయిపట్టుకొని—

కీర్తన—"చూచితే ? దానిసొగసు చూచితే ? నాచువంటి కేశ
చయము.

త్రాచులాగు వెనుకవ్రేలు—చూచితే ?"

అని కాలితోఁ దాళమును దాటించుచుఁ బాడెను.

ఈకీర్తననే ఫిడేలుపైఁ దెరలో నొకఁడు వాయించుచుఁ బాడు
చుండెను. నేను దెల్లఁబోయి కూరుచుంటిని. కాంతలయందలి యత్యం
తానురాగ మొకప్పుడు మనుజులను దాత్కాలికముగఁ గవులను

జేయఁగలవనియు నట్టివారు తాము వలచినవారి సౌందర్యమును గాన మొనర్తురనియు నేను వినియుంటిని. అట్టిమాటలు పేర్వైనయీరాజులోఁ గలిగినదేమోయని సద్దుకొని యూహించుకొంటిని. ప్రధానుఁ డాకీర్తననే దొరకబుచ్చుకొని—

"చూచితిగా దానిసొగసు - చూచి
మిన్నువంటి సహసముగల్గు
చిన్నిచనుల వన్నెలాడి - చూచితిగా."

అని ప్రత్యుత్తరమిచ్చెను "నేనువలచిన కాంత యవయవములను నీవట్లు వర్ణింతువా?" యని మహారాజు కోపోద్రేకమునఁ బ్రధాను నొక్కటియాడ్చి దౌడపై సాగదీసి కొట్టునేమోయని నాకొడలు కంపించినమాట సత్యము. రాజున కట్టి యౌచిత్యము లేకపోయెను. ప్రధానున కట్టిభయము లేకపోయెను. నన్నయభట్టకవిచే భారతమును గృతి నందిన యాచంద్రార్కకీర్తిశాలియగు రాజరాజనరేంద్రుఁడు తానువలచిన దాని యంగములను జూడుమని ప్రధానుననుఁ దాను జూపించు నంతటి మతిమాలినవాఁ డెప్పుడగునో యను చెప్పుమా యనియు; రాజు బలాత్కారముచేఁ జూచిన యవయవము లేవో చూచి "హరిహరీ" యని లోన స్మరించుకొని నోరుమూసికొని యూరకుండక యితరగుహ్యావయవవర్ణనముల లయఁజెప్పకుండ లంకించుకొనుటకు వేఁగిదేశము నంతయు బాగుగ విస్తారయశస్సమృద్ధిని బరిపాలించిన ప్రధానుఁ డంత వెఱ్ఱిముండకొడుకా? యనియు నొడలు జలదరించెను. రాజప్రధాను లిట్లు పనిలేక పాడుకొనుచున్న పాటలను విని వారు మతిలేకయుండిరో లేక త్రాగియేయుండిరో తమ్మెక్కడ నొడలు తెలియని వెఱ్ఱితిమ్మిరిచేఁ బట్టుదురో యని కాఁబోలుఁ జిత్రాంగియు సఖియుఁ బారిపోయిరని నే ననుకొనవలసివచ్చినది. వారువచ్చుటకుఁ గారణ మూహ్యమైనప్పుడు పోవుట కేలకాదు? అంతట శ్రద్ధయోగ్యమగు రాజప్రధానుల సంభాషణములోఁ జిత్రాంగి సారంగధరునికి భార్యగాఁ దేఁబడిన దను నంశము తేలినది. రాజామెను దానే వివాహము చేసికొన నిశ్చయించు కొనెను. ఇంతటితో మొదటిరంగము ముగిసెను.

రెండవ రంగమందు రాజరాజనరేంద్రుని వివాహము. ఢంకా భేరీవాద్యముల ఝాంకారములతోఁ గవుల స్తోత్రపాఠముల ఝాంకా

రములతో, నాట్యాంగనల గాజులగజ్జెల క్రేంకారములతో భట్టుల చాటుపాతకతాంకారములతో, మల్లుల ముష్టియుద్ధహుంకారములతో, మదగజఘటల ఘీంకారములతో, సంభావనబ్రాహ్మణుల యహంకారములతోఁ బల్యంకికావాహకుల హోంకారములతోఁ బహువైభవముగ జరిగినందులకు సంతసించితిని.

మూఁడవరంగమందు రాజరాజనరేంద్రుని నగరుపెండ్లి అనఁగ సంస్కృతమునఁ బుష్పసంధానము; దివ్యముగ నలంకరింపఁబడిన యా శోభనఁపుగదిలో నిలువుటద్దముల నడుమ నత్తరుపన్నీరు బుడ్లనడుమ, బ్రసవకుండికల నడుమ, ఫలహారపుఁ బళ్లెరములనడుమ నీప్రభువు పాడిన కీర్తనలు వేసిన తెయితక్క లాపరమాత్మునికే యెఱుక. అంతలో నిష్కారణముగ విరహమఁట—మొదటఁ బ్రవేశించినప్పుడు బాగుగనే యున్నాఁడు—విషూచివలె నాతని నాకస్మికముగఁ బట్టుకొని గిరగిరఁ ద్రిప్పి నేలఁగొట్టినది. అంతట నీమహారాజు చిత్రాంగికొఱకు—గాజు బొమ్మల కాళ్లుపట్టుకొని, కట్టెలేళ్ల కన్నులముట్టుకొని లక్కచెట్లతోటి పండ్లులాగి పళ్లెరములలోఁ బెట్టిన బనారసుకాజాలను బండ్లతోఁ గట్టిగఁ బస్సి వడివేసి, చప్పరించి, లొట్టవేసి యదుకుల కాంభోజిరాగములో నేకతాళముతో నేడ్చిన యేడుపులు హరహరా! పగవానికైనవలదు. "వహ్వా! వహ్వా!" "వన్సుమోరు వన్సుమో" రనుచు సభికులు మహా సంతోషసముద్రమున నోలలాడుచుండిరి. ఇట్లు రాజుపున్నాగవరాళిలో పోదాసదా సుదాతిజూపవే? యని పాడిన కీర్తనతోఁ బొదచాటునున్న చిత్రాంగి యట్టె వెలుపలకు వచ్చెను. రాజు మూర్ఛపడెను. ప్రాణములు గూటఁబడినవెనుక లేచి భక్ష్యముల పళ్లెరములను బరామర్శించి గర్భా దానతంత్రమంతయు ఖరహరప్రియరాగములో ఖండజాతిత్రిపుటతోఁ గడతేర్చెను. అంతటితో మొదటి యంకము ముగిసెను. తెరదిగెను.

రెండవయంకమున మొదటి రంగమున సారంగధరుఁడును మంత్రి పుత్త్రుఁడును మఱికొందఱు బాలురును బ్రవేశించిరి. కొంతసేపు వారు కుండబంతినాడిరి. కాలిబంతి యెగిరి ప్రమాదవశమునఁ బైన వ్రేలాడు దీపమును బగులఁగొట్టె. లోపలిచమురు భగ్గుమనెను. పాక కాలిపోవు నని భయపడితిమి. కాని యట్లు జరుగలేదు. తరువాత మంత్రిపుత్త్రుని చేతినుండి గోటిబిళ్ల యెగిరి సభలోనున్న యొకకోమటి పిల్లవాని కణ

తమం దగులుటచే నాతఁడు సొమ్మసిల్లి పడిపోయెను. అంతట నాతని తండ్రి గోలుగోలున నేడ్వసాగెను. కోమటిమాత్రము నాటకపద్ధతికి విరుద్ధముగాఁ బాటలతో నేడ్వక మాటలతోడనే యేడ్చుచుఁ బిల్ల వాని నింటికిఁ దీసికొనిపోయెను. అంతఁ గోఁతికొమ్మచ్చి నాడుచుండఁగా సారంగధరుఁడు చెట్టుమీఁదనుండి పడెను. వెంటనే తెరకూడఁబడెను.

ద్వితీయ రంగారంభమున మంత్రిపుత్త్రుఁడును సారంగధరుఁడును పావురముల నెగరవైచుచుఁ బ్రవేశించుచు నిట్లు పాడిరి.

"పావురాల నెగరవైచి పట్టుకొందమా?
మావరాలమూటలైన శ్రీవరాంగసుషమమీఱు॥ పా॥

ఇట్లుపాడి యెగరవైచిరి. నాటకగాథ ననుసరించి పావుర మొక్కటి ప్రక్కనున్న చిత్రాంగిమేడమీఁద వ్రాలి కూరుచుండుటకు బదులుగా నెదుటనున్న మాశిష్టుకరణము మేజస్ట్రేటుగారి నెత్తిమీఁద వ్రాలి రెట్ట వైచెను. ఆకస్మికమైన మైలవార్త విన్నయాతఁడువలె నతఁడు సచేల స్నానమునకై పోయెను. ప్రక్కగోఁతిలోఁబడి పావుర ముండఁగా నది చిత్రాంగి మేడమీఁదనే యున్నట్టు భావించి సారంగధరుఁ డిట్లుపాడెను.

"పోగరుబోత? మా కపోతమా!
తగదువడిగతిరుగు తిరుగకున్న పొగరడంతు పొగరు.

పావురము రాకపోవుటచే సారంగధరుఁడు చిత్రాంగి యింటికి వెళ్లుటకు స్థిరపఱచుకొనెను. మంత్రిపుత్త్రుఁడు మలయమారుతములోఁ గొంతమందలించెనుగాని దానిని సారంగధరుఁడు శంకరాభరణముతోఁ జప్పఁబఱచెను. రెండవరంగము నిట్లు ముగిసెను.

మూఁడవరంగమున సారంగధరుఁడు చిత్రాంగిమేడలోఁ బ్రవే శించెను. చిత్రాంగి యాతనిఁ జూచుటతోడనే లేచి గొంతుక ఖాంగు సవరించుకొని "ఆ" యని ప్రక్కనున్న శ్రుతితోఁ గంఠమును గలిపి "ఊ" యని పిడేలువానికిఁ గీర్తనకై తలయొగుపుతో సంజ్ఞచేసి—

బిలహరి—ఆది.

'ఒకసారి కౌఁగిటనొత్తి నన్నేలరా! ఓరీ! మారాకారా!
తెకతెకను సుడకగ తోగలరాయఁడు! పొకపొకలగ్రమ్ముచు

నొడలుపొక్కెను అకట ! యింక "బ్రదుకంగఁజాలను ! నికటమున నన్బట్టి గట్టిగ॥ నాక॥

యనుచు హస్తపాదవిన్యాసములచేఁ దాళపుదారిని గానఁబఱచుచుఁ దారక వఁటున్నట్లు పాడెను. అంతట సారంగధరుఁడు నడుము బిగించుకొని——

కీర్తన.

"చెలియ నీదుపలుకులు చెవులకఱకులుకులు
మగువ! నీదుమాటలు మనసుకత్తిపోటులు" అని యెంతసేపో యెగిరియెగిరి వగర్చుచుఁ గూరుచుండఁ జిత్రాంగి యాతనిపైఁబడెను. "రమణి! రాకు రాకుమా" యనుచు గొంతుఁజించుకొని రాకుమారుఁడటునిటు పోవుచుండఁగ "రావ పోకు పోకుమా" యనుచుఁ జిత్రాంగి యాతనివెంటనే దిరుగుచుండెను. "కుర్యో" మనుచు ఘుష్మరించుచుఁ బంది పట్టుపడక పఱుగడలు ద్రొక్కుచుండ నెఱుకత దానినిం బఱిమాలుచు బెదరించుచు వెంటబరుగెత్తు నట్లుండెను. ఇట్లిద్దఱు పాడుచు "మైసూరీ పంజాబీ" పదవిన్యాసపు గమనికలతోఁ, గుడియెడమ యెత్తిగింపుల యెడుపులతోఁ, గరముల జోకాయింపుల కట్టుదిట్టములతో, వంపుతలల ప్రక్కచూపుల కోపకోపులతో ముందున కుంకించు మురిపములతో వెనుకతగ్గువిలాసములతోఁ గొంతసేపు గదియంతయు ధూళి రేగునట్లు విపరీతశృంగార మల్లయుద్ధసన్నాహ సంరంభమునఁ గాళులు విఱుగునట్లు తాళప్రస్తారసందర్భము దప్పకుండ గంతులు వైచిరి. సారంగధరుఁడు వెడలిపోయినపిమ్మట జిత్రాంగి కోపముఁ బట్టజాలక భూపాల రాగముతో భూపాలపుత్త్రిని బూతులు దిట్టుచుండఁ దెర దిగెను.

మూడవయంకమున ముఖారితో నేడ్చుచుఁ జిత్రాంగి వికృతరూపయై ప్రవేశించి నేలఁబడియుండును. వేఁటనుండి రాజరాజనరేంద్రుఁడు ప్రవేశించి సావేరితోఁ గొంతసేపు దేవేరికై దేవులాడి యథర్మయానయగు నర్ధాంగలక్ష్మిని జూచి యెద్దకూరుచుండి——సతీ! లావణ్యవతీ! సమంజససద్గుణసంతతీ! సద్ధర్మాచరణరతీ! సరసవచోరచనాచమత్కృతీ! భారతీ! అని ప్రియసాధారణసంబోధనాడంబర విజృంభణుఁడై ప్రకాశించెను. ఆమె పలుకలేదు. అంత రాజు "చిత్రాంగీ——మనోహ

రాంగీ! అతిసౌభాగ్యనిర్జితకురంగీ! మాననీయయానాధరీకృత మద సారంగీ! నాపైఁ బూలబంతుల బారు పెట్టుజోడునాళముల ఫిరంగీ!" యని బిగ్గరగఁ బిలిచి గొంతు మతేదో చరువునకై కాఁబోలు సన్నద్ధకొను చుండెను. అంత్యనియమప్రధానములగు నీసంబోధనముల విని నా కొడలు నీరు విడిచినది. "మనము భార్యలతోఁ గాపురములు చేయు చుండుటలేదా? మనభార్యలకుఁ గోపము వచ్చినప్పుడు మన మిట్లే సంబోధించుచుంటిమా? మనలో నెనిమిదేసి వివాహములయినఁ జేసి కొనువా రున్నారే! వారందఱు భార్యల నిట్లంత్యప్రాసములు తప్ప కుండనే పిలుచుచున్నారా? మన యబ్బనాఁడైన మనతాతనాఁడైన నిట్టి సంబోధనము నుపయోగింపఁబడెనని వింటిమా? ఎవ్వనికిలేని పోఁగాల మిప్పు డీరాజరాజనరేంద్రునకేల? వీని కెన్నియేండ్లు వచ్చినవి! ఎంతదేశ మున కధికారమున్నది! ఎంత భాండాగారసామగ్రియున్నది! ఎందఱబుద్ధి మంతులను సభాస్థానమున నేకరించినాఁడు! ఎన్నిగ్రంథములు చదివి నాఁడు! ఎన్నికృతులందినాఁడు! అయ్యయ్యో! ఎంత నిర్భాగ్యుఁడై పోయినాఁడు! యెంత ప్రాపంచికజ్ఞానశూన్యుఁడై పోయినాఁడు. తుట్ట తుదకుఁ గట్టుకొన్నదానిని బిలుచుటకైన చేతకాని చచ్చుపెద్దమ్మలలో నగ్రతాంబూలమునకు సిద్ధమయినాఁడే? ఆహా! వీనికి మతిలేదా! మను ష్యత్వమే లేదా? పాటతోనే కాని మాటలాడఁడే యెంత మహాకర్మము దాపరించినది." అని నాలో నేమేమో యనుకొనుచుండఁగా రాజరాజ నరేంద్రుఁడు:—

సీ. "నీకుఁ గోపం బేల నాకుఁ జెప్పుము నాతి!"

యనఁగ నదివఱకుమాటలకు లొంగనికాంత పాటకు స్వాధీనయై యర్ధపాదమును

"నాతోడఁ బలుక కోభూతలేశ!"

యనియెను.

రా—నినుఁ బ్రాణసమముగా నేఁ జూచుకొంటిని.

చి—నేను నీయిల్లాలఁగాను పొమ్ము.

రా—గరిత్నాంగివిడిచి నీప్రాపు జేరినవాఁడ.

చి—నేనప్డు జచ్చితి నంచు నెంచు మింక!

రా—బిగువైనకౌఁగిటఁ బెనచి ముద్దీయవే?
చి—కోడలనంట కోనుతలనాథ?
రా—కోడలంటివి? యదియేమి కోమలాంగి.
చి—కొడుకు సుంపుషునకైతేఁ గోడలనఁ బగదె?
రా—ఏమి ? వానిని వెగవ్రేతు నీక్షణంబ
చి—నన్ను జంపుము మామయ్య! మున్ను చేడ !

ఇట్లు వీరిద్దఱొకరి దొకరుఁబుచ్చుకొనిన తరువాత మిగిలినదానిని వేఱొక రానందభైరవితో సాగదీయుచు నొకచెంపను వీరుగొట్ట నొక చెంపను వారు గొట్టుచు వేపారుల యుశాణిలోవలె నొకతములపాకు చుట్టునొకరు కొఱికి 'ధూ" యన దాని యగ్రమును వేఱొకరు కొఱికి తిరుగఁబడి "ధూ" యనుచుఁ బగులఁ గొట్టుటలతో నదుకుటలతోఁ ద్రెంపులతో ముడిబెట్టుటలతో నర్ధపాదార్ధపాదాన్యోన్యసాహాయ్యావృతులతో దిక్కుమాలిన శవము నిద్దఱు చెఱివైపు సాయపడి బుజములు గలపి శ్మశానవాటికకడకుఁజేర్చినట్లు సీసపద్యమును నానాస్వర సాంకర్యముతో సంపూర్తిఁ జేసిరి. అంతటఁ దెర దిగెను.

మూడవయంకమున రెండవరంగమున న్యాయాధిపతియు న్యాయవాదులు నేరగాఁడగు సారంగధరుఁడు సాక్షులు సేవకులు ప్రవేశించిరి. సర్కారువైపునున్న న్యాయవాది నాదనామక్రియతో నేరగాని నేరమునంతయు నుపన్యసించెను. నేరగాఁడు భైరవివర్ణమునఁ దననిర్దోషత్వమును హార్మోనియము సాహాయ్యమునను జిప్పతాళపు సాహాయ్యమునను స్థిరబరచెను. సాక్షులందఱు కలిసిపాడిరి. సారంగధరునివంకనున్న న్యాయవాది సరససంగీతరచనాచమత్కారముగల యొక్క స్వరజతిని జల్లుజల్లునఁ బాడి సంగతులుపై సంగతులు లేత ముదురు పట్టు జారు సాపు వరివిక చౌకము దురుసు మంద్రము తారకము బొంగు కీచు మొదలగు వివిధభేదసాంప్రదాయములతో విసరి వెదచల్లి వర్షించి వినువారి తలలను బలత్కారమున బులిమి సారంగధరుని సత్యసంధతను నారోజున నటతాళమున నుపన్యసించెను. వెనుకటి కాలముకాదు. వెనుకటి యుగముకాదు. వెనుకటి మనుజులుకారు. వెనుకటి సృష్టికాదు. అంతయుఁ గ్రొత్త. సరిక్రొత్త. సాక్షిచట్టమంతయు

సంగీత సర్వార్థసారసంగ్రహమే! శిష్టాచట్టమంతయు గాయనగాయనీ జనపారిజాతమే. న్యాయవాదులందఱు గాయకులే! సాక్షులందఱు సరిగమాధ్యయన శీలురే! బిళ్లబంట్రోతులందఱు పిల్లారిగీతములయినఁ బాడఁగలవారే! సారంగధరుని నేరము స్థిరపడినదనియుఁ గరపాద ఖండనశిక్ష విధించితిననియు న్యాయాధిపతి లేచి నాటకసంబంతోఁ దీర్పు చెప్పఁబోయి శంకరాభరణముతో సంకరపఱచి సభ చాలించెను. తెర దిగెను.

మూఁడవరంగమునఁ గారాగృహమునందున్న సారంగధరుఁడును దల్లి రత్నాంగియుఁ బ్రవేశింతురు. తల్లి యాతని గౌఁగిలించుకొని మహాదుఃఖపారవశ్యమున నేడ్చునని నే ననుకొంటిని. అట్లేడువలేదు. కాని యిట్లు పాడెను.

బలహంస - ఏక.

" నాయనా! సాయనా తరముగాదురా! నాయనా!
నిన్ను బోలువాని నీజగానగాన గాన నోనాయనా!"

అనుచుఁ "బ్యాండు" స్వరముల నారోహణావరోహణ శృంగారము జిప్పిలుచుండునట్లు మధురకంఠమును మధ్యమకాలశ్రుతితోఁ గలిపి గానకళాకాలక్షేపమును జేసెను. సభవారి కరతాళధ్వని లఖండముగ నుండెను. ఇదివఱ కనేకపాత్రములు పాడిరిగాని యీమె పాట బహు సంతోషప్రదముగ నున్నదని యందఱ యైకకంఠ్యముగఁ బలికిరి.

"సారసనయనుఁడవో సద్గుణసహితుఁడవో చారురూపమున మారుఁ బాఱు మాఱుఁ జేయుదో నాయనా!" అనుచుఁ దిరిగి పల్లవి యందుకొని యుపపల్లవిని బఠించి "జగానగానగా" యని బింకముగఁ బాడుచు నుసిదెబ్బల సౌభాగ్యమును జరణచాలనమున నుద్బోధింపఁ జేయుచు ముక్తాయింపఁగఁ దెరచాటునుండి పాటకుఁడు "తధిగిణతోం తకదధిగిణతోం తళంగుదధిగిణతోం" అని తానుగూడఁ బైముక్తాయింపునకు బంగారమునకు సౌరభ మబ్బించునట్లు శబ్దములకొలుపుతో వన్నె దెచ్చుసరికి హాహాహాహా యనుచుఁ బాకయంతయుఁ బరమానంద మొందెను. చేతులపైఁ గొట్టుకొనువారు, బల్లలపైఁ గొట్టువారు, పిఱ్ఱలపైఁ గొట్టుకొనువారు, ప్రక్కదళ్లపై బాదువారునై ప్రజయంతయు

నొడలు తెలియని మహానందమున నుప్పొంగుచున్నది. ఉండదా? వారి
కేమి? బలహంసరాగముపై బ్యాండుస్వరములుగల "ధీరుఁడే రాముఁడు"
అను చక్కనికృతికిఁ బాఠాంతరమైనకృతి లభించినప్పుడు సారంగధరుఁడు
వచ్చిననేమి? కాలురూపాయనిచ్చినింటికి వాడవచ్చినవాఁడు కన్న తల్లికంటె
నెక్కుడయగుదురా! తాను గలిగించిన సంతోషమున కాతల్లి మొగమే
కలకలలాడుచున్నదే? జీవఘాతుకములగు పక్షిపులులలోనైన నడవి
పందులలోనైన నరమాంసభక్షకులయిన కిరాతాధములలోనయిన నాఁడు
జాతికి సహజముగ నున్న యపత్యానురాగము కానక కన్నయొక్క
కొడుకుపై—గడియలోనో జాములోనో కాలుసేతులు ఖండింపఁ
బడుటచేఁ గాలధర్మ మొందవలసిన యొక్కకొడుకుపై—సర్వసద్గుణ
రాశియైన యొకకొడుకుపై—సవతితల్లి పన్నినకుట్రచే శిక్షను బొంది
యున్నను నామెను బల్లెత్తుమాటయైనఁ బలుకఁగూడదని తెలుపు కుసుమ
కోమలతరస్వభావసంపన్నుఁడైన యొక్కకొడుకుపై—తన తండ్రినిగాని
తనసవతితల్లినిగాని దుఃఖభారమున నెప్పుడైన నేమియైనఁ బలుకవలదు
సుమా" యని తనకుబోధించిన పరమార్థజ్ఞానచింతాఖనియైన యొక్క
కొడుకుపై — "పడుచుఁదనమున బ్రహ్మచారినై దోషశూన్యుఁడనై
తల్లిదండ్రులు బాగుగనుండఁ జచ్చిపోవుచుంటిని గదా! ఇంతకంటెఁ
గావలసినదేమి" యని యుప్పొంగుచున్న మహోన్నతభాగ్య విజ్ఞానభాగ
ధేయమైన యొక్కకొడుకుపై—నవమాసములుమోసి కాంచిన తల్లియైన
రత్నాంగికి—మగనికోఁత సవతిరోఁతఁగలిగిన రత్నాంగికి—కొడుకును
జూచుకొని సంతోషించుటకంటె వేరువేడబమే లేని రత్నాంగికి—
కత్తికోఁతకంటెఁ గాలసర్పదశనఘాతకంటె గహనాగ్నికీలికాసంహతికంటెఁ
గడుపుచిచ్చే భరియింపరానిదై యుండఁదగిన రత్నాంగికి—అదరు
లేదు—బెదరు లేదు—మొగమున దైన్యము లేదు. కంట నీటిచుక్క
లేదు. గొంతుకలో బిగింపు లేదు. గుండెలో దడ లేదు. లోకసంగ్రహార్థ
మేడువవలయు ననుచింతయయిన లేదు. ఏమియు లేదు. ఎంతమాత్ర
మును లేదు. మొద్దు. మొఱఁడు. అయ్యయ్యో! మొద్దులాగుండినను
నేను సంతోషింతునే? నేను "బలి" యని నుతింతునే? కొడుకు దుఃఖ
మును భరింపలేక కొఱడుపాఱిపోయినదని యొకరితోఁ జెప్పి నాలో

నేననుకొని సంతుష్టి జెందియుందునే. అయ్యయ్యో! ఆమాత్రపువకాశ మయినఁ గలుగనీకుండ ముద్దులాలుక బాధుచున్నదే! ముక్తాయించు చున్నదే! ఆహా! యిదియెంత ప్రారబ్ధము! అంద అత్తల్లు లిట్టివారయినఁ బ్రపంచ మెక్కడపగటిలోఁ బ్రళయావస్థనొంది యుండునే? అంతట సారంగధరుఁ డొకకీర్తన పాడినాఁడు. దానితో మూఁడవయంకము పూర్తియయినది.

నాలుగవయంకము ప్రథమరంగమున్నకై తెరయెత్తఁబడఁగ సారంగధరుని మఱమంచముమీఁదఁ బరుండఁబెట్టి యిద్దఱుతలారులు గండ్ర గొడ్డళ్లతోఁ గాలుసేతులు నఱకుచున్నారు. ఆరాజపుత్త్రునిదీక్ష—పరా కాష్ఠయేమో కాని, యట్టి భయంకరావసానసమయమందైన—నాబాలు నకు—రాగ మెక్కడ సంకటమగునో తాళ మెక్కడ ధ్వంసమగునోయను మహాందోళనమే కాని మఱియేచింతయు లేదుగదా? ఆతని చేతులను దలారులు ఖండించుచుండఁగ నాతఁడు పాడుచున్న యొకకీర్తనలయగల పాటలోఁ దాళమెక్కడఁ జెడిపోవునో యని కాలిమడమతో మంచపు పట్టెమీఁదఁ దాటించుచునేయున్నాఁడు. తాళము పోవు బాధ ప్రాణము పోవుబాధకంటె నెక్కువది కాదా? లయ బ్రహ్మ మని చెప్పుటచేఁ దాళము చెడఁగొట్టిన బ్రహ్మహత్యాదోషము సిద్ధింపదా? కాన తన యిష్టానుసార మప్పుడు సాగెను.

అయిదవయంకమున మీననాథుఁడు ప్రవేశించుటయు నాతఁడు సారంగధరుని బ్రదికించుటయుఁ దరువాతఁ గుమారుని తల్లిదండ్రులతోఁ గలుపుటయు మొదలగు కథాభాగములన్నియు నేకైకచరణధురీణము లగు చిన్నచిన్న పార్శిమట్లుగలపాటతోఁ నాంధ్రీకరణమొందినటు మీరాట ప్పాలతోఁ బాటకు మిక్కిలి యుపయుక్తములగు వింతవింత వృత్తము లతోఁ బల్లవిమార్గపుబందుకట్లతోఁ జౌకపుమార్గపుఁ గారుకమ్మెచ్చుల తీఁగసాగింపులతో ముగింపఁబడినవి. నాటకప్రదర్శనము పూర్తియగుటచే జనులు లేచిపోయిరి.

రూపకాలోకమున మనస్సు మిక్కిలి చెడుటచే శేషించిన రాత్రి బొత్తిగ నాకు నిద్ర లేదు. సోదరులారా! ఇంతవింతనాటకమును జూచి పాపము శాంతించునుగాక, పాపము శాంతించునుగాక, యని లెంపలు

వైచుకొంటిని. సూనదుఁడు మేఁకలగొంతుకలను బఱఁబఱఁ గోయుచుండ మనసు చెదరకుండఁ జూడవచ్చును. మాటిగవాఁడు గొడ్డలి పుచ్చుకొని గొడ్డుతలలను బల్లనఁబగులఁగొట్టి చర్మమొలిచి మాంసమును ఖండఖండములుగఁ జేయుచుండఁ గంటఁ బడకుండఁ జూడవచ్చును. కత్తుల వ్రేటుతోఁ బల్లెపుఁబోటులతోఁ ఫిరంగిగుండ్లతో ఘోరముగఁ జేయఁబడు వ్రణములతో మహీసంఘమున మొండెములు శిరములు నెత్తురునదులపైఁ దేలి కొట్టుకొనిపోవుచుండఁగ గుండెదిట్టముగోనున్నవాఁడు జూడవచ్చును కాని యుచితజ్ఞతాశూన్యుఁడైన కవి కలము మొనతోఁ బ్రకృతికాంతను హృదయకోశమునఁ బొడిచి చంపి చర్మమూడఁదీసి సంధులువిఱుగఁగొట్టి నరములఁద్రెంపి రక్తముఁ ద్రావి పచ్చిమాంసపు కండలను నోటఁబెట్టుకొని నడివీధికెక్కి తెయితక్కలాడుచుండఁ జూడఁగ—నొడలు చావవలసినదే? కన్నులు లొట్టపడిపోవలసినదే—గుండెలు బ్రద్దలయి నీరు కారవలసినదే—కన్నున్న వానికి, మెదడున్న వానికి హృదయ మున్న వానికి నింతకంటె భయ భీభత్సప్రదమైన దృశ్యము మేదినిలో లేదు. మనమేపూర్వజన్మపుణ్యలేశముననో మనుజులమై పుట్టితిమే—అన్నము తినుచున్నామే — గుడ్డకట్టుకొనుచున్నామే — పెండ్లి చేసికొనుచున్నామే—పిల్లలఁ గనుచున్నామే—మనసులోని యూహాపోహములను మంచిచెడ్డలెఱిఁగి వెలువరించుచున్నామే—వంటయింటిలోనికిఁ బోయి మనభార్యలతో నెప్పుడైన బీరకాయ వేఁగించెదువే—సరిగమ గ రి॥ బీర॥ రవపులుసు వేసి॥ బీర॥" అని సాయంతన పాకసామగ్రిసంపత్తును సంగీతములో వెల్లడించియుంటిమా? అట్లే చేసియుండినయెడల మనయిరుగుపొరుగువారు మనచేతులు కాళ్లుగట్టి తలలు నున్నగ గొఱిగించి నిమ్మకాయపులుసుతో రుద్ది బెత్తముచే మోది యున్మత్తశాలలకుఁ బంపించియుండరా? అజ్ఞానస్వరూపమగు గ్రుడ్డయినను గడుపునొప్పి తాళఁ గ్యారుక్యారున నేడ్చునుగాని సరళస్వరము పాడునా? పొయ్యి యలుకుచుండఁగఁ దేలుచేఁ గుట్టఁబడిన వనిత మొఱ్ఱో మొఱ్ఱో యని యేడ్చునుగాని ముఖారిపాడి తాండవించునా? అట్లే చేసియుండిన యెడలఁ దేలుమాట యటుంచి దయ్యపుబాధయని చీపురుగట్టలతో మీఁపుతట్టు దేరఁ జావఁగొట్టియుండరా? కన్నకొడుకు మరణింపఁగఁ దల్లి

తలకొట్టుకొని యేడ్చి యేడ్చి కొయ్యవాఱిపోవలసినది కాని మొలగట్టు
కొని యుత్కంఠముసఁ బాడిపాడి ముక్తాయించివేయవలసినదా ? దూడ
చచ్చిన యావైన దిగులుపడి, డిల్లపడి, గడ్డి మాని, నీరు మాని, దూడను
ముట్టెతో స్పృశించి కంటనీరు పెట్టుకొని తహతహచే గింజుకొని
"యంబా" యని యఱచునే—గనుకనంతకంటె నధమస్థితి నుండవలసి
వచ్చెనే—ఎంత మహాప్రారబ్ధము కట్టినది. పాటకొఱకే మన మప్పుడప్పుడు
పాడుకొనుచున్నాము. పాడించుకొనుచున్నాము. కాని ప్రాపంచిక
సర్వవ్యాపారములును బాటలతోఁ గాక మాటలతోడనే మనము
నిర్వహించుకొనుచుంటిమని మన మందఱెఱిఁగినయంశమే కదా ? ఇట్టి
మనసాంసారిక వ్యాపారములలో రాజకీయ వ్యాపారములలో నాముష్మిక
వ్యాపారములు మొదలగు నన్ని వ్యాపారములలో మనము మనసం
బంధులందఱితో సంభాషించిన సంభాషణకుఁ జేసిన చేతలకు, నడచిన నడ
తలకుఁ దలఁచిన దలఁపులకుఁ బ్రత్యక్షమైన, స్వచ్ఛమైన యాదర్శముగ
నుండవలసిన నాటకములలో నీ పరువు లేమి ? ఈ తాండవము లేమి ? ఈ పాట
లేమి ? ఈ యాటలేమి ? ఈ యుఱుకుల దుంపులేమి ? ఈ మిడిమేలము లేమి ?
ఆహా ! మనుష్యత్వము పశుత్వముకంటె నేఁడాకులు తగ్గిపోయినదే !
ప్రపంచము తలక్రిందయినదే ! ప్రకృతిని మంటఁబెట్టితిరే ? ఏమి ?
ఎట్టు ? రోగశయ్యపై రాగాలాపములా ! ప్రభుసభామధ్యమునఁ బల్లవి
దబాయింపులా ? భార్యల ప్రక్కలలోఁ బాఠాంతరము లొందినజావ
ళీలా ! తండ్రిగారి దర్భశయ్యపైఁ దానపు బజాయింపులా ! కత్తి కంఠ
ముపై ఖసిక్కునఁబడఁ బోవుచుండఁగఁ గారువాళీలికలా ! ఓహో !
ఓహో ! కాళిదాసుఁడు మన దేశమునఁ బుట్టినవాఁడే కదా ! షేక్స్పియరు
నాటకములు చదివినవారము కదా ! కన్నులు పెట్టుకొని నిత్యము ప్రకృ
తినిఁ జూచుచున్నవారము కదా ? ప్రశస్తకవులకు విరోధముగఁ బ్రకృ
తికి విరోధముగ మన మిట్టులేల వ్రాయవలయును ? చేతకాదందురా !
పోనిండు. ప్రకృతిగొంతుక నులిమి గ్రంథమును వ్రాసి ప్రజను బాధ
పెట్టనేల? నాయనలారా ! కవిత్వమే చెప్పనఁగాని కాలముగడువదా ?
బ్రతుకుట కెన్ని సాధనములు లేవు. చేసికొనుట కెన్ని పనులు లేవు. అయి
నను గవిత్వమువలన నీదినములలో జీవనము గడచునా ? ఎట్లయినను
నాటకకౌతుకమునఁ బ్రకృతినిఁ జంపిన బ్రహ్మహత్యగూడ మనకెందు

లకు ? ఇఁక మీరు కవిత్వమును మానుఁడు. నే నుపన్యాసమును మానెద—

వాణీదాసుఁడు—మీరు చెప్పిన ధోరణినిబట్టి నాటకమున వచనమే కాని పద్యమైన నుండఁగూడనట్లు స్పష్టమగుచున్నది కాదా.

జంఘా—కానన్న వా రెవ్వరు ?

వాణీ—కాళిదాసాదులు తమనాటకములలో శ్లోకములుచేసిరి కాదా ?

జంఘా—వా రెందులకుఁ జేసిరో యెట్లుచేసిరో యదియంతయు ముందరియుపన్యాసములఁ జెప్పనా? విషయము బహువిపులమగుటచేత నొక్కయుపన్యాసమున సర్వము పూర్తియగునా? నాటకశైలి యెట్లుండవలెనో పాత్రౌచిత్య మనఁగ నేమో యుక్తిప్రతియుక్తశిఖరి యెటు లుండవలయునో నాటకమునఁ బద్యము లుండవచ్చునో లేదో, ఉండిన నేపథ్యము లెట్లుండవచ్చునో శుభాంతకష్టాంతనాటకముల తారతమ్య మెట్టిదో యీమొదలగు సంశయము లింకఁ గ్రమముగ నాకుఁ దోఁచినట్లు మనవిచేసికొందును. ఆలస్యమైనందులకు క్షమింపుఁడు.

# సాక్షి

## 13. నాటక ప్రదర్శనము.

క్రిందటిసారి యుపన్యాసమునకు సారంగధరచరిత్ర ప్రదర్శనముం గూర్చి పలికితిని. కరపాదఖండనము నొందిన సారంగధరుఁడు యమసదనమునకుఁ బోవుటకు బదులుగా నాలుగవయంకమునఁ దండ్రిసదనమునకే పోయెను. ఖండింపఁబడిన కాలుసేతులు యథాస్థానముల నదుకుకొనినవి. పరలోక ప్రయాణసన్నద్ధమైన యాతని ప్రాణము దిరుగఁ జిలుకకొయ్యకు మాటనగిలించి స్థిరపడినది. చావక తప్పనివానిని జావనీయకుండ నేల! చచ్చినవానినిగూడఁ దిరుగ దేవతామాహాత్మ్యముల బ్రతికింపనేల! సావిత్రీసత్యవంతుల చరిత్రములో సత్యవంతుండు సంపూర్ణముగఁ జావలేదా? చిత్రవిచిత్ర సృష్టికర్మ కళాకలనాకోవిదుఁడగు కవిబ్రహ్మ తిరుగ నాతని ముక్కున నింతయూపిరి యతని ధర్మమా యని పోయలేదా? అల్పాయుష్యము నాతని నుదుట వ్రాసిన యా బ్రహ్మలేఖనమును బెరుమాళ్లసెట్టిపెన్సిలుతోఁ గొట్టివైచి యీభూలోక బ్రహ్మ పూర్ణాయుష్యమును గటాక్షింపలేదా? జగత్సృష్టికర్తయగు బ్రహ్మమాట యెవరియొద్దనైన సాగునుగాని గ్రంథసృష్టికర్తయగు కవిబ్రహ్మయొద్ద సాగునా! తనయిష్టమే యిష్టము. తనమాటయే మాట. తనవ్రాతయే వ్రాత! నిరాఘాటవచఃపాటవసంపన్నుఁడు. నిరంకుశక్రియాచరణదీక్షాదక్షుఁడు. పుట్టనివారినిఁ బుట్టించును. గిట్టనివారిని గిట్టించును. గిట్టినవారిని బ్రదికించును. సృష్టిచక్రము నిట్లు సవ్యాపసవ్యములతో జోక్యము లేకుండ నిష్టానుసారముగఁ ద్రిప్పుచుండును. బ్రహ్మాదిదేవత లతని కలమునకు బద్ధులు——తన నాటక పాత్రములలో

నెవ్వరికైన నసాధ్యకష్టావసరము సిద్ధించు నెడలఁ దన యిష్టానుసారముగ నేదైన నొక్కదేవతను జెవులు పట్టి ప్రత్యక్షపఱచి యానాటక పాత్ర మహాకష్టములన్నియు నుండి విడిపోవునట్లు చేయును. యోగాభ్యాసమునకు, మహాతపస్సునకు, భక్తి విజ్ఞానములకు లొంగని దేవతలందఱీతని చాటుకై కదలుచు నుండుదురు. ఈతనిమనస్సు మిక్కిలి కనికరము గలది. నాటకాంతమున నెవ్వరిని కష్టములలో నుంచఁడు. యథోచితముగ నందఱ కేదియో యొక్కసాహాయ్య మాచరించి వారి యిడుములను గడపి మఱి రంగమునుండి పోనిచ్చునుగాని కష్టముల నెత్తినెత్తికొని చింత హృదయమునఁ గట్టుకొని కంట నీరు పెట్టుకొనిమాత్రము పొమ్మనఁడు; చరిత్రకు విరోధమని జంకఁడు. సత్యమునకు దూరమేమో యని సందేహింపఁడు. ప్రకృతి నైజమునకు వ్యతిరేక మేమోయని టొంకఁడు. ప్రాపంచికనైఖరికి భిన్నమేమోయని తటపటాయించఁడు. క్రిందభూమినిఁ బైకెగఁ ద్రోచియో పైయాకాశమును గ్రిందికి లాగియో, మనుష్యులకు నాకాశగమన మిచ్చియో, పక్షులకు వచన రచనాపాండిత్యమిచ్చియో, పశువులకు బ్రబలధిషణాచాణక్యమిచ్చియో, కనఁబడని దేవతలఁ గానఁబఱచియో, యేదియో ప్రళయోద్దండమగు నొకపన్నుగడఁ బన్ని పర్యవసానమునఁ బాత్రలకు ద్రష్టలకుఁ బరమానందమిచ్చును. ఇచ్చి తీరును. అన్యథా యొన్నఁడును జేయఁడు.

కవి కింత నియమ మెందులకు? ప్రకృతి ననుసరించి పోవలసిన యాతఁడు భరతవాక్యమాంగళ్యమునకై ప్రాకులాడ నేల? ఇది చిత్రముగ నేయున్నది. అవనిలో నందఱ చరిత్రము లానందపర్యవసన్నములేనా! లోకమునఁ గన్నులులేనివారెందఱు! కాళ్లుచేతులు లేనివారెందఱు! నపుంసకులెందఱు! అల్పబుద్ధులెందఱు! పశుప్రాయులెందఱు! భర్తలచే నిష్కారణముగ విడనాడఁబడిన వనితలెందఱు! భార్యలు పెట్టిన విషముచే జచ్చిన భర్తలెందఱు! ధూమశకట మహోమార్గమునుండి దొరలిపోవుటచేఁ దలలు పగిలి కాళ్లుచేతులు తెగి చర్మము లూడిపోయి సంధులు విఱిగి పొడియై రక్తమున ముద్దలై నామరూపములు లేకుండునట్లు భయంకరమరణము నొందిన వారెందఱు! మహాక్షామములందు నన్నములేక, కాయ గసరులేక, త్రాగ మంచినీరులేక, చింతయంబలి త్రావి, రేగడమంటిబురద ద్రావి, యదియునులేక కడుపుమాడిపోవ

పస్తుపడి సకనకలాడి యస్థిపంజరములై మహావ్యాధిపీడితులై, శవ
స్వరూపములఁ దాల్చి, పశువులవలె, గడ్డితినుటకయినఁ దలపడిన నది
యును దొరకక 'యమలో' యనుచు నేడ్చి, తమరక్తమును దామె త్రావి
తమపచ్చిమాంసమును దామె తిని గుండె లార్చుకొనిపోవఁ గన్నులు
లోతులుపడఁ గడుపులు వెన్నునంటఁ గాళులు లటలటలాడఁ గడుపులు
నింపుకొనుటకయి కన్నబిడ్డలను గాల్చుకొని తినుటను సిద్ధముయి దిక్కు
మాలిన ప్రాణము లెంతకునుబోక, "చావో చావో" యని మూల్గి
మొఱఁబెట్టగ స్థానమునుండి నాభి చెదిరిపోవఁగ గుండె లవిసిపోవఁగ,
స్వల్పముగ నేమూలనో యంటిపెట్టుకొనియున్న కొసంతయూపిరియు
నెగిరిపోవఁగఁ జీములంటుటకయిన నవకాశము లేకుండ శుష్కకాష్ఠము
లై గతించినవా రెందఱు? మహాయుద్ధముల నోడలు తెలియక పోరా
డుచో గఱుక్కుమనియెడు కత్తిపోటుతో ఖచిక్కు మనియెడు నీటె
పోటుతో ధాఘ్మనెడు తుపాకిపిక్కపోటుతో నెక్కడివా రక్కడనే కూలి
వెంటనే యొకవుడు ప్రాణములుపోక పడియుండ వెనుకటిపఙ్క్తిలోని
భటులు గుఱ్ఱపుడెక్కలతో నినుపమేకులుగల చెప్పులతోఁ దమ
గుండెల పుచ్చిమీఁదనో, తలపీటలమీఁదనో యెక్కి త్రొక్కి యుద్ధము
చేసి తెగఁగ వారిరక్తములు తెఱువఁబడిన వీరినోళ్లలోనో, యొత్తఁబడిన
ముక్కురములలోనో పడి యవసానశ్వాసమైన ధారాళముగఁ బోవుట
కభ్యంతరముగల్గి కెక్కు కెక్కుమని చావఁబోవుచుండఁ బైనఁ జీమ
ప్రాలఁగఁ బర్వతమంత బరువుదోచునట్టి స్థితిలో గుబుక్కునఁ బైనున్న
వాఁడు క్రిందఁబడఁగ నవర్ణనీయమైన బాధకు లోనై ప్రాణములఁ
బాయువా రెందఱు! మహాంభోధిప్రయాణములఁ బైనుండు భూతముల
ఘూంకారముననో లోనుండు పర్వతముల ఠాంకారముననో నావలు
మునిఁగిపోవ సముద్రమునఁబడి క్షారోదకము ద్రాగి మునిఁగి కెక్కు
కెక్కుమనుచుఁ బైకిలేచి చేతి కేదియందిన బ్రదుకుదుమో యని సము
ద్రపు నురుఁగును నాచునుసహితము గ్రహింప గమకించి గొంతుకలో
నూపిరి స్తంభించిపోవఁ గడుపులుబ్బ, ముక్కుకొననింక కొంచెమూపిరి
యుండఁగనే యేమొసలియో యే పెద్దచేపయో నడుమో కాలో పట్టు
కొని కరకర నములుచుఁ గ్రిందికి లాగుకొని పోవఁగ బ్రాణములు పయికిఁ
బోయినవా రెందఱు! మహామారివ్యాధితగులఁగ మనుజహత్య చేసిన

నేరగాడువలెఁ బట్టుకొనఁబడి యింటినుండి తండ్రులనుండి తల్లులనుండి సోదరులనుండి భార్యలనుండి సన్నబిడ్డలనుండి కనికరరహితముగ వేఱు చేయఁబడి శ్మశానసమీపమునందున్న గుడిసెలలోఁ బడవైవఁబడి సంధి సంధి మహాప్రాణబాధచే గొంతుకనరములు తెగిపోవునట్లు గోంక్రించుచు నష్టోత్సాహతపర్యంత మొగఁబ్రాకిన మహాకాలవిషమున గొంతునులిమిన కోడి వలెఁ గొట్టుకొనుచు నసునసమునఁ గొంతెత్తినట్టి శక్తి గలిగినయప్పుడు దగయని సంజ్ఞచేయఁగఁ జూచువాఁడు లేక వినువాఁడు లేక యాదరించు వాఁడు లేక యెప్పటికో వంతుననుసరించుచు నేబారికవాఁడో యే మాలవాఁడో పాకవెలుపలనుండియే తోఁగినూచి మాత్రలనో మందు సీసాలనో మొగముమీఁదికి గిరవేటువేయ ప్రాణములు పగిలి వఱదలు గాఁగఁ బ్రక్కనుండు వ్యాధిగ్రస్తుల ప్రాణప్రయాణములఁ గాంచి హృదయకోశములు పగిలిపోవఁగఁ గాసంత చేయూఁత నిచ్చుగతిలేక బాధాధికతచే మతిలేక యన్యోన్యపక్షానుబంధము లేక యంతకపురి కేగినవారెందఱు! ఇట్టిముప్ప్రవములు నిట్టి యుత్పాతములు నిట్టి యవాంతరప్రళయములు లోకమున నెందఱి నెన్నిరీతుల నెంతదారుణ ముగా బాధించి బాధించి చంపుచున్నవి? సాంసారికసత్కృత్యకృత్యములలో "నమ్మా" యని పలుకనేర్చినది మొదలు 'హరి' యని ప్రాణములు విడుచువఱకుఁ బడుచుండు నన్నికష్టములకు నీదుప్రద్రవములుకూడఁ దోడై యుండ మనుజులబ్రతుకు లెట్టివియో యోజింపుటకయిన గుండె తాళునా? ఆహా! ఆహా! ప్రపంచ మింత కష్టభూయిష్ఠమై యుండనేల? ఎక్కడ జూచినఁ గష్టమే-యెక్కడఁజూచినఁ జావే—సుఖమే లేనట్లు న్నదే? సుఖమని మనమనుకొనినదైన సుఖాభాసమని వేదాంతవిద్యా పారగులగు మహాత్ములు, ప్రపంచ సారపరిశోధనక్రియాకుశలులగు సద్ రోతజ్ఞానులు శిలాక్షరములుగ శాసించియుండ నిఁకఁ బ్రపంచమున బాధతప్ప మఱియేమున్నది? ఇట్టిబాధ నవిచ్ఛిన్నముగఁ బడుటకే పర మాత్మ మనల సృజించెనా? అతఁ డంత నిర్దయాత్ముఁడా? కాదు. ఈ కష్టములన్నియు మనము తెచ్చుకొనినవే—మన మనుభవింపఁదగినవే- వానిని నివారించుటకు భగవంతుఁడైనఁ బ్రత్యక్షము కాఁదగినదే.

ఆ! ఆ! అదెట్లు? సుఖమునే యెల్లప్పుడు కోరుకొనునరుఁడు కష్టమును గోరుకొనునా? అది ప్రకృతిసిద్ధముగాదే? కాన నట్లూహించు

టకు వలనుపడదే? ఇంతకంటె విదగ్ధముండునా? ధూమశకటమును
నిర్మించిన మహాధీశాలికైన నీదినమున నిన్నిగంటలకు శకటము తిరుగఁ
బడుననియుఁ దన్మూలకముగ జననాశనమగుననియు గ్రహించుటకు బుద్ధి
గలిగియుండునా? అట్లెఱుఁగ యాతఁడెక్కియుండినఁ జావఁగూడదా?
ఈమరణము బుద్ధిపూర్వకముగనే తెచ్చికొనినదా? అట్లు చచ్చిన జను
లందఱెఱిఁగియుండియే చచ్చుచున్నారా? నావలు మునుఁగఁ జచ్చిన
వారందఱు చావు నపేక్షించియే సముద్రయానమునకు సమకట్టిరా?
వ్యాధులచేఁ జచ్చినవారందఱు మనఃపూర్వకముగనే మరణించు
చున్నారా? అయ్యయ్యో! మనమిట్లొనర్చిన నట్లుమానినఁ జత్తుమని
యెఱుఁగుదుమా? స్వప్నమందైన నట్టితలంపు మనకు లేదే! అట్టిచో
మనకష్టములను మనమే తెచ్చుకొంటిమని పలుకుట సమంజసముగ
నున్నదా? సాహసముగ నున్నట్లు లేదా?

ఉన్నట్లే యున్నది. కాని యథార్థముగ లేదు. జీవు లనాదులు.
అయినను దైవసృష్టిలోనివారు. పశువులకంటె భిన్నజ్ఞానశక్తిగలవారు.
మంచియేదో చెడ్డయేదో—కాసుబంగార మేదియో కాకిబంగార
మేదియో—గుల్లయేదియో గట్టియేదియో—పైతళుకేదో లోనిసార
మేదో—అపథ్యమేదో పథ్యమేదో—అశాశ్వతమేదో శాశ్వతమేదో—
అకార్యమేదో కార్యమేదో—భగవత్ప్రసాదితజ్ఞానతేజోలేశమునఁ గని
పెట్టి నిరాకరణీయమును నిరాకరించి యవలంబనీయము నవలంబించి
కృతార్థులు గాఁదగినవారు. అట్టివారు మొగము మెఱుఁగులకు మోస
పోయి రంగుతళుకునకు రంజిలి పైబింకములే పరమార్థశాశ్వతత్వచిహ్న
ములని నమ్మి దిగుడుబావియే యాకాశపుష్పకమని తలఁచి మఱువఁ
దగినదానిని వల్లెవేసి పఠించి పఠింపవలసినగ్రంథమును బాఱవైచి కొఱవి
దయ్యమును గృహదీపముగ భావించి యాంతరాకాశవాణి ననా
దరించి; బుద్ధిపూర్వకముగ—సదసద్విజ్ఞాన సాహాయ్య శూన్యముగఁ
దద్బోధనావ్యతిరేకముగఁ గూడఁ దప్పులు మనము చేయునపుడు తత్ఫ
లము లనుభవించ నక్కఱలేదా? స్వయంకృతాపరాధసంభూతకష్టసంత
తిలో మనకు భగవంతుఁడు కవికల్పనము ననుసరించి తోడుపడి మనల
నానందమున నోలలార్చునా? దూలగొండి గింజలుచల్లి తులసిమొక్కల
కయి కాంక్షింపఁదగునా? తండ్రినిఁ జెప్పుతీసికొని తన్నినకొడుకు దేవతల

పుష్పవృష్టికయి తలయొత్తఁ దగునా? "అవశ్యమనుభోక్తవ్యం కృతం కర్మ శుభాశుభ" మని పెద్దలుపలుకలేదా? కష్టబాధల నగు మన మీ జన్మమునఁ బ్రారబ్ధకర్మ మనుభవింపవలసినవారము కామా? ఈజన్మ ప్రస్తుతకార్యస్థలమైనను బూర్వజన్మను ఫలస్థలము కాదా? జనులలో బుద్ధిమంతులకంటె బుద్ధిహీనులు ప్రబలసంఖ్యగలవారయి యుండుటచే సత్కర్మాచరణులకంటె దుష్కృతి కర్త లధికసంఖ్యగలవారని చెప్పవల యునా? కావున సుఖపర్యవసన్న జీవులకంటెఁ గష్టపర్యవసన్నులే మిగుల నెక్కువ సంఖ్యగలవారని తేలుచున్నదే? అదిగాక కష్టములయినను సుఖములయిన స్వయంకృత పూర్వకర్మఫలములే కాని మనల బాధించుటకై కాని సుఖపెట్టుటకై కాని పరాత్పరునిచే నీయఁబడనట్లుగూడఁ గొంచెము గోచరించుచున్నదా? దుష్కర్మము ప్రబలముగాఁగ దాని దౌష్ట్యము ననుసరించియే బుద్ధి నడచును. అదియే కష్టసుఖహేతు వగును.

ఇదిగాక "పాపీ చిరాయు వనియు సుకృతీ గతాయు" వనియుఁ బెద్దలు పలుకుచున్నారు "తన్ను భజియించినవారిని దరిద్రబాధముల జేసెద" నని నారాయణమూర్తిగారి నిరాఘాటశపథ మున్నది. ప్రజల బాధలు సహింపలేక లేదన్నమాట వినలేక దరిద్రుని మొగము చూచు సరికిఁ గన్నీరాపుకొనలేక యడిగినవారికి నడుగనివారికి నడిగినకంటె నెక్కువగ నెంతయిచ్చిన సంతుష్టిగనక పిడికిళ్లకొలఁది, దోసిళ్లకొలఁది ధనమును బీదలకుఁ దిమ్మరించు వితరణశీలునకు నింటిలో మృణ్మయ పాత్రలు—గోడలపయి మాన్యపువేలపుఁజీట్లు—వీథిలోఁ బట్టుకొని పోవుటకు వచ్చినభటులు—ఆహా! ఏమివింత! లెక్కపెట్టినవే లెక్కపెట్టి సంచులకు దినమునకు ముమ్మాఱు మూతులుగట్టి భిక్షకయి వచ్చినవారిని బెదరించి కొట్టి యింటికంత కొక్కదీపమే పండువలకు వెలుగఁబెట్టి కడుపునకుఁ గావలసినంత తినక గోతియొద్ద నక్కవలెఁ బెట్టెయొద్ద నిద్రాశూన్యుఁడై వేచియుండ "హరిహరి" యనువానితో నపశకునమని దెబ్బలాడి వృద్ధులకు వృద్ధులుగట్టి యందులోఁ దప్పులెక్కలు కల్పించి ధనము కూడఁబెట్టిన పరమదౌర్భాగ్యాధమాధముని యింటిలో బంగారు పళ్లెరములు, గోడలకు నుచితముగ సంపాదింపఁబడిన చిత్రపటములు, వీథియరుగులపయి ఋణములాసించివచ్చి ప్రాకులాడుచున్న ప్రభువులు,

గుఱ్ఱములు తామే మేపుకొనుపద్ధతి నాప్రభువు లీయుత్తమస్థానకు విహా రార్థమిచ్చిన నాగుఱ్ఱాలబండిలో నీతఁడు స్వారిపోవుచుండఁగా రాజ భటులచే నాదారినే కారాగృహనివాసమునకై దీసికొనిపోవఁబడు చుండువాని నీతఁడు చూచి 'పిచ్చి ముండకొడు' కని నవ్వుకొని సకిలిం చుటా ? ఆహా ! ఏమిదింత ! పరరాజు దుష్టుఁడై ప్రజలపై నండెత్త స్వప్రజాసంరక్షణమునకయి తన దేశమును దుష్టునిబారిఁ బడకుండఁ గాపాడుకొనుటకయి దైవధ్యానమొనర్చి "సత్యమే జయించు" నను బ్రాహ్మణాశీర్వాదమొంది యుద్ధమునకుఁ బోయి శత్రునిచేఁ బట్టుపడి శత్రునిగుఱ్ఱపుబండిని మూపునఁబెట్టుకొని లాగి యతనిచేఁ జిత్రవధను సన్మార్గుఁ డొందుటా ? ఆతని తలను గఱ్ఱచివరఁ దగిలించి యూరేగించు చుండఁగా భేరీవినోదములతో వేశ్యాగాన నృత్యములతో దుష్ట ప్రభుఁడు విజయోత్సవము సలుపుకొనుటా ! ఏమిదింత ! ప్రపంచవైఖరి యట్లున్నది. దాతకుఁ గారాబంధనివాసము కృపణునకు రాజసన్మానము. సత్ప్రభునకు ఘోరమరణము. దుష్ప్రభునకు రాష్ట్రద్వయపాలనము. కృత్యములకుఁ దత్ఫలములకు నెంతభేదమున్నదో చూడుఁడు ! ఇట్టిచో నిట్టిభేదమును లేకుండఁ జేయుటకు 'కవిన్యాయమును' Poetic Justice స్థాపించుటకుఁ గవి వీరలచరిత్రలు వ్రాయవలసివచ్చినప్పుడు దాతకుఁ గారాగృహపుదొడ్డిలోఁ గాసులగాజు దొరకినదనియో, సత్ప్రభుని వధ కాలమందు శంకరుఁడు ప్రత్యక్షమయ్యెననియో, చెప్పి వారిచరిత్రలు సుఖాంతముగఁ బూర్తిచేయుదురు. పరోపకారశక్తికై తవసర్వస్వమును గర్పూరపుటారతిగఁ జేసి తానుహరించిపోవుచున్న దాతకుఁ గారా గృహమరణమే మహాలంకారముగాని కాసులగంగాళముకాదు. సత్ప్ర భునిమరణకాలమున శంకరునిరాకకంటె విష్ణుకింకరులరాకయే యధిక శ్లాఘ్యము. అదిగాక యీజన్మసుఖములే సుఖములా ? ఈజన్మకష్టములే కష్టములా? ఇచ్చట న్యాయమునకు సత్యమునకు వెంటనే ఫలములు గలుగకుండినయెడల నికనంతే ! ఈజన్మ ముత్తమమైనట్టియు శాశ్వత మయినట్టియు నపవర్గమునకు సాధన మనుకొనుచుంటిమికాని యింతటి తోడనే కడతేరునని యనుకొనుచుండుటలేదే ? దాతను వెక్కిరించిన కృపణుని మొగమున నీలోకమున గుఱ్ఱాలతోకలజాడింపులతో నెగిరిన బోర్ఁగల కాటులుగాని—దాతమొగమున శాశ్వతలోకమునందు

దేవతాకాంతల పూలసెటులయూపులతో నిదియు పారిజాతమకరంద
బిందుసందోహములపాటులు కావా? అట్టిమహాసంపదవి యాతనికిఁ
బలాత్కారుఁడవు శాశ్వతముగ నీయ సంకల్పించియుండ నింతలోఁ గవి
పాపము! తొందరపడి యాతనికిఁ గాసులగంగాళము సమర్పించు
టెందులకు? దానివలని ప్రయోజనమేమి? నిక్కమూలినసంసారపుమిడి
మేళములోఁ జర్విత చర్వణముగ గంటలు వేయించుటకే కాక మఱి
యెందుల కవి యక్కఱకు వచ్చును? శాశ్వతసుఖ మొందనున్న వానికిఁ
దుచ్ఛసుఖమీయఁదగునా? వారణాసిలో సన్యసింపఁదలఁచుకొని పోవు
వానికి వారకాంతను బారితోషికముగ నీయవచ్చునా? సత్పురుషుఁడు
(పైనిచెప్పినయాతఁడు) ప్రాణములఁ బాసి కైలాసమునకేగి నిత్యానంద
మున శంకరసన్నిధానమున వసియింపవలసిన పుణ్యాత్ముఁడు కదా! అట్టి
యాతనికిఁ గవి యెట్లాచరించినాఁడు? ఆతనికి దేహసంబంధము వదలి
పోవుటకోడనే కానఁబడఁదలఁచిన శంకరదేవుని రెండుగడియలకుఁ
బూర్వమే కానఁబఱచినాఁడు. అట్లుచేయుటయే కాక, శంకరుచే నాత
నికిఁ గైలాసగమనప్రతిబంధమునుగూడఁ గలుగఁజేయించి యీపాడు
లోకముననే యింక నిలిపినాఁడు. అది యాతని కుపకారమగునో యప
కారమగునో కవి యాలోచించుకొనుట కవకాశము లేని సంభ్రమ
ముతో నెటులయిన నాతని బ్రతికింపవలయునను పట్టుదలతో శంకరు
నిప్పుడు తీసికొనిరావచ్చునా? ఆతఁ డెవనికైన నిట్టియవస్థలో నీదిన
మునఁ బ్రత్యక్షమయ్యెనా? దేవతల నిట్లు మనయిండ్లలోని పెద్దబంట్ల
వలె ద్రిప్పుట సహజవైఖరికి విరుద్ధముగ నుండునేమో యనుసంగతు
లేవియు నాలోచింపక కవి యట్లొనర్చెను.

ప్రపంచము ప్రారబ్ధఫలానుభవస్థల మని యాలోచించినను,
నూతనకర్మాచరణ స్థలమని యాలోచించినను నది దుఃఖపూర్ణమైయున్నట్లు
కనఁబడుచున్నది. సుఖమనునది యున్న యెడల నది మిగులఁ దక్కువగ
నున్నట్లు కనఁబడుచున్నది. ఇట్టి ప్రపంచనటనకు నాటక కవిత పరమార్థ
ప్రతిబింబముగ నుండవలసియున్నప్పుడు శుభాంతనాటకములకంటెఁ
గష్టాంతనాటకము నెక్కువగ నుండవలసినట్లు కనఁబడుచున్నది. పో
నిండు, అవియు నివియు సమముగనైన నుండవలసినదా! అటులున్నవా!
పోని? ఆసేతుహిమాచలపర్యంత మున్న భాషలలో నొక్కకష్టాంతక

నాటకమైన నున్నదా ? ఏల యుండకపోవలయును. మనవా రట్టిది యుండఁగూడదనికూడ నియమమేమైన నొనర్చిరా ? అదికూడ చేసినారు. "మంగళాదీని మంగళమధ్యమా మంగళాంతాని" యని ప్రబంధలక్షణమును నిర్వచించినప్పుడు ప్రకృతిలో రూపాయకు పదునాలుగణాల భాగమును బనికిరానిదానిగా మనవారు పరిహరించియే వైచినారు. మిగిలిన యీ బేడ కాసు నాదరణమునందును "మృచ్ఛకటిక" కారుని మొదలు నీసారంగధరచరిత్ర కారునివఱకు నందఱు గిరగిరఁ దిరుగుచు గుడుగుడు గుంచములాడుచుఁ బిష్టపేషణముగ వర్ణించిన ప్రకృతులనే వర్ణించుచుఁ జెప్పిన వాక్యసందర్భములనే పదంత మార్చి చెప్పుచు భాషాంతరీకరించుచు శబ్దాభిప్రాయచౌర్యము లవలీలగ నొనర్చుచుఁ బ్రకృతిజ్ఞానమునఁ దప్ప మిగిలిన యన్నియసందర్భములలో నన్నియవకతవకలలో నొకనితలపై నొక్కఁడు దాఁటిపోవఁ బ్రయత్నించుచున్నారు.

యూరోపుఖండములోని గ్రీకులేమి ? ఇంగ్లీషువారేమి ? ఇంకను మఱికొందఱు జాతివారేమి ? సుఖాంతనాటకములు కష్టాంతనాటకములు కూడ వ్రాసినారు. ప్రకృతి ననుసరించి వ్రాయువారంద ఱటులే వ్రాయఁ దగినదిగాఁ గనఁబడుచున్నది. కేవలము కష్టాంతనాటకములను నిరాకరించుట హేతుసందర్భమునకు, శాస్త్రమునకుఁ సహజవైఖరికిఁ బ్రపంచ ధోరణికి నితర దేశనాటకకర్తల యాచారమునకుఁగూడ మిగుల భిన్నముగనున్నది. ఇట్టికట్టుబాటు మనవారిమాత్రమే యేల ముఖ్యముగ నుండవలయునో స్పష్టముగ గోచరింపదు. నాటకమధ్యమున నెన్నికష్టము లున్నను నాటకాంతమున నాకష్టములన్నియుఁ గడతేఱి తీఱవలయును గదా ! ఇట్లుండుటకుఁ గారణములేమో కొంత యూహింతము. "కష్టదశలో జనులకు భగవంతుని సాహాయ్యమేదో రూపముగఁ దప్పకుండఁ గలుగవలసినది. కష్టము లందుచే నివారింపవలసినవి. అట్లు చెప్పకుండు నెడల మనుజులకుఁ గష్టములు సహింప శక్యముగావు. భగవంతుఁడు ఆపద్రక్షకుఁడు. తమప్రార్థనల విని—తమదైన్యముఁ గాంచి యెటులో యొకటులు తమ్మాపదలనుండి విముక్తులఁ జేయునను పూర్ణవిశ్వాసము మనుజులకు నశించును. జను లట్లు భగవత్ప్రార్థనా విముఖులయి క్రమక్రమముగ నాస్తికు లగుదురు." ఇది యొక కారణమని యూహింతము. కాలిమీఁదఁ గురుపు క్రమక్రమముగ నెదుగవలయును. పలుకఁ బాఱి

వలయును. చిదుకవలయును. క్రమముగ నారవలయును. అంతట బాధ తీరవలయును. అంతేకాని యీలోపుగ నెన్ని ప్రార్థనములో యాతఁడు చేసినసయిన వినియోగమున్నదా? అది యథార్థరీతిగ మానుటకుఁ దీసి కొనుకాలములో నొక్కదినమైనను దగ్గించుట కెవనికైయిన నవకాశ మున్నదా? అటులే కష్టఫల మనుభవించి తీరవలయును. అనుభవకాల ములో నొక్కత్రుటిమైనను దగ్గించుకొనఁగ నెన్ని యేడుపు లేడ్చినను దగ్గదు. తగ్గించువాఁ డెవ్వఁడును లేఁడు. పూర్ణముగ ననుభవించవలయును. ఆ యనుభవపూర్తి యయినపిమ్మట నాయాప త్తంతమందును. ఈయంశ ములు మనలో మహావేదాంతికి మొదలు మందబుద్ధిశిఖామణి వఱకు సంపూర్ణముగఁ దెలియును. ఇట్టి యనుభవము నిత్యసంసారకృత్యముల గడియ కొక్కసారియయిన ప్రతిమనుజుని మనస్సునకుఁ దగులుచున్నది. తగిలి యట స్థిరముగ నిలువఁబడి మనస్తత్త్వముతో నైక్యమగుచున్నది. ఐక్యమై దినదిన ప్రబలమై మనస్సంతయు నావరించుచున్నది. మనలో—నెంత విద్యాహీనుఁడయిన—నెంత మూర్ఖుఁడయిన—నెంతతుచ్ఛుఁడయిన—కష్టములఁ బడునప్పుడు "నేను చేసికొనినదేదో యనుభవించు చున్నాను. ఎంతపాప మొనర్చితినో యంతఫల మావగింజంతయయిన మిగులకుండ ననుభవించితీరవలయును." అను నిశ్చయజ్ఞానముతో నుండును. ఈజ్ఞానమనునది యపరోక్షజ్ఞాని మొదలు లాలకాపరివఱకే కాక యధమమైన యంత్యజాతులవారివఱకుఁ గూడ దినదినానుభవములో నున్నది. కష్టములు రాగ నెట్టివాఁడయినఁ దన్ను దూషించుకొనునుగాని భగవంతుఁ డీకష్టము లిచ్చినాఁడని కాని తానెట్లో తెచ్చుకొన్న కష్టములు భగవంతుఁడు నివారణము చేయలేదనిగాని దైవము నెన్నఁడు దూఱఁడు. అన్నములేక యేడ్చువాఁడు "పూర్వ మెవనికడుపు మాడ్చి తినో" యని యేడ్చును. సంతతి లేనివాఁడు "పూర్వ మెవ్వని కొక్క కుళ్లుకాయనయిన నీయని నిర్భాగ్యుఁడనో" యని యేడ్చును. అంతియే కాని దైవమును దూఱువాఁ డెవ్వఁడును లేఁడు. "ఆపదలందు లొంగి పోకుండ ధైర్యమును గటాక్షింపు" మని భగవంతుని ప్రార్థించును. అంతేకాని కష్టములు—పరిమితి ననుసరించి—పడవలసిన కష్టములు—పడకతీరని కష్టములు—భగవంతుఁడు బాపలేదని ప్రార్థనావిముఖుఁడై

యెవ్వఁడు నుండఁడు. జనులు నాస్తికులగుదురేమో యను భయము కూడ నెంతమాత్ర మక్కఱలేదు.

నాటకదర్శనమున సంతస మొందవలయునని విచ్చేసిన ద్రష్టలను నాటకమధ్యమున నేడ్పించి నాటకాంతమునఁగూడ నేడ్పించి యేడ్పుతో నింటికిఁ బంపించుట బాగుగ నుండదని మనవారు సుఖాంత నాటకములే యొనర్చి రేమో? అదికూడఁ గారణముకాదని తోఁచు చున్నది. మనమే పూర్వమునఁ బడిన కష్టములనుఁ బ్రస్తుత సుఖావస్థలోఁ దలఁచుకొనఁగఁ దాత్కాలికముగఁ గొంత మనస్సు కలఁత నొందినను వర్ణనాతీతమైన యొక యుత్సాహము నౌన్నత్యముతోఁ గూడిన యొక విచిత్రానందానుభవము మనమనస్సున నంకురించును. ఇతరులు పూర్వమునఁ బడిన కష్టములు మనము సుఖస్థితిలోఁ బ్రదర్శింపఁబడఁగఁ జూడఁగ నటులే యంతకంటె నెక్కువగ నొక్కస్వల్ప చింతాచ్ఛాయావృతమగు నానందము వైరాగ్యగంధిల మగు నొకచిత్ర మనశ్శాంతి యుదయించును. ఇట్టి యనుభవము మనకు లేదు. దానికిఁ గారణము మనలోఁ గష్టాంతనాటక శూన్యతయే. ప్రపంచిక జనసంఘూర్ధ శేముషీసనాథుఁ డని చెప్పఁబడిన Aristotle అను నాతఁ డిట్లు తలఁచెనని Addison వ్రాయుచున్నాఁడు. Aristotle considers the tragedies that were written in either of these kinds and observes that these which ended unhappily had always pleased the people and carried away the prize in the public disputes of the stage from those that ended happily. Terror and commisseration leave a pleasing anguish in the mind and fix the audience in such serious composure of thought as is much more lasting and delightful than any little transit of joy and satisfaction యిదిగాక Seneca యనునాతఁ డిట్లు చెప్పెనని Addison చెప్పుచున్నాఁడు. A virtuous man struggling with misfortunes is such a spectacle as gods might look upon with pleasure and such as it is when one meets within the representation of a well-written tragedy. Diversions of this kind wear out of our thoughts everything that is mean and little. They cherish and cultivate that humanity is the ornament of our nature. They soften in solace to the affliction and subdue the mind to the dispensations of Providence.

ఇట్టి యుపయోగము లున్నట్లు బుద్ధిమంతులు చెప్పుచున్నారు. అది యంత యుపయోగకరమైనప్పుడు నది ప్రకృతి కెంతమాత్రము భిన్నము కాని దైనప్పుడు నట్లాచరింపకపోవుట యేల ?

ఇదిగాక ఒక కవి యిట్లు పలుకుచున్నాఁడు.

గీ. మానిసికి నున్న దేదైన లేనిదగును !
లేనిదే యుండఁదగినది ; లేనిదాని
కేడ్వఁదగినది యుండి లేకేడ్పు లేక
లేకయేడుపె బ్రతుకగు లోకమందు.

గీ. ధనమొ రాష్ట్రమొ కీర్తియొ తనుసుఖంబొ
యేదొ పైఁబడవలెనని యెప్పు డేడ్వవలఁగు
వస్తువేదైనఁ గోరి బ్రతికెడువాఁడె కాని
బ్రతుకుకొఱకునె బ్రతికెడువాఁడు లేడు.

కావున ప్రతిమనుజునకుఁ దనకు లేనిదేదో యుండవలయు నని మహాభిలాష యుండును. అది తనకు నెంతకష్టము పడినను సిద్ధింపకపోవుటచే మనస్సు చెడియుండును. ఇట్టి స్థితియే క్రమక్రమముగ నెదిగి పురుషులకుఁ బిచ్చిక్రింద దిగును. స్త్రీలకుఁగూడ నొకజాతి యున్మాదమగు Histeria లోనికి సంక్రమించును. మనస్సులలో జనుల కిట్లుచేరి బాధించుచున్న యసాధ్యవాంఛలను దొలఁగించినఁగాని వారు బాగుపడి బ్రతుకనేరరు. ఒడలిలో తాపము నావిరిస్నానమున నివారింపవచ్చును. రక్తములోని యపరిశుద్ధులను సుగంధికషాయమున నడఁగఁజేయవచ్చును. భుజించిన కఠినపదార్థ మేదైనఁ బ్రేగులలోఁ జిక్కుకొని బాధించునెడల నావుదమువలన దానిని దొలఁగింపవచ్చును. కొలఁదిసేపటికి క్రిందనే మ్రింగినవత్సనాభిని రాగిచిలుమునఁ బైకిఁద్రోసి వేయవచ్చును కాని మనస్సునఁ బట్టి బాధించుచున్న యీవిషక్రిముల నెట్లు వెలువరింపవచ్చును. వానికిఁ బ్రధానచికిత్స కష్టాంతనాటకప్రదర్శనము. మహారాజులు చక్రవర్తులు సామాన్యజనులకు లేని యప్సరసల వంటియనేకస్త్రీలు, దాసదాసీజనసమూహము, గజాశ్వాదివాహనములు, పరిమితిలేని ధనము, రాష్ట్రపాలనము మొదలగు ననేక వైభవములు గలవారయి యుందురు. చక్కనికాంత దొరకలేదని లోలోన నేడ్చు మనుజులు మహాసుందరులగు రాజ్ఞీమణులలో నొకదానిచేతఁ దమ

యుపవీతుని ప్రోత్సాహమున విషప్రయోగము చేయఁబడి చంపఁబడిన మహారాజు చరిత్రముఁ బ్రదర్శింపఁబడఁగ జూచునెడల వారికిఁ గొంత కాంతోన్మాదము తీరిపోవును. "ఛీ! ఇంతేకద! మన కీయశ్వపాలకుఁడగు షడ్డకుఁడు లేకుంటచే నాతని ప్రోత్సాహమున భార్యచేసిన విషప్రయోగము లేకుంటచే మనమే యదృష్టవంతులము" అని బుద్ధి తెచ్చుకొని నోరుమూసికొని పడియుండును. ఇటులే తమకు లేవనీ మనుజు లేడ్చు గొప్పవారి యన్ని గొప్పతనములు సుఖవంతుల యన్ని సౌఖ్యములు గొప్పవారికి సౌఖ్యవంతులకుఁ గ్లేశకారణములు మరణకారణము లగుచున్నవని నాటకప్రదర్శనమున జనులు తెలిసికొనినచో నట్టి జ్ఞానమే వారి మనఃక్రియలకు మోదుగమూడ——

.......................................................

కష్టాంతనాటక దర్శనాను భవమువలన జనులకుఁ జిత్తసంతుష్టి ప్రాపంచికవైరాగ్యము, దైవాధీనమనస్కత, మోక్షోపాయదిదృక్ష మొదలగు భవతారకసాధనములగు పరమసద్గుణసంపత్తి యంకురించును. ఈలాభము "భాగవతపురాణమువలన రాదా? సూత్రభాష్య పారాయణమువలన రాదా? గీతాధ్యయనమున రాదా?" యని యధిక్షేపింపఁ బోకుఁడు. రాదని నేను జెప్పుటకు లేదు. కాని మనస్సునందుఁ బరమార్థమును లగ్నము చేయించు శక్తిలో శ్రావ్యప్రబంధములకంటె దృశ్యప్రబంధము లధికములని నేను మీకుఁ జెప్పనక్కఱలేదు. పౌరాణికుని గ్రంథమునుండి వెలువడిన శ్రీకృష్ణనామము నాటకనేపథ్యమునుండి వెలువడిన శ్రీకృష్ణపాత్ర చేసిన ప్రయోజనములో శతాంశమైనఁ జేయదు. చెవికంటె కన్నధిక జ్ఞానేంద్రియము కాదా? అందువలననే Shakes-Peare రచించిన యన్ని నాటకములలోఁ గష్టాంతనాటకములలో ముఖ్యమైన Lear, Othello, Hamlet బహుశ్లాఘాపాత్రములై యున్నవి. ఇంక నుండఁగలవు. కావున నన్ని విధముల నట్టి నాటకము లుత్కృష్టములు; సుఖాంతనాటకములు మంచివి కావని నేనెన్నఁడుఁ జెప్పను. వానినిమాత్రమే వ్రాసి మిగిలిన వానిని కేవలము వదలివైచుటయే కాక నింద్యములని నిరాకరించుట తగదు. మనవారు వానినిగూడ వ్రాసి ద్విముఖయగు ప్రకృతిని నిష్పక్షపాతముగ రెండువైపులఁ బరామర్శింతురు గాక!

# సాక్షి

## 14. స్వప్నచారి ప్రకృతి.

మా కార్యస్థానమున కీఁగువ నుపసంహరించిన లేఖ నాలుగుదినముల క్రిందటనే వచ్చినది. నే నిట్లు చదివితిని.

"సాక్షిగారికి——బండారుపల్లెనుండి.

మీరు భూతములఁగూర్చి వ్రాసిన సాక్షిపత్త్రికను జూచితిని. అందువలన భూతములనునవి ప్రపంచమున లేవనియు, స్వప్నచిహ్నము లోకజాతి రోగచిహ్నములనియు, దానికి మంత్రాగాలు కేవలము నిరుపయోగములనియు, నవి తెలియని జనుల నమాసము చేసుకొనుటకుఁ జేసిన కుత్సితతంత్రములుకూడఁ గావచ్చుననియు మాకు గోచరించినది. మీరు వ్రాసిన యీ యభిప్రాయము మాకు సంతుష్టికరముగనుండ లేదు. లేనిభూతములను జనులు కల్పించినారని చెప్పుట యసందర్భము. జనులలోఁ దఱచుగ భూతములున్నవను నభిప్రాయము వ్రేళ్లూనియున్నది. అది యేలకలుగవలయును? తనంతఁదానే యది కలిగినదని చెప్పుటకు వలనుపడదు. కారణమేదియో యుండవలయును. వాణీదాసుఁడు చెప్పినట్లు విచిత్రబ్రహ్మసృష్టిలో నేదియుండిన నుండవచ్చును. లేదని నిరాకరింప వలనుపడదు. మనకుఁ గారణము తెలియకపోవచ్చును. నేను మీరు వ్రాసిన యీ వ్రాఁతలన్నియు ఖండింప సమర్థుఁడనుగాను. కాని మీరు వ్రాసిన దెందుచేతనో యిప్పుడే నామనస్సునకు నచ్చలేదు. ఇప్పుడు మా గ్రామమున నొక్క విచిత్రమయినభూత మొకని నావేశించియున్నది. ఆతఁడు మహమ్మదీయుఁడు ఆతఁడు ప్రతిరాత్రియుఁ బండుకొన్నప్పుడు సరిగనే యందఱవలెనే మంచముపయి వస్త్రధారి యయి పండుకొనును. తెల్లవాఱుసరి కాతఁడు కేవల దిగంబరుఁడయి

మంచము క్రిందఁబడియుండును. ఆతఁడు రాత్రి కట్టుకొన్న వస్త్ర మెక్కడ నున్నదో చూతమన్న నెక్కడను గానఁబడదు. ఆతనికి మీయభి ప్రాయానుసారముగ నేదయిన రోగ మేమోయని యూహించుట కెంత మాత్రము సరిపడదు. ఆతఁడు విశేష దేహదార్ఢ్యసంపన్నుఁడు, ప్రబలా హారభక్షణప్రియుఁడు. జన్మమున జ్వరమనఁ జేరినదైన నెఱుఁగఁడు. ఆతనిజాతివారగు ముసల్మానులు గూడ నీతఁడు భూతావిష్టుఁడై యున్నాఁడని యభిప్రాయపడుచున్నారు. అనేకభూతచికిత్సలఁ జేయు చున్నారు. ఆభూత మిదివఱకు లొంగలేదు. మసహింపువారలుకూడ మహామంత్రవేత్తలగువారు వచ్చి చూచి తమయావచ్ఛక్తి నుపయోగ పఱచినారు. కాని వారిశ్రమము వ్యర్థమైనదని చెప్పుటకు మిగుల విచా రించుచున్నాను. అది వ్యాధి కానేరదు. ఇఁక మఱియేది కావలయును? మోసమా? ఆతఁ డెవరిని మోసము చేయ నట్లు చేసియుండును? ఎవ్వఁ డయినఁ గట్టుకొన్న బట్టనువిప్పి మంచము క్రిందఁ బడియుండునా? బట్టయేమైనట్లు? గదితలుపులు లోననే వైచియుండును. ఎవ్వఁడును గాని గదిలోనికి వెళ్లి యాతండు గాఢనిద్రను బోవుచుండఁగా నాతని వివస్త్రుఁ జేసి యావస్త్రమును నపహరించి యాతని మంచ ము క్రింద దిగంబరునిగ భూశయన మొనర్పఁజేసె నని యూహిం చుట కెంతమాత్రమును వీలులేదు. తలుపులు వైచియుండఁగా నెవ్వఁడు లోనికిఁ బోవును. ఈరీతిగ జరుగుట యొక్క రాత్రియా? కాదు. ఇది వఱకు మూఁడుమాసములనుండి జరుగుచున్నది. ఆతఁ డీగ్రామమునకు వచ్చికూడ మూఁడుమాసములయి యుండును. అంతకుముం దాతఁ డేయూరనుండువాఁడో మాకుఁ దెలియదు. ఆతని కీయూరు వచ్చు చుండఁగా నడుమదారిలో నేదియో భూత మావేశించినదని యనుకొను చున్నారు. ఇట్టి భూతవిశ్వాసము మనలోనే కాదు మహమ్మదీయులలోనే కాదు, ఇంకనితరజాతులలోఁగూడ నున్నది కాని లేకపోలేదు. అట్టిసర్వ జాతిసామాన్యమగు నీయభిప్రాయమును మీరు నిరాకరించుట వింతగ నున్నది. అదియెట్టులయిన నుండనిండు. ప్రస్తుతము మీరీవింత నెట్లుసమ ర్థింతురు? మీరు మా యీలేఖకు ప్రతిలేఖ వ్రాయవలయునని కోరు చున్నాము. మీలేఖకొఱ కెదురు చూచుచుందుము. వంశపరంపరాగత జనాభిప్రాయములయం దేదో సత్యముండును గాని యవియన్నియు

మోసములు వ్యాధిచిహ్నములు గానేరవు. మీరీవిషయమున నిచ్చిన మీయభిప్రాయము సమంజసముగ లేదు. ఆయభిప్రాయమును మీరు దిద్దుకొనవలయును. లేదా యీచిత్రమును సకారణముగ సమర్థింప నయిన వలయును.

చిత్తగించవలయును
సుజనవిధేయుడు,
నాగేశ్వరశర్మ—

ఈలేఖను జదువుటతోడనే జంఘాలశాస్త్రి మొగము తెల్లం బోయెను. వాణీదాసుని మొగ మెఱ్ఱంబడెను. కాలాచార్యులు గాఢాంధకారవర్ణవదనుడు గాని యాతని మొగములో నేవికారము సిద్ధించినదో చెప్పవీలు లేదు. జంఘాలశాస్త్రి తల పంకింప మొదలిడెను. వాణీదాసుడు సకిలింప నారంభించెను. కాలాచార్యులు ముక్కుటబ్బుడితో నెగరోజ సమకట్టెను. ఆలేఖను బల్లమీఁద నునిచి నేను గూరుచుంటిని. దానిని సంరంభముతో వాణీదాసుడు మఱలం జదువుకొనెను. జంఘాలశాస్త్రి వంకం జూచి యిగిలించెను. "అట్లు కిచకిచలాడెద వే"మని జంఘాలశాస్త్రి యాతనిపై రోసరోసలాడెను. మా "సాక్షి" పత్రికను గొందఱయిన శ్రద్ధగం జదువుచున్నారనియు వినోదార్థముగం జదివి దానిని మూల బాఱవైవకుండ దానిలో సత్యాసత్యములను వివిక్తబుద్ధితోం గని పెట్టుచున్నారనియు నేనానందమొంది యూరకుంటిని—అంతట వాణీదాసుడు తీండ్రమున లేచి యుపన్యాసపీఠ మెక్కి యిట్లు పలుకం దొడంగెను.

"నేను జెప్పలేదా ? నేనప్పుడే సర్వతంత్రస్వతంత్రుండైన జంఘాలశాస్త్రి నెదుర్కొనలేదా ! నాకాతనికున్నంతనోరు లేదుగాని యాతనికున్నంతబుద్ధి లేదా ? మాటల బడబడవలని ప్రయోజనమెంతయో బోధపడినదా ? కాలమేమి మూఢకాలమా ? జనులేమి యజ్ఞులా ? విద్యాశూన్యులా ? వివేచనారహితులా ? అఱుమాఱు కేకలచే "ధమ్మా-యించుట" కేమి పిల్లలా ? వావదూకుల కిది పూర్వకాలము కాదు. జాఱునాలుక సొబగు లిపుడు గవ్వకుమాఱవు. ఉపన్యాసపీఠమందలి చేతివిసరులు, కాలితన్నులు, కంటిత్రిప్పులు, గళకంపములు, మండలీకృత వాగ్ధాటీమాహాత్మ్యములు జనుల నిప్పుడు మోసపఱుపంజాలవు. టక్కు-

టిక్కు పొడిమాటల కిది కాలము. అంశములకు సంకెల కిది కాలము.
కాని యథార్థాలంకార రామణీయకమునకు నాలాపాడంబరవైభవమున
కిది కాలము కాదు. సత్యాన్వేషణమునకై యీ సంఘము స్థాపింపఁబడినది.
సత్యమేదియో జనులకు బోధపఱచి యసత్యమునం దసహ్యత కలుగఁ
జేయుటయే మన ముఖ్యోద్దేశము. ఇప్పు డీ మన సమాజైకోపన్యాస
కర్తగా రేమి చేయుచున్నారు? కదలుచున్న పండ్లను లాగఁదలఁచి గట్టి
పండ్లను గాలుచే సుద్ఘాటించుచున్నారు. కలుపుకీడుమని చెప్పి
వరికంకులను వడివేసి పెఱుకుచున్నారు. దయ్యము లున్నవి ఉన్నవని
నేను మొదటినుండియు ఘంటాఘోషముతోఁ జెప్పుచున్నాను. అవి
జనులకు హానిచేసినను జేయకున్న నున్నమాట సత్యమని యొప్పుకొనక
తీరదు. శాస్త్రిగారు భూతములు లేవని నిర్ధారణముగఁ జెప్పిన యభి
ప్రాయ మాతని యనుభవ మొక్కదానినిఁబట్టియే కలిగినదై యున్నది.
ఉన్నవను జను లందఱి యభిప్రాయము స్వానుభవములఁ బట్టియుఁ
బూర్వజన్మానుభవములఁ బట్టియుఁ గలిగినదై యున్నది. లోకమునసున్న
యందఱు అంధులు, తానొక్కఁడే సాక్షియా? అందఱున్మత్తులు, తా
నొక్కఁడే బృహస్పతియా? అణువే యద్రికంటె నధికమా? ఎన్ని పూర్వ
పక్షరాద్ధాంతము లాలోచించి యొకమాట మాటాడవలయును? వాక్య
గౌరవమును దూచకుండ మనకేమను నహంభావముతో జనుల నెత్తులపై
విసరుటే! మితభాషియే బుద్ధిమంతుఁడని పెద్ద లనుటలేదా? తననోరు
తాఁగట్టుకొనలేనివాఁడు లోకము నోరుగట్టుటకు సిద్ధపడుట బుద్ధిహీనత
గాదా? శాస్త్రీ! నాకవిత్వము పట్టిపేలపిండి చొప్పదంటుకవిత్వమనియుఁ,
జచ్చుకవిత్వమనియు నోటికి వచ్చినట్లెల్ల వదరితివే? జ్ఞప్తియున్నదా?
నీమాట—నీనోటినుండి వెడలినమాట - చచ్చు—చచ్చున్నర మూఁడు
చచ్చుల పుష్పాతికె—యయినట్లు లోకమంతట నిప్పుడు వెల్లడి యయి
నదా? హే! హే! హే! ఇది చూచుకో! ఈపత్రమును మఱి
యొకసారి కన్నులు తెఱచి చూచుకో! వాణీదాసునిగూర్చి యిందున
నేమి వ్రాయఁబడినదో! వాణీదాసుఁడే సత్యవాదియో! నీవే సత్య
వాదివో! ఇప్పుడు తెలిసినది. ఎవనిబుద్ధియధికమో యెవని ప్రాపంచిక
జ్ఞానమధికమో, యెవఁడు యథార్థకవియో యిప్పుడు బయటఁ బడినది.
గండ్రతనము కవిత్వమగునా? వటవట వదరుట వాచానైపుణ్యమగునా?

పై బడబడరే కాని యంతశ్శక్తి సున్న. ఇట్టి నీవు నన్ను—నాకవిత్వము నధిక్షేపించుటా? నేను సంబోధించని మాటలనుము—సాక్షిని జూచి పురజను లూరకుండిరి. కాని నన్నీసరికి సాగనీసి తన్నియుందురు. "Arrogant fool" అని పాతకాలపువిద్యార్థులు నిన్నుఁ బిలుచుచునే యున్నారు. అట్లు కేక బొబ్బలు వేసెదవు? కొట్లాటలాడెదవేమి?" అని వాణీదాసుఁడు చాలించునంతలో జంఘాలశాస్త్రి మహాకోపమున లేచి యుపన్యాసపీఠ మెక్కఁబోవుచుండఁగ నాతని నాపి నేనిట్లు చెప్పితిని.

"వాణీదాసుఁడా! నీ వసూయాక్రాంతస్వాంతుఁడవలెఁ గానఁబడుచున్నావు. అతఁడు నిన్నెప్పుడో కవిపిగా నను దూషించెనని యిప్పుడా కోపము మనస్సున నుంచుకొని యాతని మిగుల నిందించితివి. ఈపత్రములో వ్రాయఁబడిన భూతావేశమునుగూర్చి జంఘాలశాస్త్రి యేమి చెప్పునో యదివినకుండనే యాతనినిఁ దూలనాడుట పాడిగాదు. ఈపత్రలేఖకుఁడే పొరపాటు నొందియుండ వచ్చును. లేక మనశాస్త్రి చెప్పిన యభిప్రాయమే సమంజసము కాకుండవచ్చును. ఆతనిబుద్ధి ననుసరించి యాతని యనుభవము ననుసరించి సత్యమని యాతనికిఁ దోఁచిన దేదియో దానిని జెప్పినాఁడు. అది సత్యము కావచ్చును. కాకపోవచ్చును. సంఘమున నుండవలసిన యైకమత్యరీతి యిదియేనా? శాస్త్రి పొరపాటు చెప్పిన నొక్కటి, నీవు చెప్పిన నొక్కటి; నేను జెప్పిన నొక్కటియునా? శాస్త్రి చెప్పినమాటను నీవే చెప్పియుండినయెడల నిన్ను నీవిట్లు దూషించుకొనియుందువా? మనము చెప్పిన యంశములలో నేదయినఁ దప్పున్నదని జనులు మనకుఁ జూపించినయెడల బాగుగ నాలోచించి తప్పగునో కాదో? శాస్త్రముచే యుక్తిచేఁ బరిశీలించి తప్పయిన దిద్దుకొనఁదగును. కాకున్నచో మనయభిప్రాయమే యుపపన్నమని లోకులకు మృదు వాక్యములఁ దెలుపవలయును. అంతియే కాని మీలో మీరిట్లు నిష్కారణవైరమూని యన్యోన్యదూషణమునకై గమకించుట హాస్యాస్పదము కాదా? లోకులలోని కలహములను నివారింపవలసిన మనము మనలో గ్రుద్దులాడుచుండుట నీచము కాదా? జంఘాలశాస్త్రీ యీ లేఖాంశమునుగూర్చి యేమిచెప్పునో విందము." అని నేను గూర్చుంటిని.

అంతట జంఘాలశాస్త్రి లేచి యిట్లు చెప్పెను.

"నేనిప్పుడు చెప్పవలసిన దేమున్నది? అయ్యూరు పోవలయును.

ఆమహమ్మదీయునిఁ జూడవలయును. ఆతనితో నాలుగుదినములు నేను గాలక్షేపము చేసి యాతనిస్థితి యెట్టిదో పరీక్షింపవలయును. పిదప మీ తావునకు వచ్చి నేను గనిపెట్టినదేదో చెప్పవలయును. అంతేకాని నే నిప్పుడు చెప్పఁదగినదేదియు లేదు. కాని యీసంఘమున నింతటినుండి వాణీదాసుఁడైన నుండవలయును. నేనైన నుండవలయును. ఇద్దఱముఁ గూడ నుండుట పొసఁగదు. నే నుపన్యాసకుఁడను, విమర్శకుఁడ నెన్నఁ డైనఁ గాఁగలనుగాని వాణీదాసుఁ డెన్నఁడైనఁ గవి కాఁజాలఁడు. ఈమాట శిలాశాసనము. కుగ్రామములో గుడుగుడుగుంచము లాడువాఁడు కవియా? ప్రకృతిజ్ఞానశూన్యుఁడు కవియా? అసూయాపిశాచావిష్టుఁడు కవియా? సమీచీనయోజనాభావ దుర్భావ్యుఁడు కవియా? కష్టనిష్ఠురవచఃపుంజాసమంజసుఁడు కవియా? మనోలాఘవసనాథుఁడు కవియా? ఈతఁడే కవియగునెడల నింకఁ గవి కానివాఁ డెవ్వఁడు? ఏమి! ఇంక మంగలిపొదియలలో నవలలు! చాకివానిగాడిదవీఁపున శ్రావ్యప్రబంధములు! పారిశుధ్యసంఘమువారి పెంటబండ్లలోఁ బాటలనాటకములు! ఆహా! ఎంతపాపకాలమువచ్చినది! కవి ఎంతలఘువైపోయినాఁడు. కాకియీఁకకున్న గౌరవము కవికి లేదే! అయినవాఁడు కానివాఁడుగూడ నందులకే సిద్ధపడుచున్నాఁడే? ఏమియింతగనున్నది. అయిన నీగొడవ నాకిప్పుడక్కఱలేదు. నేను బోయెదను. తిరుగ నాలుగుదినములలో రాఁగలను. వచ్చి యామహమ్మదీయునిఁబట్టిన పిశాచమును గూర్చిన సత్యమేదో చెప్పెదను." అని తటాలున జంఘాలశాస్త్రి పోయెను. నాఁటి కైదవదినము రాత్రి జంఘాలశాస్త్రి వచ్చి వెకవెకలాడుచు నుపన్యాసపీఠ మెక్కి యిట్లు పలుకఁ దొడఁగెను.

నేను బండారునగరమునకుఁ బోయితిని. మనకు లేఖను వ్రాసిన నాగేశ్వరశర్మయింటికిఁ బోయి యాతనితో నేను "జంఘాలశాస్త్రి" నని చెప్పితిని. ఇతఁడు నన్ను మిగుల గౌరవించెను. "సాక్షి" బాగుగ నున్నాఁడా? యనియు, వాణీదాసుఁ డేమిగ్రంథముల రచియించినాఁ డనియు, నింతకాలమునుండియుఁ గాలాచార్యులు మాటలాడకుండుటకుఁ గారణమేమనియు, బొజ్జయ్యసెట్టి బ్రదికియుండెనా? యనియు విమర్శకుస్వభావమునుగూర్చి వ్రాసిన "సాక్షి" లో మిగిలినభాగము తరువాతియుపన్యాసములోఁ జెప్పఁబడునని వ్రాసినప్రకార మేలచెప్పి

యుండలేదనియు, నేను వ్రాసినలేఖను జూచుకొనియే మీరిచ్చుటకు వచ్చితిరా?" యని యతఁడు నన్నడిగెను. ఇన్ని ప్రశ్నల కొక్కసారి నే నేప్రశ్నమునకు ముందుత్తరము చెప్పవలెనా? యనుకొనుచుండ నంతలో "నామహాష్టునియుఁడు నాకు హితుఁడు. నేను మిమ్మాతని యింటికిఁ దీసికొనిపోయి యాతనితో మాటలాడింతును ర" మ్మని లేచెను. నేనాతని వెంటనే పోయి యాతనిఁ జూచితిని. ఆతఁడు దాదాపుగా నలుబదియేండ్లవాఁడు పుష్టిగా నున్నను సన్ననివాఁడు. గడ్డమును మీసమును గొరిగించుకొనునలవాటుకలవాఁడు. శుద్ధశ్రోత్రియబ్రాహ్మణుఁడువలెఁ బైకిఁ గానఁబడినాఁడు. నాకు హిందూస్థానీభాషలో స్వల్ప పరిచయముండుటచే నాతనితో నాభాషలో మాటలాడితిని. అతఁడు చెక్కు చెదరని మొగముతోఁ గొంతసేపు విని "బాస తెలియదు బాబూ!" అని యనెను. ఆమాట విని నేను వింతపడితిని. తుదకయాతని కుర్దూభాష తెలియనిభాషయగుట కొంత ప్రాభవమో యని నామనస్సులో నెంచుకొని యంతలో "నాంధ్రభాష మాకక్కఱలేదు. అది మాకు సరిపడదు. తెలియదు. దానివలన లాభము లేదు. దానిని విసర్జించితిమి" యనిపలుకు నాంధ్రబాలురమాట జ్ఞప్తికిరాఁగా స్వాపద్విశేషములోఁ బరాపలేశమును మఱచిపోయితిని. జోసంగ జేబు "హాదావడి" లోనో, నానాసాహేబు "గత్తర"లోనో యేకత్తిమొనకో యేరోఁకటి పొన్నునకో యజ్ఞోపవీతవిసర్జనము చేయవలసివచ్చిన యేయారామ ద్రావిడుఁడో యేప్రథమశాఖాబ్రాహ్మణుఁడో యీతని విచిత్ర మహాత్మదీయవంశమునకు మూలపురుషుఁడై యుండవలయునని నే నెంచితిని. ఆతనికి నాకు నంత నాంధ్రభాషలోనే సంభాషణము జరిగెను. భూతావేశమే యని యాతనికిఁ గూడ బూర్ణమయిన నమ్మక ముండెను. కచ్ఛపేశ్వరశాస్త్రులవారిచ్చిన కాగితపుఁ జుట్టలను రెండుదినములనుండి నిప్పుపై వైచి ముసుఁగు బెట్టుకొని యాపొగను బీల్చుచున్నానని యాతఁడు చెప్పెను. పగ లాతనితో మాటాడుట కెవ్వనికిని భయము లేదు. కాని దీపములు పెట్టినతరువాత నాతని నెవ్వఁడు చూడఁడు. ఎవ్వరు దరిచేరరు. అతని సేవకుఁ డాతనికి సాయంకాలము కాకుండనే భోజనము గదిలోనుంచిపోవును తెల్లవాఱువఱ కాతనియొద్ద నెవ్వఁడుండఁడు. ఆతనికి భార్యాపుత్త్రు లెవ్వరులేరు. ఆతనిస్థితి యట్టులున్నది.

"సాహేబుగారూ! ఈరాత్రి నన్ను మీగదిలో మీకు సహాయుఁడుగఁ బండుకొననిచ్చెదరా!" యని నే నడుగుచుండ నాగేశ్వరశర్మ యొక్క బ్రహ్మను నాకుఁ దనకుఁ దప్ప మఱెవ్వనికిఁ దెలియకుండునట్లుగా నా పిఱ్ఱపైఁ దేలు కుట్టినంత బాధనిచ్చు గిల్లునొక్కటి గిల్లినాఁడు. అందు లకు సాహసింపవలదని యాగిల్లునకు వ్యాఖ్యానము కాఁబోలు. అకార ణముగ మీరెందుల కాపదలలోఁ జిక్కుకొందురు? అని సాహేబు గారు ప్రత్యుత్తర మిచ్చిరి. "నాకేమి భయములేదనియు నేను బరిశోధ నకై వచ్చినాఁడననియు" నాతనితోఁజెప్పి యారాత్రి నాగేశ్వరశర్మ మొదలగువారు నిరోధించుచున్నను నాతని గదిలోనే పండుకొంటిని. ఆరాత్రి నేను గంటిమీఁద ఱెప్పయైన వేయకుండ మేలుకొనియుంటిని. ముసలిమానుఁడు ముసుఁగుఁదన్ని దీపాలుపెట్టఁగనే పండుకొనెను. ఆరాత్రి యొక చిత్రము జరిగినది. నాకన్నులారఁ జూచితిని. నాకత్య ద్భుతముగ నుండెను. ఈవింత నేనొక్కఁడ నేచూచుట కాదు. నే నీసంగతి లోకులకుఁజెప్పిన నాయొక్కనిమాట నెవఁడయిన నమ్మునో లేదో యని యెంచి యామఱునాఁటి యుదయమున నాయూరిలో సంపన్నుఁడు సత్యవాదియునగు గృహస్థు నింటియొద్దకుఁబోయి గడచిన రాత్రి జరిగిన వృత్తాంత మంతయుఁ జెప్పగ నాతఁడు గూడఁ దెల్లబోయెను. ఆతఁడు నేను నారాత్రి మహమ్మదీయుని గదిలోఁ బండుకొంటిమి. ఆతఁడు యథారీతిగ నేడుగంటలకే శయనించెను. మే మిద్దఱ మట మేలుకాంచి యుంటిమి. గడియారమొంటిగంటకొట్టు సమయమున నిన్నటిరాత్రి వలెనే యామహమ్మదీయుఁడు లేచి మంచముపైఁ గూర్చుండెను. ఒక నిముస మట్లు కూరుచుండి చివుక్కునలేచి మంచము కోటిప్రక్కనున్న యగ్గిపెట్టెను జేతఁబట్టుకొని గది తలుపుల గొండ్లెముతీసి నిన్నరాత్రి వలెనే వెలుపలకుఁ బోయెను. ఆతనిని నేనును నాసహాయుఁడును వెంబ డించితిమి. ఆతఁడు నడవగది తలుపులు తెఱచి దొడ్డిలోనికిఁ బోయి దొడ్డితలుపుఁ దీసి తలుపులు తిరుగ దగ్గిఱఁబెట్టి వీథిలోని కేగెను. సమీపముననున్న చెరువుగట్టెక్కి నాలుగడుగులలో శ్మశానమునకు నిన్నటివలెనే పోయెను. మే మాతనితోఁగూడ నుంటిమి. ఆతఁడు మమ్మెక్కడఁజూచిపోవునో యని కొంచెము భయపడుచు దాపుననే యుంటిమి. ఆతఁ డంత కట్టుకొనిన వస్త్రముల నూడ్చి చేతిలోనున్న

యగ్గపెట్టెతో నంటించి యది మండుచుండఁగ దానిచుట్టు ప్రదక్షిణము చేసెను. ఆభస్మము నచ్చటనున్న చేఁపలో నుంచి దానిని చెరువు నీటిలోఁ గలిపి తిరుగఁ జేఁదను భద్రముగ నాస్థానముననే యుంచి దిగంబరుఁడై యింటికి బయలుదేఱెను. అతఁడు కనులు తెఱచియే యున్నాఁడు. మమ్ము గూడఁ జూచుచున్నట్లున్నాఁడు. ఆతనికంటె నాలుగడుగులు ముందా తని యింటిలోఁ బ్రవేశించితిమి. అతఁడు వొచ్చితలుపు గొళ్లెముఁబెట్టి నడవతలుపు యథారీతిగ గొళ్లెముఁబెట్టి గది తలుపు గడియవైచి యగ్గిపెట్టెను నటుగ మంచము కోటిగొట్టుఁబెట్టి మంచముక్రింద దూరి శయనించెను. ఈపనులన్నియు నాతఁడు ప్రతిరాత్రమును జేయుచునే యున్నాఁడు. చేయవలయునను బుద్ధితోనే చేయుచున్నాఁడు. కాని తెల్లవారునరికి వానికి రాత్రిచేసిన పని యొక్కటియును జ్ఞప్తియుండదు. Somnambulist అని యింగ్లీషు భాషలో నెవనిఁ జెప్పుదురో యాతఁడే యీతఁడు కట్టుగుడ్డ కాల్చుకొనిన సంగతి మఱునాఁడు తెలియక పోవుట వింత కాదు. ఈస్థితిలోఁ గొందఱు ఉపన్యాసముల వ్రాయుదురు. కవిత్వములఁ జెప్పుదురు. మేలుకొనినస్థితిలో సాధ్యముకాని గొప్ప లెక్కలఁ చేయఁగలరు. కాని మేలుకొంచు వెంటనే యాపను లెవ్వరు చేసిరో ఏమియుజ్ఞప్తియుండదు. నన్మదాపురుకుత్సీయములోని విదూషకుఁడు "నిద్రలో గ్రామాంతరములకుఁ బోవువారు నదుల నీదువారు గూడఁగల"రని చెప్పినమాట నిక్కమాటయో పరిహాసవాక్యమో యని మొదట నేననుకొంటిని. నేను భూతవిషయకోపన్యాసమును "సాక్షి"లో భూతావేశమని చెప్పఁబడుచోట మేధాసంబంధమైన వ్యాధియో Brain and Nervous system జనన కోశసంబంధమగు వ్యాధియో womb మోసమో గైయుండునని చెప్పితిని. Somnambulism అను నీస్థితి Nervous system "నరములకూడిక"తోఁ జేరిన విపరీతస్థితియై యున్నది కావున వాణీదాసా! ఇచ్చట భూతావేశ మేమియు లేదు. నే నసత్యమాడినదియు లేదు నీవు నన్ను దూషించినందులకు 'క్షమింపు'మని వేఁడుకొనవలయును.

---

# సాక్షి

## 15. స్వవిషయసల్లాపములు.

---

ఈదినమున నుపన్యాస మేమియు లేదు. జంఘాలశాస్త్రి సభకు వచ్చెనుగాని యాతనికిఁ గొంచెము దేహములో నస్వస్థతగ నుండుటచే నాతఁ డేమియు బలుకలే ననియెను. కాలాచార్యులు మతవిషయములఁ గూర్చి కాగితముమీఁద వ్రాసికొనివచ్చి చదువఁగలవాఁడు కాని ధారాశముగ నుపన్యాసమీయ సమర్థుఁడు కాఁడు. కవికూడ సభకు వచ్చెను. కాని యాతఁడుకూడ నేమియు నీరాత్రిఁ బలుకలేనని చెప్పెను. "ఒక రాత్రి యుపన్యాసము లేకపోయిన నుర్వికేమి లోటా? ఉన్నయెడల విశేషమా?" యని గొంచి గోటులో మాటలచేఁ గాలక్షేపము చేయఁదలఁచితిమి.

జంఘా—సాక్షీ! బొట్టయ్యశెట్టిమాట యేమిటి? ఆతఁ డిదివఱ కెందును గూర్చియుఁ దన యభిప్రాయమును వెల్లడింపలేదు.

సాక్షి—ఈయింటినుండి మనము మఱియొక విశాలద్వారముగల యిల్లు ప్రవేశించువఱకు నాతఁడు మనతోఁ గలిసి పనిచేయుట కవకాశ ముండదు.

కవి—అప్పుడయిన నాతఁడు కలిసివచ్చునని తోఁచదు. అతనికిఁ దామర దేహమంతయు వ్యాపించినది. "కుష్ఠు" అని కొందఱు చెప్పు చున్నారు.

కాలా—అంత పెద్దరోగము కాదు. కాని దురదచే మిగుల వెత గొంచుచున్నాఁడు.

కవి—తామరకు జీడికంటె సిద్ధౌషధము లేదు.

జంఘా—కవి వైద్యుఁడునుమీనా? అబ్బో! ఇతఁడు జోడు గుండ్లతుపాకివలె నున్నాఁడే!

కవి—ఏమీ! ఒక్కబాణైన నీకు దయోగింపవలెను.

సాక్షి—తిరుగఁ గలహమునకు గణాధిపపూజ నారంభించుచుంటిరా?

కాలా—విష్వక్సేనుఁడని సెలవిచ్చిన బాగుగ నుండునేమో?

జంఘా—స్వామీ! మీరు తెంగలవారుకదా! మీరు మొన్నటి రమేకాదశిరోజున శ్రాద్ధమేల చేసినారు?

కాలా—శ్రాద్ధముగాదోయి! నీపిండము తెగను! సత్యనారాయణ వ్రతము.

జంఘా—మల్లెచెట్టులో మాత్ర మేట విడుతుపోయి యనఁగ "నయ్యో! తులసిమొక్క యనుకొంటి" నని చెప్పినట్లున్నది. విష్ణు భక్తివ్రతముతప్ప నితరవ్రతములేని—లేకయుండవలసిన, వైష్ణవుఁడు విధిగఁ జేయఁదగిన శ్రాద్ధమును మాని చిల్లరదేవతల ప్రీతికొఱకు దేవులాడుట యంతకంటె గొప్పపని యనుకొనుచుంటిని కాఁబోలు!

కాలా—నేను జేయలేదయ్యా! మాయింటి కెవరో వచ్చి చేసికొనిరి.

కవి—ఆలాగా! లేనిపోనిమాటలాడుటలో జంఘాలశాస్త్రికిఁ జాలినవా రెవ్వరు లేరు.

అంతలో సాక్షికొఱకు నెవ్వరో రాఁగ వారివెంట నాతఁడు పోయెను.

కవి—జన్మమునఁ బుట్టిన స్వభావ మెంతకును వదలదు కాదా. కాలాచారీ! ఒకయూర నొకగ్రుడ్డివాఁ డుండెనఁట. ఆతఁడు పుట్టుగ్రుడ్డి యఁట. ఆతఁ డొక రాజసంస్థానమునకు వచ్చి తా నశ్వపరీక్షకుఁడనని వెల్లడించెను. రాజున కీవార్త తెలిసి యాతనిని బిలిపించి చూచెను. జాత్యంధుఁడేమి! అశ్వపరీక్ష యేమి! అని రాజు నవ్వెను. కొన్ని నాళ్లకొక యశ్వవర్తకుఁ డనేకాశ్వములతోఁ దత్సంస్థానమునకు వచ్చి యాతని కాయశ్వములు జూపెను. వానిలో నుత్తమమైన యశ్వమును

రాజు పరిశీలించి తీసికొనెను. ఆగుఱ్ఱమురీతి లక్షణములు కళ మొదలగు నవి చూచి యందఱు సంతసించిరి. రాజున కప్పుడు జాత్యంధునిమాట జ్ఞప్తికి వచ్చి యాతనిఁ బిలిపించి గుఱ్ఱమును బరీక్షింపుమని చెప్పెను. అతఁడు గుఱ్ఱమును జేతఁ దడిమి గుఱ్ఱము బాగుగ నున్నది కాని యిది గేదెపాలవలనఁ బెరిఁగిన కారణముచే దీనికి బురద యనఁగఁ బ్రీతియును నెండయన్న భయము నుండునని యాతఁడు చెప్పఁగ నందఱు నవ్విరి. అంధుఁ డందుపై "మీరు నవ్వఁబోకుఁడు. అశ్వపరీక్షకుఁ డింక గ్రామ ముననే యున్నాఁడు కాబోలు. ఆతనిని బిలిపించి యథార్థమును గనుఁ గొనుఁడు" అని యంధుఁడు పలికెను. అశ్వపరీక్షకుని రాజడుగ "నా గుఱ్ఱముతల్లి దానిఁగని మరణించుటచే దాని బఱ్ఱెపాలతోఁ బెంచితి" నని యాతఁ డొప్పుకొనెను. ఇట్టిరహస్యముల నీవెట్లు కనిపెట్టితివని రాజు గ్రుడ్డివానినడుగ, "నీగుఱ్ఱపుచర్మమే చెప్పుచున్నది" అని యాతఁడు మాఱుపలికెను. "అశ్వపరీక్షయేనా మఱియింక నేపరీక్షనైన నెఱుఁగు దువా?" యని రా జాతనిఁ బృచ్ఛసేయ నరపరీక్షకూడఁ జేయఁగలనని యాతఁడు చెప్పెను. ఉత్తమకాంతారత్నమైన తనరాణిని నీతనిచేఁ బరీక్షింపించవలయునని రాజనుకొని యంధు నందులకయి నియ మించెను. అంధుఁ డంతఃపురములోనికిఁ బోయి రాణి కెదుటఁగూర్చుండి యిట్లు పలికెను. "అమ్మా! నేను కొన్నిమాటలు చెప్పెదను. ఇక్కడను మీరొక్కరే యుండవలయును" అని వేడుకొనెను. అంత రాణి యట్లుసేయఁగ "అమ్మా! నేను నీకుఁ దండ్రివంటివాఁడను, పుట్టుగ్రుడ్డివాఁడను. నిన్నుఁ బరీక్షింప వచ్చినాఁడను. ఆత్మతోనే గాని యక్షితోఁ బరీక్షింపఁజాలను. బట్టి నీయొడలిమీఁద నేమాత్ర మున్నుండి నను నేను బరీక్షింపలేను కావున వస్త్రహీనవుకమ్ము" అని ప్రార్థించెను. అంత "నటులేయయితిని" అని యామె చెప్పెను. "తల్లీ! తిరుగ వస్త్ర ధారణము చేసికొనుము; శ్రమయిచ్చినందులకు మన్నింపుము" అని చెప్పి యటనుండిలేచి రాజునొద్దకు వచ్చి "అయ్యా! మీభార్య దాసికిఁ బుట్టినది" దని చెప్పెను. అంత రాజు కోపావిష్టుఁడయ్యెను. కాని జన్మ రహస్యమును గనుఁగొనఁగ నంధుఁడు చెప్పినమాటయే సత్యమయ్యెను.

"ఇట్టిసంగతి నీవెట్లుకనిపెట్టితి" వని రాజాతని నడుగ నేను గ్రుడ్డివాడ నైననరే నేను కేవలము రాతివిగ్రహము నయిననరే. కాని నాయెదుట నామె బట్టవిప్పుకొనుటచేత దాపీస్త్రీకయని చెప్పితినని యాతఁడు మారుపలికెను. రాజు మిగుల సంతసించి యాతనికి దినమునకు సేరు బియ్యము నొకయరణా బత్తెము నేర్పాటు చేసెను. కొన్నిరోజులు గడచిన పిమ్మటఁ దన జన్మవృత్తాంతము చెప్పుమని రాజడుగ "ఏలినవారు కోమటివానికిఁ బుట్టినారండి" యని యాతఁడు చెప్పెను. అప్పటికి జీవించియున్న తనతల్లియొద్దకు రాజేగి యామెనుండి కత్తినివిని తల్లినడుగ నామె భయవిహ్వలయై వైశ్యసంపర్కము సత్యమని యొప్పుకొనెను.

ఇది "నీకెట్లు తెలిసె" నని రాజాతని నడుగ "నింతవిద్యాయుక్తున కొక సేరుబియ్యము నేర్పాటు చేసినప్పుడు నీవు కోమటివని కాక మఱెవ్వఁడవై యుండుదువు" అని నేనూహించి యట్లు చెప్పితి నని యంధుఁడు పలికెను. కావున నెంతచదువుకొనినసరే! యెంతవయస్సుగలవాఁడయిన సరే! యెంత సత్సహవాసమున్నవాఁ డయిననరే! జనుఁడు పుట్టుతోఁ బుట్టిన బుద్ధినిమాత్రము విడువఁజాలఁడు.

జంఘూ—కవీ! మహాకథకుఁడవైతివి. కలియుగసూతుఁడ వయితివి. సెబాస్ కథలు చెప్పుట యెవరియొద్దనుండి యెఱవు తెచ్చికొంటివి! ఎరువుముక్కువలె నీకిది యెరవణముగ నుండ గలదా?

కాలా—ఎరువు ముక్కేమిటి?

జంఘూ—ఒకనికి ముక్కు లేదు. ముక్కునఁగ నాతనికి ముచ్చట యింతింత కాదు. కాల్పనికమగు నాసికను గడియింపవలయునని మిగుల కుతూహలముతో నుండెను. ముక్కెవ్వఁ డెరవిచ్చును? ఒకనాఁ డాతఁడు వైద్యునియొద్దకుఁ బోయి నాసాపుటప్రదానము నపేక్షించి యాతనికాళ్లఁ బడెను. అంత నావైద్యుఁ డీతని తొడనుండి కొంత మాంసము, చర్మముతీసి యామాంసమును ముక్కువెక్కుగలదానిగఁ జేసి దానిపై నాచర్మఖండమునుఁ గప్పి దానిని నాసికాస్థానమున నదికింతునని చెప్పెను. అందులకు ముక్కిడి మిక్కిలి సంతసపడెను. కాని నూతన నాసికానిర్మాణమునకై పురాణోరుచ్ఛేదనమున కంగీకరించుట బుద్ధిలక్షణము కాదని యందుల కంగీకరింపఁడయ్యెను. తుద కెట్టులో తంటాలు

పడి మఱియొకపురుషుని భుజమునందలి మాంసమును దీయించి దానితో
నొక చేత ముక్కును సింగారించుకొనెను. కొన్నినాళ్లకీ పెట్టుముక్కు
చల్లఁబడి కుళ్లిపోయి యూడిపోయెను. ఎందులకూడినదోయని యాలో
చింపఁగ ముక్కుకండనమ్మిన పుణ్యపురుషుఁడు పరలోకగతుఁడయ్యెనని
తెలియవచ్చినది. మనసొంతముక్కయిన మనకు శృంగారముకాని
యద్దెముక్కపాయకరముకాదా ? ఒకనిని జూచి నీవు కవిత్వము తెచ్చి
కొనుటయే హాస్యాస్పదముగనుండఁగ గథకత్వముగూడఁ దెచ్చిపెట్టుకొని
యింకఁ దక్కఁ దలఁచుకొనలేదా యేమి ?

కవి—ఏమికథఁ జెప్పితివి ? ఎంతసందర్భముగఁ జెప్పితివి ! పృష్ట
తాడనము దంతభగ్నమనునట్లున్నది. ఇఁకఁ జాలించు.

కాలా—తగవులెందులకు ? ఏదియో యిష్టగోష్ఠి సలుపరాదా ?

జంఘా—ఇష్టగోష్ఠి సేయుభాగ్యము. కాలాచారీ ! తల యింత
మాయఁబెట్టుకొంటివేమి ?

కాలా—క్షురకుఁడు పదికములోనికైన దొరకకుండనున్నాఁడు.

కవి—అబ్బో ! క్షురకుల కిప్పుడు గురుఁడేకాదశమందున్నాఁడు.
ఎక్కడఁజూచిన మామిడాకుతోరణములు; మంగళ్ల వీక్షణములు.

జంఘా—శుభకార్యము లెన్నియైన జరుగుచున్నవి. కాని
కాలాచారీ ! యీయుత్సవకల్లోలములో సీమంగళమహోదయములో
నీవుగూడ దేనినయిన ముడిపెట్టుకొనరాదా !

కాలా—నేను నిజము చెప్పుచున్నాను. నాకుఁ బోడుముమీఁద
నున్న మమకారము పొలఁతిమీఁద లేదుసుమా ?

జంఘా—నిజమే. సద్గ్రహణపారీణునకు ముక్కులోఁ బోడుము
కంటెఁ బక్కలోఁ బడఁతి యెక్కువకాదు. కాని లోకసంగ్రహార్థమయిన
నీవుచేసికొనుట మంచిదనుకొందును.

కాలా—రామ రామ బ్రహ్మచారినైయుండక నా కీప్రారబ్ధ
మెందులకు ?

కవి—లోకసంగ్రహార్థముచేసికొనుటయేల ? చేసికొనువారంద
ఱందుకొఱకే చేసికొనుచున్నారా ? అతనికేమి ? ఇఁకఁ జిన్నవాఁడు. పండి
తుఁడు-మిగుల దృఢశరీరుఁడు-భార్యను సంభాళించుకొనలేక పోవునా ?

జంఘా—సాపాటుపుష్టికి సంబాళింపునకుఁ జాలభేదమున్నదిలే. "మోటారుకారును" ముందునకుఁ బోకుండ నాఁపవచ్చును గాని కాలి దురదయాలినిఁ గడ ద్రొక్కకుండ నాఁపఁగఁగదా. సస్తేమునఁ బదునాలు బండ్ల బరువును జెడఁగనీకుండఁ బట్టవచ్చును. కాని ప్రక్కను జల చిత్తపుఁ బలుగాకిని బెసగనీకుండఁగ బట్టలేము. ఇనుపగొలుసు విరువ వచ్చును. కాని మగువల పులుసును విఱుగఁగొట్టలేము. ఆఁడుదాని యోగ్యత మగవాని యాంహాంశక్తిలో లేదు. పెన్నుపాము బింకములో లేదు.

ఒకఁడు బహుదార్ఢ్యసంపన్నుఁడై [illegible]ండెను. ఆఱడుగులపొడ గును నాలుగడుగుల వెడల్పుగల బల్లపయిఁ గొంగళిను గూర్చుండఁ బెట్టి తనపండ్లతో నాబల్ల నాతఁడెత్తినాఁడు, ఆఱువందల 'పౌనుల' బాగటను గడుపుపయి నుంచుకొని నాలుగుసుత్తెటలతో దానిపయిఁ గొట్టించుకొనినాఁడు. కుర్చివెనుక కాలును పంటితోఁబట్టి పైకిలేవఁదీసి నాలుగుగజముల యెత్తునకుఁ బోవునట్లుగా నెగవైచినాఁడు. ఇంక ననేకాద్భుతచర్యలు చేసినాఁడు. ఈతఁ డొకకాంతను బెండ్లి చేసికొని నాఁడు. ఆతని కామెయందు మిక్కిలి యనురాగము. ఆమెకూడ నీతని వరించియే పెండ్లిచేసికొనినది. మదించి మతిలేక యెగిసిపోవుచున్న యేనుఁగునయినఁ దోఁకఁబట్టుకొని కాళ్లు "దబాయించి" యాఁపశక్తి గల యీతఁడు సుకుమారియు, నబలయు; నాలుగడుగులున్నరయెత్తు గలదియు నయిన యామెను కౌఁగిటిలో నిలుపుకొనలేకపోయినాఁడు. ఆమె యసంతుష్టిచే గడ ద్రొక్కనారంభింపఁగ నీతఁ డాగ్రహముచేఁ దెయితక్కలారంభించెను. ఈ వెఱ్ఱిముండకొడుకు మునుపటికంటె నిఁక నొకబిందెపాలుఁ ద్రాగియు నింకొకబుట్టెడు కోడిగ్రుడ్లు తినియు, మఱి కొన్ని వేలు దండెములు తీసియు నిల్లాలిని సుఖపెట్టవలయు నని మనుష్య శక్తికిఁ బరమావధి యగునట్లు పాటుపడెను. 'ఊహూ ఊఁ' వంట యింటిలోఁ గూరుచుండి యీతఁడు కోడిపులావు చేయించుచుండఁగా నామె కిటికీలోఁ గూర్చుండి కోడెగాండ్రకుఁ జేసన్న చేయుచుండెను. ఈతఁ డశనాధికతవలన లాభమేమియు లేనట్లుకాంచి వీర్యవృద్ధి లేహ్యముల సేవింప మొదలిడెను. మదనకామేశ్వరాదుల లోనికి మర్దనములు పైకి నుపయోగించెను. కాని యామె మనసు పరపురుషులమీఁదను

చూపు భర్తపైని నిలిచియుండెను. నల్లమందు గంజాయి మొదలగు స్తంభనద్రవ్యములుకూడ నుపయోగింపఁబడెను. ఈతఁడు యత్నిత కార్యసాఫల్యమును గనఁజాలనివాఁడయి ఖేదపడెను. భార్య దుష్ట వ్యాపారముమానలేదు. ఈతఁడాత్మహత్యకై సంకల్పించుకొనెను. తలఁ బగులఁ గొట్టుకొని చచ్చెదమన్న కసరతున గట్టిపడినది. పగులునో లేదో- రయిలుబండి క్రిందఁబడి చచ్చెదమన్నఁ బదునాల్గుమోటారుబండ్లు మీఁద నుండిపోఁగఁ జెక్కుచెదరనివాఁడు చచ్చునని యేమి నమ్మకము. అంతట నేఁబది ధాన్యపుగింజలయెత్తు 'Sulphonel' తీసికొని——

అంతట నెవ్వరో వచ్చి బొట్టియ్యసెట్టికి రోగము హెచ్చుగనున్న దనియుఁ, దొందరగనున్నదనియు, సాక్షికూడ నక్కడనే యున్నాఁ డనియు, మీరందఱు రావలయుననియు రోజుకొనుచుఁ జెప్పెను. అంత మేము తొందరపడి పనికిమాలిన యీాపలుకులను గట్టిపెట్టి సెట్టియింటి కయి పోయితిమి.

# సావిత్రి

## 16. మఠాధిపతులు

బొజ్జయ్యసెట్టి యనారోగ్యస్థితిలో నున్నాఁడను కొంతకాలమునకే క్రిందటిసారి సభ్యు లందఱును సభ చాలించి యింటికిఁ బోవుటకై పరుగెత్తిరి. విష్ణుమూర్తికి బొడ్డునఁ దామర, త్రిగుణాత్మకునికి చేతిలోఁ దామర. బ్రహ్మకుఁ బిడ్డలక్రింపఁ దామర. నాసి సెట్టి కాపాడిన వస్తువు తామర. ఓ! ఒక్కటే తామర! ఏఁబదిగాదు! సర్వవ్యాపకత్వమున దీనికి బ్రహ్మదేవుఁడే సాటి. శాశ్వతత్వమున నక్షత్రమే సాటి. అప్రతిహతమై, యనిర్వచనీయమై, యనాదిమధ్యాంతమై, గృహపాలకజీవన విరాగతోజ్జ్వలమైన యీవస్తువు పరవస్తువుగు బోలియున్న గనుకనే చెప్పనొప్పును గాని యత్యధికోపముగ నుండునని చెప్పవీలు లేదు. కందమూలాది నివారణార్థమై కల్పింపఁబడిన యొకయిత్తడిచేయి వలనఁ గావలసినంతపని జరుగకుండుటచే దానికిఁ దోడుగ మఱియొకటి నూతనముగ నిర్మింపఁబడెను. ఈ రెండు నాతని చేతియొకహస్తము నాశ్రయించి యొఱదీసిన కత్తులవలె యొడలికొంతలకై యొదుపువైచి యుండును. ఇంత లోకాతీతమైన తామరకుఁ గారణ మేమైయుండునో సెట్టి తెలిసికొనఁగోరి యెఱిఁగినవారి నెఱుఁగనివారిఁగూడ నడుగనారంభించెను. ఈనడుమను బదిసంవత్సరములనుండి నిరాఘాటముగాఁ దద్దినముల బ్రాహ్మణార్థభోజనము ననుభవించి పితృకర్మకర్తలకుఁ బితృదేవతలకు నడుమ సంధానకర్తయై చాకచక్యముతోఁ బ్రవర్తించి యిప్పుడు కొలఁది మాసములనుండి వ్యాధిగ్రస్తులకుఁ బాకహస్తకింకరులకు నడుమ నాయకారఘ్ఁబనిని నిర్వర్తించుచుఁ దన మొదటివృత్తికి మఱింతవన్నెయు

వాసియుఁ దెచ్చుచున్న దేశీయభిషగ్వరప్రభులగు తిరుపతిశాస్త్రులగారి నిందునుగూర్చి సెట్టియడుగ మొదట నాతనికి శ్లేష్మపైత్యతత్త్వమనియు శ్లేష్మము క్రమముగ ఘనీభవించి బరువైయుండ వాతముగఁ గ్రిందకు జారినదనియుఁ బైత్యము లఘువైనదగుటచే జఠరదీప్తిచే నంటుకొని సెగలు పొగలతోఁ గ్రమ్మి దేహమునంతయు వ్యాపించి నల్లగ మాడ్చి వైచుటచే నొడలంత దగ్రుపులు పుంస్లై బయలుదేఱిననియు "సుష్మముష్ణేన శీతల" మ్మను న్యాయముచే రసకర్పూరము నిత్యము సేవించిన యెడలఁ దామర నివారించుననియు నాతఁడు సచ్చికిత్సానిర్దేశ రోగనిదాన మొనర్చెను. పశువులగొంతులు గోయుట మాని యీ నవము నరమేధమును సంకల్పించి యాచరించుచున్న బుడేమియాసాహేబుగారిని సెట్టి యీవిషయమునుగూర్చి యడుగ "నీనుమునకు నీరంటునెడలఁ ద్రుప్పు పట్టునట్లీతనిశరీరమున నీరంటుటచే నొడలెట్లు త్రుప్పుపట్టుచున్న దనియు లోనినీటిని హరించుటకై నిత్యమును నేపాళపుమాత్రలు సేవింపవలయు" ననియు నతఁడు పిల్లిగడ్డ మల్లలాడుచుండ "బిస్మిల్లా" యనుచు నుపన్యసించెను. కర్మవిపాకజ్ఞుఁడగు గరళకంఠశాస్త్రుల నతఁ డిందుఁగూర్చి యడుగ "నాతఁడు పూర్వ మొక చోరుఁడనియు నాతఁ డొక విటఁతుపునింటికిఁ గన్నము వైచి యామె తనధన మెచ్చటనున్న దో చెప్పకపోవుటవలన నాతఁడు దూలగొండినూగు నామె యొడలికి రాచినట్లును దత్పాపనివారణార్థముగ నొక బ్రాహ్మణున కాతఁడు సదక్షిణాకముగఁ జందనచర్చతోఁ బీతాంబరము లొడలఁ గప్పవలయు" ననియు నాతఁడు చెప్పెను. ఒకజ్యోతిషికుని బిలిచి యాతఁడడుగ "జన్మపత్రమున నతనికిఁ గుజుఁడు నీచపడెననియుఁ దత్కుజుఁడే గోచారమున ద్వాదశస్థానమున నుండెననియు నాతఁడే యిందులకుఁ గారణమనియు నొక పుట్టెడుకందులను రక్తవర్ణవస్త్రసహితముగ నొక బ్రాహ్మణునకు దానమిచ్చుటయేగాక సర్వగ్రహములకు యథారీతిని శాంతులు చేయించిన మంచి"దనియు నాతఁడు చెప్పెను. ఒకయెఱుకతను బిలిచి యాతఁ డడుగ "నీతనితోఁ బూర్వముకలిసి వ్యాపార మొనర్చిన యాతఁ డీతనికిఁ జేతఁబడి చేసెననియుఁ బంచవర్ణముల యన్నము పరమాన్నము నాతనికి దిగఁదుడిచి కారింగువతోఁ బొగవైచి యాయన్న మూరికుత్తరముగా గోధూళివేళ మూఁడుదారులు కలియుచోటఁ బాఱఁబోయవలయు"

ననియుఁ జెప్పెను. ఈసాధనసామగ్రిలో దేని నవలంబించుటకును దోఁచక బోల్తియయ్యసెట్టి నాతో నిదివఱకున్నగాఁ జెప్ప నాలోచన మడిగెను. అంతట నే సెట్టి సాధనసామగ్రిపు వేరొక స్థలము వారెవరిఁ బరిశ్రాద్ధన ప్రాశస్త్యములఁ గూర్చి యడిగితిని. పెద్దగుమ్మస్తావారు మహాత్మ్యవైద్య వైద్యులఁ జెడఁబెట్టి "కర్మ్యాదముల్ గలిగి మనసుఁ బెదిని మఱియొకటి లే"దని కంఠోక్తిగాఁ బలికెను. తొంటినంబివారలు "మంత్రశక్తి" కలుగక పోయినయెడల "దండ హాజరాత్" అని దృఢనిశ్చయముతోఁ బలికిరి "బమ్మన్ సైతాన్" అని మహాత్మ్యసు గుంపు పంక్తిగా బోధించెను. "గ్రహ శాస్త్రమంతయుఁ గర్మవిపాకము కాలక్రమ పరిణామ మాత్రమగునది కాదని పూర్వోత్తరజన్మజ్ఞాన నిశ్చయము కల్గిన గ్రహశాంతి మూలకమగు గ్రహాచారమే ముఖ్యమనుచు కొండొకచో గణించెను. "ఎన్ని మందులైన నెన్ని కర్మచికిత్సలైన నెన్ని గ్రహశాంతులయిన నెట్టున్నను దిగఁదుడుపునకు గబ్బిలపుఁ బెంట ధూపముఁ గాని నడపిన జెవి గోయించుకొందు" నని చెవిటిముసలి యొక్క స్త్రీసూక్తి నాలించెను.

ఇట్లెవరిమట్టునకు వారే యగ్రగణ్యులు; యథార్థవాదులు. మిగిలినవారు నీచులు. దొంగలు. కల్లుగీతలోనున్న గౌరవము కవిత్వపు వ్రాతలో లేదని గవలవాని నమ్మకము. కన్నపు ప్రేతలోనున్న ఘనత, ధిషణాచాకచక్యము, తదనఘాటిలో లేదని కన్నగాని నిశ్చయము. పండితు లెట్టిసేలువును భుజమునఁ దాల్చి శాస్త్రజ్ఞానగర్వమున విఱ్ఱవీగఁగ రంగూసుకట్టుపొదినిదాల్చి రాజుగారిచ్చిన సింగపుఁదలాటపు మురుగులతో మంగలి లోకాతీతుఁడై వర్ధిల్లును. ఉద్యోగి కలపుఁబోటు లచే జీవనహానిచేసి యెంత క్రిందుమీఁదు తెలియకయుండునో పశు మారకుఁడు కత్తిప్రేటుచేఁ గలిగిన యానందముతో వానిపై నెగిరి యాడును. ధాన్యాదుల నమ్ముకొని వర్తకుఁడు మోటారుబండ్లలో నెట్టు లూగులాడునో తనసౌష్ఠవము నమ్ముకొని వారకాంత తూగుటుయ్యెలలో నంతకంటె నెక్కువగఁ గులుకుచుండును. కవియొకఁడు పలికినట్లు-

ఎఱుకనికిఁ దనపంది భూమీశుపట్టి
గజముకంటెఁ బ్రశస్తమై కానిపించు
మిండనికిఁ దనకరిబోసి మెల్లసాని

తనకంటె ఘనుఁడు లేడనియుఁ దాను లోకోత్తరుఁడనియు వెఱ్ఱి ప్రతిమనుజుని కుండును. తనస్వరూపము మంచిది. తనగుణము మంచిది. తననడువడి మంచిది. తనప్రవృత్తి మంచిది. యను నహంకారావమూలకోన్మాదము సర్వజన సామాన్యమైయున్నది. ఇట్లు జనప్రకృతినిగూర్చి యేమేమో మనసున నూహించుకొనుచుఁ బండుకొంటిని. అంతట నొక స్వప్నముగలిగెను.

బొట్టియ్యసెట్టి విశేషవ్యాధిగ్రస్తుఁడై యుండెను. మంచముపై నిద్దఱుజను లాతనిఁబట్టుకొని కూర్చుండఁబెట్టిరి. అతఁడు మిగులబాధ పడుచుఁ దల యొకప్రక్కకు వ్రాల్చి కూరుచుండెను. ఆతనిచేతిని దర్భ ముడి యుంగరమున్నది. మంచమున కెదుటఁ గొందఱు బ్రాహ్మణులు కూరుచుండిరి. జీవప్రాయశ్చిత్తమంత్రములుకాఁబోలు చదువుచుండిరి. కొందఱు గ్రహశాంతులు చేయుటకై వరుణాలు తీసికొనుచుండిరి. ఇంతలో నొకబ్రాహ్మణుఁడు చేత గిండిఁబూని ప్రవేశించి పంచగవ్యప్రాశనమంత్రమును జదువుచు నాతనినోటి కుద్ధరిణితోఁ బవిత్రగోమూత్రాదికతీర్థము నిచ్చుచుండెను. అంత బ్రాహ్మణులందఱు గొల్లుమనిరి. నేను స్వప్నముననే యదరిపడి బొట్టియ్యసెట్టి కాలధర్మము నొందెనని జడిసితినిగాని యట్లుకాలేదు. "శతంజీవే" యను నాశీర్వచనపుఁ బనసను బ్రాహ్మణులంద ఱొక్క మొగిఁ గంఠములఁగలిపి యుచ్చైస్స్వరములఁ బఠించి మంత్రాక్షత లతనిపై వర్షించిరి. అంత ఫలప్రదానము ప్రారంభమయ్యెను. "కర్కటసోమయాజులుగారూ! మీరద్వైతపక్షమునఁ దాంబూలమును స్వీకరింపు." డని యాబ్రాహ్మణసమాజములో సభాపతికాఁబోలు పలికినాఁడు. అంతటఁ గొంతసేపు సభ నిశ్శబ్దముగ నుండెను. అంత నొకబ్రాహ్మణుఁడు తీండ్రమునలేచి "కర్కటకశాస్త్రి లేపాటిఘనుఁడు? ఏమంతచదువుకొనినవాఁడు? ఏమంతశిష్టతఁ గలవాఁడు? ఏపాటిసద్గుణసంపన్నుఁడు? ఏమంతవయోవృద్ధుఁడు? అద్వైతమతతాంబూలము నాతఁడేల తీసికొనవలయును? ఆతఁ డపత్నీకుఁడై యింట నొక్కఁడుండుటచేత నాతని కద్వైతసిద్ధిమైనదా?" యని యుత్కంఠమున హుంకరించెను. "నీవలె ఘుండసుంచుకొని ద్వైతసిద్ధినొందలేదులే" యని యొక్కఁడు సభలో నాతనిఁ బరిహసించెను. "ఉంచుకొనలేదా? ఆతనియిల్లూడ్చుదాసిద్దైన బోసినూకాలి బట్లతలపై

బాసికముగట్టిన బోడసన్న్యాసులారా [illegible]!" [illegible] "సన్న్యాసత్వము నకు దూరా" యని కొందఱు కేకలు వేసిరి. [illegible] "నాయుష్య మున కొంతకాలమున్నదో [illegible]. [illegible]! [illegible] వేమి ? తీసికోతాంబూలం" [illegible]. [illegible] గతి [illegible]గదా చార్యులుగా [illegible] కగం బ్రాకనిచ్చి [illegible] "[illegible] వ్రతునియాధిక్య మేమి ? అతడు ముందరగా. తాంబూలము పుచ్చుకొనేల ? రామానుజ మతస్థులుండ మాధ్వమతస్థులుండ సగ్ర తాంబూలమును కన్నె వ్రతి సిద్ధ పడనేల ? మతత్రయమునకిచ్చిన తాంబూలములు త్రిమతస్థులు సమముగా సమకాలమునఁ బుచ్చుకొనవలయునుగాని ముందెవ్వడును దీసికోఁ దగదు." అని చెప్పెను. ఆచార్యులుగా నాడినది న్యాయమని సభలోఁ గొందఱామోదించిరి. "ఇచ్చట మాధ్వు లెవ్వరైననున్నారా ?" యని సభవారొకని నొకఁ డడుగ నారంభించిరి. అంతట నొకమూలనుండి యొకఁడు జేనెడంగవస్త్రము వాఁడు. వడిఁదిరిగిన మీసాలవాఁడు. కొంచెము కుచ్చువిడిచిన నెత్తిగాపంచవాఁడు. నొసిచందనపుడాగుల కణతలవాఁడు. భూమచ్ఛదాగ్ని స్పర్శనమునఁగాబొలు నల్లపడిన పెదవులపైఁ గడచినరాత్రి దొ తాంబూలక్రిమ కాసంతగలవాఁడు, సకిలించుచు లేచి "నేనుంట" నని ముందునకు వచ్చెను. ఈవ్యక్తి లక్ష్మణ రావుగారి వంటయింటిలోని భీమావతారమని గొల్లుగ గ్రహించిరి. వంట పూటికొంతకుఁ బరిపతుప్పుజాసహిత తాంబూల మేలాయని కొందఱు గొణిగిరి. అంత నామాధ్వుఁ డుత్కంఠమున "సభవారు గుజగుజలు పోనక్కరలేదు. ఉదరపోషణార్థమై న్యాయముగఁ జేసికొనువృత్తులలో గరిఁటబట్టుట లోపముకాదు. కమలముపట్టుట ఘనతకాదు. కావడిమో యుట లోటుకాదు. కంఖాణమెక్కుట ఘనతయుగాదు. మీరిచ్చినది మతతాంబూలము కాని యదృష్టతాంబూలము కాదు. మీరు చేతిలో సిబ్బిగరిఁటెజూతురా ? భుజమూలముల శంఖచక్రములు చూతురా ! పిఱ్ఱపై గావంచఁజూతురా ? ఫాలమునఁ గమలగంధము చూతురా ! మూతిపై మీసాలఁజూతురా ? మదిలోని ముఖ్యప్రాణమూర్తిని జూతురా ?" యని పలికెను. బెండకాయబొట్టువాఁడు పెంకిముండవాఁ డని కొందఱు గుసగుసలాడి కిసుకున నవ్వుకొనిరి.

అంతట నీముగ్గురును ఫలప్రదానమునకుఁ బళ్లెరమునొద్దకుఁబోయి నిలువఁబడిరి. విసనకఱ్ఱ యుప్పుపెట్టుకొని కోపమూపుల నద్వైతివంకఁ జూచుచున్న వైష్ణవుఁడు "అదిగో పళ్లెరము పై ముందేల నీవు చేయి వైచెదవు? అప్పుబొట్టుటునుదత్వైతము పోనిచ్చుకొంటివికా" వని వీవనతో నొక్కపోటతనిచేతపైఁ బొడిచెను. అంతట నద్వైతి పళ్లెముమీఁదఁ బెట్టుచున్న చేతి నామమాయునామమాలయాతనికిఁ గల్లముపైఁ గట్టిగఁ బెట్టెను. సభ గగ్గోలుపడుసందడిలో మాధ్వుఁడు తనతాంబూలమును దీసికొని మీసాల సవరించుకొనుచుఁ బోయెను. అంత సభవారు రీమత శత్రుల పెద్దలు సఖ్యపఱచి యిద్దఱొకసారి తాంబూలములఁ దీసుకొనుఁ డని యేర్పాటు చేసిరి. ఇద్దఱొకసారి పళ్లెమునుండి తాంబూలముల లాగికొనుటలో బలహీనతతోఁ గూరుచుండిన బొజ్జయ్యసెట్టి ముందు నకుఁ బడెను. కాని కడుపు తలను గాపాడెను. మాధ్వుఁడు తాంబూ లమును దీసికొనిపోయినజాడ నెవ్వఁడును గనిపెట్టనేలేదు. ఆతఁడేడి యేడని గొల్లరు చూచిరి. అయ్యయో! మాధ్వుఁడు ముందుగాఁ దాం బూలము దీసికొని మతద్వయము నవమానించినాఁడని యంత ఉగ్రు లయిరి. ఈమాఱునుండి మాధ్వతాంబూలమును మానిపింపవలసిన దని కొంద ఱుద్ఘాటించిరి. అంతలో "ఇదుగో మాధ్వుఁ డిక్కడనే యున్నాఁడు. ఎక్కడకును బోలేదే" యని యొక్కఁడనెను. అంతలో "నీవుకూడ మాధ్వుఁడవే! ఆతఁడుకూడ మాధ్వుఁడే! ఇతఁడుకూడ మాధ్వుఁడే! అయ్యయో! అందఱు మాధ్వులే నేనుగూడ మాధ్వుఁ డనేకాఁబోలు" ననిరొకఁడు భయాశ్చర్య కంపితకంఠమునఁ బలి కెను. అట్టి మెఱపు మెఱసినంతలో బొజ్జయ్యసెట్టి కూరుచుండిన మంచము పెద్దతాయియయ్యెను. ఆ తాయి యట్లెయట్లె యెదిగి యేడుకొండలయ్యెను అదిగో శేషాచలము. అదిగో మోకాళ్లపర్వ తము. అంతలో బొజ్జయ్యసెట్టి శంఖచక్రధారియగు శ్రీవేంకటేశ్వర నామక మహావిష్ణువిగ్రహ మయ్యెను. సెట్టి నిదివఱకుఁ బట్టుకొనియున్న వారు శ్రీభూనీళామహాదేవు లయిరి. ఇద్దఱిచేతులు రెండు జయ విజయు లయ్యెను. ఓ! కలియుగ వైకుంఠము. శ్రీవేంకటరమణా! శ్రీనివాసా! యను మహానాదములతోఁ గొండ లెక్క స్త్రీపురు షులు, సాదువులు బైరాగులు, వేలు లక్షలు కానఁబడిరి. కొండక్రింద

నీమాధ్వసమాజమంతయుఁ జేరినని. ఎక్కడఁ జూచిన బంచముద్రల వారే! ద్వాదశోర్ధ్వపుండ్రధారులే! తులసీమాలానుషక్తులే. శ్రీనివాస నామస్మరణ పరాయణులే. ఓ! నేలయీనినట్లున్నది. ఒక శాలలోఁ గుండలాలపండితులు చేరి శాస్త్రచర్చలు చేయుచుండిరి. మఱియొకచోట మధ్వాచార్యకృత గ్రంథములను సవ్యాఖ్యానముగఁ బఠించుచుండిరి. సుధాభాష్య కాలక్షేపమును మఱియొకచోటఁ గొందఱు చేయుచుండిరి. మణిమంజరి మధ్వవిజయము మొదలగు గ్రంథములను మఱియొకచోటఁ జదువుచు బౌద్ధులను బ్రచ్ఛన్నబౌద్ధులను బహుభంగుల దూషించుచుండిరి. మఱియొకచోఁ దంబురాలు చేబూని కాళ్లకు గజ్జెలు గీలించి చిప్పతాళపుహంగుతోఁ బురందరనామములు కర్ణపేయముగఁ గొందఱు గానముచేయుచున్నారు. మఱియుఁ గొన్నిచోటుల వ్యాసపీఠములపై భాగవత రామాయణములనుంచి పురాణకాలక్షేపమును జేయుచున్నారు. ఈవేంకటేశ్వరక్షేత్రమునఁ జేరిన మాధ్వులలోఁ బురుషులకంటె స్త్రీలెక్కువగనున్నారు. కొర్నాటి చీరలవారు, బనారసు కోకలవారు, బరంపురపుఁ బీతాంబరములఁ వారు, సన్నకుసుంబాచీరలవారు, గోచికట్లవారు, నూడకట్లవారు, చుట్టుత్రిప్పులవారు, మేలిముసుగులవారు, వ్రేలుముళ్లవారు, జడచుట్లవారు, వంకకొప్పులవారు ననేక వర్ణస్వరూపవయోలావణ్య విలాస వైఖరీ సహితలగు వారెల్ల నాయూరఁ జేతిపిల్లలతోఁ జంకపిల్లలతోఁ గడుపుపిల్లలతోఁ జేరిరి. పుష్పించిన నందనవనమువున్నట్లీయలమేలు మంగాపురము పురంధ్రీమణి సహితమైయున్నది. కలలో నిది తిరుపతిలోఁ గలిసిపోయినది. ఈస్త్రీలలోఁ బుణ్యస్త్రీలకంటెఁ బూర్వసువాసినులధికముగ నున్నారు. పురాణములఁ జదువుచోట్లనేమి, పురందరనామములు పాడుచోట్లనేమి, మతచర్చలు జరుగుచోట్లనేమి, శాస్త్రవాదములు జరుగుచోటులనేమి, నూతనముగ గ్రంథములు వ్రాసి కవులు వానినిఁ జదువుచోటులనేమి, బహుమాకృతులకై పరీక్షలు జరుగుచోటులనేమి, వంటయిండ్లలోనేమి, వడ్డనసాలలనేమి, నాటకశాలలోనేమి, చందనపుగిన్నెలచాంచిప్పలబజారులనేమి, యిక్కడక్కడ ననునియమము లేకుండ నీవెలివీఁపు వేపారివిజంతువులు సర్వథా వ్యాపించియున్నారు. వీరు బారులుగట్టి కర్ణాటకభాషతో మాటాడు

కొనుచుఁ గొండల నెక్కుచుండఁగ నంతరిక్షమున నొకదిశనుండి మఱి యొకదిశకుఁ గొంగలబారులు "గిరుగాటు" మనుచుఁ బోవుచున్నట్లుండెనని యాంయూరికవియే యొక పద్యమును జదివినాఁడు. మహాభేరీనాదములును, ఢంకారవములును, ఘంటానినాదములు నంతట వినవచ్చెను. శ్రీమదుత్తరాది మఠస్వాములవారు శ్రీమద్వ్యాసరాయ మఠస్వాములవారుకూడ నక్కడకు దయచేసిరి. వారు దేవతార్చాకలనాపరాయణత నుంటచే నీవాదములు వెలువడిన ట్లూహించితిని. మఠముల వైభవములు, శ్రీరామచంద్ర పీఠముల శృంగారములు, శ్రీస్వాములవారల పవిత్రస్వరూపము లవర్ణ్యములుగ నున్నవి. అప్పుడు మధ్యాహ్నము రెండుమూడుగంటల నడిమిసమయము. భోజనమునకు శాలలలోని కందఱుఁ బోవుచున్నారు. అవి తిరుపతిమాధ్వ సభాదినములని నే ననుకొంటిని. విశాలశాలలలో లెక్కలేని పఙ్క్తులు దీర్చి భోజనమునకెల్లరు కూరుచుండిరి. అంతలోఁ బెద్దకలకల మారంభమైనది. ఎవ్వరును దానికిఁ గారణమును గ్రహింపలేదు. తుదకుఁ గొందఱు మాకు భోజనమక్కఱ లేదని విస్తళ్లయొద్దనుండి లేచిరి. వీరిని జూచి మఱికొందఱు లేచిపోయిరి. శ్రీమదుత్తరాది మఠాధిపతులకును, వ్యాసరాయ మఠాధిపతులకు యుద్ధము జరుగుచున్నదని ప్రతీతి వెల్లడియైనది. సర్వసంగపరిత్యాగశీలు రగుసన్యాసులేమి సమరమునకు సన్నద్ధులగు టేమియని నా కాశ్చర్యము కలిగెను. మతవిషయకవాదములలో బద్ధదీక్షామత్సరులై యున్నారేమోయని యనుకొనుటకువారిద్ద ఱేకమతస్థులే! వారిమఠములు భేదములుగాని మతమువారికొక్కటయే. అట్టిచో వారికేలకలహము రావలయును? మర్యాదలలో నేమైనవ్యత్యాసములు సిద్ధించెనేమోయని నేననుకొని, యంతలో నదియుఁ గారణముకాదని నేనూహించికొంటిని. వారిద్దఱు జగత్పూజ్యులు. వారిద్దఱిని గౌరవింపని వారెవ్వరు? వారిని గౌరవించుట యనునది వారిశిష్యులకు గౌరవము కాని వారికిఁ గాదు. అదిగాక "వారు నన్నుఁ జూడలేదు. వీరు కూరుచుండుమనలేదు. వారు నమస్కరింపలేదు" అని విచారించు మత్సరగ్రస్తులగు మందజనుల మూఢావస్థకు మిక్కిలి పైననున్న ద్వంద్వశూన్యతా మహనీయమై మహావస్థయందుఁ బట్టాభిషిక్తులగు పరమహంస శిఖామణులు వారై

నప్పుడు మర్యాదలంగూర్చినకలహ మేల కాఁగలదని నేను నిశ్చయపఱచు కొంటిని. ఇంతలో నెవ్వరో "మామూ లక్కఱలేదా? పూర్వాచార మక్కఱలేదా? వ్యాసరాయపీఠ మూరుపేరు మాపీఠముముందా" యని కేకలువైచుకొనుచుఁ బోవుచుండ నాతనిఁ బిలిచి "ఈతగవునకుఁ గారణ మే" మని యడుగ నాతఁడు "అగ్రతీర్థము మా యుత్తరాదిస్వాముల వారి కనూచానపద్ధతి. ఆగౌరవము లిప్పుడు వ్యాసరాయస్వామి తనకుఁ గావలయునని కోరినారు. ఈ ప్రపంచమంతయు నేలవలయునని నాకుఁ గూడ నున్నది. తాను తనపీఠము తన సంస్థానము తనయధికారము తాను జూచుకొని మాటలాడవలయునా? మాస్వాములవారు మర్యాద ననుసరించి ప్రథమగౌరవము తనకే యుండవలయు నని శాసించినారు. అందులకు విరోధు లంగీకరింపలేదు. ఆదరణములకై వచ్చితిమా? అన్న మునకై వచ్చితిమా ?" యని యాతఁడు పలికెను. ఇద్దఱ కొక్క స్వల్ప విషయమునఁ గలిగిపట్టుచే నింద అభోజనమున నుండుటయు, నిన్ని వేడుకలు భగ్నములగుటయు, నిట్టి నైకమత్యము చెడిపోవుటయు నిందఱ నోళ్లఁబడుటయు మంచిదికాదని నేనూహించుకొనుచుండఁగ ధామ్మనుధ్వని యయినది. నాకన్నులు చెదఱి మూసికొనిపోయినవి.

తిరుగఁ గన్నులు తెఱచుసరికిఁ దిరుమలయు లేదు. అలివేలు మంగాపురము లేదు. మాధ్వసభ లేదు. మాధ్వస్వాములవారలు లేరు. పెద్దచెఱువు గానఁబడినది. చెఱువుప్రక్కనొక్కపట్టణమున్నది. నౌబత్తుల ధ్వనులు పటహధమధమలు కాహాళభాంకారములు మహామ్మదీయ వేశ్యానాట్యధ్వనులు వినఁబడినవి. పెద్దమశీదు కనఁబడినది. అందున బారాహిమామను పీరున్నది. దానియెదుట వివిధములగు వేషము లాడుచున్నవి. మిక్కిలి ప్రసిద్ధిజెందిన యిద్దఱుపులివేసగాండ్రక్కడఁ దారసించిరి. ఇద్దఱుఁగూడ గొప్పదేహసాధనప్రవీణులు. కుడియెడమల మర్యాదలఁగూర్చి ఘోరమైన పోట్లాట జరుగుచుండెను. ఒకఁడు రెండవ వేసగానిఁ దనకుడివైపునఁ బోనిచ్చుటకు సమ్మతింపలేదు. కత్తులు విఱుగుచున్నవి. కత్తులాడుచున్నవి. తలలెగురుచున్నవి. రక్తము ప్రవ హించుచున్నది. కేకలు మిన్నుముట్టుచున్నవి. కళేబరములు క్రిందఁబడు చున్నవి. కాని కుడియెడమలతగవు సద్దుకొనలేదు. నాకాయుల్లోలకల్లో

లము చూడ మిగుల నాశ్చర్యము భయము గలిగినవి. భయముచే ముడుచుకొని యొకమూలఁ గూర్చుంటిని. నాకు నెత్తికంతలో రెండు కొమ్ములు వచ్చినవి. చెవులు వ్రేలాడఁ జొచ్చినవి. నాల్గుగిట్టలకా ళ్లేర్పడి నవి. 'బే' యని యఱచుచు నటునిటు నేను మేఁకనై పరుగెత్తుచుండ నెవ్వఁడో చిల్లనపులి వేసగాఁడు నామెడను గఱచిపెట్టి పైకెత్తెను. నేను 'బే' యని గట్టిగ నఱచుచుఁ గన్నులు తెఱచు సరికి నాభార్య తన మొగమును నాభుజము మెడనడుమ నుంచి నిద్రఁబోవుచుండెను. అంత నాతో నామెయు లేవఁగ స్వప్నమంతయు నామెకుఁ జెప్పి దీని యభి ప్రాయ మేమని యడిగితిని. మేఁక యనఁగా నజమనియు నజమనఁగా బ్రహ్మమనియు నందఱు బ్రహ్మస్వరూపులనియు జీవులలో నొకనికంటె నొకఁడు హెచ్చునుకొనుట తప్పనియు నామె చెప్పెను.

# సాక్షి

## 17. మతవైషమ్యము.

జంఘాలశాస్త్రి యిట్లు పలికెను.

నిన్న రాత్రి నే నరఁటిపండ్లకై యంగడికిఁ బోయితిని. అరఁటి పండ్లు నేను గొనుచున్న "దుకాణము"నకు మిక్కిలి చేరువగఁ బొడుము దుకాణ మున్నది. అరఁటిపండ్ల నమ్మునాతఁడు తురక. పొడు మమ్ము నాతఁడు బ్రాహ్మణుఁడు. ఇతఁడు వెలనాటి వైదికుఁడు. ఈతని తండ్రి తాతలు హోమగుండమున సమిధల వైచి యుష్మ్హాన నూఁదఁగ నీతఁడు గోలెపుఁ గుంపటిని ధూమచ్ఛదముల వైచి యుష్మ్హాన నూఁదుచుండెను. కాలి ధూళియగుచున్న సమిధలలో వా రాజ్యవిసర్జనము చేయఁగఁ గాలి ధూళియగుచున్న ధూమపత్రములలో నీతఁ డాజ్యవిసర్జనము చేయుచుండెను. ఈతని ముత్తాత ఘటపటాడంబరకర్కశ తర్కఘాటిచేఁ బ్రకాశింప నీతఁడు ఘటదండాంచల కషణప్రభూత గరగరధ్వానముచేఁ బ్రకాశించెను. ఈతని పూర్వులవలె నీతఁడుకూడ జనసంతర్పణమునకై శక్తికొలఁది పాటులు పడుచుండెను. ఇంటనున్న యనూచానవిద్యలలో నాగమకర్మములలో నీతనికి మిగిలినది నాసికాచూర్ణ నిర్మాణము.

ఈతనియొద్దకుఁ బొడుము కొనుట కొక వైష్ణవుఁడు నేను బోవు సరికే వచ్చియుండెను. వారి కదివఱకే స్వల్పమైన కలహ మేలయారంభ మయ్యెనో నాకుఁ దెలియలేదు. కాని నేను గొంత వారిని వీరినడుగ, "తగిలినను బాధలేని తాటియాకు టీనెతోఁ బొడుముపొట్లము కట్టక తగులఁదగని దారముతో నేలకట్టి నన్ను మైలపఱచితి" వని యావైష్ణవుఁడు పలుక "నేను వైదికుఁడ ననుకొంటివా? పంచముఁడ ననుకొం

టివా?" యని యావెలనాఁటి యాతఁడు ప్రత్యుత్తర మిచ్చెనఁట. దారపుఁబోఁచతోఁ నారంభమైన తగవు తళుకుమనుసరికి నూరంతయు బ్రాఁకిపోయెను. ఈవైష్ణవునకుఁ బడపకట్టు దారపుకట్టులలో నెంతపట్టో! ఈబ్రాహ్మణుఁడు పొడుమెట్లు చేయుచున్నాఁడో యాతనికిఁ దెలియక పోవుటచేఁ గాఁబోలు నింక మడి మైల కేటాయింపులఁ జేయుచున్నాఁడు. పొడుముకొలె కితఁడు పొగాకుఁ గొనఁడు. జనులు కాల్చిపాఱవైచిన పొగచుట్టపీఁకెల నితఁడు తట్టకొక యణాఁచొప్పునఁ గొనును. జాతి లింగవివక్ష లేకుండ సంపాదింపఁబడిన యీధూమచ్ఛకణికానిర్మాల్య సన్నిపాత మీతని నస్యసృష్టికార్యమునకు మూలప్రకృతియైయున్నది. ఈచిలుకకొట్టు తట్టలను మండిగలవైచి యీతఁడు గాడిప్రొయ్యిపై వేయించును. దోరఁగ వేఁగిన మొక్క జీడిపప్పువలెఁ గమ్మనివాసన గ్రమ్ము తోడనే వానిని ఱోళ్లవైచిదంపి గోష్టుక్రొవ్వు, గాసున్నమువైచి పొడుముచేయించును. ఈపొడుమునకున్న గమగమ, గాటు, కమ్మ దనము ననుభవైకవేద్యములేకాని యనిర్వాచ్యములు. వక్త్రకరవాస్యము వెలువరింపఁగూడదుగాని దీనికున్న తిక్కలోఁ దీపి, కారములోఁ గమ్రత, నిందు గాఢభమాత్ర మేళనమునఁ గలిగినదని చెప్పుదురు. కాని విశ్వసింప వీలులేదు. నస్యప్రాశస్త్యకలనాసంపాదిత జగద్విశ్రాంత యశోధురంధరుఁడైన షణ్ముఖశాస్త్రుల యీపొడుమునే ఆత్మానాథ చండాల ముపయోగింతురు. యజ్ఞామృతపానపవిత్రులగు యాయజూ కులే యీయమూల్యవస్తువును మడిమైలల విభేదములేకుండఁ దాఁకు నప్పు డొక్కసామాన్యుఁడగు తెంగలివైష్ణవుఁడు దీనినట్లు నిరసించుట మహాపరాధమని యక్కడి నస్యప్రియులు కొందఱు ఉద్ఘాటించిరి. అంతట వైష్ణవుఁడు పొడుముపట్టొక్కటి యొక్కముక్కుముక్కున భుసబుస రవాంతర ఘ్రాత్కారముచేఁ బూరించి చేతి నొడలినిగూడ జాడించి యిట్లనియెను.

వైష్ణ—నీవు పంచముఁడవని నీవనుకొనఁదగినది కాని నేననలేదు. నీవు మహావైదికశిఖామణివైననేమి! నీ వంటినదారము నాయాచారము నకు పనికిరాదు.

బ్రా—ఆమాటయే తిరుగ ననవలదని చెప్పుచుంటిని. వింటివా! జాగ్రత్త నే నెవఁడనో యెఱుఁగుదువా? శుద్ధ శ్రోత్రియ కుటుంబము

లోనివాఁడను. నే నంటిన దారము నీకుఁ బనికిరాకపోయెనా? ఓహో! ఏమి సదాచారసంపన్నుఁడవు! ఆచారమనఁగ నేమో మొదలు తుద నీకుఁ దెలియునా? నాచారముతో మతుచ్యుతుఁడవైన నీకు నాపాదు మెట్లు పనికిరాఁగలదు? ఛీ? పొట్ట మక్కఁడ పెట్టి, తిరికి చూడకుండఁబో!

వైష్ణ — కారులఱచక నోరుకట్టిపెట్టుకొనుము. పొడుమున కగ్ని సంస్కారమైనది. కావున స్వీకరించితిని. "యే బాహుమూల పరిచిహ్నిత శంఖచక్రా" యను న్యాయమున నివిగో తప్తవైష్ణవముద్రికాచిహ్నాములు. అవి లేని నిన్ను దాఁకఁగూడదు. నీ వంటినది దాఁకఁగూడదు.

బ్రాహ్మ — హొహొ హో! వైష్ణవాచారములు మే మెఱుఁగనివి కావు. పెంటలవెంట పఱుగడలు త్రొక్కిన పాడుగుడ్డలతోఁ బాదప్రక్షాళనమైన లేకుండ విష్ణ్వాలయమునకుఁ బోయి నిలువఁబడి సెనగలునములుట యాచార మయ్యెనేమి? ఆయంటుచేతు లంగవస్త్రమునకుఁ దుడుచుకొనుట యాచారమయ్యెనేమి? పూజరి ముష్టివాండ్రకుఁ బడవైచినట్లు మీచేతులలో నే తడుపుగుడ్డలలోనో పడవైచిన పులికూడు ముద్దలను గుటుకుగుటుకున ముంగాళ్లమీఁదనే మ్రింగుట యాచారమయ్యెనేమి? ఆచేతులను జుట్లకు రాచికొనుట యాచారమయ్యెనేమి? అంతటితో నూరకుండక యరఁటిపుటికలలో వివిధములగు ప్రాచియన్నములనుంచి వానిని నెత్తిఁబెట్టుకొని మంగలవీథులనుండి మాలపల్లెలనుండి మోసికొనిపోయి రైలుబండ్లలోఁగూడఁ దీసికొనిపోయి రెండు పక్షములవఱకు నాదుష్టాన్నములను దెరచాటున నమృతప్రాయముగ నాహారించుట యాచారమయ్యెనేమి? గోలెములోని నిన్నటి కుడితి నీదినమున గేదెముట్టదుకదా, మూర్కొనైన మూర్కొనదు. ఉదయమున మూఁకుటఁబోసిన పాలను గుక్క సాయంకాలమునఁ గతకదు సరేకదా, కంటితోఁ జూడనైనఁ జూడదు. ఈఁగలంటుటకు సందేహించిన — చీమలు చేరుటకు జంకిన — చిరకాలవిరచిత చిత్రాన్నమును మీరెట్లు తినుచున్నారో! మీముక్కు తినుపడొక్కులో మీనోళ్లు రాతినోళ్లో మీపొట్టలు బోనపుఁబెట్టెలో! ఆహా! ఆగమశాసనమునకు విరోధముగ, నారోగ్యపద్ధతికి వ్యతిరేకముగ, నఖిలజీవ ప్రకృతికి భిన్నముగ నాచరించు మీరెట్లు బ్రదుకుచున్నారో! మీకింక మురదుట్టిగతులున్నవో!

వైష్ణ—ఇఁక నోరెత్తకు! ఎత్తకు! విష్ణునివేదనమొందిన ప్రసాదమును దూషించిన నీకన్నులు చిల్లులు పడిపోవును. నీనాలుక తెగి యూడిపడును. మీలోఁ దొంబది వంకలు పెట్టుకొని మమ్మధి క్షేపించుచుంటివా? ఏకాదశినాఁడు—గోవు గడ్డిమేయఁదగనియేకా దశినాఁడు—చీమలు ధాన్యపుగింజలను స్పృశింపఁదగని యేకాదశి నాఁడు—బిచ్చగాండ్రకు బిచ్చము వేయఁదగని యేకాదశినాఁడు— త్రాగుటకు నీరీయఁదగని యేకాదశినాఁడు—గుటక మ్రింగనైనఁదగని యేకాదశినాఁడు శ్రాద్ధమాచరించి గొంతువఱకు గారెలు మెక్కి గర్రునఁ ద్రేఁచుట సదాచారము కాఁబోలు! గారెలు కడుపునిండ దట్టిం చిన దిట్టరికిఁ గనుచీఁకటిలో గర్భాధానకాండమునకు లోపమేమి? పుష్పములకంటె నెక్కువకోమలముగ, హృదయరంజకముగఁ బెరిఁగిన నెలతల తలలను వితంతుదశ సంభవింపఁగనే మంగలివానిచేతఁ బెట్టి తచ్ఛిరోజముల నాతనికి త్రివాతఁ బెట్టుచున్నారా? లేదా? ఈవిక్కు మాలిన దురాచారమునుగూర్చి నవనాగరకనారీపురుష లోకమంతయు నిప్పు డెంత యుద్ఘోషించుచున్నది! మీకేమి యౌచిత్యములేదా? అనురాగములేదా? అంతఃకరణమే లేదా? ఇదిగాక మాంసాశనము దూష్యమనియు నది వర్జనీయమనియు మాంసమును ముట్టినవాఁడు బహిష్కారపాత్రుఁడనియు బోధించి యజ్ఞశాలలో బహిరంగమునఁ జేరి నవరంధ్రములనుమూసి మేఁకలను కటికవానికంటె ఘోరతరముగఁ జంపి యామాంసమును సిగ్గులేక, హేయమనక, దయాశౌచములు లేక, మ్రింగి, నిష్పాపులమని, పవిత్రులమని, దేవ, పితృదేవ, భూదేవ సంతర్పణక్రియాచణులమనియు, గరగతస్వర్గద్వారవిదారణసాధన పారీ ణులమనియుఁ గుండలా లాడించుకొని మీవారూళ్లవెంట యుచి తజ్ఞతను విడిచి తిరువీథులు వేంచేయుటలేదా? మదద్రవ్యపరిగ్రహణము మతాచార విరుద్ధమను మహాజనవాక్యమునకు విరోధముగ మఖ శాలలోఁజేరి మందయానలతోఁగూడ సోమపానమునుజేసి సొక్కి, సోలి, తూలి, తెయితక్కలాడుటలేదా? ఇదిగాక నిత్యగృహకృత్యములలో మీరు చేయసిద్ధపడని కర్మమేదైనఁ గలదా? శవవహనమునకు ముందు బుజము మీది. తిలపిష్టమహిషీదానమయ విగ్రహదానప్రతిగ్రహ

ణమునకుఁ బ్రథమపీఠము మీఁది. శల్యకాసమాన్న సమాహరణ
సాహితికిఁ బ్రథమపండితతాంబూలము మీఁది——

బ్రాహ్మ——ఇంకను నోరు మూయవా? ఈపాపపుమురోఁక
టితో నోటిపైఁ బొడుతును. సిగ్గులేక నూతి యొకమతమని వదఱుచు
న్నావా? మతము! తురకవాండ్రు, దూదేకులవాండ్రు, మాల,
మాదిగ, చచ్చాట, జంగములు మొదలగు జాతులలో మీమతమును
బవిత్రము చేయునివారెవ్వరు? మీతోఁ బూర్వమునఁ గలిసి తిననివా
రెవ్వరు? మీతో సంబంధము లాచరించని మీవంశములను నానా
సాంకర్య సమామ్నాయమును జేయునివారెవ్వరు? మాలదాసయ్యలు
మహమ్మదీయభాగవతోత్తములు, చచ్చాటవైష్ణవులు, దాసరాచార్య
పురుషులు, మాదిగాళ్వారులు! ఓహో! నిరంకుశమతము! సర్వ
చండాలసమ్మతము! బ్రహ్మఘ్నుఁడైనసరే, గోఘ్నుఁడైనసరే! గురు
తల్పగమనుఁడయినసరే! విష్ణుభక్తియుక్తుఁడయినయెడల నాతఁడే
బ్రాహ్మణుఁడు. అతఁడే శ్రీవైష్ణవుఁడు. అతఁడే పరమభాగవతోత్తముఁ
డని మీరనఁగనే మేదరిగూడెములు, మంగలివాడలు, పల్లెపాలెములు,
బెస్తవీథులు, తురకపేటలు, మాలమాదిగపల్లె లొక్కుమ్మడి సుద్ద
బద్దెలతో బత్తెజేగురుడాగులతోఁ, దులసిపూసల పేరులతోఁ గరాగ్ర
గతశంఖచక్రచిహ్నములతో వైష్ణవాగ్రహారములపై విశిష్టాద్వైత
దేవాలయములపై నాచార్యకూటాగారములపై విష్ణుభజనమందిరము
లపై భక్తిబోధనశాలలపై విఱుచుకొనిపడలేదా? హృదయముననున్న
విష్ణుభక్తి పరీక్షార్హము కాదయ్యెను. బాహ్యవైష్ణవలక్షణములు కడు
ఫులు బద్దలుచేయుటకుఁ జాలియుండెను. ఇఁకఁ జేయఁదగినదేది? అందఱు
భక్తులే——అందఱు శ్రీవైష్ణవులే——భక్తియే ప్రధానము. వర్ణవృత్తి
లింగము లావశ్యకములు కావు. కర్మజ్ఞానములతోఁ బనిలేదు. ఈభక్తి
మఱింత ముదిరిముదిరి పరిపక్వదశనొంది ప్రపత్తియయినది. దీనితో వైదిక
కర్మము చచ్చినది. స్నానములేదు. సంధ్యావందనములేదు. జపములేదు.
ఆచమనములేదు. పాదప్రక్షాళనములేదు. సర్వకర్మపరిత్యాగము సిద్ధించి
నది. ప్రపన్నులకు నియమములులేవు. వారు నిరంకుశులు, స్వేచ్ఛావిహా
రులు, భగవత్ప్రీత్యర్థతకొఱకు పదిపాయలు ద్రాగినను బ్రపన్నునకుఁదప్పు
లేదు. తుదకు రామానుజమతమనఁగఁ ద్రాగుడుమతమని యర్థమిచ్చు

సంతతి అవకతవకను దిగిపోయినది. కొంత ఉత్తములున్నను గొందఱి దుర్నయముచే మత మిట్టిదుస్థితినిఁ బూర్వమే చెందియున్నది. పీపాల కొలఁది త్రాగినను ప్రపత్తిసంగతిచేఁ బాపముకాదు.

వైష్ణ—విన్నిట్టులీడ్చిసాగదీసి లెంపకాయగొట్టినను దోషముకాదు.

అని యాతనిఁగొట్టును. అతఁడు పాపముకుండు నీతనితలపయిఁ బగులఁగొట్టును. ఈతఁడు తేలుసర్వ మాతనికంటిలోఁ గలికము వేయును. అతఁడు లోకటిబాదివతో సీసపుప్రక్కను బొడుచును. అతఁ డీతని మెడ ప్రక్కను గట్టిగఁ గఱచును. అంతట నచ్చటచేరినవారు వారిని విడఁదీసిరి. వైష్ణవునకు విడఁదీసినకొలఁది పౌరుషము హెచ్చెను ; కన్నులమంటచే బ్రాహ్మణుఁ డఱుఁగుపైఁ గూర్చుండి "శివశివా" యని బాధచే నఱచెను. అంతవైష్ణవుఁ డుగ్రుఁడై "చూచితిరా! నన్నుడికించుట కాదిక్కుమాలిన కూఁతలను విడిచి యెట్లాతఁడు కఱచుచున్నాఁడో" యని యఱచెను. "మాశివుఁడు దిక్కుమాలినవాఁడా! ముండకొడుకా! నీవిష్ణువుగాఁడు మాశివునికంటె దిక్కుమాలినవాఁడు. కావుననే మాదేవుని యాచించి కొడుకును సంపాదించుకొన్నాఁడు" అని యాబ్రాహ్మణుఁడు కలియఁ బడుటకు లేవఁబోవుచుండఁగా వైష్ణవుఁడు "సహస్రనామతత్తుల్యం రామనామవరాననే" యని యేడ్చినదాసిగాఁ డెవఁడో "నెమరునకుఁ దెచ్చుకోరా ముండకొడుక" యని బ్రాహ్మణునిమీఁదికి రాఁబోవఁగ వా రిద్దఱును దిరుగ నచ్చటిజనులు వేఱుసేయుటయే కాక వైష్ణవుని నచ్చటినుండి దూరముగ బలాత్కారముగఁ దీసికొనిపోయిరి. అద్వైతవిశిష్టాద్వైత వాదాడంబరములో నచటిపండ్ల మాట మఱచిపోయితిని. పండ్లుఁగొను చుండఁగ నాకొట్టున కధికారియగుతురక "మహమ్మదుగారివలెనే రాముఁడు శివుఁడు పైగంబరులే కాని భగవంతులు కారనియు బాపనయ్య లు సైతానులవలె నేలపోరాడెద" రనియుఁ బలికెను. నేనింటికిఁబోయి జరిగిన యావద్వృత్తాంతము నాలోచించుకొనుచుఁ బండుకొంటిని ; కలఁతనిద్దుర పట్టెను. ఒకస్వప్నము కలిగెను. ఈనడుమ శ్రాద్ధభోజనము లధికములగుటచేతను నెట్టికి వ్యాధియగుటచేతను దఱచుగ నాతనితో నిద్రాశూన్యుఁడనై యుండుటచేతను గలలు మిగుల వచ్చుచున్నవి.

నేనొక పట్టణమునకుఁ బోయితిని. దాని నొక్క నవాబు పరి పాలించుచుండెను. అతనిభార్య నొకబ్రహ్మరాక్షసుఁడు పట్టుకొనెను.

అదినటను నలువదిదినములనుండి గొమెన్వాషా వచ్చి యామెకు మంత్రించు చుండెను. ఆదినమే యాపిశాచ మామెను విడిచెను. ఆమె సుఖముగ భోజనముచేసి యారోగ్యమును గాంచెను. నబాబునకు మిగుల సంతోషముగ నుండెను. హిందూదేవాలయముల నభిషేకాదులు జరిగినవి. హిందూదేవళముల నన్నింటను నుత్సవములు జరుగుచున్నవి. జనులు వేలకొలఁది ప్రసన్నచిత్తముగ భుజించుచున్నారు. నౌబత్తుల బజాయింపులు, ఫిరంగుల ధ్వానములు, తుపాకిపేలుడుల కొనువాశిరికలు హవాయి గొట్టముల హాహాధ్వానములు, జిల్లిగిత్తముల సకిలింపులు పల్యంకికావాహకుల హుంకారములు మొదలగునన్ని సందడులు గలిసి యారాత్రి మిక్కిలి విచిత్రముగ నున్నది. నేనీయుత్సవములతోఁ గూడఁ దిరుగుచుంటిని. ఒక్కచో జనసంఘమునుండి దాటిచేసికొనలేక ప్రక్కసందునఁ బడి యట్టెపోయితిని. కొంతదూరముపోఁగఁ నిసుగనొక పెద్దవీధి చేరితిని. అక్కడ నీశ్వరుఁడు నందివాహనారూఢుఁడై మహావైభవమున నూరేగుచున్నాఁడు. శృంగిభృంగులకంపులలోఁ గూడి వాండ్రాడుచున్నారు. శంఖధ్వానములు ప్రాంతములఁ జెవుడుగొలుపుచుండఁగ వింజామరలు సెలల నదల్చుచుండెను. వాహనోపరి వృషభధ్వజముపైఁ ద్రింశత్కోటి దేవతాహస్తచ్యుత పారిజాతపుష్పములవలె వెన్నముద్దలు ప్రకాశించుచు రాలుచున్నవి. వీరాంగపుమ్రోతచే నూరేగిరిపోవుచున్నది. ఈశంకరునకు నమస్కరించి యీయుత్సవముతోఁ గొంతసేపు నడచితిని. అంతలో నెదుటినుండి మఱియొక యుత్సవముతో ననేకజనులు వచ్చుచున్నారు. ఆయుత్సవ మేమో మొదటఁ దెలియలేదు. కాని వేణుగోపాలస్వామి తిరువీథులు వేంచేయుచున్నాగని తెలిసినది. ఓహో! శివవిష్ణువు లొక్కవీథిలోఁ దారసిల్లుచెట్లు! పెద్దయుపద్రవము గలిగినదే. శివునకు విష్ణుదృష్టి తగులఁ గూడదు. విష్ణువునకు శివదృష్టి తగులఁ గూడదు. అట్లగునెడల దేవతలకు మహాసంప్రోక్షణాది క్రియలు జరిగింప వలసియుండుటయేకాక "బింబప్రతిబింబ" మను మహాదోషము గూడ సిద్ధించును. ఈచిక్కులు లేకుండ వెనుకకుఁ బోయిన మంచిదేమో? త్రిపురసంహారకుఁడగు దేవుఁడు వెన్నముద్ద బొట్టిగానికి వెన్నీయవలసినదా "ఏమైనసరే కానిండు! ఉత్సవములు జరుపుకొనుటకు నబాబుగారిసెలవున్నదికదా? "ఈరాత్రితో నిలువుబొట్టయిన నెగర

వలయు నష్టంబొట్టయిన నెగరవలయు" ననుచు నెవరికిఁ దోఁచినమాట
లను వారెల్ల నామహాకలకలములో నాడఁగ నాకుఁ గొన్నిమాత్రమే
వినఁబడినవి. ఇంతలో బాలగోపాలుఁడు శ్రీగరుడాళ్వారి తిరుస్కంధము
నధిరోహించి మహావైభవసమగ్రుఁడై వేంచేయుచున్నాఁడు. ఘంటలు
జయజయధ్వానములిచ్చుచున్నవి. మంగళవాద్యములు మాఱుమ్రోయు
చున్నవి. శ్రీపెరియచిరియ తిరువళ్లవిగ్రహము ఉత్సవమునకు ముందు
నాట్యములు చేయుచున్నవి. "గోపాలకృష్ణా! తాండవకృష్ణా! మురళీ
కృష్ణా! రాధాకృష్ణా!" యనుపవిత్రధ్వను లాకాశమెల్లఁ గ్రమ్ముచున్నవి.
ఇంతలో వైష్ణవోత్సవమునుండి ఛీ! ఛీ! ఛీ! యనుధ్వనులు "తిరుగు
తిరుగు" అను బెదరింపులు మిన్నుముట్టినవి. "మొండిముండకొడుకులు
మనకెదురుగ వచ్చుచున్నారా? తలలు చిదుకఁ బొడుపుఁడు. తన్నుఁడు.
కొట్టుఁడు వెనుకకుఁ దిరిగిపోవుదురో వాహనమునకు నిప్పంటింపవల
యునో కనుఁగొనుఁడు. ఆగడము! ఎన్నఁడైననిట్టివింతగలదా? బ్రతుకఁ
దలఁచుకొనినయెడల మఱలిపొండు" అని యేమేమో కేకలు వినఁబడి
వినఁబడనట్లు నాచెవినిఁబడినవి. "జయ! మహావిష్ణూ!" యని యాప్రక్క
నుండి కేకలు వేయఁగ "జయమహాదేవా!" యని యాప్రక్కనుండి వినఁ
బడినవి. వీరిఘంటానాదములు వారికి వినఁబడకుండ వారు శంఖధ్వాన
ముల మఱింత ప్రబలపఱచిరి. వారి శంఖధ్వానములు వీరికి వినఁబడ
కుండ వీరు భేరీకాహాళఢంకాధ్వనులను మఱింత హెచ్చించిరి. వీరి
మంగళధ్వనులు వారికి వినఁబడకుండ వారు వీరాంగపుమ్రోఁతకు రుంజలు
కూడఁజేర్చి చెవులు బ్రద్దలు కొట్టుచుండిరి. అందుపై నింకసంతుష్టిలేక
వైష్ణవపక్షమునుండి "ముష్టివాఁడా! కట్టగుడ్డ కరవైనవాఁడా! వల్ల
కాటికాపరి!" యను తిట్లుప్రబలి చెలరేఁగ, "మాయకాఁడా! దొంగ
ముండావాఁడా! వ్యభిచారపరుఁడా! చెల్లెలికి మగఁడా!" యను
తిట్లీవైపునుండి కోలాహలముతో విజృంభించినవి. అంత నొక్కఁడు
త్రిశూలమును లాల్సాహెబు నెత్తుకొనిన మహమ్మదీయునివలె గట్టిగ
మొగమున కడ్డముపెట్టుకొని వీరాంగధ్వనులు వెంబడింపగ వైష్ణవోత్స
వములోనికిఁ బోవ మఱియొక్కఁడెట్లో చక్రమును బట్టుకొని డాలు
పీరునుబట్టుకొన్న తురకవలె వీరావేశముతో శంకరచిహ్నమును చిహ్నా
ధరునికూడఁ బాఁకెను. ఈవైపు నావైపునున్న మంగళ్లు డోళ్లమీఁదఁ

గొట్టవలసిన కఱ్ఱలతోఁ దలలపైఁగొట్టుకొనసాగిరి. డోళ్లు డోళ్లనంత రిక్షమునఁ దాఁచిస్లుచుండెను. ఇంతలో నొకజయఘంట విష్ణుపక్షము నుండి చక్రమువలెవచ్చి నందీశ్వరుని మోమునఁ బ్రక్కబారునగొట్టఁగ వాహనము వంగెను. వాహనులు కాళ్లు ద్రొక్కుకొని కఱ్ఱలతోఁ బొడుచుకొనిరి. కాని వానిని బసవనిని నాపలేకపోయిరి. అంతట మహోత్సవమున వాహనములను మోసికొని కొందఱు పూజారులు వైష్ణవ పక్షమునకు వచ్చిరి. కొందఱు వాహనులు కఱ్ఱలతోఁ విష్ణువాహనులకాళ్లు విఱుగఁగొట్టిరి. వారు గరుడాళ్వారుని భుజముపై నుంచుకొనిరి. హాహా కార మగుచున్నది. కన్నులు చీకట్లుగ్రమ్ముచున్నవి. చెవులు దిబ్బడలు వైచుచున్నవి. ఒడలు గగుర్పాటొందుచున్నవి. నాట్యాంగనలలో నొకరి నొకరు పీకుకొని కఱచుకొనుచుండిరి. మహాహాసమగుచున్నది. తలలు బళ్లుమనుచున్నవి. రక్త మొలుకుచున్నది. నే నీసందడిలో నుండక కొంచెముదూరమున నిలుచఁబడితిని. కొంతసేపటికి వైష్ణవార్చకుఁడు బాలగోపాలమూర్తి యుత్సవవిగ్రహమును జేఁబూని "కృష్ణా! రక్షించు" మని కేకలువైచుచు శివపక్షమునకుఁ బరుగులెత్తుచుండెను. ఆతనితో ననే కులుగూడఁ గేకలువైచుచుఁ బరుగెత్తుచుండిరి. శంకరోత్సవప్రతిమనట్లే యొకపూజరి పూని "శంకరా! త్రిపురసంహారకా! తృతీయలోచనవికా సమున కిదియే సమయము" అని కేకలువైచుచు ననేకజనసంఘముతో వారి నెదుర్కొనెను. 'హరిహరా' రవము లంతట వ్యాపించినవి. వైష్ణ వార్చకుఁడు తనచేతనున్న విష్ణువిగ్రహముతో శివార్చకుని చేతనున్న శివవిగ్రహమును హుంకరించి యొక్కదెబ్బకొట్టెను. రెండును లోహ ప్రతిమలగుటచేఁ గాఁబోలు గప్పుగప్పున నిప్పులు మంటలు లేచెను. లక్ష మెఱుపు లొక్కసారి మెఱసినట్లు కన్నులు చీకటులుపడినవి.

అట్టె కన్నులు తెఱచుసరికి వాహనములులేవు. విగ్రహములు లేవు. మంగళ్లులేరు. సానులు లేరు. దీపములు లేవు. ఉత్సవములు లేవు. అంతములేనియొకటే తేజోవంతమైన సముద్రము అన్నిదిక్కుల వ్యాపించియున్నది. దానిలో బుద్బుదము లట్టెలేచుచున్నవి. అట్టె యడఁగిపోవుచున్నవి. తరంగములు కదలుచున్నవి. తిరిగి సముద్రమున లీనమైపోవుచున్నవి. ఇట్టియిట్టి యివియన్నియు చూచుచున్న నేను బుడుమ్కున మునిఁగి బుడగనై తేలితిని. గొంతుక బిగిసిపోయినట్లుండ 'ఊ' యని మూల్గితిని. నాభార్య నన్ను లేపెను.

# సాక్షి

## నాటకప్రదర్శనము.

జంఘాలశాస్త్రి యిట్లుపన్యసించెను.

ఈనడుమ నాటకప్రదర్శనముం గూర్చి రెండుపన్యాసము లీయం బడినవి. వానిలో మొదటి యుపన్యాసమునఁ బాటల నాటకముల యప్రాశస్త్యము వెల్లడి చేయంబడినది. దాసరి భాగవతములవలె, దాదినమ్మ కలాపములవలె, గరిడీనాటకములవలె, పచ్చబొట్ల గొల్లవేషపు గోలల వలెఁ, బాటలనాటకములు, పామరరంజకమాత్రములు; నోటనున్న ధూమచ్ఛదపుఁదూటకట్టెలఁ గర్ణాలంకారములుగఁ జేసి నెత్తినున్న చినుఁగుల గుడ్డల నెగదీఁతకప్పుఁగల శ్రోణీమండలము క్రింద సుఖాసనములుగఁ జేసి భామాకలాపప్రబంధిరి కెదురుగను బ్రక్కలను వరుసలేక, క్రమము లేక, బొట్టనవ్రేళ్లపై, పడమలపై, ముంగాళ్లపైఁ, బిఱ్ఱలపై, నొంటి యొంటితొడలపై, మోఁకాలిచిప్పలపైఁ గూలఁబడి తలలెత్తి నోళ్లను దెఱచుచుట కవకాశమున్నంతవట్టున శక్తివంచనము చేయకుండఁ దెఱచి పందిరి క్రిందఁ బండు కోఁతివలెఁ బండ్లిగిలించుచున్న హాస్యకరుని కోరు కుళ్లాయిపైనున్న బత్తెపంగనామములు "పెట్టినవా? కుట్టినవా?" యను పూర్వపక్షసిద్ధాంతములు చేయుచు దీని సిగఁదఱుగను! భామ వేసమింకఁ బైటఁబడదేమిరా? యని భామాకథాకలాపాకర్ణనోత్కంఠాకుంఠతను వెల్లడించుచు నీనడుమ ననాహూతుఁడై యనపేక్షితుఁడై వెఱ్ఱివేసముతో వేంచేసిన వేణుగోపాలస్వామినిఁ జూచి "అమ్మ ముండకొడుక! గంపెడుగుడ్డలతో గంగిరెద్దువలెనుంటివిరా! ఓరీ! నీవ టరా! పట్టుసాలిదాని కూడుతిన్న బాపనపద్దన్నవా! చాలుచాలు!

ఈపాటికి నీయాట కట్టిపెట్టి చచ్చినట్లు చాఁపమీఁదఁ గూలఁబడు. "మునసబుగారూ! ముండమోసిన భామవేసము మూఁడుజాలములకుఁ గాని రాదా యేమి" అని భామ మాశ్లేషించి కావిరహబాధాసహనతచే విసుగుకొనుచు భామవేషము తెరచాటికి వచ్చి రేగుపైపై "అదుగో చంద్రుండుదయంబగున్" యను పద్యమును రాగముఁబుచ్చికొని పైనఁ బందిరి యాకు లెగురునట్లు పాడుచుఁ గ్రింద నేలధూళి రేఁగునటు లాడఁగ వెనుక నున్న కీచురాయిగాఁడు దడదడ నాలుగడుగులు ముందునకు వైచి తన తలను సత్యభామ పిఱ్ఱలపై దబాయించి గుద్దిదెబ్బల మార్పుల ననుసరించి యాసామ్రాజ్ఞీదేవి సవ్యాపసవ్య శ్రోణీభాగములపై టొకాయించుచు నిలఁబోడిన వైలుకాంతవలెఁ గూయుచుండ "సెబాస్! సెబాస్" అనుచుఁ జెవిచుట్లూడనుండ శిరఃకంపనములు చేయుచు, భామను నేత్రములచేఁ, గన్నములచేఁ గబళించుచు నెవఁడైన సందడి చేసిన "అబ్బా! ఒక్కటేగోల! విననీయరుగదా" యని యంతకంటె నెక్కువగోల జేయుచు "పదపద్మములు తడఁబడసాగెనమ్మ" యను పాటకు భామకు "తోడా" వేయఁదగినదని యఱచుచు గానభరత విద్యాపరిజ్ఞాన నైపుణీధురీణులయి శోభిల్లు పామరులు, మూఢులు, నాగరకతాగంధశూన్యులు, ప్రపంచజ్ఞానాభావులీపాటల నాటకములకు 'బలీ' యనఁదగినవారు; ప్రతిపద ప్రస్తుతి ప్రధానప్రవీణులయి ప్రకాశింపవలసినవారు. అంతియేకాని శ్రవణమందు శబ్దసౌష్ఠవ గ్రహణమున్నవాఁడు, తలయందు గుణగ్రహణమున్నవాఁడు, హృదయమందు రసగ్రహణమున్నవాఁడు, వాని నేమాత్రము మెచ్చఁదగినది కాదు. అవి కేవలమసందర్భతాదుర్భరములు, అనౌచితీభూయిష్ఠములు. అప్రాజ్ఞతాకరములు. అస్వభావసిద్ధములు; అవి యమ్మవారిజాతరలలో సుబ్బరాయఁడు షష్ఠిలో పల్లెటూళ్లఁ బూర్వమాడఁబడుచుండిన వీథిభాగవతములకంటె నెక్కువయని చెప్పుటకు మనసొప్పదు. అయినను వానిని వ్రాసిన కవు లేమి యూహించి వ్రాసియుందురో మాకుఁ దెలియదు. ఏదియో గొప్పయూహముండవలయునుగాని యూరక వ్రాసియుందురా? నాటకములలోఁ బాట లుండవలయుననియే వారి నమ్మకము. అట్లుంటయే యౌచిత్యమని వారి యభిప్రాయము. అట్లు లేకపోవుటయే నింద్యమని, యసందర్భమని, యస్వభావమని వారినిశ్చితము

అట్లు వ్రాయనివాఁడు కవి కాఁడనియే వారినిశ్చయము. అట్టి మనోనిశ్చ
యమే యట్టియహంకారబుద్ధియే వారికి లేకుండు నెడల వారిలోఁ
గొందఱు విద్యాలేశశూన్యుఁడగు కాళిదాసుఁడు పాత్రౌచితీగంధా
భావుఁడగు కాళిదాసుఁడు—ప్రాపంచిక జ్ఞానదరిద్రుఁడగు కాళిదాసుఁడు
కవినామానర్హుఁడగు కాళిదాసుఁడు—నామమాత్రమైనలేకుండ నశిం
చిన కాళిదాసుఁడు—బుద్ధిలేక—జగదజ్ఞానాంధకారావస్థలో—వ్రాసిన
యభిజ్ఞానశాకుంతలములోని నిర్భాగ్యనిరర్థకనిస్సహాయ నీరస నిర్జీవ
శ్లోకములకు బేగడాది తాళాడంబరములచే రంగు, తేజము, రసము,
గాత్రము, ప్రాణము, నాత్మయు నిచ్చి, ఝంపాదితాళసంపదచే మంద
గమనము, ధావనము, నాట్యము, వ్యోమయానఘాటినిచ్చి యీపేరు
లేని నాటకమును ప్రసిద్ధసంగీతశాకుంతలములోనికి "పిరాయించి" పనికి
మాలిన పట్టి మసిబొగ్గును, మణిరాజమగు వజ్రముగఁ జేసిరా లేదా ?
అయ్యయ్యో! మనుజజన్మమునకుఁ గన్నీరున్న యెడల నేడ్చుట కింత
కంటె దురవస్థ ప్రపంచమున నుండఁబోదు.

మానరా—"శివునాకుమంగళం జాయామంగళంమానరా! ఓరీ
మానరా" యని యొకఁడు పాడినాఁడు. ఈగాయకుని నేను బెజవాడ
నుండి నంద్యాలకుఁ బోవురైలుబండిలోఁ గలిసికొంటిని. ఈతఁ డేయూరి
యొద్ద బండిలోని కెక్కినాఁడో నే నెఱుఁగను గాని మారికాపురము
నొద్ద "మానరా" యను నీపాట నారంభించి కంబమువఱకుఁ బాడి
నాఁడు. నేనాపాటను నతఁడు పాడినదీక్షకంటె నెక్కువదీక్షతో వింటిని.
ఆతనిపాటలోనిహాయి నెఱిఁగి కాదు. ఆతని పాటలోని యర్థము తెలి
యక యింతసేపువింటిని. "శివునకు మంగళము మానరా" యని మంగ
ళపుటారతియుండునా ? అని నే ననుకొంటిని. తుద కర్థముతెలియక
యాగాయకునే యడిగితిని. తనకుఁ దెలియదని యాతఁడు చెప్పెను.
ఇఁక నేదిగతి ? ఆతఁడర్థముజెప్పునని కొండంత యాసపెట్టుకొంటిని.
ఎటులయిన దానియర్థ మెఱుఁగవలయునని నాకుఁ బట్టుగలిగెను. మఱి
యొక కీర్తన మేదైన బాడుమని యాతని గోరితిని. పాడుమనుసరికి
నాలుక వెనుకాడు స్వభావము ననుసరించి కాంబోలు నాతఁడు తనకు మఱే
దియు రాదనెను. అంతట నీయూరేదని యడిగితిని. "మంగళగిరి" యని
యాతఁడనెను—అంతట మంగళగిరి పానకాలరాయని నివాసముకదా,

పానకాలరాయఁడనఁగ నరసింహుఁడుకదా! అందుచే నీకీర్తనము నర
సింహస్వామి మీఁదిదేమో యని యూహించి "మానవసింహునకు
మంగళంజయమంగళం" అని యాకీర్తనమును నేను నిశ్చయపఱచు
కొంటిని. జామున్నరసేపు తలఁగొట్టుకొనినను మొఱపెట్టుకొనినను
బాట పాషాణప్రాయమైయుండెను. ఆ కంటకంపుతోడను జడప్రేతల
తోడను లక్షలక్షణములతోడను మూలుగునాల్గు పదతలుపుచ్చి సాగ
దీయుటచేతను దుడుకుఁ గట్టుకథవలె నీకీర్తనలోని [illegible] వలె
విడెను. కీర్తనము కీర్తనముగ నుండఁగనే యింతమాత్రగహనమగు
నప్పుడు శ్లోకము కీర్తనము గాఁగ నెంతగాడిద గత్తాయగునో శ్లోకము
లోనిశబ్దములకు గానపాకములలో దీర్ఘమున్నచోట హ్రస్వము హ్రస్వ
మున్నచోట దీర్ఘము దాపరింప నడుమున్నచోట విరుపు, విరుపున్నచోట
నడుమ స్తంభింప, నిలుపున్నచోట సాగుడు, సాగుడున్నచోట నిలుపు
ఘనీభవింపఁ దాళపుదబాయింపుల దారికిబట్టి శ్లోకములోఁ గొంత
భాగము రెండుమూఁడావృత్తులుగ బాదింపులు తినుగుప్రేతలు బడఁగ
శ్లోకమంతయు సంధిసంధిని విఱిగి ముక్కలు ముక్కలై చర్మము దెగి
ప్రేలాడ రక్తముగారఁ గండలుప్రొవ్వఁగలిసి యూడిపడ, ప్రేగులు
చుట్టలుగ బీభత్సస్వరూపముతోఁ బడిపోవఁ గటికవానిదాగలివలెఁ
గడు హేయమై మశకమక్షికాపిపీలికాసంకులమై దుర్గంధభూయిష్ఠమై
సంగీతశాకుంతలమంతయు చండాలశాకుంతలమయినదా? లేదా?

ప్రథమరూపక కవితాపీఠమునకు బానిసనడుగఁజేయుపాపము మన
కేల? ఆమహాకవి లేఖనవైఖరినిబట్టి సంగీతసంపర్కమే నాటకమునందుఁ
గూడదని కనఁబడుచున్నదే! ఉన్నశ్లోకములు గూడను గానధోరణితోఁ
జదువఁదగినవి కావని యాతనియభిప్రాయమైనట్లు కనఁబడుచున్నదే! ఈ
యంశములఁగూర్చి నాటకాభ్యాసపరిశీలనసమయమున విపులముగఁ
జెప్పెదను. 'ఆ' యను నొక్క యక్షరమున నుచ్చారణభేదములఁబట్టి
భేదార్థములగునుగదా. అందువలన భేదరసము లుద్బోధించునుగాదా?
అదియొకసారి ప్రశ్నార్థకమగును. ఒకసారి యాశ్చర్యరసము, నొకపరి
తీవ్రకోపరసమును, నొక్కమాఱు కరుణరసము, నొక్కమాఱు భయా
నకరసము, నొక్కమాఱు సాక్షేపణనిందాగర్భమగు హాస్యరసము
నుచ్చరించు విధములఁబట్టి యుద్బోధించును. కవిహృదయమును గుర్తె

ఱేఁగి పాత్రౌచిత్యమును బరిగణించి, యర్థసంపత్తును నవగణించి యథో చితరసము యవబీజాగ్రమాత్రమైన మాసిపోకుండఁ గంఠరవమునఁ బ్రమాదమువ నపశ్రుతి, వెలితి, కంపము గలుగనీకుండ నక్షరాభ్యాస ప్రథమదినమునఁ బలుకనేర్చుకొనిన రెండవయక్షరము నుచ్చరించుట యందే యింతభయము, ఇంతదీర్ఘాలోచనము, ఇంతజాగ్రత్త, ఇంత కొంకు పడరానియన్నిపాట్లు తలలో రేగటియున్నగాక మెదడున్న ప్రతిమనుజుఁడును పొందవలసినట్లు కనఁబడుచున్నదే ? అట్టిచోఁ జిత్రవిచిత్రాతివిచిత్ర వివిధానుస్వనసంభూత సర్వవిధ శబ్దజాలమును నిర్లక్ష్యముగ, నిర్భీతిగ, నిశ్శంకగ, నిరంకుశముగ, నిరాఘాటముగ, రాగతాళములతో లంకెవేసి రోకళ్లపాటల క్రింద నడుగులఁదంపుల క్రిందఁ దండనపదాన క్రిందఁ బంబరసుల క్రిందఁ బడఁదీసిపాడి, మడచిమడచి మఱిపాడి, చౌకచౌకముగ సాగఁదీసిపాడి, మందరశ్రుతిలో మందాకరవమునఁ బాడి, నై కాలములోఁ బుసుగుబుసుగునఁ బాడి, షష్ఠకాలములోఁ జావుపాటపాడి, ఓ ! సంగతులలో గరగరలు, గలగలలు, జారులు, ఎగుపులు 'హుం'మ్మని మ్రింగుళ్లు, చురచురలు, నమ్మునమ్మని నములుటలు, చిత్తజల్లుగఁ గురిపించి పాడి, పాడి, ముక్కాయితీర్చి, చేతులు మోదిమోది, కాళ్లు కొట్టికొట్టి, తల యూఁపియూఁపి నాటకరంగమును బాటకచ్చేరిగ నాటకశాలగఁ జేసినగొడల నింకరసమేమి, ఉచితతయేమి, యుక్తిసందర్భమేమి, పాత్రత్వమేమి, కవియేమి, కవిత్వమేమి, మనుజుఁడేమి, మనుజత్వమేమి, ప్రకృతియేమి, ప్రపంచమేమి, ప్రారబ్ధముతప్ప మఱేమియు లేదు. ప్రపంచ కవిశిఖామణులలో బ్రహ్మజాతినగ్ర మెవఁడో నాటక కావ్యాంతరిక్షమున నుదయాస్తమయములు వృద్ధిక్షయములు మాపుమచ్చ లెఱుఁగని యమృతకరుఁ డెవ్వఁడో యట్టికాళిదాసుఁడు తాను రచియించిన యభిజ్ఞానశాకుంతలమున కాంధ్రకవు లాపాదింపఁజేసిన యధోగతిని పెట్టిన యంతిమావస్థను, ఆట్టిక ప్రస్థతంత్రమును, తననిశ్శరీరాత్మతోఁ జూచు నెడలఁ బాపము, ఏమనుకొనునో ! నావెఱ్ఱియే కాని యేమనుకొనుటకు నేమున్నది. ఏమనుకొన్న నేమిలాభమున్నది. అట్టిదురవస్థయే సిద్ధించిన యాధుని కాంధ్రకవు లంగబలసంపన్నులయ్యు నేమనుకొనుచున్నారు ? ఏమిచేయుచున్నారు ? హరిశ్చంద్రనాటకము సంగీతహరిశ్చంద్రనాటకమై సద్గ్రంథసముదాయమునుండి జారి జావళీపుస్తకాల క్రిందఁ బడినది కాదా;

సారంగధరచరిత్ర సంగీతసారంగధరచరిత్రమై చచ్చియేపోయినది కాదా! సర్వరాష్ట్రమును గోలుపోయి సతీసుతులతోఁ గాశికిఁ బోయి వారి నమ్ముకొని, తన్ను మాలవాని కమ్ముకొని, చచ్చినయొక్క కొడుకును శ్మశానమునఁ దగులబెట్టుటకువచ్చిన సామణిని స్వవారితోఁ వెగనఱుకఁ బూనిన హరిశ్చంద్రునిచరిత్రము సంతాపచరిత్రమగునుగాని సంగీత చరిత్ర మెట్లు కాఁగలదు ? ఇంతకంటె సవాచ్యాసంపర్కాధికత యుండునా? సంగీతసంఘమువారిమను గ్రంథనామముతగునా ? "సంగీతశవవహన" మను పేరుతో గ్రంథ ముండవచ్చునా ?

హరిశ్చంద్రనాటకకర్తను నే నెఱుఁగుదును. ఆయన నీసడుమనే బెంగుళూరునఁ జూచితిని. ఆయనరచించిన స్వతంత్రనాటకములలో నిది మొదటిది. వీరికి సంగీతమం దభిరుచి లేదు. వీరు పాడలేరు ! సరేకదా ! పరులుపాడిన విననొల్లరు. గానసంగ్రహణచాతుర్యము వీరికిఁ గానరాదు, అట్టివీరు రచించిన సత్యహరిశ్చంద్రము నవసంగీతమంజరి యయినది. "నాటకమున సంగీత మెచ్చటనుండఁగూడ" దను నియమము వీరికున్నది. వీరియభిప్రాయమును దెలిసికొని ప్రవర్తింపవలయునను నియమము జనులకు లేదు. సంగీత మొక్కరసమునకుఁదప్ప రూపకమున నెక్కడ నుపయోగింపఁగూడదు. ఆరసము భక్తి. ఈభక్తి, భగవంతునియందలి యనురాగము. చంచలతమమైన చిత్తము నాతనియందు లగ్నముచేయుటకుఁ బడరానిపాటులఁ బడవలయును. ఏదియో యొక ప్రతిమను ముందుంచుకొనవలయును. దానిని దదేకదీక్షతోఁ జూడవలయును. దానిని నమ్మకముతోఁ బూజింపవలయును. దానికి స్నాన మొనరించి యాతీర్థము త్రావవలయును. దానికి దీపధూపాది షోడశోపచారములు చేయవలయును. దానిని ప్రేమింపవలయును. దానివిశ్లేషమును సహింపకుండనుండవలయును. దానికి సాష్టాంగపడుచుండవలయును. దానినే సంసారతారకసాధనమని సంపూర్ణముగ నమ్మవలయును. దానినామమును నిత్యము స్మరింపవలయును. ఇట్లుకొంత కాలముచేయఁ జేయఁగఁ గంటిలో నొకవిధమైనమార్పు గలిగి యావిగ్రహము తేజోవంతమైనదిగ, జీవవంతమైనదిగ, చలనాశక్తి సంపద్వంతమైనదిగఁ గానఁబడును. కన్ను చెదరిన కొలఁది మనసు దానియందు లగ్నమై యితర ప్రపంచవైముఖ్య మొందును. అంతట వెఱ్ఱివెఱ్ఱికేకలు, ప్రార్థనములతోఁ జేరిన పాటలు,

పాటల కనుగుణములగు నాటలు, చిత్తావశత్వమువలన సిద్ధించును. ఇట్లు పాడిపాడి, యొడలు తెలియ యాడియాడి పరవశత్వమున భక్తుడు విస్మితుడై పడిపోవును. ఇది భక్త్యుద్రేకమున కారంభావస్థ, ఇట్లు క్రమక్రమముగ విస్మృతికాలము హెచ్చగును. ఒడలు తెలియని మనుజుడు తెయితక్కలాడు స్వభావముగలవాడై యుండును. కాళిందులున్నచో గానముండితీరవలయును. ఆటకుఁ బాటకు నత్యంతమైత్రి. అందుచే భక్తిరసమునఁ బాట ముఖ్యముగము నుండవలయును. ఈరస మునఁదప్ప నితరరసములందు మిగిలిన పాత్రములచేతఁ బాటలు పాడింపఁ గూడదు. గానమునకు నాటకరంగమున నేమాత్రమైన జోటీయఁదగదు.

'ఓపరా' లని పాశ్చాత్యభాషలలో నొకవిధమగు గ్రంథము లున్నవి. ఇవి గానప్రధానములై యుండును. వీనితోఁ గొంచెము హెచ్చు తగ్గుగఁ బోలియుండునవి మనలోని యక్షగానములు—ఇవి యిటలీ దేశపువారు పూర్వమునఁ బఱచుగ వ్రాసియుండిరి. వాని ననుసరించి యే యింగ్లాండు మొదలగు దేశములవారు గూడ తమతమభాషలలో వానిని వ్రాసిరి. వీనికిఁ బ్రధానమగునది గానము. ఇట్టిగ్రంథ ప్రదర్శన ములఁగూర్చి Addison హేళనముగ,' It is laid down as an established rule which is received as such to this day that nothing is capable of being well set to music that is not nonsense " అని వ్రాసినాఁడు. ఇప్పటి మనదేశపు బాటల నాటక ములే ఆ 'ఓపరా' లవంటివనియు వానిలోఁ బదములుండునట్లే వీనిలోఁ గూడ నుండవచ్చుననియు, వానిని జను లాదరించినట్లే వీని నాదరింపఁ దగుననియుఁ బాటలనాటకము లొనర్చుకవు లనవచ్చును. అట్లనుట సమంజసముకాదు. వీరినాటకములు దశరూపకములలోఁ జేరినవి. యక్ష గానములుగావు. యక్షగానములు కేవలగానములు. అవి దశరూపక ముల లోనివికావు. దశరూపకములనునవి గాన కాలక్షేపగ్రంథములు గావు; బాహ్యాంతర ప్రకృతిచిత్రపటము Addison తిరుగ నాటకస్థగా నార్హతనుగూర్చి యిట్లు పలుకుచున్నాఁడు.

"If the Italians have a genius for music above the English the English have a genius for other performances of a much higher nature, and capable of giving the mind a much nobler entertainment. Would one think it possible

(at a time when an author lived that was able to write the Phaedra and Hippolitus) for a people to be so stupidly fond of the Italian opera as scarce to give a third day's hearing to that admirable tragedy? Music is certainly a very agreeable entertainment but it would take the entire possession of our ears, if it would make us incapable of hearing sense if it would excite arts that have a much greater tendency to the refinement of human nature, I must confess I would allow it no better quarter than Plato has done who banishes it out of his commonwealth.

ప్రకృతి ప్రతిఫలములై, ప్రాశస్త్యపరిపూర్ణములై, ప్రదర్శనైకావ్యములై ; ప్రజ్ఞాదాయకములయిన యథార్థనాటకములను పాటలు లేనికారణమునఁ జూచుటకు మాని సర్వవిధములఁ దద్వ్యతిరేకములగు పాటలనాటకములను జనులు మాధుర్యమునఁ జూచుటవలన మనసునకుఁ గలిగిన వెగటుచే Addison యిట్లు వ్రాయుటకుఁ గారణమైనది. ఇట్టి సన్నివేశమునకు మనదేశమున గురుఁడిప్పు డేకాదశమందున్నాఁడు. ద్వాదశజన్మములకు వచ్చినప్పుడుగాని జనులకీతిక్క తగ్గదు. సోదరులారా! నాటకములందు వృత్తములుండఁ దగదను నంశమునుగూర్చి యీ రాత్రి యుపన్యసింప నుద్దేశించితిని. కాని తదంశమునుగూర్చి కాసంతయుఁ జెప్పజాలనైతిని. పాటలనాటకములమాట ప్రస్తావవశమున రాఁగనే చిత్తము, జిహ్వయుఁగూడ నదేధోరణిని బోయినవి. వానిని గూర్చి యెంతచెప్పిన నింకఁజెప్పఁదగినదేయున్నది. కాని యింక వానిని గూర్చి చెప్పి మీకు సాధ్యమైనంతవఱకు శ్రమమీయను ; విధిలేక ముందెప్పుడైనఁ జెప్పవలసియుండి చెప్పునెడల మన్నింతురుగాక! ఈసారి వృత్తనాటకములఁగూర్చి చెప్పుట కవకాశము లేదు. కావున ముందెప్పుడైనఁ జెప్పెదను.

“జిహ్వ మనకు వశమైయుండవలయునుగాని మనము జిహ్వకు వశులమై యుండఁగూడదు. అశ్వవశుఁడై యుండు నాశ్వికుని యవస్థ నడుగవలయునా?” యని వాణీదాసుఁడు సణుగుకొనుచు సభవిడిచి పోయెను.

# సాక్షి

## 19. నాటకీయపద్యరచన.

జంఘాలశాస్త్రి పలికెను

నాటకములో వృత్తము లనష్టములని యిరాత్రి చెప్పఁదలంచితిని. వృత్తము లనంతములు; రాగములవలెఁ బ్రస్తరించినకొలఁది బయటఁబడును. వీనిలోఁ దఱచుగ వాడుకలోనివి కొన్నియున్నవి. అవి చంపకోత్పలమాలాది వృత్తములు; తఱచుగ వాడుకలోలేనివి స్రగ్ధరాతరళాదివృత్తములు. బొత్తుగ వాడుకలో లేనివి ప్రహరణకలితలాటీవిటాదివృత్తములు. ఇప్పటికి లక్షణగ్రంథముల వ్రాయఁబడియున్న వృత్తములనే యందఱు ఉపయోగించుటలేదు. ఇవిచాలక యీసంఖ్య మనస్సునకు నచ్చక వీని వింత నడకలభేదములు శ్రవణమునకు సంతుష్టి నీయకపోవుటచేతఁ గొందఱు కవిబ్రహ్మలు వృత్తసృష్టి నారంభించినారు. సీసమునకు బంగారమనియు, బంగారమునకుఁ బాఠాంతరముగ వెండియనియు వెండికిఁ దిరుగఁ దగరమనియు సృష్టిప్రతిసృష్టిని వీరాచరించుచుండ హైదరాబాదునబాబుగా రనేకసంఘములను బెంచుచుండ "సాటికి సాహెబుగడ్డము పెంచినట్లు" మాయూరనున్న మంగలికవి కందమునకుఁ బెండలమనియు, సుగంధికి దుర్గంధియనియు, విద్యున్మాలకు విద్యున్మాదిగయనియు నూతనవృత్తములు కల్పించుటయేకాక, ఖడ్గబంధమునకుఁ బ్రతిపక్షముగాఁ దంటసంబంధ మొకటి చేపట్టి యిప్పుడు కవితానూపురరవముతో "టంగుటంగు" మని పనిచేయుచున్నాఁడు. కర్ణపేయములై మనోహరములైన వృత్తభేదములన్నియుఁ బూర్వులే ప్రస్తరించి నిర్మించియున్నారు. ఇంకఁ బ్రస్తరింపఁ బ్రయత్నించుట పనికి

మాలినపని. ఈవింతవింత వృత్తములన్నియు బహువిచిత్రగమనభేదములు కలవి. వానినడకలు టక్కుటక్కుమని తాళమునకు సరిపోవును. గానోపయోగంబులయిన పదములు మొదలగునవి తాళబద్ధములై యెట్లు హృదయ రంజకములుగనుండునో యీ వృత్తములుకూడ నట్లే యుండును. కేవలరాగాలాపములలోఁ దాళ మావశ్యకములేదు. రాగమైనను చాలకాలమునఁ బాడఁబడినప్పుడు తాళ మపేక్షింపదు; కాని రాగము మధ్యమకాలమునఁ బాడఁబడినప్పుడు లయ నాసించియే యుండును. కావున లయయుక్తముగా నున్నపాట యంతయుగానమే. కావున వృత్తములు లోకజాతిపదములు. స్వరవి యనుస్వరవి లేనిపదములు. గాయకుని యిష్టానుసారముగ రాగమును మార్చి పాడుటకర్హము లయిన కీర్తనములు. ఈవృత్తముల గానమందు రాగముమాత్రమే గాయకుఁడు మార్పఁగలఁడు కాని వృత్తముతోఁ బుట్టినట్టియు వృత్త జీవమునకు జీవమైనట్టియుఁ దాళమును మాత్రము మార్పలేఁడు. అట్లుమార్చినయెడల వృత్తమే ధ్వంసమగును. పాటలకు వేయఁబడి యుండు రాగతాళములను గాయకుఁడు మార్చి పాడవచ్చును. పాడఁ గలఁడు. అందువలనఁ బాట చెడిపోదు. వేరు మట్టు వేసికొని పాటచెడ కుండఁ బాడఁగలఁడు. ఒకప్పుడు క్రొత్త మట్టువలననే పాటకు మఱింత శోభరావచ్చును కాని యిట్టిస్వేచ్ఛను వృత్తములయెడలఁ దాళవిషయమై తీసికొనఁజాలఁడు. అందుచేఁ దాళప్రబంధకట్టులోఁ బాటలకంటె వృత్తములే ప్రబలములయినట్లు కానిపించుచున్నవి.

నాటకకర్తలగు కొందఱు కవులు పాటలకుఁ బ్రతినిధులుగఁ దమనాటకములలో విచిత్రవృత్తముల నుపయోగ పఱచుచున్నారు. నాటకములలోఁ బాటలుంచవలయుననియే వీరి కుతూహలము. పాటల కున్నంతరంగు, రక్తి, తవర, డాబు, సభావశీకరణశక్తి, సర్వరస విజృంభణదక్షత వృత్తములకు లేవనియే వీరి పరిపూర్ణనిశ్చయము. నాటక రచనాకాలమందంతయుఁ బాపము! పాట లుంచమైతి మనియే వీరిప్రాణములు పరితపించుచుండును. పాటలయందింత ప్రీతియున్నను వానికై యింతబాధపడుచున్నను, వానినిమాత్రము తమనాటకముల నుపయోగ పఱచుటకు సాహసింపరు. ఏలన, నాటకములఁ బాటలు కేవలము ప్రకృతి వైఖరివిరోధములని వారెఱుఁగుదురు. ప్రకృతివిరుద్ధాంశ ప్రతిపాదకము

లగు ప్రబంధము లతిశీఘ్రకాలములోఁ బరమపదించు నని వీ రెఱుఁగు
దురు. వారి గ్రంథములు వారికనులయెదుటనే కాలధ్వస్త మొందుట వారి
కిష్టముండునా? గ్రంథచిరజీవత్వము నపేక్షించి పాటలను వారు బహి
ష్కరించిరి; కాని పాటలనాటకములకుండు ప్రాముఖ్యము ప్రజారంజన
శక్తి తద్గ్రంథకర్తలకుఁ గల ధనాగమము జనగౌరవము చూచుసరికి
వారి కోడలు నీరువిడుచుచున్నది. "కాలానుగుణ్యముగఁ బాటలనాట
కములు వ్రాసి ఘనులు ధను లనిపించుకొనుట మంచిదా? అవిలేని నాట
కములు వ్రాసి యనామకులు నస్పృష్టహీను లనిపించుకొనుట మంచిదా?"
యను పూర్వపక్షసిద్ధాంతములను వారుపక్రమించిరి. "పాటలరుచి యెల్ల
కాలము ప్రజలకుండునని యేమి నమ్మకము? వారి కది తగ్గినపిమ్మట మన
గ్రంథము లేమి కావలసినది? పాటలరుచి యున్నంతకాలమే సంపాదించిన
ధనముతో మాన్యములు గొన్నగూడలఁ బాటలరుచి పోయిననైనను
మాన్యములు పోవునా? అయ్యయ్యో! స్థిరముగ నిలువవలసినవి
భూములా? పుస్తకములా? పుస్తకములు పస్తుపెట్టునప్పుడు వానిముద్దేమి
ముక్కలయ్యెను? చచ్చిన తరువాత బ్రదికియుందుమని యెంగిలిలంఘన
ములతో నెండియుండి బ్రదుకును బరిసమాప్తి నొందించుకొనుట ప్రతి
భకు లక్షణమా? అయ్యయ్యో! ఇదియేమివెఱ్ఱి! కావలసిన దుదర
పూర్తియా? స్థిరకీర్తియా? మనపాటలనాటకముల పత్రములు పకోడీల
పొట్లముల క్రింద నుపయోగపడుచుండ గాలిపటముల చిల్లులకడుకుల
క్రింద వినియోగపడుచుండ మహతాబుల గుల్లలై మండుచుండ వల్ల
కాటికడుపు నిండిన లాభమేమి? మండిన నంతకంటె మంచిదికాదా?"
యనియు నింకేమేమో యనియుఁ దమలోఁ దాము వితర్కించుకొనుచుఁ
బ్రతిహతమయినదానిని దిరుగఁ బ్రతిపాదించుచుఁ బ్రతిపాదితమగుదానిని
బ్రతిహతము సేయుచు గుబ్బటలుపడుచు గుంజుకొనుచు రెండుతలల
పామువలె వెనుకకు ముందునకుఁ బ్రాకులాడుచు సవ్యాపసవ్యపరిశీల
నము సేయుచుఁ గ్రిందుమీదులఁ జూచుచు మ్రింగనులేక క్రక్కను
లేక యుక్కిరి బిక్కిరియగు నవస్థలోఁ జిక్కుకొనిరి. కాని వారు మిగుల
నేర్పరులు. సమయానుగుణవర్తనస్ఫూర్తులు. ప్రపంచజ్ఞానయుక్తులు.
ఉభయతోముఖపాండితీ మండితులు. దూరదృష్టిసహితులు. కావుననే
వారిట్టి సందిగ్ధావస్థలో విశేషకాలముండక యుభయతారకముగ

నుత్కర్షించిరి. ప్రకృతి వ్యతిరేకములగు "పాటలనాటకములవలనఁ దాత్కాలిక ఘనగౌరవములు కానలెనుగునా? పాటలు ద్రోచివైచి ప్రకృతి నవలంబించి వ్రాసిన నాటకములవలని స్థిరయశస్సంపదలు కావలయునా" యని రెండు ప్రశ్నములుండెను. అది యున్న దాని కిది లేదు. ఇదియున్న దాని కది లేదు. ఈయుభయపక్షములసంధిని వారు గొంతసేపు రాద్ధాంత పూర్వపక్షము లాచరించుకొని "వానిని వదలము; దీనిని వదల" మని "యారెంటినిగూడఁ బట్టుకొందుము" మని నిశ్చయపఱచుకొనిరి. "అబ్బాయీ! అమ్మమ్మ యొద్ద సదుకులు తిందువా? నాయొద్ద మినపరొట్టె తిందువా" యనియడుగు తల్లికి 'నంతయాలోచన మక్కఱలేదు. రెండునుగూడఁ దిందునమ్మా' యని పలుకు బాలుని జూచి బలియనఁ దగినది కాదా! వాఁడు తనువాతఁ దిండిపోతుగాని! మిండఁడుకానీ! దుండఁగీడుఁ కానీ! పండితుఁడు కానీ! అప్పటిసన్నివేశమును టొంకకుండ నెదుర్కొనినాఁడు. అటులే మననాటకకర్తలాచరించినందుల కానందింప వలసినది. పాటలకుఁ బ్రతినిధులుగఁ జిత్రరూపవృత్తముల నుపయోగించి యొక్కవ్రేటుతో రెండుతలలు పగులఁగొట్టినారు. గానతాళయుక్తములగు వృత్తములకుఁ బాటలకు భేదమేమున్నది? అయిన నవి పాటలా? కావు. ఒకవేళ నావృత్తములను నటకులు వృత్తైఖరిచే చదివెదరేమో? అట్లుచేసినయెడల పాటలనాటకముల కున్నంత పరిషద్గౌరవము తమనాటకముల కుండదేమో యను భీతిచే వృత్తములపైఁ జిన్న పువ్వులువైచి యట్టి పువ్వులనే యావృత్తములున్న పత్రము క్రిందవైచి "ఈవృత్తముల నిష్టానుసారముగ నటకులు పాటలుగఁ బాడుకొనినఁ బాడుకొనవచ్చును. అందులకు మాప్రోత్సాహమేమియులేదు" అని యాపుష్పమునకు వ్యాఖ్యాన మొనర్చిరి. ఆహా! ఎంతగడుసుందనముఁ గలవారో! వచననాటకములో వానివంటివో వ్రాసినకవులు వట్టితెలివి తక్కువ వారనియు, వారికిఁ బ్రజారంజనకవితాశక్తి లేదనియు నందుచే వారి వచనపరంపరలనడుమను గొన్ని పార్సిమట్లతోఁ బదములో బ్యాండు స్వరములతోడి కృతులో యదికించి నటకులు కవులయుత్తమగతులకై వారిగ్రంథములను గానరసబంధురములుగఁ జేయుచుండ వింతరూపరూపవృత్తములను వారు బాటలుగఁ బాడమానివైచెదరా? ఏడ్చుటకుఁ గారణములేనప్పుడు కారణమును దేనినో కల్పించుకొని యేడ్చు

రోదనప్రియుండగు స్వల్పకాలమునం గలిగినప్పుడు మాన్పివైచునా ? మన నాటకకర్తలు వారిసృష్టములను నటకులు పాటలుగఁ బాడవలయునని యే కోరికఁగలవారు. పాడుచుండనిచో నెఱుఁగనే యెఱుఁగుదురు. కాని 'పాడు' మని వారికిఁ దామె చెప్పఁ దగదు. చెప్పినట్లుండఁ గూడదు. షా గ "మీ యిష్టానుసార మాచరించుకోవచ్చును గాన మేము ప్రోత్సహించువారము కా" మని ఖండితముగ నిర్ఘాటముగఁ బల్కుచు వారికిఁ బాటలపైనుండు ననిష్టతను వెల్లడించినారు. వారి ప్రయోజకత యెంత ప్రకాశించుచున్నదో ! వారు పాటలు వేయను లేదు. వేయకపోను లేదు. పైచిన తాత్కాలికలాభమును బొందు చున్నారు. పైపెచ్చు స్వభావానుసారముగనే నాటకములు వ్రాసినను ఖ్యాతిని బొందుచున్నారు. చిలుకను బిళ్లని నొకపంజరమునఁ బెంచు చున్నారు. ఉభయకవితాధురీణులును ఐహికము నాముష్మికముతో నంటఁ గట్టుచున్నారు.

కాని వారినాటకములు పాటలనాటకములకంటె భిన్నములు కావు. పాటలనాటకముల కెట్టి యాక్షేపణము లిదివఱకుఁ జెప్పఁబడియుండెనో యవియన్నియు వీనికిఁ గూడ నమోఘముగ వర్తించును. వారు ప్రచ్ఛన్నసంగీతనాటకకర్తలు. వీరు ప్రత్యక్షసంగీతనాటకకర్తలు! ఇది యే భేదము. ప్రకృతికాంతామారణమున వీరిద్దఱు సమానదీక్షాదక్షులే! సమానపాండితీబంధురులే ! కాని ప్రచ్ఛన్నసంగీతనాటకకర్త కృత్రిముఁ డగుటచేఁ గొంతపిఱికివాఁడగుటచేఁ గౌఁగిటిలో లాలించినట్లే నటించి యామెను గొంతుముడికోలకిఁ జంపినాఁడు. ప్రత్యక్ష సంగీతనాటకకర్త ధారాళాంతఃకరణముగలవాఁడు. నిర్భయస్వభావము గలవాఁడగుటచే నెదురుగఁ బోయి తాళపుఁ జిప్పలతో బ్రహ్మరంధ్రస్థానమునఁ గొట్టి చంపి నాఁడు. "ప్రకృతిని జంపితివా ?" యని పాటలనాటకము లొనర్చినవారి నెవఁడైన నడుగ "ఔను నేను జంపితిని. అది బ్రతికియుండినయెడల నగికి స్వేచ్ఛగ నుండదు." అని బహిరంగముగ నాతఁ డొప్పుకొనును. ప్రచ్ఛన్నసంగీతనాటకకర్త నీప్రశ్న మెవ్వఁడైన నడుగ "అయ్యయ్యో ! నేనేమియెఱుఁగుదును. నేను బ్రకృతిని బూజించువాఁడను. దానికను సన్న మెలఁగువాఁడను. దానియిష్టము ననుసరించి మాటలాడువాఁడను. దాని యానకెందున భిన్నముగఁ బోవువాఁడను గాను. నేనేమిటి దానిని

జంపుటయేమిటి ?" యని ప్రేక్షకులు చెప్పిరి. నీప్రబంధమునఁ
బ్రకృతి ప్రాణపీడనమ్మే పడిపోయియుండుటకుఁ గారణమేమని యాతని
నడుగ "నాకేమి తెలియును ? నటుడు తెల్లవాఁడయిన వానిని బలాత్కార
మునఁ జంపి నాకొంపఁ దీసిరి కాఁబోలు ! నెమ్మదిగనుండుఁ బాటలువల
దని నే నెప్పుడు చెప్పుచున్నాను. నిరంకుశులగు నాపద్యములను విక్కు
మాలిన పాటలుగ మార్చువారి నెన్నఁడు మెచ్చను నేను స్పష్టముగ ఘోషిం
పనే ఘోషించినాను. నామాటవినకుండ నాయభిప్రాయములను గణింప
కుండ, నాపద్యములు లక్ష్యపెట్టకుండ, నాకవితాసుమజాలముల
మన్నింపకుండ, నాపాత్రప్రవృత్తులను బరామర్శింపకుండ, నాయుక్తి
ప్రతియుక్తిసంభాషణముల సంభావింపకుండ, నాకవితావిజృంభణాపాటవ
మును బాటింపకుండఁ బుష్పగుచ్ఛములవంటి నాపద్యముల నన్నిటిని
బలాత్కారమునఁ బడఁదీసి కంబళిపురుగు క్రింద, భాగవతపు బాటల
క్రిందఁ బనికిమాలిన జావళీల క్రిందమార్చి గానసాహాయ్యోన్మాదమున
నొడలు తెలియక తెయితక్కలాడియాడి యానిర్భాగ్యపునటకులు నా
నాటకమునకు సంజీవినియగు ప్రకృతిని పట్టిపట్టి దిమ్మలాటలలోఁ గాళ్ల
క్రిందఁ బడవైచి త్రొక్కిచంపిరి కాఁబోలు!" నని గుండెలు నిష్ఫలముగఁ
గొట్టుకొనుచుఁ గూనురాగము లాలపించెను. నటులలోనున్న కెవఁడయిన
పోయి "మీరేల పాట లీనాటకమున నుంచితి"రని యడుగ "మేముంచిన
దేమున్నది ? దానిలోని వృత్తములకే మట్టులు వైచిపాడితిమి. "వానిని
నటకులిష్టానుసారముగఁ బాడుకొనవచ్చు" నని యాయన తనంత తాను
బాహాటముగ సర్వనటకుల కనుజ్ఞ నిచ్చియుండ మాదోషమేమి ? మే
మెవతెనో చంపితిమా ? అదియెవతెయో మే మెఱుఁగుదుమా ? ఆమె
పేరైన మే మెన్నఁడైన వినియుంటిమా ? అయినను మాకొకరినిఁ జంప
వలసినంత యావశ్యకతయేమున్నది ? ఈనడుమ బలమెఱుఁగని ప్రాఁత
కత్తులతో యుద్ధము లొనర్చి చట్టలు తెగి పిక్కలు తెగి చావునకు మేమే
సిద్ధమైయుండ మే మొకరినిజంపుటయేమి?" యని వారు పలికిరి. ప్రకృతి
మాత్రము చచ్చినది. నాటకకర్త లేమియు నెఱుఁగరు. నటకులేమియు
నెఱుఁగరు. "ఆ! ఆ! నేను వేదాంతుఁడను; ఆస్మరణమైనఁ బనికిరాదు.
ఆ! ఆ! నేను వేదాంతుఁడను. ఆస్వప్నమైనఁబనికిరాదని యెవరిమట్టునకు
వారే యనుచుంటిరి కదా ! మీరందఱు వేదాంతులగుపక్షమునఁ

యోగినిగారి వేవిళ్లకుఁ గారణమేమిటి? "వీరి నాటకములలోని వింత వృత్తములను బాటలుగఁ బాడుటచేతనే యీ యాపత్తు దాపురింపలేదు. వానిని బాటలుగ మార్చకుండనే వానికి యథోచితములగు నడకల ననుసరించి రాగహీనముగ వానిని జదివినసైనను నీయాపదయే సిద్ధమగును. ఏలయన వానికిఁ దాళము జన్మసిద్ధమైయున్నది. తాళము తోడనే తాండవ మున్ఫవింపక తప్పదు. తాళవాసన తగులగనే పాత్రౌచిత్యము భగ్నమగును. రసము ధ్వంసమగును. ఔన్నత్య మడుగంటును. సహజత్వము చచ్చును. రామరావణయుద్ధప్రదేశమునో దుష్యంతశకుంతలాసమావేశ సముచితతాపసాశ్రమపనవాటినో యథోచిత వస్తుసన్నిపాతమునఁ బ్రదర్శించునాటకరంగమంతయుఁ గోరలమ్మగుడి ముంగిలియో కల్లుపాకయో యగును. ఎట్లన — రామరావణులను యుద్ధరంగమునఁ గవి దారసింపఁ జేసినాఁడు. వారిచే నిట్లు సంభాషింపఁజేయుచున్నాఁడు.

రావ — అరే! దురాస నిల్వ నిన్ను నంత మొందఁజేసెదన్॥

రామ — బిరాన రార! చంపువాఁడ! ప్రేలు లేలమానరా!

పంచచామర సంబంధమగు నడక యిటు టక్కుటక్కుమనుచుండ నీశూరవరులు నేలఁ ద్రొక్కి త్రొక్కి యాడుదురా లేదా? శౌర్యరసాపరావతారమగు రావణాసురుఁ డట్టిసమయమున దశవదనములు జేవురింపఁ గనులవెంట సౌదామినులు వెల్లివిరియ శౌర్యరసగుంఫనములగు నన్నావాక్యము లాడవలయునా? అట్లెయట్లె యెగురులాడవలయునా? ఛీ! భగవదవతారమగు శ్రీరామచంద్రమూర్తి యాసమయమున సపరాధయుక్తుఁడగు రావణుని జూచి వానిదౌష్ట్యమునకు స్వల్పమైనకోపము లోనఁ గల్గియున్నను వాని యజ్ఞానమునకుఁ జింతించినవాఁడై యీషత్కోపచింతాసమ్మేళన సముచితములగు వాక్యములాడవలయునా? ఏకతాళమున కనుగుణముగఁ దైతక్కలాడవలయునా? ఛూ! శూరవీరుల వీరాలాపపు వెఱ్ఱివృత్తములు కోరలమ్మగుడియెదుట వేపమండగల యెడమచేయి నిలువుగఁ బైకెత్తి కుడిచేతినిఁ బిఱ్ఱపై నిలిపి యొంటికాలి భరతమాడుచు శివశక్తులుపాడు

"అమ్మవారి మాటలన్ని యాలకించివారెరె! హా! మిమ్ము నమలి లొట్టవేసి మ్రింగు మ్రింగు హా!"

కూడఁ దాళప్రసంకెలయున్నదా? సుగంధ్యాదివృత్తములకువలె నంత విశేషముగ లేనప్పటికిని దాళప్రసక్తున్నది. కాని లేకపోలేదు. అదిగాక యీసామాన్యవృత్తములలోనైన నొకదానినంటినడక రెండవ దానికి లేదు. దేనినడక దానిదే! అది దానికే సహజము. నియమితము లగు గణములకూర్పుచే నిట్టినడక సిద్ధించినది. అనఁగ జంపకమాలకు మొదట నగణ ముండితీరవలయును. తరువాత జగణము, భగణము, జగణము, జగణము మొదలగునవి వరుసగా నిట్లే యుండితీరవలయును. మఱియొక నియమితగణములకూర్పు నుత్పలమునకున్నది. ఈగణ సమూహములో భగణమున్నచోట జగణముగాని జగణమున్నచోట భగణము గాని యుండినయెడలఁ బద్యము చెడును. వృత్తములలో నొకొక్కజాతి నడక యొకొక్కపద్యమునకు జన్మసిద్ధమైనది. దానినడకను బట్టియే యది యేపద్యమని గ్రహింపవచ్చును. నాటకమునఁ బాట పాడుట యెట్లసహజమో పద్యములు పాడుటకూడ నట్లే యసహజము. ఆపద్యములు సామాన్యవృత్తములయినసరే! వింతవృత్తములయినసరే! అన్నివృత్తములు నాటకమునుండి బహిష్కరింపఁదగినవే!

అట్లయైన నొక్కవచనముతప్ప నాటకమున మఱేమియు నుప యోగింపఁగూడదా? ప్రకృతివైఖరి ననుసరించి వ్రాసినయెడల నంతే! అట్లయినచోఁ బూర్వనాటకకర్తలందఱు ప్రకృతిజ్ఞానాభావులేనా? అందఱు కారు! వారు కొన్నికారణములచేఁ గొన్నివృత్తములను విధి లేక చేర్చుకొనవలసివచ్చినది. పాత్రములన్నియు రంగస్థలమున మాట లాడుకొనునప్పుడు వివిధములగు రసములు వివిధములగు పరిపాకభేద ములతో నుదయించును. ఇవియన్నియుఁ బాత్రములకు వేఱువేఱవస్థల వేఱువేఱు విధములగు మాటలఁ గలుగఁజేయును. బాహ్యప్రకృతిలో నుండు ననేకవస్తువులుగూడ నాంతరప్రకృతిలో ననేకములగు మార్పులను గలుగఁజేయును. ఇట్టి చిత్రవిచిత్రానేకభేదాన్వితము లగు తమ హృదయావస్థలు పాత్రము లొండొరులతోఁ గారణాంతర ములఁ జెప్పుకొనవలసియున్నప్పుడు దృష్టిగోచరములుగాని హృదయా వస్థల బొమ్మలను బాహ్యప్రకృతితోనుండు రంగులతోడనే వేయవలసి యున్నది. కాన నిట్టిసమయమున నుపమాలంకార మావశ్యకముగ వచ్చును. మనోవేద్యమగు చిత్రచ్ఛాయకల హృదయావస్థయు దానికి

టక్కున సరిపోయి తెలియఁదగని దానిపైఁ వెలినిని బఱపి చీకటిపై
వెలుతురును బ్రసరింపఁజేయునట్టి బాహ్యప్రకృతిస్వభావమగు వింతసన్ని
వేశమును నీరెంటికి లంకెవేయఁ గలిగిన ప్రశస్తస్వభావముతోడి యీమంచి
కల్పనము వచనమునఁ జెప్పినయెడల నిగనిగ నుండుననియు నినుడికగ
నుండదనియుఁ బద్యరూపమునందున్న జాతుల జాత్యగ్రములఁ దెలుచుగ
నుండుననియుఁ బూర్వులుసంస్కృతకవులలో నుత్తమోత్తములగువా
రెంచి తాళసంబద్ధసహితములగు వృత్తముల నన్నింటిని నిరాకరించి కేవల
వచనమువలెఁ గొంచెము పెంపుతోడిగ నడచు నాట్యవృత్తము నను
ష్టుప్వృత్తము తఱచుగ నుపయోగపఱచినట్లు కనఁబడుచున్నది. పద్య
ముల నెచ్చుతెచ్చుట యుపయోగపఱుపవలయునో చెప్పినయెడలఁ జెల్ల
వారువఱకుఁ జెప్పవలసి వచ్చును. ఆయంశమును ముందరి యుపన్యాస
మునఁ జెప్పెదను. ప్రశస్తమైన యభిప్రాయమున్నయెడల దాని నుప
మార్థాంతరన్యాసాలంకారములతో మేళవించి దానిని ధారణాయోగ్య
ముగఁ జేయుటకై నడకయందు వచనమునకంటె విశేషభేదములేని
వృత్తములలోఁ బూర్వోత్తమకవులు దాని నిముడ్చుచుండిరి. వచనమే
ప్రకృతి ననుసరించి ప్రధానమైన నాటకములందు వీరరసమున విధిలేక
కొన్నిజాతులపద్యముల నుత్తమకవులు స్వీకరింపవలసివచ్చినది. ఏకాదశి
నాఁడు శుష్కోపవాసముండవలసినదే! అయినను బ్రాణదేవుని
బాధింపఁదగని హేతువుచే ఫలాహారముమాత్రము చేయవచ్చునని
నియమములున్నవి. ఇట్లు నిష్ఠాగరిష్ఠులగువారు కొంచెము మాత్రము
జరిపిరి. వారి తరువాతివారు — ఆచారము తక్కువగను నాఁకలి
యెక్కువయుఁ గలవారు. ఫలాహారమునుండి యుప్పిడిపిండికి దానినుండి
మినుపరొట్టెకు దానినుండి పకోడీలకు దానినుండి తేగలకుఁ గ్రమక్రమముగ
వివిధభేదాహారరచనాచమత్కృతిని వ్యాపింపఁజేసిరి. అటులే వచనమే
యుండఁదగినది! అయిన ధారణాయోగ్యము లుత్తమాభిప్రాయముల
నార్యాదివచనవైఖరీసహితవృత్తములఁ గొన్నింటిలో మాత్రమే
నాటకముల నుంచవలసిన ట్లుత్తమకవుల ప్రాతలఁబట్టి కనఁబడు
చుండఁగా సరసకవితాశక్తి తక్కువ, శబ్దగుంభనాశక్తి యెక్కువఁగల
తరువాతికవులు క్రమముగ శార్దూలమునకుఁ బిదప వసంతతిలకకు
మంగళమహాశ్రీకి మహాస్రగ్ధరకు దిగజారి కలములు బారవైచి తాళపుఁ

చెప్పుట చేయఁబూన సాహసించిరి. పద్యవిహీన మగునఁగ నాటకము ధ్వంసమగునను భయముచేతనే చచ్చిచచ్చి తుదకుఁ దప్పనిసరిగ వచనముల నడకగల పద్యములఁ దీసికొనుట తగునని పైకిఁజెప్పకుండ వారి లేఖనవైఖరినిబట్టి గర్భితముగనైనను సూచించినారు. "వారట్లు సూచింపనిదే సూచించిరని దురభిప్రాయమును మనము పడకుండఁ గూడదా" యని యందురేమో? అట్లు కాదు. పాశ్చాత్యదేశీయగ్రంథకర్తలలో నుత్తమోత్తములు లనఁదగువారుకూడ నాటకరచనయందు, నందులోఁ బద్యరచనయందే మనపూర్వులు వెల్లడించిన యీయభిప్రాయమునకుఁ గేవల మనుగుణముగఁ బ్రతిబింబముగ వారియభిప్రాయమును వెల్లడించియుండినయెడల మనపూర్వు లీవిషయమున దురభిప్రాయపడినవారైయుండియుండరుకద? వారట్లు సూచించిరని మనము దురభిప్రాయపడియుండఁగూడదుకద! Addison యిట్లు చెప్పుచున్నాఁడు:—

Aristotle observes that the Iambic verse in the Greek tongue was the most proper for tragedy; because at the same time that it lifted up the discourse from prose, it was that which approached nearer to it than any other verse. For, he says, we may observe that men in ordinary discourse very often speak Iambics without taking notice of it. We may make the same observation of our English Blank verse which often enters into our common discourse though we do not attend to it and is such a medium between rhyme and prose that it seems wonderfully adapted to tragedy.

గ్రీకుభాషలో పద్యభేదము లనేకము లుండఁగా "Iambics" అనునది యొక్కటే నాటకమునకు ముఖ్యముగఁ దగునని మహాధీమంతుఁడగు Aristole చెప్పినాఁడు. అందులకుఁ గారణములు మూఁడు చెప్పినాఁడు. (1) వచనసామాన్యరచనకంటె నీపద్యరచన ఘనతరముగ నుండును. (2) ఇతరపద్యములన్నిటికంటె నిది వచనముతో నెక్కువగఁ బోలియున్నది. (3) మనము సామాన్యసంభాషణములో దీనినే యుపయోగించుచుంటిమని యెఱుఁగకుండ నుపయోగించుచుందుము. వింటిరా? నాటకమునందుండుట కెట్టిపద్యము కావలయును? అత్యంతము వచనమునుబోలియున్న పద్యము కావలయును. ఇది గ్రీకుదేశస్థుల కట్టుబాటు. ఇఁక నింగ్లాండుదేశపుకవులు నాటకరచనయందు Blank verse

అనుపద్యము నుపయోగింతురు. అనేకపద్యస్థానములుండఁగా దీనినే యేల వారుపయోగింపవలెననుము. ఇదియుండిన యెడల సంభాషణములోఁ దెలియకుండ వారుపయోగించుకొందురు. ఇది సామాన్యుని వచనము కాదు. పద్యమువలె పద్యమునుకాదు. చక్కని యాభాషయందుధ్వనిస్వరచనా చమత్కారము గలిగి నాటకములకుఁ బరిపూర్ణముగాఁ దగియున్నది. దీనియభిప్రాయమునుబట్టి సామాన్యభాషకు బహుళముగఁ దగ్గరయున్న పద్యమే నాటకమునకుఁ దగినట్లు కనఁబడుచున్నది. ఇంగ్లీషుజాతివారుగాని గ్రీకుజాతివారుగాని నాటకరచనయందేదో యొక్క జాతిపద్యమే యవశ్యమని దానినే స్వీకరించిరిగాని వివిధపద్యములను ప్రయోగింపలేదు. కారణమేమి? వివిధపద్యములను బ్రయోగించుటనున్నది. అది నాటక రసమునకు భంగము—కావలసిన దెట్టిపద్యము? పద్యముకాని పద్యము —వచనముకాని వచనము! అది ఇంగిలీషున Blank verse.

గ్రీసువారికి "Iambics" ఉన్నది. ఇంగ్లీషువారికి Blank verse ఉన్నది. సంస్కృతభాషలో "ఆర్యావృత్తము, అనుష్టుప్వృత్తము లున్నవి" వీనికిఁ బ్రతిబింబమైనది మనయాంధ్రభాషలో నేమియున్నదని యాలోచింపఁగఁ "తేటగీతి" కనఁబడుచున్నది. దీనికిఁ బ్రాససంబంధము మిక్కిలి తక్కువగఁ గలదు. దీనిలోని పాదములను నియమిత గణక్రమములేదు "సూర్యుఁడొక్కఁడు మూఁడు సురరాజులిద్దఱు, దినకరద్వయంబు "తేటగీత" యని చెప్పఁబడియున్నది. సూర్యులు రెండువిధములు, గలమైన వేసికోవచ్చును. నగణమైన వేసికోవచ్చును. సురరాజు లనేక విధములు. వానిలో మనకిష్టమైనదానినే వేసికోవచ్చును. చివర సూర్యులలో నగణముగాని, గలముగాని యభీష్టముగా వైచుకొనవచ్చును. ఒకగణము తరువాత నొకగణ మవశ్యము రావలయునని నియమము దీనికి లేదు. కనుక దీనికి జన్మసిద్ధమైన యొక్కనడక లేదు. దీనికి మనము దానిలోఁ బ్రయోగించెడు గణములనుబట్టి గమనభేదముల నీయఁగలము. ఇట్టిగమనభేదములు మిగుల నావశ్యకములు. పాత్రమునకుఁ గల మనస్థితిభేదములఁబట్టి యీగమనభేదము లుండవలయును. ఏకమైనట్టియు మార్పులేనట్టిదియుఁ బద్యమును జెరిపినగాని మార్చుట కవకాశము లేనట్టిదియునగు గమనముగల పద్యముకంటె తేటగీత యన్నివిధముల భేదమగుటచే నిది పద్యముగాదు. వచన మంతకంటె కాదు.

అందుచే నిది Addison చెప్పినట్లు medium between prose and rhyme అయి wonderfully adapted to tragedy అగుచున్నది. దీని కంటె ఛందస్సును వచనమును బోలినపద్యము లేదు. అందుచే నిదియే సర్వవిధముల నాటకరచన కత్యంత మర్హమైయున్నది. అదిగాక దీనిఁ గేవలము వచనమువలెనే నడచునట్లు మనము గణములకూర్పులచేఁ జేయవచ్చును. అట్లే చేయుట తగును. నాటకములోని గీతపద్యములును గీతములవలెఁ జదువఁబోయిన నవి నడువకుండునట్లు వ్రాయవలెను. అవి వచనములని జదువుకొనినప్పుడే యవి నడువచలయును. ఈవచనములకుఁ బద్యత్వము మిగుల విలువగలిగి ధారణా యోగ్యములయిన యభిప్రా యములను వీనిగర్భమున దాచుటకే ఈపద్యములకు వచనత్వము-ప్రకృతి వైఖరికి భిన్నముగ నుండుటకే గీతపద్యమనఁగ నదియొక్కటియే కాదు. దానిని సీసము నాటవెలఁదిని గూడ నుపయోగపరచవచ్చును. వీనిని జదువవలసినప్పు డాయారసభేదోచితకంఠరవ పరిపాకములఁ జదువవల యును. గానధోరణిని బాడఁగూడదు.

నాటకములో నన్నియుఁ దేటగీతములే యైనచో విసుగుగనుండు నని కొందఱందురు. ఇది కేవల మహాధాభిప్రాయము. గానము వినుట కొఱకు గంతులు చూచుటకొఱకు నాటకశాలకు వచ్చిన నరుల కట్లు తోఁచినఁ దోఁచవచ్చును. నాటకశాలయే ప్రపంచము పాత్రములే యందలి నరులని యూహాముతో వచ్చినవాని కెన్నఁడట్లుండదు. మన నాటకములలో నచ్చటచ్చటనున్న గీతపద్యములే విసుగుగలిగించు నెడల నారంభము మొదల లంతమువఱకు నొక్కటే Blank verse పద్య ముగల యింగిలీషునాటకము లంతకంటె విసుగుఁగలిగింపవలసినవికావా ! ఈయాక్షేపణము దుష్టప్రబంధపఠనమువలన దుష్టరుచులు దురభిప్రాయ ములు గలిగిననరులనుండి వెడలునదికావున దీనిని ఖండించుటకంటె నుపేక్షించుటయే యుచితము. ఈరాత్రి చాలాసేపు చెప్పి శ్రమయిచ్చి తిని. క్షమింప వేఁడుచున్నాను.

---

# సాక్షి

## ఆధ్యాత్మిక విద్యావశ్యకత

---

జంఘాలశాస్త్రి యిట్లు పలికెను.

ఈనడుమ సువర్ణసీపత్త్రికలో "సువర్ణలేఖాపత్త్రికా ప్రశంస" యను శీర్షిక క్రింద మన "సాక్షి"ని గూర్చి కొన్ని యంశములు వ్రాయఁబడినవి. సువర్ణసీపత్త్రికాధిపతు లిట్లు వానొసఁగు నీస్వల్పమైన పని కామోదించినందులకు మనము వారియెడల మిగులఁ గృతజ్ఞతఁ గలవారమై యుండవలయును. ఎవ్వరైన నేదైనఁబనిఁ జేసినయెడల దానిలో నెక్కడతప్పువచ్చునా ఎక్కడ వంక దొరకునా? ఎట్లధిక్షేపింతుమా? యని వేయికనులఁ గనిపెట్టియుండువా రనేకులున్నారు. నేసులు వెదకి యధిక్షేపింప మొదలుపెట్టినయెడల నాక్షేపణార్హుఁడు కానివాఁ డెవ్వఁడైన నుండఁగలఁడా! బ్రహ్మజ్ఞులగు వేదవ్యాసులు మొదలు పశుప్రాయుఁడగు పామరాధమునివఱకు కంపఱు నొక్కవయసను దిట్టనేర్చిన కలము క్రింద దిగదుడుపు కాదా! సర్వజగత్సృష్టికర్తతప్ప సర్వజ్ఞుఁ డెవ్వఁడైన నున్నాఁడా? అంద ఱల్పజ్ఞులే కదా! మనుజబుద్ధి మిక్కిలిపరిమితి కలది. జ్ఞాన మపారము. అమితగంభీరము అహంభావము లవతలికిఁ ద్రోచి గర్వములు కట్టిపెట్టి యసత్యము నడచిపెట్టి మనసును స్వచ్ఛముగఁ జేసికొని యొక్కనిముస మితరచింతలకు శాంతిఁ జెప్పి యొంటరిగఁ గూర్చుండి కన్నులను మూసికొని "యింతకాలమునుండి యీప్రపంచమున నల్లలాడుచుంటిమిగదా! మనకుఁ దెలిసిన యంశమేది" యని గాఢమైన ప్రశ్నమును మిమ్ము మీరు వైచుకొనుఁడు! వైచికొంటిరా? మంచిది. మీయంతరాత్మ మీకేమని యుత్తరమిచ్చుచున్నది. ఆయుత్తర

మేదియో మీకుఁ దెలిసినజాలు. పైకిఁ జెప్పనక్కఱలేదు. మీరు పై
కేల చెప్పనక్కఱలేనిన మీ వ్యక్తిమొగములే దానిని వెల్లడించుచున్నవి.
ఇంతే మనుష్యుని జ్ఞానము ; గగనకుసుమము ! మరీచికావీచిక, నపుంసక
సంగమము, వంధ్యాప్రసవము. తెలియనివాఁడు తెలియనట్లుండునా ?
ఊఁహూ ! ఓ ! ఏమిస్వప్నములు ! ఏమిమొగిసిపాటులు ! ఏమి తెగనీలు
గులు ! ఏమివాదోన్మథనములు ! ఏమి రాద్ధాంతపూర్వపక్ష రామణీయ
కతలు ! ఏమి ప్రజ్ఞాప్రకర్షలు ! సూర్యగోళములో గంధకపు గనులున్న
వనియుఁ జంద్రునిలో సర్పకప్పలెపము లున్నవనియు, వెలుతురు నిము
సమున కిన్నివేల మైళ్లు ప్రయాణ మొనర్చునని యు ఖగోళశాస్త్రజ్ఞుఁడు
నిర్వచించుచుండఁగా ! ఆశాస్త్రజ్ఞుని నిలువఁబెట్టి "నాయనా ! వెలుతు
రనఁగ నేమో నాకుఁ దెలియును. అది యేమిటి ? ఎట్లు గలుగును" అని
యాతని మన మడుగుదమేని "కెమికల్ కాంబినేషన్" అని "ల్యూమి
నస్ బాడీ" యని "ఆప్టిక్" ల్సని "ఈథర్" యని "రెటినా" అని ఏమేమో
చాటు భాషతో గ్రంథము నెలసీయ నారంభించును. "తెలియనిమాటనొక్క
దానిని దెలుపుమని యడిగితిని గదా ! ఇన్ని తెలియనిమాటలు నా
మొగమునఁ గొట్టిపోయెదవేల నాయనా ! నన్నొక మెట్టుపై కెక్కించ
లేకపోయితివి సరికదా ! దిగఁ దీయుచుంటివి కూడనా ? చాలు నమస్కా
రము" అని మన మాతని యెదుర నుండి సెలవుతీసికొనవలసివచ్చును. ఈ
గోళము లెక్కడనో దూరమున నుండుటచేత వానితత్త్వము మనకు
బాగుగఁ దెలియకపోయి యుండవచ్చునని మన మనుకొనుట కవకాశ
మున్నది. మనము నిత్యము చూచుచున్న వస్తువులఁ గూర్చి మన కే
మాత్రము జ్ఞానమున్నదో కనుఁగొందము. ఈ క్రిందిచిత్రమును బరి
శీలించుఁడు.

The sinor Nardo recounts the results of experiments made on his own person in the transplantation of hair and relates that by transplanting quickly a hair, with its root, from a pore of his head into a pore of his chest, easily to be accom-plished by widening the pore some what with the point of the needle, introducing the root with nicety and exciting within the pore itself, by friction, a slight degree of inflam-mation the hair takes root, continues to vegetate and grows

in due season changes colour becomes white and falls. Ten thousand wonderful things.

తలపై వెండ్రుకను మొలకెత్తోఁ జేసి గుండెలపైఁ బ్రాఁతినయెడల నక్కడ నది వేరునాటుకొని గొబ్బుగునని దీని ముఖ్యాభిప్రాయము. ఇది యొక ప్రకృతిశాస్త్రవిద్వాంసుఁడు చెప్పియుండెను. ఆతఁడు రోమశాస్త్ర మందు ప్రత్యేకనిపుణతసంపాదించినవాఁడు గలవాఁడై యుండినట్లు తోఁచును. "వెండ్రుకయనగనేమి? అది గొబ్బెట్లగును?" అని యాతని నడుగ నాతఁ డావిషయమునమాత్ర మితరులకంటెఁ దెలిసిన వాఁడు కాఁడు. పైని రెండుగదులు, క్రింద రెండుగదు లుండుననియు వీని నడుమ నొకపైపునుండే తెఱచు తలుపులున్నవనియు నవి నిముసమునకిన్ని మాఱులు కొట్టుకొనుచుననియు శారీరశాస్త్రవేత్త హృదయకోశవర్ణన మొనర్చునుగాని మొదటఁ గొట్టుకొనుటకుఁ గారణమేమని యడుగ నూరకుండును. ఒక కవి యీవిషయమున నిట్లు పలుకుచున్నాఁడు.

గీ. మనకుఁ దెలిసిన దేవయిన మహిమ గలదె?
ఇదిగొ పుష్పము! పూవన నేమి! ఊహు!
ఎట్లుపుట్టిన? దూహుహూ! ఇట్టిరంగు
లెటుకలిగెనూఁహూ! యేవస్తువిద్ధి? ఊహు.

మనము యథార్థముగఁ బైచాయచూచి యదియే వస్తువనుకొను చున్నాము; ఒప్పుపొడవు వెడలుపుఁ జూచి వస్తువనుకొనుచున్నాము. వస్తువు మనసులోఁ గలిగించినమార్పులే మనము వస్తువుగ గ్రహించు చున్నాము. వస్తువికారములను దెలిసి వస్తువు తెలిసినదని మోసపడు చున్నాము. మనజ్ఞానము; మిథ్యాజ్ఞానము. ఛాయను జూచి వస్తువని భ్రమించుట జ్ఞానమగునా? తోలుబొమ్మలను జూచి నరులని యను కొనుట జ్ఞానమగునా? ఇంద్రజాలములోని పదార్థములను బరమార్థము లని తలఁచుట జ్ఞానమగునా? స్వప్నానుభవములను సత్యమని తల పోయుట జ్ఞానమగునా? మనదరినున్న యన్నివస్తువులు మనము నిత్యము చూచుచున్నవే! చూచుచుంటిమని యనుకొనుచున్నవే! కాని యేవస్తు వును మనము చూచుటయే లేదు. చూచుచుంటిమని యనుకొనుచున్న దేదో యది వస్తువుకాదు. వట్టిది. మనచుట్టుననున్న యన్నిపదార్థములు మన మనుదినము తెలిసికొనుచున్నవే! తెలిసికొనుచుంటిమని యనుకొను

చున్న వే! కాని యేపదార్థమును మనము తెలిసికొనుటయే లేదు. తెలిసి
కొంటిమని యనుకొనుచున్న దేదో యది పదార్థముకాదు. ఆ యథా
ర్థము—ఇట్లు వినకున్నను, వినుచుంటిమని, తాకకున్నను దాకు
చుంటిమని, చూడకున్నను జూచుచుంటిమని, తెలియకున్నను దెలియు
చుంటిమని మనము మహామోహమున నసుకొనుచుండెడి వస్తువుల
కేవో పేరులుపెట్టి యేవోగుణములు వానికున్నట్లు నిర్ధారణపఱచి
వానియథార్థతత్త్వములను బూర్ణముగ తెలిసినవారివలెనే వానిని
మనయైహికప్రయోజనములం దుపయోగించుకొందుము. ఒకకవి యిట్లు
పలుకును.

గీ. వస్తుయాథార్థ్య మెఱుఁగక వస్తువునకు
నేదొ సంజ్ఞను మనముంచి యెఱిఁగినట్లు
లల్లలాడుదు మిదియంత యైంద్రజాల
మందు దుముకులాడెడు బొమ్మలాట కాదె?
స్వప్నమునకంటె స్వప్నమై సత్యముగను
మాయకును మాయయగుచు నమ్మకముగాఁగ
శూన్యమునకంటె శూన్యమై సుస్థిరముగఁ
గనఁబడెడు దీని నేమని యనఁగవచ్చు!

ఆహా! మొదలు తుదలేనితంత్రము! మోసములన్నిటిలో మిగుల
మోసము! మాయలన్నిటిలో మహామాయ! విడరాని పెద్దచిక్కు!
పరమప్రీతికరమగు బంధము! తేజోమయమగు నంధత్వము! కోమలతమ
మగు గొంతుకోఁత! అనిర్వచనీయవ్యాపారము! అవాఙ్మానసగోచరము
కాని యీతంత్ర మందఱు నెఱుఁగుదురు, తెలియనివాఁ డొక్క
డును లేఁడు. అత్యంతమూఢున కందఱికంటె బాగుగఁ దెలియును. ఈ
మౌఢ్యము తగ్గినకొలఁది యామౌఢ్యము హెచ్చును. గ్రీసుదేశమున
మహాధీశాలియని యెన్నఁబడిన "సోక్రెటీస్" అను వేదాంతవిజ్ఞానసంప
న్నునియొద్దకుఁ గొందఱు జనులేతెంచి "ధీమంతులలో నిన్నగ్రగణ్యు
నిగా జనులందఱు నైకకంఠ్యముగ నంగీకరించిరికదా! అందులకుఁ గారణ
మేమి?" యని యడిగిరి. "నాకేమియుఁ దెలియదనుసంగతి నాకుఁ దెలి
యును గావున నన్ను ధీశాలి యని జనులెన్నుచున్నారు" అని
యాతఁడు ప్రత్యుత్తరమిచ్చెను. చూచితిరా! ఇచ్చట జ్ఞానసంపద యనఁగ

నుండి వెడలు ననుభవైకవేద్యమగు మహాపరిమళము నాస్వాదించి దానితోఁ జిరకాలము కలసిమెలసి యాయనుభవమును వ్యాపింపఁజేసి కొని—సర్వదిక్కుల నాక్రమించినది, అనిర్వచనీయమైనది—అక్షీ తీతమైనది—అగమ్యగోచరమైనది, అఖిలజగద్వ్యాప్తమైనదియు నగు నాపరమశక్తితో నైక్యమొందుటకు సాధ్యమగునేమో కాని ప్రపంచ మనఁగ నేమో తెలియక తాను బ్రపంచమునకంటె భిన్నుఁడెట్లో యది యంతకంటెఁ దెలియక, తానెవఁడో మొదలే తెలియక, బ్రహ్మమనఁగ నేమిటో బొత్తిగఁ దెలియక యీజ్ఞానసంభారమునకుఁ గావలసిన సాధన సామగ్రిని సంపాదించుట యేమియుఁ దెలియక, అహంబ్రహ్మశబ్దములకు వర్ణక్రమము దెలిసినంతనే నరుఁడు పరమజ్ఞానావస్థ నొందఁగలఁడా! లేదు. శబ్దార్థజ్ఞానము ప్రధానముకాదు. ఆయెఱుకయే యెఱుకకాదు. అనుభవజ్ఞాన ముండవలయును. అనుసంధానతేజ ముండవలయును. అవి లేనియెడల నట్టియవస్థ యజ్ఞానమునకంటె భిన్నముకాదు.

అయ్యయ్యో! ఈమాటలు వింతలుగనున్నవే! ప్రపంచమునఁ గొమ్ములు తిరిగిన విద్వాంసు లున్నారే! తర్క-వ్యాకరణాదిశాస్త్రజ్ఞాన నిక్షేపు లున్నారే! జంగమజ్ఞానావతారము లున్నారే! కఠినశాస్త్రీయ పరీక్షలలోఁ గడతేరి పతకములను బత్రికలను గడించినవారున్నారే! ప్రకృతిశాస్త్రపాండిత్య ప్రభావమున ననేక నూతనరహస్యములను గనిపెట్టిన జగత్ప్రసిద్ధ ప్రతిభాప్రపూర్ణులున్నారే! చిత్రవిచిత్రానేక యంత్రనిర్మాణచాకచక్యధురంధరులున్నారే! అసాధ్యములని యెంచఁ బడిన పనులను సాధించుమేధాసనాథులున్నారే! వీరందఱు జ్ఞానసం పన్నులుకారా! ఎక్కడఁ జూచినఁ గళాశాలలే! ధూమశకటస్థాన ములే! కర్మాగారములే! నక్షత్రదర్శనశాలలే! చిత్రవస్తుప్రదర్శన మందిరములే! తంత్రీవార్తాభవనములే! ఇటు లెన్ని చెప్పఁగలము? నాగరికతయు శాస్త్రజ్ఞానకళయుఁ జేయిచేయి బట్టుకొని యెల్లెడల నవ్వులు పువ్వులు వన్నెలు చిన్నెలు మణులు కాసులు వెదఁజల్లుచు వర్షించుచుఁ దేజోమయస్వరూపములతో నాట్యమాడుచున్నవిగదా! లెక్కలేయని భగవంతుని లోపములఁ దీర్పఁదలఁచి బంధుమిత్రాదులతో నరు లాకసమున నెగురుచున్నారుకదా! పాలసులేయని నలువలోపమును దిద్దఁ దలచి మహాసముద్రములలో నరులు గంటలకొలఁది నిండ్లలోవలె

నివసించుచున్నారుకదా. పాతాళగంగను జుట్టుచేతఁ బట్టి పైకిలాగఁగల
పటిష్ఠతచే జనులు ప్రకాశించుచున్నారుకదా! వాఁకిటలోనుండి దొడ్డి
వఱకుఁ గష్టముననుగాని వినఁబడనేరని కంఠరవము మైళ్లదూరముననైన
స్పష్టముగ వినఁబడుచున్నదికదా! పైస్వరూపమును జూచుటకే భగవం
తుఁడు మనకుఁ గనులిచ్చియుండ నాలోస్వరూపమును జూచుటకుఁ
గూడ సత్తులను జనులు సంపాదించుకొనిరికదా! చచ్చినవారిగాత్రవైఖ
రుల నోడలకుఁ గట్టి కంఠవైఖరుల గోట్లుములఁ బెట్టుచున్నారుకాదా!
గాజుగోడలపైఁ గాకరకాయలు కాయుచున్నవికదా! ఏడంతస్తుల
మేడలు నూరంతస్తులవఱకు కెగబ్రాకినవికదా! ఒకనిహృదయకోశము
మఱియొకని రొండవలిలోఁ గొట్టుకొనుచున్నదికదా! వ్రాతౌ రామభీమేశ్వ
రుని నెత్తిపైఁ జీలగొట్టి యూతనిబ్రాహ్మణత నాపనట్లు మిక్కిలి విస్తార
ముగఁ బోడుగగువాని గొప్పగును మెదడులోని బీజమునుదీసి యాపు
చున్నారుగదా! పిసుగుపాటు పుష్పపుప్రేటుకంటె మార్దవముగలదిగఁ
జేయఁబడుటచే దాని దుడుకుడఁగినదికదా! దుర్గము నిస్సారమైనది
కదా! కాలముగరువము చప్పఁబడినదికదా! అగ్నిదేవుఁడా శ్రయాశత్వ
ఘాటిని ద్యజించి ప్రచ్ఛన్నుఁడై యంగిజేబులలో దాగుచున్నాఁడుకదా!
హృదయములనుండు ననురాగాద్యనుభవభేదములను గాగితముపై
వ్రాసిచూపఁగల చలపాటియంత్రమొక్కటి దాపురించి కావ్యకర్తల
గుట్టులు బట్టబయలుసేయుచున్నదికదా! శుక్రశోణితము లోకవిధ
మయిన భాగములుగఁ గలిపి గాలివానని ప్రదేశమున స్త్రీగర్భమున కుచి
తమగు వేడిమిని దానియందుఁ బ్రవేశపెట్టి ప్రత్యక్షసృష్టితంత్రమునకు
బ్రకృతిశాస్త్రజ్ఞులు ప్రయత్నించుచున్నారు. ఇదినూడఁ గొనసాగిన
రొండల బ్రహ్మత్వము నపేక్షించి పాటులుపడుచున్న మానుతినోట నీక
మట్టియేకదా! బమ్మగాని కింక "బ్రహ్మప్రమాణము" వ్రాయుటయే యవ
శిష్టముగ నుండునుగదా! ఇంతకంటె శాస్త్రజ్ఞానమునకుఁ బారమేది?
ఇంతకంటె మనుజబుద్ధి కవధియేమి?

కాని యీశాస్త్రజ్ఞానము మనకెట్లుపయోగించుచున్నదో
కొంచెము యోచింతము. ధూమశకటనిర్మాణమువలన దూరదేశమునుండి
ధాన్యాదులు వచ్చుచున్నవి. క్షామబాధలేకుండఁ దినుచున్నాము. కదు
పులు గట్టిపడుచున్నవి. ఫలములు పానకము లనేకములుగూడ వచ్చుట

చేతఁ జిత్రచిత్రాహారముల కలవాటుపడుచున్నాము. రుచిగ్రహణశక్తి యొరదీసినకత్తివలె మిగుల వాడిగలదియైనది. రుచు లూసరవెల్లిరంగుల వలె నట్టియట్టి భేదించుచున్నవి. మిక్కిలి సున్నితము లగుచున్నవి. వింత పదార్థములనే కాని లక్ష్య పెట్టకయున్నవి. ఏయాహారవస్తువుల నెట్లుగా మేళవించుటవలనఁ బ్రబలరుచి యుద్భవింపఁగలదో యామార్గములను గనిపెట్టుచు బుద్ధి జిహ్వకుఁ గార్యదర్శియై పనిచేయుచున్నది. ఇంకను "విస్కీ, బ్రాండి" మొదలగు వింతవింత మదద్రవ్యములు వచ్చుచున్నవి. వీనిని బ్రథమమున భోజనాత్పూర్వమునో నడిమిభాగమునో జఠరదీప్తికై యౌషధప్రాయముగఁ దీసికొనుచున్నాము. తరువాత సీసాలు వరుసపెట్టున వంపుపెట్టుచున్నను నోటికిఁ గంపే మిగిలెను గాని మనసునకుఁ దృప్తితగ్గుటలేదు; త్రాగుడుతోఁ దిండియెక్కువ. తిండి యెక్కువతోఁ ద్రాగుడెక్కువ యగుచున్నది. జిహ్వ జుట్టుమనుచున్నది. కడుపు గట్టుమనుచున్నది. తల గిట్టుమనుచున్నది. ఖగోళశాస్త్రజ్ఞానము నౌకాయాత్రకు మిక్కిలి ప్రయోజనకారియైనది. అందువలన "మఖ్మలు ఛప్పరమల్లులు" పృష్ఠములపై, జీలుగుబుట్టలు శిరములపైఁ, దోలు పొదులు వ్రేళ్లపై, గాజూరాలు కన్నులపై నవతరించుచున్నవి. గాత్ర సౌందర్యము లిట్లు ఘనము లగుచున్నవి. దూరఖండములతో వ్యాపారములు బహుళము లగుచున్నవి. మణివృద్ధితోఁ దమవృద్ధియగుచున్నది. బంగారము హెచ్చుగుకొలఁది సింగారము హెచ్చుగుచున్నది. సంపద లెదిగినకొలఁది సాత్వికము తగ్గుచున్నది. సౌఖ్యవాంఛ హెచ్చుగుచున్నది. ఇఁక విద్యుచ్ఛక్తి తంత్రీవార్తలలో శకటములలోఁ దదితర యంత్రములలోఁ బ్రవేశించి జనసంఘమునకు సామాన్యముగ సౌఖ్యాధిక్యమును గలుగఁజేయుటయేగాక భాగ్యవంతుల గృహములఁ బ్రవేశించి విసరుచున్నది. దీపములు వెలిఁగించుచున్నది. బట్ట లుదుకుచున్నది. వళ్లు పట్టుచున్నది. ఇల్లూడ్చుచున్నది. నీరు చల్లుచున్నది. బుజములపై నెక్కించుకొని మేడలమీఁదికిఁ దీసికొని పోవుచున్నది. దాసిపనులే కాదు. చాకలిపనులే కాదు; మంగలిపనులే కాదు; వాహకులపనులే కాదు; అవి యివి యనక యన్నిపనులు విసుపులేకుండ విరామములేకుండ వేల బానిసలపెట్టునఁ జేయుచున్నది. మనుజు లీయుపచారపరంపరలో మహా సౌఖ్యమునఁ దేలుచున్నారు. ఇంత విద్యుచ్ఛక్తియే మాత్రలందు ద్రావ

కుక్కలు, పందులుకూడ మనకంటె యోగ్యతరజీవనములయినట్లు కనఁబడుచున్నవిగదా! అయ్యయ్యో! అనఁగూడనిమాట యనవలసివచ్చెను. హరిహరీ! వినఁగూడనిమాట విననలసివచ్చెను. ఆహాహా! బ్రదుకఁగూడనిబ్రదుకులు బ్రదుకుచుంటిమికదా! ఇప్పుడైన లెంపలు వైచుకొనవలెగదా! ఐహికసౌఖ్యపరంపరా ప్రవాహమున నట్టెకొట్టుకొని పోవుచుండునప్పుడు రవంత కాలూది నిలువఁబడి యావడినుండి కొంచెము వెలుపలకు వచ్చి యింద్రియవ్యాపారములను గొంతవఱలించి చిత్తమును గాసంత కుదుటఁబఱచుకొని 'నేనెక్కడనున్నాను? ఏమిచేయుచున్నాను? నేనెవఁడను? ఎందులకిక్కడనుంటిని? నాకును బ్రపంచమునకేమిసంబంధము? నేనేమిచేయవలసినది?' యని గట్టిగఁబట్టుదలతో మనల మనము ప్రశ్నించుకొనవలెగదా? మనసును బైకిఁ బోనీయకుండ సాధ్యమైనంతవఱకరికట్టి కంటిచూపునుగూడ వీలగునంతవఱకు లోనికే పఱపి తన్నుఁదాఁబరీక్షించుకొనవలెగదా? అట్లు పరీక్షించుకొని పరీక్షించుకొని, సుఖమువెంట పరుగెత్తుటలు, నది చిక్కకుండ దప్పించుకొని దూఁకుటలు, దానికై వగర్చుచు నెగురుటలు, అదియింకెవ్వనికో చేఁ జిక్కెనని వెక్కివెక్కి యేడ్చుటలు, కన్నులు తుడుచుకొని మఱియొక కొఱపిదయ్యపు సుఖమును వెంబడించుటలు, తీరమునఁ జూచిన, నగ్గుజగ్గు, తళుకు తవర, హారగు హాయిలు, తీఱసుఖము జేఁబడినతరువాత దానియందుఁ గానఁబడకుండుటచే నొకటి రెండావృత్తులెట్లో యనుభవమైనపిదప నది రోఁతగనున్నదని పరిహరించుటలు, నెంతసేపేమోకాని గుండెలు కొట్టుకొని కాళ్లువిఱుగఁగొట్టుకొని చేతులు ముందునకుఁబెట్టుకొని సుఖమును బట్టుకొనఁబ్రయత్నించు పరుగులాటలలో నురుకులాటలలోఁ గూలుటలలోఁ బండ్లువిఱుగఁబడుటలలోనున్న సుఖమేదో యదియే కాని యంతకంటె నేదియు లేకపోయెనేయని నెత్తిగొట్టుకొని యేడ్చుటలు మొదలగు గడబిడలు, దడబడలు హుటాహుటులు గంద్రగోళములు లేకుండ నొకవిధమగు శాంతి నిశ్చలమై, నిబిడమై, నిశ్శబ్దమైన యొకవిధమగుస్వస్థత—లోననిప్పుడే విశ్వ[illegible]ముగఁ గనఁబడుచున్నదని సంతసింపఁదగదా? ముత్యాలదండ తలపైనుండ నీటఁబుట్టినవగుటచే నాకారసామాన్యముచే బుద్బుదములను ముత్యములని భ్రమించి నీటఁబడి కెక్కు కెక్కుమని చేయిచాపి పట్టుకొనఁబోవఁగ టప్పనకుండఁ బేళ్లి

పోయి శూన్యములయినమాయను క్షేమముల మహేంద్రజాలమునఁ బడి వయసంత నల్లకాను చేసికొంటిమిగదా ? అని నిశ్చలపశ్చాత్తాప మొందవగదా? ఈమాత్రపు స్వల్పప్రయత్నమునకే విలక్షణమగు నిత్యశాంతి లోకలఁ గలుగుచుండగ నిక నిందావిషయమును దీక్షవహించి సదా యెంత ప్రశాంతి నొందుదురో? ఎంత నిశ్చలానంద మొందుదురో యనుకొని యత్నము మెట్టుగ్గుట కాలోచించుకొనవలెగదా!

ఇన్నివిద్యలు ప్రజలు చదివిరికద! ఇన్ని యంత్రములు సృష్టించిరి గదా! ఇంతజ్ఞానాభివృద్ధి నొందినది! ఏమి యీవింత! కుదురవలసిన మనశ్శాంతి కుదురదయ్యెను. నానాటికి పతియేదఁ గొట్టుకొనిపోయి శాంతికి దూరముగఁ బోవుచున్నది సిద్ధించును ఎందుచేత? ఈవిద్యలు దొంగవిద్యలు—ఈయంత్రములు పొట్టకూటి తంత్రములు—ఈ జ్ఞానము మిథ్యాజ్ఞానము—ప్రపంచరహస్యములఁ దెలిసికొనుట కిది మార్గముకాదు. ఏరహస్యము విడిన నన్నిరహస్యములు విడునో, యే చిక్కుఁ దీసిన నన్నిచిక్కులు విడునో, యేముడి విప్పిన నన్నిముళ్లు తమంతఁ దాము విడిపోవునో, ఏవిద్య నేర్చిన నన్నివిద్యలు సుగమముగ పూర్వకముగ సిద్ధించునో యది యొకటియున్నది. చింతచెట్టును గొట్టఁ దలఁచినవాఁడు తల్లివేరును దెగవ్రేయవలయునుగాని చింతాకు దూయ నారంభించిన నెంతకాలమునకు దూయఁగలఁడు. అంతోయిదో దూసినను నైన లాభమేమి? ఆవిద్య యేదో మనవేదఋషులు కనిపెట్టియేయున్నారు. కాని వారు మనవారని చెప్పుకొనుట వారికి మనకుఁ గూడ సిగ్గగుచున్నది. మనము సంధ్యావందనప్రవరలలో నావేదఋషులగు నార్యులను మనవంశ పూర్వకర్తలుగ స్మరించుకొనుచున్నను మన మార్యులము కామని యిప్పుడొక వంశవిచ్ఛేదక సిద్ధాంతము తలచూపుచున్నది. ఎటులయినఁ గానిండు. మనము నరులమని యొప్పుకొనిన నంతేచాలును. తారకసాధన మపేక్షింపవలసిన మన కార్యముల బోధనము తప్పదు. వారు ధీదార్ఢ్యముచేఁ దపస్సామర్థ్యము నాధ్యాత్మికవిద్య గనిపెట్టి బోధించిరి. ఋషులు మన కిట్లొనర్చిన మేలును గొనియాడ నేను సమర్థుఁడనుగాను. Max Muller గారు "India what it teaches" అను గ్రంథములో 6 వ పేజీలో నిట్లు చెప్పుచున్నారు.

If I were asked under what sky the human mind has most fully developed some of its choicest gifts, has most deeply pondered on the greatest problems of life and has found solutions of some of them which well deserve the attention even of those who have studied Plato and Kant—I should point to India. And if I were to ask myself from what literature we, here in Europe, we, who have been nurtured almost exclusively on the thoughts of Greeks and Romans and of one seme tic race, the jews, may draw that corrective which is most wanted in order to make our inner life more perfect, more comprehensive, more universal in fact more truly human, a life, not for this life only, but a transfigured and eternal life, again, I should point to India—

"ఐహికాముష్మికసాధనసంపత్తికి హిందూదేశ మితరులకు మార్గదర్శిగా నున్నదని ముఖ్యాభిప్రాయము. చూచితిరా? దీప మిల్లంతయు వ్యాపించి ప్రకాశించుచున్నది. దీపస్తంభమునొద్దనున్న మనకుఁ గ్రీనీడ ప్రారబ్ధమేకదా! మరి 25-వ పేజీలోఁ దిరుగ నిట్లు చెప్పుచున్నారు.

"We find in that language such a compound for instance as 'as asmi I am.' What would other languages give for such a pure concept as I am. They may say I stand or live or I grow or I turn but it is given to few languages only to be able to say I am. To us nothing seems more natural than the auxiliary I am; but, in reality, no work of art has required greatest efforts than this little word I am" ఆత్మ శాశ్వతమని మనవారు కనిపెట్టినారని దీని ముఖ్యాభిప్రాయము.

మనతాతలు ముత్తాతలు స్నానసంధ్యాదు లొనర్చుకొని పవిత్రముగఁ గూరుచుండి యుపనిషత్తులఁ బఠించెదు వాడుకఁగలవారు. అదిగాక వానిని వ్రాసినయెడలఁగూడఁ బుణ్యమనియుం నవి మఱింత జ్ఞప్తియందు దాకొనుననియుఁ దమతరువాతవారు వానిని దేవతార్చనపుఁ బీటలపైఁబెట్టి పూజించుకొందురనియుఁ దాళపత్రసంపుటముల

వానిని వ్రాసిన స్త్రీస్వాతి యూరపుగాయకుల కోట్లగూట్లలో వ్రేలాడు నులక త్రాటి బిగింపుగల తమ్ముకమాస్త్రీయమూత్రాభిషేకమును నెలుకపెంట పూలపూజయుఁ బొందుచున్న గౌతమీయములకట్టలు చెప్పక చెప్పుచున్నవి. ఇంగ్లండులోని వ్యాసవితంతువుల సట్టుపలచేత నీపురుగులపుట్టలయిన భద్రముగ నింక నుంచఁబడినయుండెనని యూహింపవలసియుండును. ఈ పనికిమాలిన పెంటలనే చలనంటక్షణమైన మీరెక్కనే—పాశ్చాత్య దేశీయులు పరిశీలించి, పరిశోధించి—వానిలోని యద్వితీయ తేజః పుంజములగు బ్రహ్మమణిరాజములను గ్రహించి కన్నులకద్దుకొని శిరముల నుంచుకొని తమజాతులనుఁ సముద్భాసులను నమూల్యాలంకారములుగఁ జేసికొని—“భరతఖండము మాకిచ్చిన తెలుగఁడగని—విలువ నెఱుఁగఁడగని—యాస్తియిది” యని ప్రాక్పశ్చిమ సముద్రములు దాటిపోవు మహాఘోషముతోఁ బట్టజాలనిసంతోషమునఁ బలుకుచుండఁగా సత్యభారతీయస్త్రీలబిడ్డలమైన మనమేమిచేయుచున్నాము? చెప్పనా? ఆగ్రంథములేవో మనము చూచుటలేదు. వానిని వినుటలేదు. వానిని దలఁచుటలేదు. కోటికొక్కఁడెవఁడైనఁ వానిని జదివినయెడల మూర్ఖుఁడని వానిని బూతులు తిట్టుచున్నాము. ఆగ్రంథములు వట్టితప్పుల తడకలనుచున్నాము. కార్యకారణసంబంధశూన్యములనుచున్నాము. దురభిప్రాయదుష్టములనుచున్నాము. పరశురామ ప్రీత్యర్థములని కారులఱచుచున్నాము. వానిని రచించిన గ్రంథకర్తలు లేరనుచున్నాము. వారు మావంశకర్తలు గారనుచున్నాము. వారికి మాకెక్కడను సంబంధము లేదనుచున్నాము. మాపనువునకు నాటి మాయాంధ్రనుట తగదనుచున్నాము. ఆహా! ప్రపంచమున మనయంతవారము మనమే! నిశ్చయము. మూలపురుషులను బూతులుదిట్టువారు మఱియొక జాతిలో నేకాలములో నైనకాని యుండరని వింటిమా? లోకపూజ్యమయిన యుద్గ్రంథసంభారమును గాకిరెట్టలకప్పగించినవారు మఱియొక జాతిలో నేకాలమున నైనఁగాని యుండిరని వినియుంటిమా? ఇట్టి దేశాభిమానము, నిట్టిగ్రంథాభిమానము, నిట్టిభాషాభిమానము, నిట్టి వంశాభిమానము గలవారు మఱియొకజాతిలో నేకాలములో నైనఁగాని యుండిరని వినియుంటిమా? జరయు మృతియు నీయని యమృతకలశము హస్తగతమైయుండ దానిని ధూరముగఁ బాఱద్రోచినాము. తాడి

కల్లు లొట్టెడు ద్రావి లొట్టవేసి రోగపడిచచ్చుచున్నాము. సంస్కృత భాష నభ్యసింపవలసినవారు మనవారికంటె మఱెవ్వరు లేరుకదా! అది కష్టమని దానిని జెడమడఁద్రొక్కి యితరదేశీయుల కప్పఁజెప్పితిమి. గొప్పపనియే చేసితిమి. గొప్పపనియే చేసితిమి. పోనిండు. దేశభాష నభ్యసించుచున్నామా? మన తేట తెనుఁగుబాసను నేర్చుకొనుచున్నామా? అది కొఱకరానికొయ్యయని యది మావంశమువారి కెవ్వరి కక్కఱలేదని నిరాకరించితిమి. ఇచ్చట మఱింత మహాకార్య మాచరించితిమి. పోనిండు. అంతటితో నూరకుంటిమా? 'Durbar and pandit literature is unsuitable to these times, యని యొక రామవాక్యమును బురస్కరించుకొని పాకి and చచ్చట literature వ్రాయుటకుఁ గొందఱు బుద్ధిమంతులు పూని వ్రాయుచున్నారు. ఈ పని నేమనవలయునో బోధపడకున్నది. పంచభక్ష్యపరమాన్నములతోఁ గూడిన షడ్రసోపేతభోజనము మిగుల బలాహారముగాఁపున వర్జించితిమి. దనియాలపొడి మిరియాలచేరుతోఁ వడిపొడిగఁ దినుచుండఁగా నదియుఁ మాని పెంటపైఁ బాఱవైచిన పులివిస్తరాకులు నాకుఁడని బుద్ధిమంతులు బోధింప నిఁక నెక్కడఁ జావవలసినదండి! ఏల పామరులగు పట్టణపుసోమరులంద అదియే చేయుచున్నారు. పాకశ్రమ మక్కఱ లేదు. అవి మిగులసులభము. ఆహా! భగవంతుఁడా! ఈ మాయజ్ఞానము దుర్గతి నెన్నఁడైనఁ బాపవా?

నాయనలారా! నామనసు మిగులఁ దీవ్రముగ నున్నది. చెప్పవలసిన దెంతయున్నను నింకఁ జెప్పఁజాలను. క్షమింపుఁడు. మీ రెన్ని యైహికసుఖము లొందినను నాకిష్టమే కాని యివియే శాశ్వతములని నమ్మకుఁడు. శాశ్వతసుఖ మొకటియే యున్నది. దానిపైననే దృష్టి యుంచుకొనుఁడు. ఉపనిషద్విద్య నభ్యసింపుఁడు. ఐహికకార్యములందు మనయోరిమి నూఁపి యూఁపి మొదలంట నూడఁబెఱుకు సన్నివేశములనేకములు తటస్థించును. అట్టిసమయముల మనల రక్షించునది మహర్షుల బోధనముదక్క వేఱొండు లేదు. ముమ్మాటికిలేదు. కష్టసుఖములలో మునిఁగియున్నను దృష్టిమాత్రము బ్రహ్మముపై నుంచుకొనుఁడు. కవి చెప్పినట్లు

గీ. ఘన తరంగాహతాంగంబు కల్గి కనము
నెత్తి నదిదాటు కరివోలె నెన్నియూన
వలు సుఖంబులు కలిపిన విలసదర్థ
స్పష్టజనుస్కు రేఁడు నానఁడు చిత్తరించు భువనము.

నాయనలారా! ఈరాత్రి నెందుకో నీమాటలన్ని పలికితినో! ఆఁ! జ్ఞప్తికి వచ్చినది. సువన్నసిపత్రికాధిపతుల పుణ్యమాయని యీ సత్కాలక్షేపము మనకు జరిగినది. ఇందువలన వారికి మరియొకసారి కృతజ్ఞతను వెల్లడింపవలయును. కాని మాలోని 'సాక్షి' పానుగంటి లక్ష్మీనరసింహారాయనింగారని నిశ్చయించినట్లు వారు వ్రాసినారు. ఆరాయనింగారెవ్వరో మే మెఱుఁగము. మాలో నొకవైష్ణవుఁడు, నొక వైదికుఁడు, నొకకోమటి, యొకశూద్రుఁడు, నొక యారామద్రావిడుఁడే కాని వెలమవారెవ్వరు లేరు.

# సాక్షి

## తోలుబొమ్మలు

---

జంఘాలశాస్త్రి యిట్లు పలికెను.

నిన్నరాత్రి తోలుబొమ్మలయాటలోనికిఁ బోయితిని. తోలుబొమ్మలవాండ్రు పడమటిదేశమునుండి వచ్చిరి. బొమ్మలు మిగులఁ బెద్దవి. ఈగ్రామమున ననేకస్థలములందు బొమ్మలాట కీర్తనములు జరిపిరి. "బొమ్మల నాడించుటయందు మిగుల నేర్పుగలవా" రను వాడుక గ్రామ మంతయు వ్యాపించినది. వారిలోఁ బాటపాడున దొక్కయాఁడుది యున్నది. అది జీడిగింజకంటె నల్లనిది. దాని ముఖాగ్రమునఁ దల వెండ్రుక లెచ్చుట నారంభమైనవో తెలియదు. "తడిమినను దెలియవా ?" యని వాణీదాసుఁడు సన్నఁజేయుచున్నాఁడుకాని యతిప్రాసములకు నిత్యము తడుముకొను నలవాటున్న యాతఁడే యట్లుచేసి సందేహ నివారణము చేసికొనవచ్చును. అది పఱిడువలె నెండియున్నది. కాని, దానికంఠరవ మమృతప్రవాహము. గ్రామమున రాత్రివేళయం దది యేమూలఁ బాడుచున్నను గ్రామమంతయు దానికంఠము వినిపించును. చెక్కు చెదరు లేదు. నలితొలి లేదు. బొంగు జీర లేదు. అప స్వరము, వెలితి లేదు. 'కైఁ' మనిన నక్షత్రమార్గమున గజ్జుమని తిరుగుచుఁ బలిటీలు గొట్టును. సంగతులపై సంగతులు, పూలుజల్లిన ట్లది వర్షించును. పేకజువ్వవలె గాత్రపువిసరులు రయ్యిమని యొకసారి తారకమునకంటి యక్కడ నొక్కసారి టప్పుమని యాఁగి రప్పుమని మిక్కిలి వింతరంగుల రసపుబుడ్లను ద్రిమ్మరించును. చెంబులో గ్రచ్చకాయలు పోసి త్రిప్పినట్లు కంఠరవము గలగల లాడును గాని బాన మంచిది

కాదు. భాగవతప్రభృతి—పత్రికాప్రయాసలేదు. లేఁతముదుళ్ల విచికిత్స
లేదు. ఎగుడు దిగుడుల తరంగభంగిలేదు. జానుపదవికల పట్టు విడు
పులు లేవు. సాఫుపంతనల సమీచీనత లేదు. నన్ను పోగర పనికాదు. పెద్ద
బాడి బెడసి. ఒకసారి "క్రైఁ" ఒకసారి 'గ్రె' కొంతసేపు వినినతోడనే
చెవులు గింగురు మనసాగును. బొమ్మలాట గ్రామసీమస్థలోగాన రెండుఫ్రాటల
నడుమఁ జైలులోని "గుంయి" మనులను.

నిన్న నేను దొమ్మిదిగంటలు కాఁకుంపనే యాటఁ జూడఁబోయి
తిని. స్థలవిశాలతకొఱకు సంతబయట నాట నియమింపఁబడినది. ఓ! ఏమి
ప్రజ! ఇసుకవైచిన రాలకుంపనట్లున్నారు. పందిలకొలఁది పోరుగాళ్ల
బండ్లు సంతబయలు చుట్టు నింపఁబడి యున్నవి. స్త్రీల్లసందున వ్రేళ్లమిడి
నట్లు జనులు సగ్గఱగ బిగ్గఱగ బిగించుకొని కూరుచుండియున్నారు. కిట
కిట లాడుచుఁ బెటపెట లాడుచున్నారు. నాకు స్థలము దొరుకలేదు.
అందుచేఁ గొంతసేపొకచోట వంగి కొంతసేపు నిలువఁబడి కొంతసేపు
ముంగాళ్లపై నానుకొనియుండి వేడుక చూచుచుండఁగ వెనుకవారి
చూపున కడ్డువచ్చితినని కఱ్ఱపోటులతో మోఁకాలిత్రోపులతో నన్నట
నుండి వారు త్రోచివైవ వేఱొకస్థలమునకుఁ బోయి యక్కడఁగూడఁ
బాద ప్రహారణమో పాదరక్షప్రహారణమో పొందుట సిద్ధింప మఱియొక
చోటికిఁ బోవుచు నిట్లు సంతబయలంత సమయానుసారముగ సంధి సంధి
పోట్లసలుపుతో సంచరించితిని. కాదు. సంచరింపఁ జేయఁబడితిని. ఎన్ని
యోబొమ్మలను ముగ్గురో నలుగ్గురో తెరలోపల నాడించుచుండ నొక్క
బొమ్మను వీరందఱు తెరవెలుపల నాడించుచున్నారు. ఇంత శ్రమపడి
బొమ్మలాట నేలచూడవలయునని మీరు నన్నడుగుదురేమో! జనులు
విశేషముగఁ జేరియుండినచోటికిఁ బోవుటకు నాకు మొదటినుండియు
మిగుల నుత్సాహము. జనుల ముఖభేదములఁ బరిశీలించుట, కంఠరవ
ములను శోధించుట, మాటలతీరులను గనిపెట్టుట, వానికిఁ గారణము
లగు హృదయరసములను విమర్శించుట, స్వభావభేదములను గుర్తెఱుఁ
గుట, యిట్లు ప్రకృతిజ్ఞానమును సంపాదించుటయే నాముఖ్యోద్దేశము.
పందిటిక్రింద నాడింపఁబడుచున్న నిర్జీవపుఁ దోలుబొమ్మలను జూచుటకై
పోయినవాఁడగాను. బయటనాడుచున్న ప్రాణమున్న తోలుబొమ్మల
యాటఁ జూడఁ బోయితిని. అందుచే సంతబయలంత తిరుగుట కష్టమయి

నను నాకుత్సాహముగనే యుండెను. వారి కాలిపోటులు నారక్త మాంసములలోఁ గొంతసేపు మాత్రమే నిలుచునుగాని వారి ప్రకృతుల కలపుఁబోటులు నాహృదయఫలకమునఁ జిరకాలము నిలుచును గాదా.

తెరకొకవైపు కపిసైన్యము, నొకవైపు రాక్షససైన్యము చేరి యున్నది. ఇంక నాట యారంభింపఁ బడియుండలేదు. అంత "గజాననం భూతగణాధిసేవిత" మ్మని శ్లోకము చదువఁబడుచుండఁగఁ జర్మవిఘ్నేశ్వరుఁడు మనుజుల చర్మనేత్రములకుఁ దెరపై సాక్షాత్కరించెను. రూపమునఁ గడుపు భారముగ నున్నను నాటకమునఁ గాలు లఘువుగనే యున్నది. తెప్పపాటులో తెరయంతయు మహాయుద్ధరంగమైనది. రావణునకు లక్ష్మణునకు ఘోరయుద్ధము జరుగుచున్నది. బాణము లుభయుల సేనలనుండి "రుంయి రుంయి" మని యెగురుచున్నవి. కపిభల్లుక గోలాంగూలయోధులు రాక్షసులపై కెగిరి తన్నుచున్నారు. పొడుచుచున్నారు. కఱచుచున్నారు. నములుచున్నారు. గ్రుద్దుచున్నారు. హుంకరించుచున్నారు. రాక్షసయోధులు కపుల నదల్చుచున్నారు. పీకుచున్నారు. గదలచే మొత్తుచున్నారు. ఊపుచున్నారు. కపిరాక్షసులు కలియఁబడి దండపట్టులు పట్టుచున్నారు. కఱ్ఱసాములు చేయుచున్నారు. గభీ గుభీ మని గ్రుద్దుకొనుచున్నారు. బొళ్లుమన రక్తములఁ గ్రక్కుకొనుచున్నారు. కోఁతుల కిచకిచలు, రాక్షసుల హాహాకారములు, బుఱ్ఱుబుఱ్ఱుమను కోఁతుల ఫూత్కారములు కంగు కంగు మనురాక్షసుల ఝూంకారములు, హోకుహోకుమను కోఁతుల భీకరభేకారావములు, "హుర్ హుర్" మను రాక్షసుల హుంకారములు గల్గి కదనరంగమంతయుఁ గర్ణకఠోరమైయున్నది. కోఁతులచేతులు తెగి క్రిందబడుచున్నవి. రాక్షసుల పుఱ్ఱెలు పై కెగురుచున్నవి. కోఁతులతోకలు రాక్షసులకుఁ గంఠపాశము లగుచున్నవి. రాక్షసుల నోళ్లకుఁ గోఁతుల తలలు మోదకము లగుచున్నవి. కోఁతులచేతులనుండి చెట్లెగురుచున్నవి. రాక్షసులచేతులనుండి గద లెగురుచున్నవి. ఓ! తాలవర్షము, చెట్లవర్షము, తలలవర్షము, తోఁకలవర్షము, బాణములవర్షము, గదలవర్షము ధారాపాతముగఁ గురియుచుండ బుఱ్ఱుబుఱ్ఱులయురుములు, పిడికిటిగ్రుద్దుల పిడుగులు, శిలాసంకర్షణములవలనఁ గలిగిననిప్పుల మెఱు

ములు గలిగి సమరసంగమంతయుఁ బ్రళయకాలాంబుధర ప్రతికాశమై గొనుచున్నది. ఈమహాకోలాహల సమయమున రావణుఁడు పదివేళ్ల కలియుచుఁ గనుల నిప్పులఁ గురియుచు విభీషణుని జంపఁ దలఁచి యాతనిపైఁ బడఁబోవుచున్నాఁడు. లక్ష్మణుఁ డడ్డు వచ్చుచున్నాఁడు. “అడ్డుపడకు” మని రావణుఁడు సౌమిత్రిని వారించుచున్నాఁడు. “మీరడ్డుపడకుఁ” డని విభీషణుఁడు లక్ష్మణుని చేతిని బట్టుకొను చున్నాఁడు. లక్ష్మణుఁడు రావణు నెదుటఁ బడఁబోవు చున్నాఁడు. “నేనుండ నీవు రావణు నెదుర్కొనవలదని లక్ష్మణుఁ డాతని వెనుకకు లాగి తాను ముందుకు ధనుష్పాణియై దుముకుచున్నాఁడు. “నీకంటె నాకు విభీషణుఁ డెక్కువశత్రువు—ఆతని ముందు జంపినఁ గాని నిన్ను జంపను-నీవడ్డురాకు నీకేల-పో-యని రావణుఁడు లక్ష్మణు నదల్చు చున్నాఁడు” “శరణాగతత్రాణబిరుదము రాఘవులది” యని లక్ష్మణుఁడు బీరములు పల్కుచున్నాఁడు. అంతలో విభీషణుఁడు వచ్చి “నాయనా! నీవడ్డుపడకు”మని యాతని బ్రతిమాలుచున్నాఁడు. విభీషణుఁడు ముందు నకుఁ బోవ లక్ష్మణుఁ డాతని లాగి తాను హుంకరించుచు రావణుని కెదుటఁబడి మహాస్త్రప్రయోగమును జేయుచున్నాఁడు. “సరేచావు” మని రావణుఁడు శక్తిని బ్రయోగించినాఁడు. అంతట నొక్కటే మంట గ్రమ్మినది, “హా! రామచంద్రా!” యని లక్ష్మణుఁడు నిశ్చేతనుఁడై నేలఁ గూలినాఁడు. “హే హే హే” యని రావణుఁ డట్టహాస మొనర్చి నాఁడు. “వహవ్వా! వహవ్వా!” యని రాక్షసులు కేకలతో మిన్నెగిరి పోవునట్లు చప్పటలు గొట్టుచున్నారు. కిచకిచమనుచుఁ గీచుగీచుమనుచు కుయ్యో మొఱ్ఱోయనుచు హా హా యనుచు సకిలించుచు నిగిలించును తోఁకలు ముడుచుకొని పండ్లు పైకిబెట్టి క్రోఁతులు లేప్పుచున్నవి. విభీషణుఁ డేడ్చుచున్నాఁడు. లక్ష్మణుని రామునిశిబిరమునకుఁ గొనిపోయి నారు. విభీషణుని జంపుటకై నియమించినశక్తి యాతని జంపలేకపోయిన దని రావణుఁడు విసుగుదలతో నింటికేగినాఁడు. రాక్షసబలము లాతనితో మఱలిపోయినవి. క్రోఁతులందఱు లక్ష్మణునివెంటఁ బోయినారు. ఎఱ్ఱమచ్చలుగల తెల్లతెరయు గఱ్ఱుమను నాఁడుదాని కంఠరవముతప్ప మఱేమియు మిగులలేదు. జనులందఱు దీర్ఘనిశ్వాసములు పుచ్చి కొంతసేపూరకుండిరి.

ఒక తృటికాలమగుపిదప జను లగ్గిపుల్ల లట్టి వెలిగించిరి. చుట్టలు ముట్టించిరి. కొంకులుపోయిన ప్రేళ్లను సరిచేసికొనిరి. తిమ్మిరియెక్కిన కాళ్లను నేలసడచిరి. మెటికలు విఱుచుకొనిరి. ఒడలు విఱుచుకొనిరి. "పోసుమున్నదా" యని యొకరినొక రడుగుచుండిరి. కొందఱు లేచి స్థలము భద్రముసుమా ? యని ప్రక్కవారలకుఁజెప్పి పైకిఁబోవుచుండిరి. కొందఱు నెత్తిగుడ్డలుతీసి పృష్ఠములక్రింద వైచుకొనుచుండిరి. "ఇంకను వచ్చినవారెవరు కొండేమిరా" యని యొకరినొకరు ప్రశ్నించుకొనుచుండిరి. "గట్టిగుండకొడుకులే" యని బొమ్మలాటవారికి బిరుదములు కటాక్షించుచుండిరి. "పత్తిరొట్టములాగ మంచి 'పసందు' గఁ బాడుచున్నదిరా!" యని గాయనీమణిని స్తుతించుచుండిరి. బొమ్మలు పెద్దవనియు, రంగులు క్రొత్తవనియు నాటకపాత్రములను గొందఱు వర్ణించుచుండిరి. "కుఱ్ఱవాని కిదేసమయము. కొంచెము నములఁబెట్టుమమ్మా" యని యత్త కోడలున కాజ్ఞాపించుచున్నది. "పద్దీ! మెడలో తీఁగె పదిలముసుమా" యని తల్లి కూతుఁన కాభరణవిషయమై యుద్ఘాటించుచున్నది. "అక్కా! బట్ట తిన్నగ సర్దుకో" యని నిమ్మళముగఁ జెల్లె లభిమానసంరక్షణమును బోధించుచున్నది. "అబ్బీ!—రవంత దూరముగఁ గూరుచుండరాదా ? ఆఁడుకూఁతురుపైనఁ గాలు వేయుచున్నా" వని యొకచింపితలది బండివానికిఁ బరకాంతా పరాఙ్ముఖత్వమును బ్రతిపాదించుచున్నది. "అమ్మా! బద్ధకముగనుంటి వే మైన ననుమానముగనున్నదా?" యని యొకవితంతువు సమాసన్న ప్రసవసమయమగు నొకపడతిని బరామర్శించుచున్నది. "ఓరీ! నీజిహ్వ దీయ!" యని యొకగుడిసెవ్రేటిది పూర్వజారునిఁ జీఁగొట్టుచున్నది. "ఆయనకుఁ దోలుబొమ్మలన్నఁ బ్రాణ" మని యొకనూతనవితంతువు భర్తృపరిస్మరణ పరిపాకమునఁ బ్రకాశించుచు లోకసంగ్రహార్థము కను లొత్తుకొనుచున్నది. "అమ్మా! బొమ్మ లాలా గెందుకాడునే ?" యని యొక చిన్నబాలిక చర్మపాంచాలికా ఖేలనరహస్య మంత్రోపదేశ బోధనమునకై తల్లిని యాచించుచున్నది. "వెంకటరాముఁడు వెనుక బట్టినతరువాత బొమ్మలాటలో సొగసేచెడిన" దని సాలభంజికాఖేలన సాహిత్యరసగ్రహణపాండితీ మండితయగు నొక వితంతువు పూర్వ పండితస్తుతిసమ్మేళనముతో నాధునికపండిత నిందను జేసెను. "ఏమిటో

మాయప్రపంచము! మనముమాత్రము తోలుబొమ్మలము కామా ?"
యని యొక నృత్యవేశ్య వేదాంతబోధనము జేసి నోటితో సాయించు
చుండెను. ఇంతలోఁ గన్నులు మిఱుమిట్లు గొనునట్లొకబొమ్మ తెరపై
కెక్కెను. "వచ్చినాఁడమ్మా! వచ్చినాఁడమ్మా!" యని సభయంత
నొక్కసారి కెవ్వుమనెను. ఆతఁడె గ్రంథారిగాఁడు "గంధోళిగాఁ" డని
Phonetic laws ప్రకారము నవ్యనాట్యశాస్త్రమొందిన నామముగల
మహానుభావుఁ డీతఁడే! ఇతఁడు కథాప్రవాహమును నడిపించువాఁడు
కావున సీతను కిది పౌరుషనామముగఁ బూర్వులచే నుంచఁబడినది. ఇత
నికిఁ దలిదండ్రులుంచిన నామమేదియో నాకు తెలియఁగదు.

నాయనలారా! ఈనాఁటి యుపన్యాసమునఁ నన్నుఁగూర్చి కొన్ని
మాటలు మీతోఁ జెప్పుకొనవలసినది. ఇదివఱ కెన్నఁడును చెప్పియుండ
లేదు. దైవకటాక్షమున ముందెన్నఁడుఁ జెప్పనుకొందును. నావా
గ్ధోరణిని మీరు చాలకాలముగ ప్రతివారోపన్యాసములనుండి వినుచున్నారు.
నేను మోటుగ మాటలాడువాఁడనో మృదువుగ మాటలాడువాఁడనో
మీకుఁ దెలియకపోలేదు. కటువుగ మాటలాడువాఁడనో క్రమముగ
మాటలాడువాఁడనో మీకుఁ దెలియకపోలేదు. మనుజాలమనసుల కా
హ్లాదమగునట్లు మాటలాడువాఁడనో బాధకలుగునట్లు మాటలాడు
వాఁడనో మీకుఁ దెలియకపోలేదు. ఔచిత్యమెఱింగి మాటలాడువాఁ
డనో యెఱుఁగకుండ మాటలాడువాఁడనో మీకుఁ దెలియకపోలేదు.
మీమనస్సులకు గిలిగింత నిచ్చు కొంతమృదులతగల మాటలతో రస
నల కూటనిచ్చు కొంతతీపి కొంతవెగటుగలమాటలతో—మనలో
నున్న దురభ్యాసములను దుష్టవిశ్వాసములను దుష్కర్మముల వెల్ల
డించుచుంటినని నానమ్మకము. సంఘదోషనిరసనార్థము దైవముఖమును
జూచి పనిచేయుచున్నవాఁడనుగాని జనులనిందాస్తుతుల కలుకు కులు
కుల నొందువాఁడనుగాను. కాని గ్రంథారిగాని గూర్చి యీరాత్రి
పలుకవలసియుండుటచేతఁ గొన్ని మోటుమాటలను వాడవలసివచ్చు
నేమోయని భయపడుచుంటిని. ఇప్పుడైనను సాధ్యమైనంతమట్టునకు
మోటుమాట లుపయోగింపను. మాటలు మృదువులయిన మోటు
ధ్వనులీయక తప్పదు. మాటలు మధురములైనవెగటగు నభిప్రాయముల
వెల్లడింపక తప్పదు. మాటలాడఁదలఁచినయంశము మోటదగుటచే

యిట్టిశిద్ధాగ్రవైషమ్యమునకుఁ గారణము. "ఇంతశ్రమముచేసి నీవీవిషయమున మాటలాడుటయేల" యని మీరు ప్రశ్నింతురేమో! చెప్పెదను. తోలుబొమ్మలను జూచు దురాచారము మనయవస్థలలోని మూలుగులలోని మూలుగయియున్నది. ఈదురాచారమునుబట్టి మనయజ్ఞతయు మనయనాగరకతయు లోకమునకు వెల్లడియగుచున్నవి. మన మజ్ఞులమని యనాగరకులమని మోటువారమని యెవరనుకొన్నను మనము జడువనక్కఱలేదు. ఇట్టి చర్మపుత్త్రప్రదర్శనములు భగవానుఁడగు శ్రీరామచంద్రమూర్తికథయు లీలామానుషవిగ్రహుఁ డగు శ్రీకృష్ణదేవునికిఁ బాదభక్తులగు పాండవులకథయు మనకు జరిగినవి జరిగినట్లుగఁ బ్రదర్శించుటచేత మనకుఁ గలుగు నానందముముందు, నీతిముందు, భక్తిముందు, జ్ఞానము ముందు మోటువార మనుదుష్కీర్తి గణనీయము కాదు. సినిమెటోగ్రాపులో బాల్కనుల శవములను వీథుల వెంట నూరేగించుచు మిగుల దుఃఖముతో సమాధిస్థలమునకుఁ దీసి కొనిపోవుచున్న జనసంఘముల ఖిన్నస్వరూపములను దర్శించుటకంటె లక్ష్మణమూర్ఛాకాలమున శ్రీరామచంద్రమూర్తి ఖిన్నుఁడై యుండుటను దర్శించుట మనకుఁ దక్కువది కాదు. కాన యీగ్రంథారిగారి దే పట్టిచిక్కు. ఇట్టికజ్జపడిపాకము ఇట్టి మొండిమోటు సన్నివేశము—ఇట్టి బండబూతుల ప్రదర్శనము—ఇట్టిదిక్కుమాలినరోత—యేదేశమందుగాని యేకాలమందుగాని యేజాతియందుగాని లేదని నా నమ్మకము. మన మిట్టితుచ్ఛకార్యమున నద్వితీయులమై యున్నాము. ఇందువలన మనము నీతిలేనివారమని సిగ్గులేనివారమని రోతలేనివారమని పశువులమని మనస్త్రీలకు సిగ్గుబిడియములు లేవని మానుషము మర్యాద లేదని వారు దుష్టవర్తనలని పట్టి చిత్తకార్తికుక్కలని యితరజాతుల వారు మనచెవులు చిల్లులుపడునట్లు మనసుల రాచపుండు పుట్టునట్లు పలుకుచుందురని వినియుంటిరా? పురుషులకుఁ బురుషత్వము స్త్రీలకు స్త్రీత్వము లేదని యనిపించుకొనిన జాతిలోనివారి కితరులవలన నేమంత గౌరమున్నది? ఇట్టి సంఘులోపమును మీకు వెల్లడించుటకై నేను దోలుబొమ్మలఁ గూర్చి యీరాత్రి చెప్పఁదలఁచితినని మీ ప్రశ్నమున కుత్తరము. మోటుతనముగల గ్రంథారిగాని చర్యలోని మోటుతనమును వెల్లడించుటకు మోటుమాటలు కావలసియున్నవి. మోటు

మాటలుగూడ నావశ్యకములగు సందర్భముల సంప్రయోగింపవచ్చును. స్త్రీని చెఱచిన నేరమునుగూర్చిన యభియోగములలో న్యాయసభ యందు గుహ్యాంగనామస్మరణము కాని గోప్యాంగనామస్మరణముండునా? రహస్యాంగ శారీరశాస్త్రబోధనను గురుఁడు శాస్త్రోచితవాక్యములే పలుకునుగాని "[illegible]" వాక్యములు పలుకునా? కనుకనే మోటు లలో మొట్టమొదటి మాటకు స్త్రీఘాతిగాని గూర్చిన సంభాషణ ములలో మోటుమాటలు వచ్చుట వింతకాదు. మోటగు స్వప్నములు వచ్చుట వింతకాదు. మోటగుధ్వనులు గలుగుట వింతకాదు. మోటు తనమును నివారించుటకు మోటుపనులనే కావలయును. ముల్లుమూడ దీయుటకు సూదికావలదా? కావున నాయనలారా! కొన్ని మొఱకు టభిప్రాయములకు సిద్ధపడియుండుఁడు. కథను వదలి యీయంశమును గూర్చి యింతసేపు చెప్పవలసిన యావశ్యకత యేమిటో మీరు గ్రహించి యుందురు. ఇఁకఁ గథలోనికిఁ బోవుదము.

గ్రంథారిగాఁడు దివ్యమంగళస్వరూపుఁడై వేదిక నలంకరించినాఁడు. సభాజనముఖముల నలంకరించినాఁడు. చంద్రుని జూచిన కలువ వనమువలె సభ కలకలలాడుచున్నది. ఓ! ఎక్కడఁ జూచిన నవ్వులే! యెక్కడఁ జూచిన కిచకిచలే! యెక్కడఁజూచిన కిసుక్కులే! యెక్కడఁ జూచినఁ గిలకిలలే! సభాహృదయములు తాండవములాడుచున్నవి. అట్లుంట కాశ్చర్య మేమున్నది. ఎవనిఁజూచుట కింతటు మహాజనులు ప్రోగయిరో వాఁడే వేంచేసియుండ నింకఁ గావలసిన దేమున్నది. ఇంత కంటె మహోత్సవమేమి" ఇంతకంటె నేత్రానందమేమి? ఇంతకంటె హృదయపర్వమేమి? ఇంతకంటె జన్మమునకు సార్థకతయేమి? సెబాస్! జగదానందకరమూర్తియగు నా పురుషోత్తమోత్తమునికొఱకే కాని యొడల నిన్నిచింపితల లెవనికొఱకు? ఇన్ని జారుపైట లెవనికొఱకు? ఇన్ని కప్పుపంట్లెవనికొఱకు? ఇన్ని వంకచొప్పు లెవనికొఱకు? ఇన్ని పూలగాగరా లెవనికొఱకు! ఇన్ని రంగురవికె లెవనికొఱకు? ఇన్ని యడ్డు కట్టు లెవనికొఱకు? ఇన్ని కచ్చకట్టు లెవనికొఱకు? ఇన్ని పచ్చబొట్టు లెవని కొఱకు? ఇన్ని తోఁకబం ట్లెవనికొఱకు? వింతలోవింత! ఇన్ని నోటిచుట్ట లెందులకు? ఇన్ని బిళ్లకచ్చ లెందులకు? ఇన్ని చేతికఱ్ఱ లెందులకు? ఇన్ని కిఱ్ఱుచెప్పు లెందులకు? ఇన్ని పంగలకఱ్ఱ లెందులకు? ఇన్ని పంగనామము

లెందులకు? ఇన్ని విభూతిరేఖ లెందులకు? ఇన్ని కత్తిరింపుబుఱ్ఱ లెందులకు? ఇన్ని పాపటముముక్కు లెందులకు? ఇన్ని కోరపాగ లెందులకు? ఇన్ని గంగాళపుకడుపు లెందులకు? ఇన్ని పిడిసిగ లెందులకు? సభయంతయు సంతోషమున నాతనిం జూచుచున్నది. పొడుముకాయలోని పొడుము వెంకశాస్త్రులుగా రెడమచేతితో దులుపుటకు మొదలిడి యంతలో గ్రంథారిగానిం జూచి తదేకపక్ష్మనతత్పరుఁడై పొడుమంతయు నేలను దులుపుచున్నాఁడు. ఒకకరణముగారు కనుబొమ్మలకుఁ జేయియడ్డు పెట్టుకొని చూపుచెదరకుండఁ జూచుచున్నాఁడు. మునసబుగారు 'బాబూ! బాబూ' యని కొడుకును గుసికిపాట్లనుండి లేపించి చూడు! నాయనా! అడుగో" యని నాల్గుకన్నులఁ జూచుచున్నాఁడు. కొందఱు తెప్పవ్రేయకుండఁ జూచుచున్నారు. కొందఱు కన్నులు సన్నఁజేసి చూచుచున్నారు. కొందఱు క్రీగంటఁ జూచుచున్నారు. కొందఱు చేతిని గొట్టమువలెఁ జేసి దానిలోనుండి చూచుచున్నారు. దూరపు చూపానని వారు దగ్గఱకుఁ బోయి చూచుచున్నారు. కాని కాంతావలోకనములు మఱింతవింతగనున్నవి. నోరుతెరచి బాబాకరపుచూపులతో బాలవితంతువులు పరిశీలించుచున్నారు. ముగ్ధాంగనలు తలలట్టెవంచుకొని పై తెప్పలపైనుండి చూచుచున్నారు. ప్రౌఢవనితలు ప్రక్కచూపులఁ జూచుచున్నారు. వృద్ధులు తేఱిపాఱఁ జూచుచున్నారు. నడిమివయసు వారు చూచిచూడనట్లు చూచుచున్నారు. కొందఱు గాజుచూపులఁ జూచుచున్నారు. కొందఱు మొగమంతయు గన్నులు చేసికొని చూచుచున్నారు. కొందఱు వెఱ్ఱిచూపులఁ జూచుచున్నారు. కొందఱు తెఱ్ఱ చూపులు చూచుచున్నారు. "వీని మొగముమండ! వీనిని జూచున దేమిటి" యని తిట్టుచుఁ గొందఱు చూచుచున్నారు. ఇట్లందఱు కాంతలు వేఱువేఱు వింతవింత చూపులతోఁ జూచుచున్నారు.

విజయదశమినాఁడు రాత్రి వేశ్యానృత్యగానాదులతో మంగళవాద్యములతో తుపాకుల యగాదులతో మహావైభవలక్షణములతో బంగారపు టంబారికట్టి పట్టగజముపై నూరువెంట స్వారివెడలిన మండలాధిపతినైన ద్వారమునొద్దకువచ్చి కాంచని కాంతలు గ్రంథారిగానిం గాంచుటకు సంతబైటఁ గూలఁబడినారు. శివరాత్రినాఁడు నందివాహనారూఢుఁడై గుమ్మమునొద్దకు వేంచేసిన శంకరదేవు నీక్షింపని వారుగాం

తెరయెక్కిన చెడుసక్కసునిఁజూచుటకు నెలుపటనువచ్చి వేఁచియున్నారు. ఆహా! ఈతఁడెంత ప్రసిద్ధపురుషుఁడో! నన్యానన్య ప్రదానత్వమున దేవతలితని కనుఁగొనుముగఁ జేసిపోవుచున్నారు. రావణాసురునిపేరు విననివారైన గ్రంథాలిగాని నెఱుఁగుదురు. రామాయణకర్తయగు వాల్మీకి నెఱుఁగనివారైయున గ్రంథాలిగాని నెఱుఁగుదురు. చిరంజీవులలోఁ జేర్ప వలసిన చిత్రచరిత్రగలవాఁడు ఈ సంద్రాక్కయశస్వాంద్రుఁడు. శౌర్యము లేదు. విద్యలేదు. బుద్ధిలేదు. మానము లేదు. ధనము లేదు. గుణము లేదు. వానిపుణ్యమేమో యిప్పటినారకు నానిట్టి తోఁగియెక్కసరికి పట్టరానియుతా స్నేహము ప్రజల హృదయములు కక్కవలసినదే! అమృత విగ్రహము! కీర్తిస్వరూపము!

కాంతలిట్టుచూచి కనుక్కన నవ్వువారుకొందఱు 'హేహేహే' యని యొత్తినవ్వు నవ్వువారుకొందఱు, పట్టి పండ్లహాసముగనర్చి గవుచిప్పగ నుండువారుకొందఱు, వంకగనవ్వి నవ్వునకు వేరు వంకపెట్టువారుకొందఱు, "నదేపనిగ నేమినవ్వే" యని యూరకతె నధిక్షేపింపఁ బోయి నవ్వువారు కొందఱు, నొకతె నవ్వుచుండ నానవ్వులోఁ గలిపి నవ్వువారు కొందఱు, నాపుకొన—నాపుకొనఁ జాలకాగక దగ్గువైఖరిగ నవ్వువారు కొందఱు, నిగిలించువారు కొందఱు, సకిలించువారు కొందఱు, చప్పుడుకాకుండ వెక్కిరింపువలె నవ్వువారు కొందఱు నైయుండ వారితలలు పండినదానిమ్మపండ్లవలెఁ బ్రకాశించెనని మన వాణీదాసకవి చెప్పుట కవకాశమైయుండెను. ఇట్లొకత్రుటికాలము నవ్వినవ్వి యొండొరులకో కాని యొకతె రెండవదానికేమో చూపుమని కనుసన్న యొనర్చెను. ఒకతె మఱియొకతెను నిమ్మళముగ మోఁచేతితోఁ బొడిచెను. ఒకతె మఱియొకతె పిక్కపై గోకెను. ఒకతె మఱియొకదాని గాలిబొట్టనవ్రేలితోఁ దాకెను. ఒకతె మఱియొకతెకు 'అదిగో' యని త్ర్యక్షరమంత్రమును గర్ణమూలమున రహస్యముగ నుపదేశమొనర్చెను. ఇట్లన్యోన్యసంజ్ఞ లొనర్చుకొనునంతలోఁ గొందఱికెట్టి ముసిముసి నవ్వునవ్వి సంతోషించిరి. కొందఱి చెక్కలక్కే యెఱ్ఱబారినవి; కొందఱకు గుండెలు దడదడలాడినట్లు పైటలు ముందువెనుకకుఁ ద్రొక్కులాడినవి. కొందఱచేతులు గాళులేమో కాని వడకినట్లు నాకుఁ గనఁబడినవి. కొందఱెట్టి కొయ్యబారి నిలువుచూపున స్తంభించిరి. కొందఱకు గొంతు

కలో పట్టుపట్టినట్లుండ మాటలాడఁబోయి గడగడలాడిరి. కొందఱు మూఁడునాల్గుబారల నిశ్వాసములిచ్చిరి. కొందఱట్టె పులుకుపులుకున గన్నీరొలుకఁ బులకరించిరి. కొందఱు చేలాంచలముచే స్వేదమార్చుకొనిరి. కొందఱట్టె దీర్ఘాలోచనమునఁ బడిపడి తుదకు మైమఱచినట్లు కనఁబడిరి. లోపలనుండి దుష్టరక్తము దేహముపైఁ దామరగనో చురుగుగనో పొలుసుగనో కుష్ఠుగనో కమలముగనో వ్యాపించినట్లు లోనిసాత్త్విక రసము కాఁబోలు పై కన్నీరూపములుగ నుబికియుండెను! ప్రారబ్ధము.

అంత గ్రంథారిగాఁ డొడలట్టె దులుపుకొని భార్యావలోకన కుతూహలాయత్తచిత్తుఁడై యిట్లుగంతులువైచుచుఁ బాడఁదొడఁగెను.

పదము

రావె రావె పిల్లదాన-రావేమె పిల్లదాన॥ రావె॥
గోరంచు కోకెట్ట-కొప్పులో పూలెట్ట
కోరిన నగలెట్ట-కులికించి ముద్దెట్ట॥ రావే॥

అంతట యాతని యిల్లాలు వచ్చి దూరముగ నిలువఁబడెను. ఇది రెట్టించి యాతఁడుపాడి గంతులువైచెను. అప్పుడొక ముసలిది "ఓసే పెద్దమ్మా! కుఱ్ఱది జడుసుకొనునేమో జాగ్రత్త" యని హెచ్చరించెను. "అమ్మా! చాలులే నీమాటలు. మఱి యుపద్రవములు. బుల్లి కూచియా యేమి? సమర్థయియాఁడుపిల్ల జడసికొనుటయేమి" టని పెద్దమ్మ తల్లినిఁ జీఁగొట్టెను. నీబాబాకరము బ్రద్దలైపోను! నీకిది యుపద్రవముగనే తోఁచుటలేదా?" యని సమీపస్థాయిని యగుచాకిత యొకతె పెద్దమ్మను బంధుప్రేమచేఁ బరిహాసించెను. "అదృష్టము చెప్పవచ్చినప్పు డీయయ్యను జేసుకొన్న యాయాఁడుదాని" దని యొకకాంత నాకంటె పొడవగునది—బొట్టుయ్యసెట్టియంత స్థూలమైనది. చేతఁబట్టెలు మెడలో నానుకోళ్లుగలది—యెత్తుకొలఁకు బోరలించిన నిలువుటిత్తడి చెంబుపైనఁ గూరుచున్నది—దీర్ఘనిశ్వాసపురస్సరముగా నిమ్మళముగ ననుకొనెను. అంతయట్టెయట్టె కనుకొలఁకుల నీరుగ్రమ్మగఁ జీదుకొనుటకై వంగెను. నిలువుచెంబు తెటికిలఁబడఁగ నామె దబుక్కున గ్రిందఁబడెను. అంతట వాణీదాసునివంటి కవిరేయుండునెడల వనితపిఱుఁదులకు వసుధకు సామ్యమను విషయము సత్యమా? కాదా? యని తన పిఱుఁదులను

భూమిని పరిఁజేర్చి పోల్చినారనుకున్న వేమరాయని యుత్ప్రేక్షించి యుండెను. ఈమె యిట్లు [illegible] విచారించుకొనుటయుఁ బ్రక్కనే [illegible] యొక [illegible] యామె చెంబు సవ్వడిచేసి యామెను సన్నిధిని [illegible] "మీ [illegible] కారణ మేమియో నేనెఱుఁగుదును. [illegible] సాయిబుగారిచేఁ బడఁ బడినవారమే యని [illegible] నేను [illegible] యిరు వది సంవత్సరములు దుస్తీ చేసితిని. నా [illegible] బలమునకు దగినయాఁడుది దొరకక [illegible] నిన్నుఁ జూచితిని. నా ప్రాణములు లేచివచ్చినవి. మన [illegible] "మూడా ముహాబ్బా" వలె సుఖముగ [illegible] "నావర ఖాస్తును మంజూరుచేయుము" అని యామె [illegible] బట్టుకొనెను. అంతట నామె నడుమునకట్టియుని యుట్టియుని [illegible] మొగ మట్టి త్రిప్పుకొని చేతిసిలాగుకొనఁ బ్రయత్నించినట్లునటించి "నీవెవఁడ" వని యడిగెను. "నేనెవఁడనైన నెందులకు? పెద్ద గ్రంథారిగాఁడ" నని యాతఁడు బదులుచెప్పెను. అంత నీనాసకోళ్ళ వితంతువు ఫక్కున నోడలు గగుర్పొఁ గిసుక్కున నవ్వెను. అంత నాతో ళ్ళవస్తుఁడగు లబ్బివాఁ డామెను "బిస్మిల్లా" యని లేవఁదీసెను. ఆమె చెంబు చేతఁ బుచ్చుకొని యాతనితోఁ బోయెను. నేనేమో తన్నుఁ గనిపెట్టితినను కోపముచేఁ గాఁబోలు నాతురకయొక్క త్రోపును నాకుఁ గటాక్షించి మఱిపోయెను. అక్కడనుండి మఱియొక్కయెడ కేగితిని. అక్కడ నొకతె మఱియొక తెతో "అమ్మా! నుదుటిక్రింద సుఖపడఁగీత లేకపోయినతరువాత పైనఁ బొటబిందిరిలెందులకమ్మా! చేతఁజేసికొన్న పూజ సన్నమైన తరువాత మెడలోనికిఁ జేయించుకొన్నకంటె రోఁకలియంత లావున్న నేమిఫలము" అని దీనవదనముతో ననుచుండెను. అమ్మా! నీవెఱుఁగవు కాని నాపూజ మఱింత బుగ్గియయినది 'బారిస్టు' రని పైకిబండారమే గాని లోపల లొటారము. ఏమిచెప్పుకొనను. నాపిండకూడు" అని యీయామె యామె నోదార్చుచుండెను. అంత మఱియొకవైపునకుఁ బోయితిని. అక్కడ నొకయుపాధ్యాయుఁడు మఱియొకనితో నేమేమో చెప్పుచుండెను. "స్కూళ్ళఇనస్పెక్టరు" అని చచ్చిపోయినాఁడని మాత్రము [illegible] వినఁబడెను. బొమ్మలాటనుగూర్చిన గొడవకాదు కాఁబోలునని

యింకొకచోటికిఁ బోయితిని. అచ్చట నొక యీఁతరుప్ప తలది యుపదేశము (సను సపించి "బ్రదుకునకు ఫలమిది" యని భవతంత్రసర్వ రహస్యసారమును సూత్రప్రాయముగఁ దొమ్మిదక్షరములలో నవరత్న మంజరి యనునట్లుగ నిశ్చలకముగ బోధించుచుండెను. ఈవేదాంతిని యుపదేశమును గ్రాహ్యమగుగ వినుచున్న వారిలో నొకయాఁడుదాని బిడ్డఁడు నిద్రనుండి యట్టెలేచి తెరపైఁ బొమ్మను జూచి "అమ్మా! నాన్న యదుగో" అని కేక వేసెను. అప్పు డామె మిగుల విసుగుదలతో "నాన్న! అదుగనక్కఱలేదు. నాన్న బ్రదుకునకు నా బ్రదుకున కా మాత్రమా" యని పలుకుపరికి స్త్రీలంతయు నవ్విరి. బిడ్డఁ డేడ్చెను.

"గోలంచు కోకొద్దు—కొప్పులో పూలొద్దు
కోరిన నగలొద్దు—కులికించు ముద్దొద్దు॥ రానురో పిల్లోడ"

అని జగదేక యశఃపరిపూర్ణుఁడగు భర్తగల యాపరమసుందరి పాడి యెగిరి యెగిరి యాడెను. అంత విరహావేదన భరింపలేక యాతఁడు—

"పందిమాంసమెట్టిస్త—బానకల్లు తాగిస్త
సందిటికి లాగేస్త—స్వర్గమట్టేచూపిస్త॥ రావె"॥

అని పాడి బలాత్కారముగ భార్యపైఁ బడెను. జనులెల్ల గొల్లుమనిరి. తల యూపిరి. సెబాస్ అనిరి. చప్పట్లుగొట్టిరి. "అద్దీ! అలాగున నుండవలెను." అనుమాట స్త్రీప్రపంచమునుండి ఱెక్కలు కట్టుకొని బయలువెడలెను. ఇంతలో "చోడిగాఁడు" తెరపైకి విచ్చేసెను. ఈతఁడు గ్రంథారిగాని మేనల్లుఁడు. అత్తయందనురాగము గలవాఁ డగుటచే నామె నీతఁడు వెనుకనుండి కౌఁగిలించుకొని తనవైపునకుఁ ద్రిప్పుకొనుచుండెను. జనులు గొల్లుమనిరి. గ్రంథారిగానిభార్యకు "చోడి"గాఁ డనినఁ బ్రాణమగుటచే భర్తను ద్రోచివైచి యల్లుని నమితానురాగమున ముద్దుపెట్టుకొనెను. అంత గ్రంథారిగాఁడు కోపమున బరవళ్లు ద్రొక్కుచుండఁగా నత్తనెత్తుకొని యల్లుఁడు పారిపోయెను. జనులు తిరుగ గొల్లుమనిరి. గ్రంథారిగాఁ డేడ్చుచు నింటికిఁ బోయెను.

"అట్టిమహాత్మునికే యిట్టియవస్థ పట్టినప్పుడు మనుష్యమాత్రులకు లెక్కయేమి" టని నూతనముగఁ గాఁపురమునకు వచ్చిన తృతీయభార్య

తెలుగులవానితో సీనరును లేనిపోవుటనే బతిమాలించుచున్న భగ చ్ఛాస్త్రులవారు కొంత తాపోనిమించుచుండిరి. అంతట దేవస్థ శ్రీరామ చంద్రమూర్తి మూర్తిత్రయుండగు లక్ష్మణుఁడు సీతాసమేతులు ప్రవేశించిరి.

అంతలో జనసంఘమునందు నొకమూల నిద్దఱు జనులు గట్టిగ మాట లాడుకొనుచున్నట్లు ధ్వని వినఁబడెను. అట్లు నల్వురైదుగురి ధ్వని వినఁబడెను. అంతలో గుబగుబలాడుచు గొంతులు జనులు లేచిరి. కూర్చుండుఁ డని కొందఱు కేక వేయుచుండిరి. జను లుద్రేకముగ లేచుచుండిరి. పెద్దగోల యగుచుండెను. బండబూతులు పుంఖానుపుంఖముగ వెడలు చుండెను. ఇంతలో గుబుకు గుబుకుమని గ్రుద్దుల ధ్వనులు మిన్నుముట్టు చున్నవి. చెప్పు లంతరిక్షమున నెగురుచున్నవి. కఱ్ఱలు విఱుగుచున్నవి. జనుల తలలు పగులుచున్నవి. కఱ్ఱలింకఁజాలక కొందఱు జనులు బొమ్మ లాట పందిరికఱ్ఱ లూడలాగిరి. బొమ్మలాటవాండ్రు తోళ్లు మడతవైచు కొని కాలికొలఁది పరుగెత్తిరి. పిల్లలు జనుల కాళ్లక్రిందఁబడి మొఱ్ఱో యని యేడ్చుచుండిరి. స్త్రీలు సందడిలో నలిగి నలిగి "నాన్నా, తాతా, బావా, మామా" యని కేకలిడుచు విలపింపఁజొచ్చిరి. కరణముగారు, కఱ్ఱచేఁబూని యడ్డమువచ్చినవారినెల్లఁ గొట్టుచు జనారణ్యమును ఛేదిం చుచు లోనికిఁ బోవుచుండ నొకని సంగలకఱ్ఱచే నాతని ప్రక్కయెముకలు విఱుగుటచే నక్కడనే కూలబడెను. ఏమిటి! సంగతియేమిటి! ఆగుఁడు! ఎందులకు! ఈగొడవకు మొదలేమి" టను కేక లనేకకంఠములతో బయలువెడలినవి. ఆమాటలకు ప్రత్యుత్తరము లేదు. "కొట్టు—ఈడ్చు తన్ను—పొడుచు—చంపు" మను కేకలకు విరామము లేదు. హుంకార మునకు ఝంకారములకు గస్సు బుస్సులకు నంతము లేదు. దబుకు దిబుకు టప్పు టిప్పుమను ధ్వనులకు మితిలేదు. "అమ్మయ్యో! మొఱ్ఱో! బాబూ! చచ్చితినిరా" యను నాక్రందనములు హాహాకారములు భయంకరముగ నుద్భవించుచున్నవి. ఇంతలో రక్షకభటులు వచ్చిరి. కాని చుట్టలు గాల్చుచు దూరముగ నిలువఁబడిరి. కరణముగారిని గంజి కావడిపైవైచి యింటికి భటులు మోసికొనిపోయిరి. మునసబు బుద్ధి మంతుఁడగుటచే నొకఁడు మోసికొని పోనక్కఱలేకుండ స్వతంత్రముగ నింటికిఁ బోయెను. బొమ్మలాట గ్రుద్దులాట తన్నులాటక్రింద దిగినది. కారణమేమో యేరెవరికిఁ దెలియదు. కఱ్ఱప్రేటు లడఁగెను. గ్రుద్దులాట

మిగిలెను. గ్రుద్దులాట కొంతసేపటికిఁ జల్లారెను. జనులంత రొసరొస లాడుచు నొత్తిగిల నారంభించిరి. "అస్థిఇదే సమయ" మని రక్షకభటు లప్పు డాకాశవిదారణప్రతిధ్వనిదారుణములగు కేకలతో జనసంఘమునఁ బ్రవేశించి యెఱ్ఱపాగలవలనఁ గలిగిన రౌద్రరసముతో వారినీడ్చి వీరిని బెదరించి దెబ్బలుతగిలి క్రిందఁబడినవారిని లాగి యెంత "హంగామా" యయిన నాచరించిరి. జనులందఱు జడిసి యింటికిఁ బారిపోయిరి. క్రిందఁబడినవారిని వారివాండ్రు వచ్చి యిండ్లకుఁ దీసికొనిపోయిరి. రక్షకభటు లిండ్లకుఁ బోయిరి. నేను నింటికిఁ బోయితిని. కలహకారణమేమో మఱ్ఱునకుఁ దప్ప నితరుల కెవ్వరికిఁ దెలియదు. వారిలో నిద్దఱు తమకు శిక్షయగునేమో యనుభీతిచేఁ బయటఁబెట్టరు. మూఁడవవాఁడను నేను. వారిద్దఱపేరు లేవో నే నెఱుఁగనుగాని వారిని గుర్తుపట్టగలను—ఈ కారణమేదో మీరు విందురా? అనేక సహస్రజనములకు నీడ నీయగల వటవృక్షమునకు మూలకారణము జీమకంటెఁ జిన్నదైన బీజముకాదా? మహాగౌతమి నాసికాక్షేత్రమున చిన్నకాలువకాదా? అటులే యీ మహాకలహమునకు గారణము చిన్నది. చోడిగాఁడు గ్రంథారిగాని భార్యను లాగుకొని పోయినతరువాత—నెవ్వరో యిద్దఱు జనులు మాటమాటయనుకొనిరి. అప్పుడు నే నచ్చటనే యుంటిని. చోడిగాఁడు గ్రంథారిగాని మేనల్లుఁడని యొకనివాదము. కాఁడు అల్లుఁడని యొకని వాదము. ఈనెపనే పెణకపైఁబడి యిన్నికొంపలంటించినది.

జంఘాలశాస్త్రి యింక నేమో చెప్పఁబోవుచుండఁగా నిద్దఱు రక్షకభటులు మాసభాకుటీరమున సెలవులేకుండఁ బ్రవేశించి "కవిగారిచ్చట నున్నారా?" యని యడిగిరి. అంతట వాణీదాసుఁడు లేచి "నేనే కవి" నని పలికెను. "అలాగా" యని రక్షకభటులు తిరుగ వెలుపలకుఁ బోవుచుండ నేను వారినాపి "కవితో నేమిపనియున్న" దని యడిగితిని. విశేషము లేమియును లేవు. కరణముగారి చెల్లెలు కవినొకనిఁ దీసికొని తెల్లవారుగడ లేచిపోయినదఁట—ఆతఁడు మీకవియేమోయని సందేహించి వచ్చితి" మని చెప్పిపోయిరి. "కవియను బిరుదముగలవాఁడు మఱియొకఁడు గ్రామమున నుండెనా" యని వాణీదాసుఁ డనుకొనుచు వెడలిపోయెను. సభముగిసెను.

# సాక్షి

## సభాస్వకీయవ్యాపారము

ఈరాత్రి యుపన్యాసమేమియును లేదు. సభావ్యవహారములు చూచుకొనవలసియున్నది. ఒక మాధ్వునియొద్దనుండి యీయుత్తరము మొన్న నాకు వచ్చినది. దీనిలోని సంగతులఁ జదివెదను. మీమీ యభిప్రాయములు నాకుఁ దెలియఁబఱచునెడలఁ దిరుగ నాతనికిఁ బ్రత్యుత్తరమిచ్చెదను. మొదటిలేఖను వినుఁడు.

సాక్షిగారికి—సత్యపురము, గోదావరిజిల్లా.

పత్రి రఘునాథాచార్యులు నమస్కారపూర్వకముగ వ్రాసికొనినది. సువర్ణలేఖలోఁ బ్రకటింపబడుచున్న మీయుపన్యాసములను జదివి యానందించుచున్నాను. మీలో విశిష్టాద్వైతులును నద్వైతులును నున్నారు కాని ద్వైతి యొక్కఁడును లేఁడు. ఎంతటియెక్కువ సభలోనయినను ద్రిమతస్థులు చేరియుండుట న్యాయమై యున్నది. నేను మాధ్వుఁడను. శ్రీమదాచార్యులవారి యన్నిగ్రంథములఁ జదివితిని. సుధాధ్యయనమిప్పుడు చేయుచున్నాను. ప్రకరణములవఱకుఁ దర్కమును జదివినాను. మతవిషయక సాంప్రదాయములు శ్రీమదానందతీర్థులవారి కటాక్షమునఁ గొంత యెఱిఁగినవాఁడను. నే నీనడుమను మాయూనియనులో సభ్యుఁ డొక్కఁడు చనిపోవఁగఁ దత్స్థానమునకై యపేక్షించి యధికారులకుఁ బ్రార్థనాపత్రము నంపుకొంటిని. కాని యది నిరాకరింపఁబడెనని చెప్పుటకు వగచుచున్నాను. ఏదైనఁ దగిన సభలో సభ్యుఁడుగ నుండవలయునని యభిలాషతో నున్నాను. ఈమతవిషయోపన్యాసము లీయఁగలను.

మాధ్వమతావలంబకుఁడు మాలోనుండకపోవుట శోచనీయమని నాయభిప్రాయము. అందుచేత నన్ను సభ్యునిగాఁ దీసికొనఁ బ్రార్థింతును.

ఇట్లు విన్నవించు,

పెద్దాపురము. పత్రి రఘునాథాచార్యులు.

ఈతఁడు మనసభలో సభ్యత్వమపేక్షించుచున్నాఁడు. ఈతని జేర్చుకొనవచ్చునో లేదో యాలోచించి చెప్పుఁడు.

కాలాచార్యుఁడా! నీయభిప్రాయమేమి ?

కాలా—మాధ్వమతమునకు రామానుజమతమునకు విశేష భేదములేదు. రెండునుకూడ భక్తిప్రతిపాదకములే ? విష్ణు సర్వోత్తమత్వ స్థాపకములే! జీవాత్మ పరమాత్మల యైక్యము నిరాకరించునవే! మతమునకుఁ గావలసిన ముఖ్యాంశములలో రెండు నొక్కటే! మధ్వాచార్యులవారీమతమును స్థాపింప నక్కఱలేకయే యుండవలసినది. కాని రామానుజమతస్థులు భక్తిప్రపత్తులకుఁ బ్రాముఖ్యమిచ్చి వైదిక కర్మముల నిరాకరించి యాచారనిష్ఠాదూరులగుటచే వైదికకర్మములఁ దిరుగ నిలువఁబెట్టుటకై వీరీమతమును బోధింపవలసివచ్చినది. ముక్తిదశలోఁ గూడఁ గొన్నికొన్ని భేదము లీరెండుమతముల కున్నవి కాని యవి యంత గణనీయములు కావు. మిగిలిన యంశములు రెంటికి సామాన్యములగుటచే వేదాంతాచార్యులవారీమతమును సన్నిహితమని పిలిచిరి. కావున నేను నామతమున బోధించునంశములే యామాధ్వుఁడు బోధింపవలయును గాని మఱియొకటి కాదు. ఒక్కవిధమైన యంశములఁ బ్రతిపాదించుటకిద్దఱుపన్యాసకర్తలావశ్యకము లేదని తోఁచుచున్నది.

సరే! జంఘాలశాస్త్రీ ! నీయభిప్రాయమేమి ?

జంఘా—నేను గాలాచార్యునితో నేకీభవించితిని.

వాణీదాసా ! నీవేమందువు ?

వాణీ—వ్యాపారులలోఁ గొందఱు మిగుల తెలివికలవారనుట సత్యము వాదమునఁగూడ న్యాయమగుపట్టుదలవారు కుత్సితులు కారు. దయాధర్మములందు బుద్ధిగలవారు—దైవభక్తికలవారు. ధారాళాంతఃకరణముగలవారు—కావున వ్యాపారిని సభ్యునిగాఁ జేర్చుకొనవచ్చును.

బొజ్జయ్యశెట్టి పంపిన తనయభిప్రాయమును జదివెను.

"మనసభ్యుల కలయిక యిరువది సభ్యులము. అయిన మంచిసంఖ్య. ఇక సభకీ సరిపోవును మనమిప్పటి కిదానింత సౌభాగ్యత సిద్ధించినదని నానమ్మకము—ఈసభ సంఖ్య 'యేబది' కు పెరిగినయెడల పనికిరాదు—సభ కయిదుగురే చాలు—అందుచేతనే 'పంచాయతి' గావున సభకుఁ గలుగును. అప్పటివిస్తరణయందు నొక్కొక్కటిబోధపడక యున్నది. ముగ్గురొక యభిప్రాయమును పలుకులు పెరుగనొకరి యభిప్రాయమును బడిన యెడలఁ దీర్పున కవకాశముండదు. అప్పుడు 'సాక్షి'కి నిద్దఱుసభ్యులయధికార మీయవలసియుండును. అట్లయినచో నెవరును సాక్షి నంగీకరింపఁడు. సభ్యులసంఖ్య యేకారణముచేత నైనను వృద్ధి చేయఁగూడదను నియమము మన ముంచుకొనవలయును. తక్కువ వ్యాపారములలోనున్న లాభము బహుళ వ్యాపారములలో నుండదు. ఆవిషయమున మాధ్వుని దీసికొందు మనుకొనుదు. రేపు మహాత్ముఁడీయుడు తన్నుఁదీసికొమ్మనును. వానిని నిరాకరించుటకుఁ గారణముండదు. సభాసంఖ్య యనునది నల్లమందుమాత్రవంటిది. వృద్ధికిఁ గాసంత సంభవించినయెడల తరువాత గొంతుదిగుట కష్టముగ నుండును. సభలో సభ్యులు లోఁగుబాటుగ నుండవలయునుగాని విరివిగఁ జేతికందనివారుగ నుండఁగూడదు. అదిగాక సభాగృహము మిగుల చిన్నదిగనున్నది. ఆలోచించి మాటలాడు నయిదుగురిలోఁ దేలనియంశ మైదువందల సభ్యులలోనైనఁ దేలునని యనుకొనుట వెఱ్ఱి. మనము పైసభ్యుల నిరాకరించుటకుఁ గారణము మనలో నుండిన లక్షణములకుఁ గనబఱచవలయునుగాని వారిలో నున్నట్లు కనఁబడినయెడలఁ బ్రజలయిష్టమునకు దూరమగుదుము. దుకాణములో నిత్యము కూర్చుండువాఁడు కూర్చుండునప్పుడే రాబడి యెక్కువగ నుండునుగాని క్రొత్తవాఁడు కూర్చుండునెడల సామాన్యమే! నేను దురదృష్టమున సభకు రాఁజాలనైతిని. కాన నేను వచ్చుచుండునెడల నాకు మీకుఁగూడ స్థలము చాలనే చాలియుండదు. ఈకారణములచే బైవారు మనకెవ్వరువలదు.

మనలోముగ్గురు వ్యాపారిని దీసికొనుట కంగీకరించలేదు. కావున నాతనికి మనయనిష్టతఁ దెలియపఱతును— రెండవయుత్తరముకూడ నున్నది. మీరు దీనిని వినఁదగును.

మహారాజశ్రీ సాక్షిగారికి—

సత్యపురము.

అయ్యా!

నేను గన్యావితంతువను. 41 సంవత్సరముల వయస్సుగలదానను. వెలనాటివారి శాఖవానను. మీలోఁ గాలాచార్యుఁడని యొకవిద్వాంసుఁ డున్నాఁడని యెఱుఁగుదును. ఆయన నీనడుమ చెరువునొద్దఁ జూచితిని. ఆయనకు వివాహము లేదని వింటిని. వివాహాపేక్ష పూర్తిగ నున్నదని వింటిని. నావంటి వితంతువు నాతఁడు పరిణయమాడుట కిష్టపడునా? ఈ యంశ మాతనికి నేను నాదాసిచే వార్తనంపితిని కాని తాను "సాక్షి యధీనుఁడనై యుండుటచే నేమియు స్వతంత్రించి చెప్పఁజాల"నని నాకు మాఱువార్తనంపినాఁడు. అందుచే మీకు వ్రాయవలసివచ్చినది. క్షమించి యాతనిగనుఁగొని యాతని యభిప్రాయమును నాకుఁ దెలుపునెడల సంతసింతును. నాపేరేదో యాతఁ డెఱుఁగును. అందు చే వ్రాలుచేయ లేదు. సత్యపురము.

ఈయుత్తరము చదువుసరికిఁ గాలాచార్యులు పొంగిపోయెను. మంచినల్లమందువలె నలుపులో మసరెక్కెను. ముక్కుల లిద్దె గొట్టినట్లు దిబ్బడులు పైచుటచే నట్టి యుపదేశముద్రను బుఱ్ఱునఁ బీల్చెను. అట్టి రెయొంటి జన్నిదమును జూచుకొనెను. సభ్యులంద ఱాతని తొట్రుపాటును జూచి నవ్విరి. ఈయుత్తరమునకు నీవేమి ప్రత్యుత్తర మిచ్చెదవని నే నాతని నడిగితిని.

అంతటఁ గాలాచార్యు లిట్లనియెను.

చిరకాలమునుండి వివాహవాంఛతో నున్నమాట సత్యమే. చేసి కొనకున్న జరుగుసాధనము లేదనుమాటకూడ సత్యమే. సగమీఁదు దాటిపోయినది కావున నూరకుండుటయే మంచిది యనుటకూడ సత్యమే! ఇట్టిసంధిలో నాకేమియుఁ దోఁచియుండుటలేదు. కావున మీరెట్లుచెప్పిన నట్లు వినువాఁడను.

అంత జంఘాలశాస్త్రి యిట్లనియెను.

వివాహమనునంశ మెవరియిష్టానుసారము వారు చూచుకొనఁ దగినది కాని సభవారి యభిప్రాయమునకు వదలివేయఁదగినది కాదు. తన బలాబలములు చూచుకొనవలయునుగాని "యౌను గా" దను

సభ్యుల సంఖ్య బలాబలములు నిర్ణయించునవి కావు. అంతటఁ గాలాచార్యులు లేచి యిట్లనిరి.

“ఎంతమాత్రము జరిగినను సభలో నా సభ్యత్వము పోవునా? ఎప్పుడైనను జరిగినప్పుడు. నేను సాక్షికంటె సతి యెక్కువది కాను.

అంత సభ్యులు నవ్విరి. సభ్యత్వముపోవని యందరును స్వైరకంఠముగఁ బలికిరి. సరే! మంచిది మాఘమాసదినములలో కాని వివాహ ముహూర్తములు లేవు కాన నిప్పుడాలోచించి చెప్పెద” నని కాలాచార్యులు ప్రత్యుత్తర మిచ్చునని చెప్పిరి.

ఆయుత్తరము బాగుగలేదని యందఱు నెంతగాఁజెప్పిన నంతకంటెఁ బ్రస్తుతమునఁ జెప్పుట కవకాశము లేదని కాలాచార్యులు భీష్మించుకొనెను. ఈయంశ మైనది. “ఇదిగో! యీయుత్తరము సభామందిరపు టద్దెనుగూర్చి యింటియాతఁడు వ్రాసినాఁడు. ఆఱు నెలల మాసముల బాడిగె యాతని కీయవలసియున్నది. ఇదే దీనియభిప్రాయము కావునఁ జదువ నక్కఱలేదు. ప్రవేశరుసుము మిగిలినది చేరియున్నది. నాల్గు రూపాయిలున్నవని సభసంబంధమగు నాదాయపులెక్కను జదివితిని. నెలకొకరూపాయిచొప్పున నీయవలసిన యఱువదిరూపాయలలో నాలుగున్నవి. కాన మిగిలిన యొక్కటి బొజ్జయ్యసెట్టిగారియొద్ద బదులు తెచ్చి యింటియాతనికిమ్మని యందఱ అభిప్రాయపడిరి.

తరువాత—ఇదియొక యుత్తరము.

సాక్షిగారికి—

గ్రామ్యభాషావాదులకు, గ్రాంధికభాషావాదుల కిప్పుడు వాదము లింత ప్రబలముగ జరుగుచుండఁగా మీరాయంశ మెత్తుకొనకుండనే యూరకుంటిరేమి?

ఇట్లు విన్నవించు,
అనామకుఁడు.

రెండవసాక్షిలో నాయంశ మెత్తుకొని మాయభిప్రాయము వెల్లడించియుంటిమి. కానఁ బదేపదే దానినిగూర్చి పలుకనక్కఱలేదనినాయభిప్రాయమని జంఘాలశాస్త్రి చెప్పెను. సభ్యు లాతనిమాట నామోదించిరి. అన్నియుత్తరములు పూర్తియయినవి. కావున సభ చాలించవచ్చును.

---

# సాక్షి

## సత్యము

జంఘాలశాస్త్రి యిట్లు పలికెను.

నాయనలారా ! నాకుఁ దల నొప్పుచున్నది. క్రిందటిసారి మా యుపన్యాస మేమియు జరుగలేదని సిద్ధపడితిని. చెప్పఁగలిగినంతవట్టునకుఁ జెప్పి యూరకుండెదను.

“సత్యేన స్థాపితా భూమిః” యన ఋగ్వేదశ్రుతియున్నది. భూమి సత్యముచే స్థాపనము జెందియున్నదని దీనియభిప్రాయము. అనఁగ సత్యము లేకుండిన భూమియందలి వ్యవహారములు జరుగవని దీనివలనఁ దేలుచున్నది. ఈయంశ మెంతసత్యమో పరిశీలింతము. గురుఁడు శిష్యునకు విద్యఁజెప్పి యాతని యజ్ఞానమును ధ్వంసమొనర్పఁజేసి యాతని బాగుసేయవలయునను సత్యబుద్ధితోఁ బ్రవర్తింపవలయును. శిష్యుఁడు గురువునందు యథార్థభక్తిఁ గలిగి యాతఁడు తన క్షేమము కొఱకే పాటుపడుచున్నాఁడని సత్యబుద్ధి గలిగి విద్య నభ్యసింపవలయును. ఉభయుల సత్యములో నెచ్చట లోపమున్నను విద్యావ్యాపారము జరుగనేరదు. వైద్యుఁడు తనకున్న శేషజ్ఞానముతో రోగి రోగమునకుఁ గారణమేదియో పరిశీలించి యాతనితత్త్వ మెట్టిదో బాగుగఁ గనిపెట్టి తనయొద్దనున్న యౌషధములలో మంచివాని నిచ్చి యాతని కారోగ్యమును గలుగఁజేయవలయు నను సత్యబుద్ధితో దైవముఖమునఁ జూచి పాటుపడవలయును. “ఈవైద్యుఁడు యథార్థవైద్యజ్ఞానము కలవాఁడు, సత్యవంతుఁడు; నమ్మదగినవాఁడు, రోగము కుదుర్చును. దొంగమందులిచ్చి రోగము హెచ్చుచేయువాఁడు కాఁడు. ఆతని శ్రమ

మునకుఁ దగిన ప్రతిఫలమియ్యవలయుననియు" అను సత్యబుద్ధితో రోగి మందును దినికొనవలయును. ఉభయుల సత్యబుద్ధులలో నెచ్చట లోపమున్నను, భేషజతంత్ర మొక్కనిమిషమైనను జరుగనేరదు. ఈపై రెండుపక్షములవలనను సత్యము లేనందునేని మనుజుల చిత్తరోగ మగు నజ్ఞానము నివారింపఁబడుట లేదు. ప్రాకృతరోగములు నివర్తించుదారి లేదు. బాగుగ నిర్ణయించిన దేహాదిస్థితులు రెండును బాధగును. ఇట్లట నిఁక దేహయాత్ర యుచితరీతి నెట్లు జరుగఁగలదు ?

అదిగాక "ప్రజలు యథార్థముగ నాబిడ్డలు; మనోవాక్కాయ కర్మములచే వారిని బుత్త్రులవలెనే నాదరింపవలయును" నను సత్యబుద్ధి గలిగి సత్యమే యాధారముగల శాసనము లేర్పరిచి సత్యవంతులగు నుద్యోగులమూలమునఁ బ్రభుఁడు తన యాధీనులగు ప్రజను పరిపాలింపవలయును. "రాజామాతాపితాచైవ రాజాహితకరో నృణాం" అను నార్షవాక్యమును త్రికరణశుద్ధిగ నమ్మి ప్రభుఁడొసరఁగునదెల్లను దమ క్షేమమునకేయని సత్యమునమ్మి యాతనియందు విశ్వాసము, ననురాగము, భక్తియుఁ బూర్ణముగఁ గలిగి ప్రజల పాలింపఁబడవలయును. ఈయుభయుల సత్యబుద్ధులలో నెచ్చట లోపమున్నను రాజకీయతంత్రము జరుగదు. పాలనతంత్రము లేనప్పుడు ప్రజల బ్రతుకిక నడుగవలయునా ? గొల్లఁడు లేనియప్పుడు 'ఛే' యని యదలుచుఁ గట్టులేక యటునిటుఁబోవుచు గంచెలుదాఁటుచుఁ గాళ్లువిఱుగఁబడుచు నొకదానినొకటి తన్నుకొనుచుఁ గుమ్ముకొనుచుఁ దోడేళ్లనోళ్లలోఁ బడుచుఁ జెడు గొఱ్ఱెలవలె, రాజులేని యప్పుడు జనులు దిక్కులేక, గతిలేక, శాసనములకట్టులేక, యాస్తులకు స్వస్థతలేక, యాఁడువారి మర్యాదలకు రక్షణములేక, యర్భకులకుఁ గాపులేక, యన్యోన్యకలహములలోఁ గఱ్ఱలు విఱుగఁ, గత్తులెగురఁ, దలలుతెగిపడ, రక్తములు ప్రవహింప, ప్రాణముల కొక్కత్రుటియైన నిలుకడలేక, మనసులకు ఱెప్పపాటయిన శాంతిలేక, మహాసంక్షోభము నొందుదురుగాదా ! సత్యము లేకుండు నెడలఁ బ్రపంచవ్యాపారములకింతకలఁతసిద్ధించుట స్పష్టముగఁ గనఁబడుచున్నదా ! "జనులు తమ్ము పరిపాలించుకొనఁగూడదా ! ప్రభువే పరిపాలింపవలయునన్న నియమమేమి ?" యని యందురేమో ! అట్లు జరుగవచ్చునుగాని జనులలో సత్యము లేనియెడల నదిమాత్ర మెట్లు

జరుగఁగలదు. నీయందు నాకుఁ బ్రమాణబుద్ధి, నాసత్యమునెడల మఱి యొకనికి విశ్వాసము లేనప్పుడు మఱియొక యథార్థమం దింకొకనికి నమ్మకము లేనప్పుడు నిట్లొకనితో నొకఁడు హస్తకుండఁ గలియకుండ నుండునప్పు డన్యోన్యసాహాయ్యమున కవకాశ మెచ్చటనున్నది. అదియు లేదు. భూమిలో సత్యము లేనప్పుడింక జగత్తే లేదు. కావున జగత్తునకు సత్యమే యాధారము. సత్యముచేతనే జగము స్థాపింపఁబడియున్నది. కావునఁ బూర్వోదాహృతమగు వేదవాక్యము సత్యము.

కాని జాతిలో సత్యము నశించుట కేవలము ప్రళయాసన్నదశ యందుఁగాని సిద్ధింపదు. కాని సత్యము విశేషముగ క్షీణించి యసత్యము మిక్కిలి ప్రబలియుండు సన్నివేశములు ప్రపంచమున నప్పుడప్పుడు సంభవించును. అప్పుడే యసత్యనాశనమునకై సత్యస్థాపనమునకై యవతారపురుషు లుద్భవింతురు. రామకృష్ణాదులే కాక, శంకర రామానుజ క్రీస్తు మహమ్మదాదులుకూడ నవతారపురుషులే యని చెప్పనొప్పును. ఇట్టి యవతారోద్భవమునకు గూడ నవసరము తఱచుగఁ గలుగనేరదు.

అగ్నిసాక్షిగఁ బెండ్లాడిన కాంతతోఁ బరిణయకాలమునఁ జేసిన ప్రమాణమునకు బద్ధుఁడై జనుఁడుండవలయును. అట్లుండక యొకఁడు వ్యభిచరించినాఁడనుకొందము. ఈవ్యభిచారదోషమున కాదికారణమేది? ప్రమాణమునకు బద్ధుఁడై యుండకపోవుట. అనఁగ నసత్యము—న్యాయప్రదానమున కేర్పడిన శాస్త్రబ్రహ్మచారి లంచములు దీసికొని శాసనముల కపార్థములఁజేసి జనుల బాధించును. ఈజనహింస కాదికారణమేది ? బ్రహ్మచర్యదీక్షాపూర్తికాలమున సభలో "న్యాయముగ వర్తింతు" నని పరిపాలకనిధియెదుటఁ దీసికొనిన ప్రమాణమునకు భిన్నముగ నడచుట. అనఁగ నసత్యము. ఒకఁడు చెడఁద్రాగి యొడలు తెలియక ప్రేలుచు గంతులువైచుచుండు ననుకొందము—ఈదుర్వృత్తమునకు మూలమేది? తన స్వభావమునకుఁ దానుగనుపఱుపవలసిన సత్యమునకు భిన్నముగ వర్తించుట—అనఁగ నసత్యము—జనులలోనొకఁడు జనపతికి హానిచేయఁ బ్రయత్నించెననుకొందము—ఈద్రోహమునకు మూలమేది ? జనపతినుండి తాను బొందుచున్న మేలున కసత్యముగ నడచుట—అనఁగ నసత్యము. ఒకఁ డొకనిని జంపె ననుకొందము. ఈ

నేరమునకు మూలము సంఘసత్యమునకు వ్యతిరేకముగ నడచుట— అనఁగ నసత్యము. ఇట్లు మనుజుఁడు సంఘమునెడలఁగాని, తనయెడలఁ గాని, దైవమునెడలఁగాని, చేయఁగల యన్ని నేరములు సన్నిహితముగనో దూరముగనో యసత్యమునకు సంబంధించియున్నవి. అసత్యమే మూలకారణము గలిగియున్నవి. ఇట్టి నేరములను జను లేలయో లాభము గోరి చేయుదురు. తాత్కాలికపు లాభమును ధ్యానించుచు జేసికొను వాఁడయినఁ దాత్కాలికపు లాభమునఁ గలుగు మహాసంపదమునకో మఱి యొట్టిదేనికో త్రొవ్వును. తమ యీనేరములవలనఁ బయలను నష్టము వచ్చినను దమకు లాభముగనే పరిగణింపఁబడును. జనులిట్లు లశాశ్వతములగు నైహికసౌఖ్యములకొఱకు శాశ్వతమగు సత్యమును బరిత్యజింతురు.

సెనగపిండిలోఁ గొంచెము బియ్యపుఁబిండి కలిపినగాని కారపుఁబూస కరకరలాడుచు నొకటిరెండు దినములు నిలువయుండదు. జబ్బులో హాపుఁగూడిక యుండినఁ గాని టంకము బింకముగ నతికింపలేదు. కాసులో రాగిమేళవింపు లేకుండునెడల నాణెమున కది యంతగా నుపయోగింపదు. పేకకంటెఁ బడుగు మోటుగ లేకున్న బట్ట బాగుగ మనదు. అటులే జనుని మనసుగూడఁ గొంత నసత్యముతోఁ గూడి యున్నగాని వైహికపుటూగులాటలకు రాపిళ్లకు నాగదు. మిగుల మెత్తనయగునెడల మిగుల బట్టబయలగు నెడల నది గొల్లవారి కెరవై పోవును. హాస్యాస్పదమై నిందాపాత్రమై పోవును. కాసంత మాటుండవలయును. కాసంత గాటుండవలయును. ఎంతసౌందర్యవతియైన నరే! కాసంత బిగింపు, కాసంత కొంకుకొంకు, కాసంత ధూర్తత్వము, కాసంత నిగ్లత్యము, అవయవగోపనమునఁ గాసంత కట్టుదిట్టము లేని దైనయెడల జనప్రేమాస్పదురాలు కానేరదు. సరేకదా! త్వరగ నిందాపాత్రురాలగును. అదిగాక జనమధ్యమున నామె దక్కలేదు కూడను. తేనెటీగకు ముల్లులేనియెడల క్షుద్బాధచే నొకదినములోనే చచ్చును. గొఱ్ఱెలమందలోఁ గుక్క లేనియెడల మంద చిందఱవందఱ యగును. ప్రపంచవ్యవహారములందు సత్య మసత్యముతోఁ గొంతయైనఁ గలిపి యుండవలయును. పట్టి సత్యము ఒక్కనేరదు. వర్తకుల ప్రకటనదర్పములు వేషజతంత్రపువీరాలాపములు గ్రంథకర్తల గ్రంథములఁగూర్చిన

స్తుతివాక్యప్రపంచములు మొదలగునవి యిందులకు నిదర్శనములు.

Truth may perhaps come to the price of a pearl that showeth best by day but it will not rise to the price of a diamond or carbuncle that showeth best in varied lights అని Bacon చెప్పినాడు. ఆ ప్రాపంచికదృష్టిని జూడ సత్యము మిక్కిలి శ్లాఘ్యమైనదిగనే కనబడును. కాని యది ప్రపంచవ్యాపారోపయోగ దృష్టితో జూడ దానివిలువ తగ్గుచున్నది. ప్రపంచవ్యవహారములందలి జయమునకు గొంత కనుగప్పు, తలపులుముట, పైతళుకు, మాటుం దనపులీటు మొదలగునవి కావలయును. ఇట్టి దొంగగోటులు, శుద్ధ సత్యము చూపజాలదు. అది యసత్యముచే గొంతసాంకర్యము నొంద వలయును. పొత్తైనూలుకలసిన గుడ్డవున్న తళుకు, మన్నిక, వట్టిపొత్తు గుడ్డ కుండదు. కఱ్ఱసాములో నటుచూపి యిటు చూపి యటుకొట్టు వానికి జయము చేకూరును. సత్యాసత్యసమ్మేళనము ప్రపంచయాత్రా సముపాయప్రదమని యూహించి జనులు బహుళముగా నట్లుచేయు దురు. ఇట్టి జనుల గౌరవమును భాగ్యమును కీర్తియు జూచి వారిస్థితిని దాముగూడ బొందవలయునని కొందఱు పాటుపడుచున్నారు. కాని సత్యమును గనుగొనుటకు దానిని హెచ్చుతగ్గులు లేకుండ సందర్భముగ నసత్యముతో మేళవించుటకు దానిని వెల్లడిపఱచి కార్యముల సాధించుకొనుటకు శక్తిగాని యోరిమిగాని లేక వారసత్యమునకే మఱి కొన్నివన్నెలు చిన్నెలు కల్పించి, వివిధవర్ణదీపికాకాంతిని దాని నింద్ర ధనుఃకళికను జేసి జనుల నేత్రములను మనస్సుల నాకర్షించుచున్నారు. ఇది వట్టి కనుకట్టు, ఇంద్రజాలము, పైకిబొట్టు—లోపలలొట్ట, మీదికి హొన్ను, లోన మన్ను, బట్ట మందిరములకు బ్రత్యక్ష మందిరము లందవు. డాగురేకుగద్దెపై 'పీకాకు' సింహాసనము దిగదుడుపు పూస కొంతలముందు బుటేదారు జలతారుకోటులు పనికిరావు. తారను వల పించిన శీతాంశునికంటె చీనారేకుశీతాంశుడు దెక్కువసొగసుగ నుండును. ఈ 'కోహినూరులు' నీ 'టాజ్ మహాలులు' నీ నిశాధిపతులు నిశాకాల మందుమాత్రమే! సత్యసూర్యోదయమగు వెంటనే యివియన్నియు దేవదారు పెట్టెలు కాగితపుతట్టలు సవరాలబుట్టలు అయిననేమి? నాటకుల పెట్టెలలోని రూపాయలు పాదరసపురూపాయలుకావు. ఇండ్లలోని

భార్యలు గొరుగుడుమీసములవారు కారు. సత్యాసత్యసమ్మేళనమునుండి
జను లిట్లు కేవలమగు నసత్యప్రయోగమునకై దిగిపోయిరి. ఎందువలన?
ధనమునందలి కాంక్షచేత—బ్రతుకునందలి పామరతచేత—

పొట్టకూటికై జనులు కొంద ఱిట్లసత్యకథన మవలంబించియుండ
నోటిమాటకై కొందఱందులకుఁ గక్కుఱ్ఱిపడుచున్నారు. పడలరుచికై
కొత్తిమిరికలిపినట్లు గమగమకై యింగువపలుకు కూరలవైచినట్లు
మాటలపొంకమునకై వీరు వానితో నసత్యముఁ గొంత మేళవించు
చున్నారు. తమమాటలలోని పాకముచే రసముచేఁ బాకపు పరిమళ
ముచే జనులకు నోరూరఁజేయవలయునని వీరిముఖ్యాభిసంధి. అతిథులకుఁ
బదార్థములు వడ్డించుటయందుఁగూడ వీరికిఁ జాకచక్యమును హెచ్చు.
ఈవచఃపాచకుల రుచిచే సత్యము వట్టిచప్పనిది. అరఁటిదూట అయిన
నేమి? ఆదూటనే సన్నగఁ దరిగి యథార్థరసమును బిడిచివైచి గిన్నెలో
సొగసుగ, దోరగ ముకురంధ్రములు కృతార్థములగునట్లు మిరప
కాయలు పోగపుగింజలు మరికొన్నివైచి వేచి తరుణముకని పెట్టి, యా
గాటు కమ్మఁదనముల గనిలో నాముద్దను బడవైచి, పరిమళము పైకి
పోకుండ మూఁతనిడి తఱచు కలియఁబెట్టి చిక్కనిపులుసుచే దానిపైఁ
గొంత చిలకరించి పసుపుచే దానికి సౌభాగ్యమిచ్చి బుట్టలోనిదికూడఁ
గొంతఁ బొందుపరచి దింపి పత్రమునఁ బరిమార్జనమొనర్చి యట్టికా
కుండ మోతాదుగ నావఁ దగిల్చినయెడల వహావ్వా! జిహ్వకుఁ దారక
మంత్రోపదేశము కలియుగామృతము చేయవచ్చునని వీరినమ్మకము.
వీరు తఱచుగ నడిమివయసు దాఁటినవారు. వీరు ప్రాయికముఁ
బూర్వగాథలనే పలుకుచుందురు. తాను గాశికిఁ బోయినప్పుడు హిమా
లయప్రాంతముననున్న యొకమహర్షి పందెమువైచి దుండివిఘ్నేశ్వరుని
తొండ మల్లలాడింపఁ జేసినాఁడనియు నేదుకొండలవెంకన్నకు మండప
మును కట్టించిన బోగముది ప్రతిరాత్రియుఁ దములపాకుల చిలుకలు
చుట్టి స్వామి కర్పించుననియు "నానాగత్తరలో, రెండుతలల సన్యాసి
యొకఁడు గంగనుండి వచ్చి యర్ధవితంతువురూపమున నర్ధసన్యాసిరూప
ముగ నట్టె విడిపోయినాఁడనియు, సంగతులపై సంగతులు, కల్పనలపైఁ
గల్పనలు, వివిధజాతుల సొగసులతో వినిపించుచుందురు. శబ్దముల
పొందిక తప్ప యర్థసందర్భముతో నిమిత్తములేని యథమకవులకు వీరు

జ్యేష్ఠభార్యాశ్రితలనిపించుకొనఁగలరు. వారికి వీరికిఁగూడఁ గల్పనలన్నియు
నసత్యములు, నస్వభావములే! రాత్రిభోజన మగుపిదప వీరు చుట్టలు
గాల్చుచునో, నల్లమందు పట్టిచ్చినతరువాతనో, యజ్ఞ బాలవృద్ధ వితంతు
సభాగ్రాసనాధిపత్యోపన్యాస మారంభింతురు.

పరులుచెవులు నిగుడఁజేయుటకై వీరు స్వాత్మలను గ్రిందికిఁ ద్రోచు
కొనుచున్నారు. వృద్ధవేశ్యలు గోరింటాకు రక్తిమచేతను, మొగము
మెఱుఁగుల నునుపులచేతను, దుప్పికొప్పుముడ్లచేతను, జ్ఞానశూన్యమగు
విటజనము నాకర్షించుకొనఁగఁ బడుపాటు లీపచన ప్రబంధకవుల పాటుల
కందవు. వీరు రాయబారపుపనులకు బొత్తుగఁ బనికిరానివారు. వీరి నందు
లకై యుపయోగించునెడల నిక్కడిమాట లక్కడినవలతో, నక్కడి
మాట లిక్కడినవలతోఁ గార్యమును గడతేర్తురు.

వినోదమునకై యసత్యమును వీరిట్లాడుచుండ మఱియొకరు యందు
లకై కొంద ఱింతకుమించిన నసత్యమును లాడుచున్నారు. వీరు పైవారి
వలె వయసుగడచినవారుకారు. పడుచువాండ్రు, నడిమివయసువారు.
వారివలె పూర్వవిద్యలేకాని యాధునికవిద్యలు లేనివారుకారు. కల
వారు. వారివలె సత్యాధికత నసత్యాధమత నెఱుఁగనివారు. ఎఱిఁగిన
వారు. వారివలె నాగరికత లేనివారుకారు. కలవారు. వారివలె నజ్ఞులతో
సంభాషించువారుకారు. విజ్ఞులతో సంభాషించువారు. వారివలెఁ దెట్టియ
సత్యము లాడువారుకారు. వారికంటె నెక్కువగ గడుసగు నసత్యము
లాడువారు. వారివలె నల్లమందుపట్టుచేతను జుట్టకైపు సొగసుచేతను
బలుకువారు కారు, ఎఱిఁగియుండి విద్యావైభవముచేఁ బలుకువారు.
వారివలెఁ దాత్కాలిక వినోదమునకై కల్లలాడువారుకారు. శాశ్వత
గౌరవమునకై యాడువారు. ఆ! ఏమివింత? ఇట్టివా రున్నారా?
ఉన్నారు. ఏక్కడ? ఎక్కడఁ జూచిన నక్కడే! వారి ప్రతిభయే
యిప్పుడు ప్రబలముగ నున్నది. ఆధునిక విద్యాభ్యాసనముచే నవనాగర
కతాసమాలబ్ధ సంస్కారముచే నూతనాభ్యస్తవిజాతి మర్యాదపరంపరచే
వీరపూర్వముగఁ బ్రకాశించుచున్నారు. వీరు వీథిలోనఁ దటస్థునైనఁ
గాని సామాన్యశత్రువునైనఁగాని చూచినతోడనే యేమి సమావేశ
సంభ్రమములు! ఏమి మందహాసవిజృంభణములు! ఏమి హస్తచాలనచాక
చక్యములు. ఏమి నమస్కృత్యర్పణ స్వీకారవైభవములు. ఏమి సల్లాప

వచఃకలాపనైపుణులు. ఇద్దఱట్టెముట్టె పఱిచేర కలసిమెలసి ప్రత్యక్ష
ముగ నేకశరీరధారు లయిపోదురేమో యని పైవారికిఁ దోఁచునట్లు
వీరి యాంతరానురాగప్రేరిత బహిశ్చేష్టాసముదాయము కనఁబడును.
ఒకనాఁడు నేనొక గొప్పయుద్యోగియింటికి—భూతవైద్యమని తేలఁగఁ
జెప్పఁ దగదు. 'మెస్మరిజము'నకై పోయితిని. ఆతఁడు నేను మాటలాడు
కొనుచుండఁగా నొక్క సేవకుఁడు వచ్చి యొకతెల్లనిచీటిముక్క నాతని
చేతఁ బెట్టెను. దాని నాతఁడు చూచి కొఱకొఱలాడి గఱ్ఱుమని నాతో
నిట్లనియెను. నా కీతఁడు ప్రబలశత్రుఁడు. ఈతఁడు నేనుగూడ Chair-
man పనికి stand అయితిమి. అందులో మాబలాబలములేవో చూచు
కొనవలయునా? నేను వేశ్య నుంచుకొంటిననియు నది నా పేరిట లంచము
తీసికొనుచున్నదనియు నీచండాలుఁడా కాశీరామన్నయర్జీని నాపైయధి
కారికిచ్చినాఁడు, మఱియొకని కట్టిపనిచేయుటకై interest లేదులెండి,
నేనూరకుండువాఁడనా? ఈతఁడు వెనుక గోదావరివంతెనపనిలో వ్రాసిన
తప్పులెక్కలన్ని పెట్టి త్రాడు తెంచుటకు సిద్ధముగనున్నాను. ఆపనిచేతనే
మూఁడురాత్రులనుండి యొక్క Pink అయినను లేదు. అని యింక నే
మేమో చెప్పుచుండఁగా టక్కుటక్కుమను కాలిజోడుతోఁ దళుకుతళుకు
మను కంటిజోడుతో హాహాయను గల్లగుల్లనవ్వు గోడుతో 'well my
dear friend' అనుచు లోని కాతఁడే వచ్చెను. నాతో నిన్ని మాటలా
డిన యుద్యోగి తటాలునలేచి యొడలు తెలియని తీవ్రతచే ముందున
కొకగంతువైచెను. ఆతనిఁ గలియఁబడి కొట్టుననుకొంటిని. తన రెండు
చేతులతో నాతనిచేతినిబట్టి యూఁపుచు I am my dear friend so
very glad to see you అనుచు వెఱ్ఱినవ్వుచే వెకవెకలాడుచుండెను.
విద్యావంతులు బుద్ధిమంతులగు వీరిద్దఱు లేనిప్రేమములు గనఁబఱచి రాని
నవ్వులు తెచ్చుకొని యొకనినొకఁడు మోసముచేయుటకుఁ బొట్లుపడు
చుండఁజూచుట నామనసునకురోఁతయగుటచే 'రానియేడ్పు నేనుమాత్ర
మేల తెచ్చికొనఁగూడ' దని బొరుమని యేడ్చుచుఁ గడుపునొప్పిగా
నున్నదని సంజ్ఞచేఁ గనఁబఱచుచు నాఁటికిఁ జారిపోయితిని. ఒకలక్షాధి
కారి యొకసారి యయోధ్యలో తనగుమ్మమునఁ గూర్చుండ నేనాతని
యొద్దకుఁ బోయి వినయముతో రయిలుఖర్చున కొక్కరూపాయ నిమ్మని
యడిగితిని. నేను దొంగనేమోయని యెంచి కాఁబోలు నన్ను గ్రుచ్చి

గ్రుచ్చి యనేకాంశమును లడిగెను. నామరాణ్యాదనుగూర్చి యాతఁడు సంతుష్టిపడెను. ఏమైన నిచ్చునని చేయిచాచితిని. My friend, I very much regret my inability to help you అని నాకంటె దిక్కుమాలిన దైన మొగము పెట్టుకొని యనెను. అంత నేనోడలు మండినవాఁడ నైన నాయేడ్పు చల్లార్చుటకేమైన నీయవలదు. నాయేడ్పునుమించిన నీయేడ్పు చల్లార్చుకొనుటకైన నేమైన నిమ్మంటిని. అంత నాతఁడు గొణుగుకొనుచు లోనికిఁ బోయెను.

న్యాయవాది యొకఁడు సభలో నెదుటి న్యాయవాదిపై బండ్లు కొఱుకుచు నాతనిఁ జంపునంతటి తాత్కాలికకోపమున నుండుచున్న వాఁడై I beg to differ from my learned friend అని పలుకును. శబ్దములకు నైఘంటికార్థములు నశించినవి. ఇప్పటి regret కు విచార మని యర్థము కాదు. glad కు సంతోషమని యర్థముకాదు. learned కు పండితుఁడైన యని యర్థము కాదు. beg అనుదానికిఁ బ్రార్థించుట యర్థము కాదు మనుజుల క్రొత్తపద్ధతుల ననుసరించి మాటలకుఁ గ్రొత్త యర్థములు వచ్చుచున్నవి. ప్రపంచమున నింతబహుళముగ నుప యోగపరచఁబడు నీ regret ఈ glad యథార్థములయినచో నింత కంటెఁ గావలసినదేమి? ఈదయాళుత యీసహానుభూతి యీయాపద్ద ర్శనాసహిష్ణుత—ప్రజలలో నుండునెడల నీభూమియే స్వర్గాధికమైనది కాదా? అట్లయగునెడల నీవ్యాజ్యము లెందులకు? ఈచోరత్వము లెందులకు? ఈక్షామబాధ లెందులకు? ఈనరహత్య లెందులకు? ఈఘోరయుద్ధము లెందులకు? వానిని మించిన మనస్సంక్షోభము లెందులకు? మాకుక్కకు జబ్బుగా నున్నదని నేనొక పెద్దమనుష్యుని కుత్తరము వ్రాసితిని. ఈవార్త విని నప్పటినుండియుఁ దనకేమియు దోఁచుట లేదనియు మతిలేకుండ నున్నాననియు నెప్పటిక్షేమ మప్పుడు తెలియఁ బరచుచుండవలయు ననియు నాకుఁ దిరుగ నాతనియొద్దనుండి యుత్త రము వచ్చినది. ఆతఁడు తండ్రి చచ్చినప్పుడైనఁ గంట నీరు పెట్టకుండిన వాఁడని నేనెఱుఁగుదును. నేడు నాకుక్క తనతండ్రికంటెఁ దనకెక్కు వగుట యథార్థమగునా? మతిలేక యుండువాఁ డున్మత్తాలయములో మందుతీసికొనవలయునుగాని వ్యాపారములలో రూపాయకు మూఁడు ప్రాతడబ్బుల వారపువడ్డి యేలతీసుకొనవలయును. బ్రదుకిచ్చిన

భగవంతునికైన నమస్కరింపనివారు పోషణము పట్టిచ్చిన శాస్త్రిని thank you very much అని పదేపదే ప్రస్తుతించుచున్నారు. ఈ యూహాపోహము లేమిటో యీమాటలేమిటో యీచేష్టలేమిటో శ్రుతిలో గాత్రము గలియదు. గాత్రధ్వని తాళముతోఁ గలియదు.

మనపూర్వులు సత్యదీక్షకలవారు. వారిలో నసత్యవాదులు లేరని యెవ్వరును జెప్పరు. కాని, యిట్టి జనసామాన్యసత్యము, నిట్టి స్వల్పహేతుకాసత్యము, నిట్టి సత్యవాక్యభీరుతాప్రేరితాసత్యము మాత్రము వారితో నెన్నడు లేదు. వారు తలచుగ జిహ్వయందు ధారాళమగు సత్యమును జిత్తమందు వెనుదీయని ధైర్యము గలవా రనుట కేమియు సందియము లేదు. ఇప్పటివారివలె నాలాపమార్దవమున కసత్యమాడిన వారు కారు. మర్యాదకొఱకాడినవారు కారు. నడతయోగ్యతను దెలుపుటకాడినవారు కారు. ప్రచారప్రక్రమము కొఱకాడినవారు కారు. ప్రజాసంతోషముకొఱకాడినవారుకారు. భయస్వభావమున నాడినవారు కారు. సత్యమాడవలయునను నియమముచే వారు సత్యమాడిరి. కాని కొంచెము మోటుతనము గలవారైనను కఠోరవాదులని వారనిపించుకొనలేదు. మనము శబ్దమార్దవములకొఱకు శాసనధిక్కారమును జేయుచున్నాము. స్వల్పమర్యాదకొఱకు పెద్దమర్యాదల మీరుచున్నాము. ఒకని చెవులకు సంతోషము నీయఁదలఁచిన మన మనస్సాక్షికి బాధ నిచ్చుచున్నాము. ఒకని చిత్తమునకుఁ దాత్కాలికశాంతి నీయఁ దలఁచి మన యాత్మకు శాశ్వతదుఃఖము నిచ్చుచున్నాము. జడువఁదగిన భగవంతునికి జడువక, జడువఁగూడని మనుజునికి జడియుచున్నాము. ఎంతసేపు నటనము, నభినయము, మాఱువేషము, దొంగమాట, కల్లగంతు— ఇవితప్ప మన ప్రస్తుతచర్యలో నింతకంటె వేఱేమున్నది. సత్యవాక్యమునకు సత్యప్రవర్తనమునకు భంగము రాకుండునంతవఱకు మన మెంత మార్దవముగ నెంతజనరంజకముగ మాటలాడినను దప్పులేదు. కాని, దేనికొఱకు బ్రతుకుచుంటిమో, దేనిఁబట్టి తరింపఁ దలఁచితిమో, యేది జగదాధారమో, యేది దైవస్వరూపమో, యట్టిసత్యమునకే నాశనము గలుగుట సంభవించుచుండ, మన కల్లనవ్వులు మన వంకదండములు, మన నాలుకకొనపలుకులు, మన కపటాలింగనములు, మన తేర యేడుపులు, మనల రక్షింపఁగలవా? మర్యాదకొఱకు తెచ్చుకొనిన యీసందర్భ

ప్రవర్తనమున కింతలో శాంతిఁ జెప్పక నిరంతరముగ దానినే పారాయణ మొనర్చుచో మన మనుమల మనుమ లేడ్చుచు, గర్భాధానములొనర్చువారు, నవ్వుచు నరహత్యలు సేయువారగుట కేమైన సందియమున్నదా! అట్టిభవిష్యత్ఫలాగమమునకు బీజారోపణ మిప్పుడే మనతత్వము లోనయినట్లు కనఁబడుచున్నదే! సాలగ్రామతీర్థములలో సౌవీరపాషాణముఁ గలుపువారు వేదపాఠములోఁ గళాశాస్త్రాధ్యయనము చేయించువారు మనకడుపులఁ బుట్టునట్లు మన మేల నడువవలయును. అట్టిపిశాచపువవ్వులు మొసలియేడ్పులు రాక్షసచేష్టలు గలుగు సందిగ్ధమనుజ జన్మములకుఁ బితామహులము, వృద్ధప్రపితామహులము మన మేల కావలయును.

మర్యాదకొఱకు మహనీయులు గొందఱట్లు కల్లలాడుచుండఁగ మఱికొంద ఱూరక కల్లలాడుచున్నారు. తలుపుతీసి లోనికి వచ్చుచున్న యాతఁ డెవఁడో తెలియక "యెవరువా" రని యొకఁ డడుగ లోనికి వచ్చుచున్నవాఁడు "ఎవ్వరులే" యని ప్రత్యుత్తరమిచ్చును. ఏమిఁటి వ్రాయుచున్నా" వని యొకని మనమడుగ "నేమియులే" దని ప్రత్యుత్తరమిచ్చును. ఇటులే "ఏమిచేయుచున్నావు" అను ప్రశ్నమున "కేమిలే" దను నుత్తరము వచ్చును. "బయలుదేరినవాఁడవు తీరవెళ్లక తిరిగి వచ్చితివేల" యను ప్రశ్నకు "నేమియులేదు ఊరకే" యను నుత్తరము వచ్చును. ఇటు లెన్ని దృష్టాంతములు చెప్పవలయును. పోనీ! అడిగిన ప్రశ్నమున కుత్తర మేదైన రహస్య మేమో దానిని జెప్పుట కిష్టము కాక "యేమియులే" దనుచున్నాఁడేమో యని యూహించుకొందమన్న నట్టి రహస్య మేమియుఁగూడ లేదు. ప్రత్యుత్తరము చెప్పుట చాలాసేపు పట్టునేమో యనుకొనిన నదియుఁ గాదు. ప్రశ్నించువానిపైఁ జెప్పువానికి శత్రుత్వమేమోయని యూహింప నదియులేదు. అట్టిచోఁ బ్రశ్నమునకై తఱచుగ నవకాశముండదు. కారణ మేమియు గోచరింపదు కాని యసత్యమువూత్ర మాతఁడు పలుకుట సత్యము విసుగుఁదలయో నోరు నొప్పియో మఱియేహేతువో తెలిసికొనఁగోరి యాతనినే యడుగ "నేమియులే" దని యాతఁడు చెప్పును. ఆతనికిఁ గూడఁ దెలియని కారణ మేదైన నుండునేమో! స్థూలదృష్టిచేఁ బరికింపఁగ మాత్రము వృథగ నిట్టిపను లసత్యమాడునట్లు కనఁబడుచున్నవి. నాయనలారా! చెప్పవలసిన యంశములు ముందుపన్యాసమునఁ జెప్పెదను.

# సాక్షి

## రంజాన్ పండుగ - వినాయకచతుర్థి

జంఘాలశాస్త్రి యిట్లు పలికెను.

ఈనడుమఁ గార్యాంతరమున సాక్షియు నేనును హైదరాబాదునకు వెళ్లవలసివచ్చెను. అందుచే మాసభావ్యాపారము వర్షకాలపు జదువువలె వెనుకఁ బట్టినది. ఇంకను గొలఁది దినములు హైదరాబాదునందుండవలసిన యావశ్యకత యుండెనుగాని, బొఱ్ఱయ్యసెట్టికి రోగము హెచ్చుగనున్నదని మాకాలాచార్యులిచ్చిన తంత్రీవార్తపై నింతశీఘ్రముగ నిటకు రావలసివచ్చినది. నిన్న రాత్రి నేనును సాక్షియు ధూమశకట మెక్కితిమి. మే మెక్కినబండియఱలో నదివఱకే యొక మహమ్మదీయుఁడును, నొక బ్రాహ్మణుఁడును మాటలాడుకొనుచుండిరి. మహమ్మదీయుఁడు నల్లనివాఁడు, పడుచువాఁడు, పొట్టివాఁడు. నున్నగ గొఱిగించిన తలపై రోకటిపొన్నువలె బింకముగ నదుకుకొనిన చిన్నకుళ్లాయి గలవాఁడు. పెండ్లికాలమందు వరున కొసఁగఁబడు నెఱ్ఱచారల పంచెను గూడకట్టు గట్టుకొనినాఁడు. కేవల చుబుకప్రదేశము మాత్రమె తఱ కునికత్తి కఠినమగుటచేత గండభాగముల వెండ్రుకలు నిర్భీతిగ దిగఁబెరిగి యాఁదోఁకవాటముగఁ గ్రమక్రమముగ సన్నగిల్లి కొసదేరినవి. నడుమ గడ్డము తాండ్రబెత్తువలె బింకముగ నున్నది. ఆ మొగమును వాణీదాసుఁడే చూచినయెడల దానినిట్లు మంగళమహాశ్రీవృత్తమున వర్ణించియుండును. తలనున్న వెండ్రుక లంబట్టని యాయుధమునకు జడిసినవై తలచూపనొల్లక యెదుగు స్వభావము నడపలేని కారణమున లోపలకుఁ బెరిగినవి. కంటిగోతులయొద్దకు వచ్చి యాఁగి వానిలోఁబడి

పోవుదు మనుభీతిచేఁ బైకిఁ గనుబొమ్మలుగఁ గొంచె మేర్పడి యంత నంతర్వాహినియై పోయెను. లోపల నిట్లభివృద్ధి నొందుచు నో రను భయంకరగహ్వరము నొద్దకు వచ్చి యట్టె యాగిపోయి తిరుగఁ బైకుబికి మీసములుగఁ గొంచెమేర్పడి వానికొనలనుండి యుబుకు వేగ ముచేఁ గొంచెము పైకెగసినను జట్టున దిగజాఱి యీప్రక్క కొక ప్రవాహ మాప్రక్క కొకప్రవాహమై విడిచిపోయెను. అందుచేతనే గడ్డమను నిసుకతిప్ప యానడుమ నుండుటకుఁ గారణమైనది. అని స్వభా వాలంకారసహితోత్ప్రేక్షాసమన్వితముగఁ జమత్కరించియుందును. ఆ మహమ్మదీయునితో మాటలాడు బ్రాహ్మణుఁడు గొంచెము కాలము గడ చినవాఁడు; మెడలో స్ఫటికమాల కలవాఁడు. అతఁడు ప్రథమశాఖ బ్రాహ్మణుఁడని నేను గొంతసేపటికిఁ గనిపెట్టితిని. వారిద్దఱు మమ్ము జూచి కొంతసేపు వారిమాటలఁగట్టిపెట్టిరి. సాక్షి వెంటనే పండుకొనెను. నేనుగూడ నడుమువాల్చి కనులుమూసితిని. కాని నాకు నిద్ర రాలేదు. మేలుకొంటినని వారికిఁ దెలిసినయెడల వారు స్వేచ్ఛగ మాటలాడుకొన రేమోయని యోచించి నేను నిద్రను నటించితిని. వారిట్లు రైలుధ్వనిలో గట్టిగ మాటలాడుకొనుచుండిరి.

మహ—నలుపు తెలుపని యేమిటి చెప్పినారు?

బ్రాహ్మ—యజస్సు.

మహ—తెలియలేదు; యేమిటి ?

బ్రాహ్మ—అది వేదములో నొకశాఖ.

మహ—వేదమనఁగా మీఖొరానేనా ? వేదమునకు నలుపేమిటి తెలుపేమిటండి!

బ్రాహ్మ—ఏమిటని ప్రశ్నింపకూడదు. మామతములో నున్న కట్టుదిట్టమదే!

మహ—సరే నాకెందుకు! నలుపుగొప్పా తెలుఁపుగొప్పా!

బ్రాహ్మ—తెలుపు గొప్పకాదా! పక్షిరాజమైన హంస తెలుపు; మృగరాజమైన సింహము తెలుపు; మణిరాజమైన వజ్రము తెలుపు; హస్తిరాజమైన యైరావతము తెలుపు; వృక్షరాజమైన కల్పవృక్షము తెలుపు; దేవరాజగు దేవేంద్రుఁడు తెలుపు.

మహ—అదేమిమాటండి. పాల"దర్యామీఁదబిచానా" (పాల

సముద్రమున ప్రక్క వేసినవాఁడు నలుపా? తెలుపా?

బ్రాహ్మ—అబ్బో! మీ రీరహస్య మెఱుఁగుదురా? అతఁడు నలుపే కాని యతనికంటె ఘనుఁడగు శంకరుఁడు తెలుపు.

మహా—మీకు మతిలేదా? ఇన్ని దేవు లేమిటి?

బ్రాహ్మ—ఆప్రశ్నలలో దిగకుఁడు. దైవశోధనము తప్పు. రయిలుహోరుచే వారిమాటలు నాకేమియు వినఁబడుటలేదు. అంత శ్రద్ధగవినుటకు వారి సంభాషణమున రుచియేమియుఁ గనబడలేదు. అంత వీరిద్దఱసంగతి యాలోచించుకొనుచు నిద్రించితిని. ఒకకలఁ గాంచితిని. అదియొక పెద్దపట్టణము. హయిదరాబాదువలె నుండెను గాని యది కాదు. నేనాపట్టణమున కేలపోయితినో నాకుఁ దెలియలేదు కాని దానిపెద్దయంగడిలో నిలువఁబడితిని. డప్పులచప్పుడు లగుచున్నవి. కాహళుల రవళులు గుండ్రగుండ్రముగఁ దిరుగుచుఁ బైకిపోవుచున్నవి. నౌబత్తులధ్వనులు నాల్గువైపుల వ్యాపించి మాఱుమ్రోఁత లిచ్చుచున్నవి. హిందూస్థానీబాణిగ సన్నాయిపాట వినఁబడుచున్నది. సారంగ ధ్వనులు మృదంగరవములు ముఖవీణానినాదములు పెల్లగుచున్నవి. ఈయుత్సవమున కేమికారణమని యటనున్న యొకనిని నేనడిగితిని. అతఁడు మంచిదుస్తులు ధరించి నాకు సమీపముననున్న కోమటిదుకాణమున నగరుపుల్లలఁ గొనుచున్నాఁడు. నాప్రశ్నమును వినినతోడనే యాతఁడు రోషకషాయితనేత్రుఁడయి నీవేమి "కాఫరువా" మహమ్మదీయవంశమున జన్మించిన నీ వీసందడి యేలజరుగుచున్నదో యెఱుఁగవా? యని నన్ను గద్దఱించెను. అతనిమాటలను విని తెల్లపోయి నిలువఁబడితిని. నేను గట్టుకొనిన రుద్రాక్షయంచుదోవతి బిళ్లకచ్చలతోడి దేమైపోయెనో కాని దానిస్థానమున వదులుకాళుల తెల్లని యిజారుండెను. జన్నిద మేమయ్యెనోయని తడిమిచూచుకొనఁగ నది యాలాగునకు బొందుగ బంధింపఁబడియుండెను. నాతలనున్న చిన్న జుట్టుపిలక బుడుక్కున నాతలలో దూరిపోయి యట్టె గడ్డముమీఁద నడుగుపొడుగుతో వ్రేలాడుచుఁ గితకితలాడఁ జేయుచుండెను. శిష్టు జంఘాలశాస్త్రి తళుకుమనునంతలో షేకు జంఘాల సాహేబయ్యెను. "సలామలే" కనుచు నాతఁడు నాచేతినిబట్టుకొని యాయుత్సవము లోనికి గీసికొనిపోఁ బ్రయత్నించెను. నేనిట్లు తురకనగుటకుఁ గారణ

మేమోయని లోపల గింజుకొని చచ్చుచుంటిని. క్రొత్తగవచ్చిన వెండ్రుక లగుటచేఁగాఁబోలు, గడ్డము కొంచెము దురదగనున్నది. నాతల మా మేనత్తతలవలె నుండెను. తురకనగుట స్పష్టముగఁ గానఁబడుచున్నది. ఇది కలగాని సత్యముగాదని తలఁచుచు మనస్సును శాంతిపఱచుకొంటిని. కాని యాశాంతి నిలువఁబడకున్నది. అయ్యయ్యో! వేదవిహిత కర్మము లడుగంటెనని లోలో నుడికి యేడ్చుచుంటిని. మొగ మింతటి నుండి క్రిందినుండి పైకిఁ గడుగుకొనవలయును గాఁబోలు. వ్రాఁత కుడి నుండి యెడమకు వ్రాయవలయును గాఁబోలు! అయ్యయ్యో! కాశీ రామేశ్వర యాత్ర మాని మక్కామదీనాలకుఁ బోవలయునుగాఁబోలు! మహేశ్వరదేవాలయమును వదలి మసీదులోనికిఁ బోవలయును గాఁబోలు! మూఁడువేళల సంధ్యనుమాని యయిదువేళల "నమాజు" చదువవలయును గాఁబోలు. దేవీనవరాత్రదీక్షమాని పీర్లదశరాత్రిదీక్ష చేయవలయును గాఁబోలు. శంకరగురుత్వమును ద్యజించి మహామ్మదు శిష్యుఁడనయితిని గాఁబోలు నా వికృతస్వరూపమును జూచి సాక్షి యేమనుకొనునో; వాణిదాసుఁడు కాలాచార్యులుచూచి నవ్వుదురేమో! నాభార్యయే నన్నింటికిఁ జేరనియ్యదేమో యని లోపల గుబ్బెటలు పడుచుంటిని. ఇంతయాందోళనముతో నున్నను నేను లోపల మట్టునకు జంఘాలశాస్త్రినను నమ్మకమే నాకుఁ బూర్ణముగాఁ గలిగి యుండెను. గడ్డమువచ్చినదిగాని జ్ఞప్తిపోయినదా? తలపై జుట్టెగిరి పోయెను గాని తలలోపలిబుద్ధి నశించినదా! అయ్యయ్యో? దర్భముడి యుంగరముతో నర్ఘ్యప్రదాన మొనర్పవలసిన ముండకొడుకును, బెడ్డముక్క చేతఁ బుచ్చుకొని మూత్రవిసర్జన మింకఁ జేయవలయును గాఁబోలు. ఒడలు తెలియని యాందోళనముతో హరహరా యని యఱచితిని. ఆమాట నానోరువిడుచుటయేమిటి రెండుచపేటము లూఁచి పుచ్చుకొని యాతురక నాకుఁ గటాక్షించుట యేమిటి? ఆదెబ్బలతోఁ గన్నులు జీఁకటులు పడినవి. తల దిరిగినది. అంతలోనే తిరుగ స్మృతిని దెచ్చుకొని రోషావేశమున నాతనిఁ గొట్టుటకూహించి కాలినున్న నేవ పల్లిలంక చెప్పులజోడు నొక్కటి తీసితిని. తీసిచూడఁగ నది "లూడి యానా" ఛడావయ్యెను. అంత మెత్తనిపాదరక్షతో నామొఱకు తురక పండ్లూడఁగొట్ట వీలులేదని తటపటాయించుచుఁ దలయెత్తి కొంచెము

చూచుచుండఁగ నుత్సవజనము మమ్ము సమీపించినది. భేరీధ్వనులతో జెవులు గింగురుమనుచున్నవి. అందఱు తురకలే! ఒక్కఁడైన హిందు వుఁడు లేఁడు. నేను తప్ప—నాయవస్థ యిటులున్నది.

"ఆబాబ్ షరాల్వీసాబ్" అనుచు నామహమ్మదీయు లందఱు నన్ను గౌరవించిరి. నాగుండెలలోఁ బెద్దఱాయి పడినది. ఇక్కడకు మ్లేచ్ఛత్వము సిద్ధాంతమని నిశ్చయపఱచుకొంటిని. నన్ను వట్టి పనికి మాలిన తురకగా భావింపక మతగురువులలో నొకఁడుగఁ గూడ వీరందఱు భావించుచున్నారు. అంత నొకశ్వేతవసనధారియగుముసలి ముసలమానుఁడొక్కఁడు నాయొద్దకు గౌరవపూర్వకముగ వచ్చి నా యెడమచేతిలో ఖొరాను నుంచెను. కుడిచేతిలో నొక పొడుగుపుల్ల నుంచెను. ఆపుల్లచివర బాలచంద్రాకృతిఁగల యొకరజతరేఖ కనఁబడును. వెఱ్ఱిమొగముపైచుకొని వారిపంక నటునిటు చూడనారంభించితిని. జల తారుపాగలో, జలతారుకుళ్లాయిలో ప్రతిమనుజునకుండెను. పొడుగు గడ్డాలవారు, పొట్టిగడ్డాలవారు, గరుసుగడ్డాలవారు, నలుపుగడ్డాల వారు, గోరంటాకుపైచిన గడ్డాలవారు, తెల్లగడ్డాలవారు, కరకకాయ రంగుగడ్డాలవారు, కంటిసుర్మాలవారు, గాజుకన్నులవారు, వడిప్రేతమీ సాలవారు, చెవులసందునఁ బెట్టిన పొగదేఱు నగరువత్తులవారు, నలుబది యేబది బొత్తాములకుఁ దక్కువలేని మొకమలు మొండిచొక్కాలు వారు, నర్ధచంద్రాకృతిఁగల జేబులవారు, వెండిపొన్నుల చేతికఱ్ఱలవారు, వింతవింతరంగులలాగులవారు, వెండిపొడుముడబ్బిలవారు, వివిధము లగు దేహచ్ఛాయలతో, నాకృతులతోఁ గానఁబడిరి. వివిధరూపలావణ్య యుక్తులగు మహమ్మదీయవేశ్యలయాటలు, పాటలు, కోలయాటలు, కారువాలు మొదలగునవి యాహ్లాదకరముగ నేయుండెను. ఏమియున్న నేమి? నామనస్సున కెంతమాత్రము స్తిమితతలేదు; చేతిలో ఖొరా నున్నదని యేడువనా? నెత్తిపై శివునివలె చంద్రరేఖయున్నదని సంత సింపనా? మహమ్మదీయశిఖామణిత్వము గలిగెనని సంతోషింపనా? మా మూలుశిఖ మట్టిలోఁగలిసెనని యేడ్వనా? మతము పోయినదని యేడ్వనా? బ్రతికియుంటినని సంతోషింపనా? నామన సప్పుడు పడిన యాందోళన మింతంతగాదు. వర్ణనాతీతము. అనుభవైకవేద్యము. వేల కొలఁదిగడము లిటు వెంబడింపఁగ నేనుముందుకు నిమ్మళముగ నడచిపోవు

చుంటిని. ఇట్లు మేము గొంతదూరము నడువగ మా కెడమప్రక్కగ నొకమసీదు కానఁబడెను. దానిలోని కందఱము ప్రవేశించితిమి. మార్కండేయాలయమా? ప్రదక్షిణమా? నందీశ్వరదర్శనమా? మహేశ్వరసేవయా? మారేడుపత్రిపూజయా? అభిషేకమా? విభూతిరేఖాధారణమా? దుర్గాదర్శనమా? కుంకుమస్వీకరణమా? శివపాదుకాగ్రహణమా? ఏమియు లేదు. ఎవరిమట్టునకు వారు, చేరుమాళ్లను గ్రింద బఱచుకొని చెవులలో వ్రేళ్లుగుక్కుకొని మోఁకాళ్లచిప్పలపైఁ గూరుచుండి నమాజును మొదలిడిరి. వారందఱట్లు చేయుచుండ వారిలో మౌల్వీపయి ఖొరానుభరానుషంగినగు నేనట్లుచేయకుంట మంచిదికాదని యెంచి ముక్కుగుడ్డపై ముంగాళ్లు మోపి కూలఁబడితిని. అలవాటు చొప్పున తూర్పుమొగముగఁ గూర్చుండఁబోయి నాశిష్యులందఱు పశ్చిమాభిముఖులై యుంటఁ జూచి నేనును వారివలెనే కూరుచుంటిని. పౌరోహిత్యపుఁ బీటనెక్కితిని కాని, పునస్సంధానపుమంత్రము చదువఁగలనా? కృష్ణవేష మమరినది కాని కేదారగౌళరాగము పాడఁగలనా? అయ్యయ్యో! నమశ్శివాయమంత్రము పఠింపఁగలను గాని, నమాజుమంత్రము పఠింపఁగలనా? సంభావనాపేక్షచే సభకు వచ్చిన బ్రాహ్మణశుంఠ మహదాశీర్వచనపుఁబనసను బఠించు వైదిక్కులతోఁ గంఠముకలిపి పెద్దసందడిలోఁ "బరమదయా కరయో" "యరలవమదనసయో" చదివి పరిసివారిపోవఁ జేయునట్లు నేను శివానందలహరియో, భజగోవిందశ్లోకములో చదివితిని. సంస్కృతభాషలో నేనిట్లొనర్చిన జాపననమాజు నెవ్వరును వినియుండలేదు. అది పూర్తియగు వెంటనే బ్రతికితినిరాయని తల తడిమిచూచుకొనుచు మహమ్మదీయవేద హిమధామరేఖాపాణినై మసీదు వెడలి మహాజనసంఘము వెంటాడింప వీథిలోనికి వచ్చి తిరుగ ముందునకుఁ బోవుచుంటిని.

అంతలో నెదురుగ వచ్చుచున్న దేవరయో చూచితిని. నిశ్చేష్టుఁడనైతిని. కొంతసేపటి కొడలు గడగడవడఁకఁజొచ్చెను. కన్నులవెంట బాష్పములు జొటజొట రాలఁ జొచ్చెను. దుఃఖ మాపుకొనుటకుఁ బ్రయత్నించుచుంటిని. గొంతు బిగిసికొనిపోవుచున్నట్లున్నది. ఎదుట వీరాంగపుమ్రోత యగుచున్నది. పుష్పభరితమగు ననంతశయన మొన మండ్రచే బహుకష్టమున మోసికొని మాకెదురుగఁ దేఁబడుచున్నది.

దానిలో నయ్యయ్యో! మన బొజ్జయ్యసెట్టి శిరఃకంపము చేయుచుఁ గూరుచుండెను. తలయొకప్రక్కకు వ్రాల్చఁబడియుండెను. నరవాహన గమనానుసారిగ నది తిర్యక్కంపన పునఃకంపన పశ్చాత్కంపన చక్రకంపనము లొందుచుండెను. ఆతనిని బ్రదికియుండఁగఁ జూడ నాకు ఋణము లేకపోయినదని విచారించితిని. కాని శవమైనఁ జూడనోచని సాక్షికంటె నేనే యదృష్టవంతుఁడనని యనుకొంటిని. సభయం దింక వ్యాపారాది విషయములనుగూర్చి యుపన్యాసము లీయఁగల మహానుభావుఁ డీతనితో సముఁడెవ్వఁడు దొరకఁడుగదాయని విలపించుచుంటిని. సభవారి కీతఁ డప్పుడప్పుడు స్వల్పప్రశ్నములనిచ్చుటఁగూడఁ వాడుకగలదు. సభాభవనపు బాడిగ నిచ్చుటకై యీతనియొద్ద నొకరూపాయను సాక్షి బదులుతెచ్చి నాఁడు. ఇతఁడింత యాకస్మికముగ నేల చావవలయునో నాకు బోధపడ లేదు. పోనీ స్వేచ్ఛానుసారముగఁ జచ్చినాఁడేమో ఇతనిశవముతోఁ గాలాచార్యులయినఁ వాణీదాసుఁడయిన నుండనక్కఱలేదా? వారిద్దఱు కనఁబడరు. ఇతఁడు మనసత్యపురములోఁ జావక మహమ్మదీయపట్టణమున నేలచావవలయును? అక్కడనే చచ్చియున్నవాని నింతదూరము మోసి కొనివచ్చుచున్నారా? ఇతఁడు వీరశైవుఁడు కావున వీరశయ్యనెక్కి నాఁడు. వీరాంగపుమోతలతో బయలుదేరినాఁడు. అంతవఱకు సందర్భ ముగానేయున్నది కాని యతఁడు బొజ్జయ్యసెట్టికాఁడేమో? ఆఁ! కాక పోవుటకూడనా? అవిగో తామరకోరములు కండూతిఖండనకాల్పనికకర ములు! ఆతని కిటునటు నిరంకుశదీప్తిచే వెలుఁగుచున్నవి. తన్నుఁ బదు గురుగాని మోయలేరను సంగతి వెల్లడించుటకై వాని నట్లుంచినట్లు న్నది. అతనియొడ లెంతమాత్రము నొక్కలేదు. నిండుగనున్న కడుపు పై దామరడాగులు మాత్రము భూగోళపుఁ బ్రతిమపై వివిధదేశముల వింతవింతరంగులతో నదుల నల్లనిచారలతోఁ బర్వతముల గొంగళి పురుగుపట్టెలతో ?నడుమ నిగనిగలాడు దేహచ్ఛాయాసముద్రముతో ద్వీపభ్రమనిచ్చు జీడిప్రేతలమచ్చలతోఁ బ్రకాశించుచున్నవి. బొజ్జయ్య సెట్టి దురదచే మరణించినాఁడు.

నేనిట్లు తురకచేత మరణించితిని. సాక్షి జాడ లేనేలేదు. ఇఁకసత్య పురసంఘము చల్లారిపోవును కాఁబోలునని ఖేదపడుచుంటిని. ఇన్ని యోచన లిన్నియును నాహృదయమున నొక్కతెప్పపాటులోఁ గలిగినవి.

నా మొగమందలి దుఃఖచిహ్నములు, నామిత్రు లెవ్వరయిన జూచుచుండిరేమో యని నేను వారందఱివంక నొకమాఱు చూచి చూడనట్లు చూచితిని. వారందఱు రౌద్రమూర్తులై యున్నారు. పండ్లు కొరుకుకొనుచున్నారు. గడ్డముల లాగికొనుచున్నారు. కాళ్లు నేలనడచుచున్నారు. చేతికఱ్ఱలు పైకెత్తి యాగుఁడాగుఁడని బెదరించుచున్నారు. వీరాంగము వాయించు మంగళ్లను "మార్ డాలో" యని కేకలువైచుచున్నారు. కోపముచే నూపిరిసలుపక పోయినపుడు పొడుము పీల్చుచున్నారు. మహమ్మదీయ వేశ్యలు వికృతశవాకారమును జూచి బెదరి వారివారి ప్రియులయొద్దఁ జేరినారు. ఉత్సవమంతయు మిగుల గగ్గోలుగ నున్నది. తురకలు ముందునకు బడితెలు చేఁబూని పోవుచున్నారు. కాని నాల్గుహస్తములతోఁ బెద్దపళ్లెరమంత మొగముతో సత్రపుతరవాడి కుండంత తలతోఁ నొరలగాదెవంటి కడుపుతో నున్న మనసెట్టినిజూచి "అరేయోఃషైతాన్ సాదిస్తాహై" (ఇతఁడు పిశాచమువలెఁ గనఁబడుచున్నాఁడు) అనుచు వెనుక నడుగువైచి వెట్టిమొగములతో మరలిరి. తురకలనౌబత్తు లడఁగినవి. మంగళ్ల వీరాంగములు హెచ్చినవి. వెలయాండ్రకనుగీటు లంతరించినవి. వైశ్యరాజు తలత్రిప్పులు ప్రబలినవి. జారుకాళ్లు వెనుకాడుచున్నవి. అంగవస్త్రపుభుజములు ముందునకువచ్చుచున్నవి. బొజ్జయ్యసెట్టి వాహనమునొద్దకుఁ బోవలసిన నేను తురకల దండుతో వెనుకాడవలసి వచ్చినందులకు విచారించుచుంటిని. అంతలోఁ గొందఱు తురకలు నాయొద్దకు వచ్చి "ఇప్పుడేమిచేయవలసిన" దని నన్నడిగిరి. వెనుకకుఁ బోవుట పౌరుషముకాదని నేనంటిని. అంత "బలే బలే" యనుచుఁ గేకలువైచుచుఁ గొందఱుతురక లెదుటిగుంపులోఁ గలియఁబడిరి. తెప్పవేటుకాలములో ననంతశయనముచుట్టు వేలకొలఁది ప్రమథగణము నిలువఁబడియుండెను. తళుకుమనునంతలో ననంతశయనము పుష్పరథమైనది. అట్టెయట్టెచూచుచుండఁగ సెట్టిగారిముక్కు మూరెడై బారెడై వ్రేలాడఁజొచ్చెను. ఒక్కపెద్దదంతము నోటినుండి పైఁకి దలసూపెను. తుందిలుఁడగు బొజ్జయ్యసెట్టి తుందిలోదరుఁడగు విఘ్నేశ్వరుఁడయ్యెను. కడుపుమీఁద చారలు సర్పబంధములయ్యెను. అతని చేతులు శృంగిభృంగులయ్యెను. అతని కాళులయొద్ద గవుడిపోతంత

మూషకము చెవులు నిక్కఁబెట్టి, యల్లలాడుచున్న తురకలగడ్డముల వంకఁ జూచుచుండెను. అట్టు ముందుకు నట్టె వెనుకకు నూఁగుచున్నది. నాకప్పుడు చైతన్యమే లేదు. కొంతసేపటికి స్మృతితెచ్చుకొని చూచుసరికి విఘ్నేశ్వరవాహనము మహమ్మదీయసమాజములోఁబడి యందఱిగడ్డములు కొఱికివైచెను. ప్రమథులు ముసలిమానులుఁ గొట్టుకొని కొట్టుకొని ప్రాణము విసిగి నిలువఁబడిరి. రంజాఁపండుగ 'ఖరాబ్' అయిపోయినదని తురకలు మిగుల విచారించుచున్నారు. అది యేపండుగ యని యప్పుడు నాకుఁ దెలిసినది. ఆదినముననే వినాయకచతుర్థి కూడ వచ్చినది కాఁబోలునని నేనేమియుతోఁచక యనుకొనుచుంటిని. గణనాయకునిఁ బూజించిన మారేడుపత్రి తురకలనెత్తిపైఁ బడుచున్నది. తురకలనోటి సిగరెట్లు గణనాయకునిపైఁ బడుచున్నవి. అప్పుడు విఘ్నేశ్వరుఁడు సర్వమతసామరస్యమునుగూర్చి యుపన్యాసమిచ్చుటకై రథముపై నిలువఁబడి చేయెత్తి మాటలాడఁ జొచ్చెనుగాని కడుపు బరువుచే మాటలాడలేకపోయెను. తుండము వాక్ప్రవాహమున కడ్డు వచ్చునేమో యని దాని నాతఁడు పైకెత్తినట్లె యెత్తి నాచేతనున్న ఖొరానును లాగుకొని నెత్తిపైఁ గొట్టుకొనెను అంతట వెలగపండ్లుగ నేరేడుపండ్లుగ దూర్వలుగ నుండ్రాళ్లుగ నాపుస్తకముమారిపోయెను. అప్పుడా తినఁదగిన వస్తువులసందడిలో మాటలాడఁదగిన యంశము నాతఁడు మఱచిపోయెను. కడుపట్టెపొంగిపొంగి పర్వతసన్నిభమయ్యెను. అంతట కిచకిచమనుచు నానెత్తిమీఁద నేమోచప్పుడయ్యెను. తలయెత్తి చూడఁగ నాచేతిలోని కఱ్ఱచివరనున్న చంద్రుఁడు గణపతిని జూచి నవ్వుచున్నాఁడు. ఇంతలో ఫిరంగులధ్వని వినఁబడెను. గణపతి కడుపాధ్వనితో విడిచిపోయెను. దొడదొడ లింగోటిపూసలు, విభూతిపండ్లు, తిరుచూర్ణపుఁబొట్లములు, లింగకాయలు, శంఖచక్రములు, 'క్రాసు' చిహ్నములు మొదలగునవేమేమో క్రిందఁబడినవి. అంద ఱాశ్చర్యమునఁ జూచుచుండిరి. విఘ్నేశ్వరుఁడు గప్పుమను వెలుతురుతో మాయమయ్యెను. కనుతెఱచుసరికిఁ బెద్దభవనమున నేనుంటిని. తురకలులేరు. ప్రమథులులేరు. మంగళ్లులేరు. వేశ్యలులేరు. ఆభవన మొక్క యాసుపత్రియఁట! ప్రత్యేకముగ స్త్రీలకొరకేర్పరుపఁబడినదఁట. రెండు ప్రక్క

లపై నిద్దఱు పిల్లలు పండుకొనియుండిరి. ఆసుపత్రి కధికారిణియగు నామె నాయొద్దకు వచ్చి "నేను వార్తాపత్రికలోఁ బ్రకటించిన ప్రకటనను జూచియే వచ్చితివి కాదా" యని నన్నడిగెను. ఏమియుఁ దోఁచక ఊఁయని యంటిని. ఇటురా ఇదుగో! పిల్లవాఁడు, పదునెన్మిది మాసముల వయస్సుగలవాఁడు. ఇదిగో పిల్లది, పదఃమూఁడుమాసముల వయస్సుగలది. నీకుఁ గావలసినయెడలఁ దీసికొనిపొమ్మని చెప్పెను. వీరి కుల గోత్రములేమని నేనడిగితిని. అదియేమియుఁ జెప్పవీలులేదని యామె తీవ్రముగఁ బల్కెను. సరేయని యాపిల్లలఁ జెరియొకచంక నెత్తుకొని పోవుచుంటిని. ఆపిల్ల లాకలిచే నేడ్చుచు నేను స్త్రీననుకొని కాఁబోలు పాలు ద్రావుటకు నావక్షమును నోటితో స్పృశింప మొదలిడగ నాకు గిలిగింతయయి కెవ్వున నవ్వుచు మేలుకాంచితిని. లేచిచూచుసరి కెదపై రెండుచేతులు వైచుకొనియుంటిని. సాహెబు, ప్రథమశాఖా బ్రాహ్మణుఁడును మాటలాడుకొనుచునే యున్నారు. సాక్షి కూడ నిద్రించుచున్నాఁడు.

# సాక్షి

## పార్థసారథిస్వామి

జంఘాలశాస్త్రి యిట్లు చెప్పెను.

బొఱ్ఱయ్యసెట్టి కీసడుమఁ బ్రాణము మీఁదికి వచ్చినది. అందుచేత సభా కార్యములు మనకు సరిగ జరుగుచుండుట లేదు. ఆతఁడు కామరసు గుదుర్చుకొనుటకు రాజధాని యగు మదరాసునకు వెళ్లినపిమ్మట నక్కడ ప్రాణవాయు చికిత్సచే రోగహరణము చేయుదునని యెవ్వఁడో వైద్యుఁడు చెప్పినాఁడఁట. రోగచికిత్సచేఁ బ్రాణవాయు హరణము చేయుటయే యిదివఱకు వైద్యప్రపంచమున బాహాటముగ జరుగు చున్నదనియు నీనవీనపద్ధతి యేదో బాగుగ బోధపడలేదనియు, దీనినే oxypathy యని ఆంగ్లేయమునఁ బిలుతురనియు దీనిని గూర్చి సర్వాంశ ములు సవిస్తరముగ ముందుఁ దెలియఁబఱతుననియును సెట్టి సాహాయ్య మునకై యాతనితో మదరాసునకుఁ బోయి యచ్చటనున్న కాలా చార్యులు వ్రాసినాఁడు. ప్రాణనాశనమున కెన్నెన్ని సులభసాధనములు కనిపెట్టఁబడుచున్నవో రోగనాశనమున కన్నియన్ని సులభసాధనములు కనిపెట్టఁబడుచున్నవి. ఈయుత్తరములో దానితరువాయిభాగమును జదివెదను వినుఁడు.

“కందసామి కోవెలయొద్దనుండి నడచి బండ్లునిల్చుస్థలమునకై పోయితిని. అచ్చటనుండి తిరువల్లిక్కేణికి నాకు బండి కావలయునని నేనుగోరఁగఁ బది పదునాల్గు బండ్లవాండ్రు వచ్చి “సామీ! వరుంగో” యని నన్నుఁ దమతమ బండ్లలోఁ గూర్చుండఁ బెట్టుకొనుటకుఁ గొంచెము ‘జబరదస్తీని’ జేయ మొదలిడిరి. నాకిన్ని బండ్లక్కఱలేదు. ఒక్కబండియే

కావలయును. తిరువల్లిక్కేణి కెంతబాడిగ యీయవలయునో చెప్పు మని నేను వారిలో నొక్కని నడిగితిని. నాముఖవైఖరి—మాటరీతిం జూచి యీతఁడెవఁడో తెలుగుజిల్లాలోని మూఢుఁడనియు, ముష్టికో వంటపూటితనమునకో నూతనముగ నచ్చటకు వచ్చినాఁడనియు నీతని యొద్దనున్న సొమ్ము సులభముగ హరింపవచ్చుననియుఁ దలఁచి కాఁబోలు! అందఱుకూడ నన్నే తమబండ్లలో నెక్కించుకొనుటకుఁ బ్రయత్నించుచున్నారు. బండియద్దె తెలియకుండ నేను బండియెక్కుటకు సమ్మతింపలేదు. వారిలో నొక్కఁడు తిరువల్లిక్కేణి కొకరూపాయ యని చెప్పెను. మూఁడణాలకువచ్చెదవా యని నేనడుగ. "పోడాముట్టాళ్" అని యాతఁడు తన యసహ్యతాసూచకముగఁ దబుక్కున నుమిసెను. అంత నొక్కమహమ్మదీయుఁడువచ్చి యరణా కమ్మిచేసికొండి యని పదు నైదణాలన్నరకు దనయభిప్రాయము నగపఱుప నేను మూఁడణాలనియే తిరుగనంటిని. 'జారే! హైవాన్' అని యాతఁడు బండికొరడనెత్తెను. ఇంతలో నొకదాక్షిణాత్యుఁడు తనభార్యతో నచటకు వచ్చి మూఁడు పావులాలకుఁ దిరువల్లిక్కేణికే బండికుదుర్చుకొనిపోయినాఁడు. ఇచట నుండి తిరువల్లిక్కేణికి గల దూరము హెచ్చయ్యెనా! యని నేను సందేహముతోఁ గూడిన వింతతో నిలువఁ బడితిని. ఇంతలో నొకఁడు బండితోలుకొని యటకు వచ్చెను. అతనిమాటవిని యాతఁడు పూర్వ మునఁ దెలుఁగువాఁడని నేనను కొంటిని. "దా" ప్రయోగాదులు "రండి మీా, వస్తుడు" మొదలగుశబ్దములువానినోటనుండి తఱచుగా వెడలినను వాని తెనుగు నాకుఁ గొంచెము బాగుగఁ దెలియుటచే నే నాతనిఁజూచి సంతసించితిని. అదిగాక యాతఁడు నాయెదుట నస్యమును బీల్చుటచే నాకు గుంభకరేచకాదులవలనఁ గలిగినంత స్తిమితతగలుగుఁ బ్రాణమట్టె లేచివచ్చెను. తిరువల్లిక్కేణికి మూఁడుపావులాలిచ్చెదను రమ్మని యాత నితోఁ బలుక నాతఁడు సమ్మతించెను. విద్యుచ్ఛకటమెక్కుట నాకు భయము నసదుపాయము నగుటచే గుఱ్ఱపుఁబండిలోనే పోవుటకు యోజించి యిట్లొనర్చితిని. బండియెక్కగనే 'కొంచెము నస్య' మని యాశకటసారథిపై మందహాసముపఱపి చేయిచాచితిని. అంత నతఁడు నాకు ముక్కుపొడి యలవాటులేదనియు, రొంపభారముచే ములగ చెక్కను సున్నమును దంపి దానిని గుడ్డలోఁబెట్టి బీల్చుచున్నాననియు

నాతఁడు నాగుండె బగులునట్లు నడుము లొటుక్కుమనునట్లు చెప్పెను. ముక్కుల వివరము తగ్గిపోవుచున్నట్లుకనఁబడుచున్నది. దాని ననుసరించి నోటివివరము హెచ్చుగునట్లు కనఁబడుచున్నది. ఈపట్టణమున నస్యకరులలో షణ్ముఖము నాతఁడు దిగంతవిశ్రాంత యశోధురంధరుఁ డనియు నాయవతారపురుషుఁ డిప్పటికిఁ గొన్ని వత్సరములక్రింద నస్తమించెననియు వానితరువాతివారి కాతనిసామర్థ్యము నైపుణియు రాలేదనియు నాతని నస్యస్పృష్టికిఁ బద్ధతియే వేఱనియు, నాకల్పనమే వేఱనియు, నాధోరణియే వేరనియు నర్థమిచ్చెడు మాటలు నాతో బండివాఁడేమో చెప్పినాఁడు. "పొడుము పీల్చనినీకు నస్యమందు నస్యకారకునియందు నింత యభిమానమేల" యని యాతని నడిగితిని. మామేనమామ నస్యప్రియుఁడనియు, నతనికిఁ గలిగిన నస్యగుణగ్రహణశక్తి యింతయని చెప్పుటకు బ్రహ్మతరమైనఁగాదనియు, నతనినస్యరసాస్వాదన సామర్థ్యమొక్కయంశమువలననే తెలిసికొనవచ్చుననియుఁ జెప్పియూరకుండెను. "ఊరకుంటివేల? అదియేదో చెప్పు" మని నే నడుగ "ఏమున్నది. షణ్ముఖము పోయినపండ్రెండవదినముననే మామేనమామ తనదేహము చాలించినాఁడు. షణ్ముఖము చా వాతఁడు వినినప్పటినుండియుఁ దిరుగఁ బొడుముపొత్తి నట్రవ్రేలితో ముట్టలేదు. అంత వాఁడు కడతేరినప్పు డింక బ్రదుకవలసినపని లేదని యాతఁడు మూర్ఛపడి వెంటనే లేచెను. "పొడుము పీల్చ రేల' యని నేనడుగ "ఇఁక ముక్కులున్న సార్థకత లేదు. నాముక్కులాతని వెంబడించిపోయినవి" అని చెప్పెను. ఆదినమే ముక్కుదిబ్బడియారంభము. అలౌకికమైనరొంపభారము. గొంతుకలో బొరగలిగినవి. మిక్కిలి తంటాలు పడితిమి లాభము లేకపోయిన" దని చెప్పెను.

ఈమాటలు జరుగుచుండఁగాఁ దేరువీథిలోనికి వచ్చితిమి. అట జనము మిగులఁ గిటకిటలాడుచున్నది. అనేకశకటములు వరుసలుదీర్చి నిలువఁబెట్టఁబడియున్నవి, మిక్కిలి సందడిగ నున్నది. ఈదినమున నిట్లుండ నేల యని నే నాతని నడుగ నీనెల పెరటాశియనియు నీదినమున శనివారమనియు నీమాసములో వచ్చుశనివారము లన్నిటియందుఁ బాడఁ బార్థసారథిస్వామి కఖండవైభవముతో నుత్సవము జరుగుననియు నందువలననే బండ్లకు 'గిరాకు' హెచ్చుగ నున్నదనియు నాతఁడు నాతోఁ జెప్పెను. మంచిదినముననే దైవదర్శనము లభింపనైయున్నదని

సంతసించి బండిదిగితిని. ఆతనికి మూఁడుపావులా లీయఁబోవఁగ బదు
నాలుగణాలకు మాటలాడి పండ్రెండణా లిచ్చెదరేమి యని యసత్య
మాడి నాయొద్ద బలాత్కారముగ రెండణా లధికముగఁ దీసికొనినాఁడు.

బండిదిగి కృష్ణా! గోపాలకృష్ణా! పార్థసారథీ! యని బిగ్గఱగ
దైవనామపఠన మొనర్చుచు గుడివంకఁ బోవనారంభించితిని. ఇరు
ప్రక్కలఁ గొబ్బరికాయ లరటిపండ్లు కర్పూరము మొదలగు వస్తువులు
గల యంగళ్లనడుమనుండి దారిచేసికొనుచుఁ బోవుచుంటిని. దేవాలయ
గోపురమందు వెలుగుచున్న విద్యుద్దీపికలు పండువెన్నెలలఁ గాయు
చుండెను. తత్కాంతి కఠినములగు స్త్రీపురుషాదులమొగము లందెల్ల
వింతకాంతులు బఱపుచుండెను. కొందఱు స్త్రీలు కొందఱు పురు
షులు గుమిగూడి వంగి యేమేమో చూచుచుండిరి. అచ్చటకుఁ బోయి
చూడఁగ వారు పుష్పమాలలను పుష్పలావికులయొద్దఁ దీసికొనుచు
న్నారు. దమనము, మరువము, గడ్డిమోపులవలె నచ్చటఁ బడియున్నవి.
పూలమాలలతట్టలసంఖ్యకు మితియే లేదు. స్త్రీలకుఁ బూలయం
దుండు నాదరమునకు నేను మిగుల సంతసించితిని. కొప్పులలోఁగాని
జడచుట్టలలోఁగాని వివిధవర్ణములుగల పుష్పములో దమనము మొద
లగు సుగంధద్రవ్యములో లేనివారలు లేరు. స్త్రీలనుజూచియో వారి
కనులయెదుట కలకలలాడుచు గమగమలాడుచు నుండవలయుననియో
కొందఱు పురుషులుగూడ తమవ్రేలుసిగలలో పూలు దురిమియున్నారు.
కాని స్త్రీల కేశపాశముల నలంకారములుగనున్న ప్రసవమాలలు
పురుషుల సగము గొఱుగుడు మొఱకుబుఱ్ఱలపై నసహ్యతాకరములై
యున్నవి. ఏయలంకారము లెవరికుండవలయునో వారికే యుండవల
యును గాని యవి యితరులకుఁదగునా? మగవాని నెత్తికి టోపియో
పాగయో తగునుగాని దమనపు తురాయియో పూలమాలయో
తగునా? బోడిగోడపై తాటాకు మదురుండవలయును గాని కాశీరత్న
లతావితాన ముండఁదగునా? పువ్వులు పొలతులచేరుటయే యుచితము.
వానికి వీరివలన శోభ, వీరికి వానివలన శోభ. అంతేకాని పుష్పమా
లచేఁ బురుషులు పోతుపేరంటాండ్రగుట హేయముకాదా? మరువముచే
నలంకరించుకొని మగవారు మాచకమ్మలగుట యసహ్యతకాదా?

నేను స్వామి కర్పించుటకొఱకుఁ బూలహారమొకటి కొనుటకై వంగితిని. అచ్చటనే యొక చిన్నపిల్లది వంగి పూలు కొనుచున్నది. కాని దానిమొగము నేను జూడలేదు. వెనుక వీపు చేతులు మెడ మాత్రము కనఁబడుచున్నవి! ఆపిల్లకుఁ బదిసంవత్సరములకంటె నెక్కువ వయస్సుండదని నేను నిశ్చయపఱచుకొంటిని. పిల్లగొంతుతో పుష్పముల బేరమాడుచున్నది. మఱియొక తట్టవద్దకుఁబోయి పూలు కొనవలయు ననుకొంటిని గాని యక్కడ మిక్కిలి సందడిగనున్నది. ఈచిన్నపిల్లను 'అమ్మా! కొంచెము ప్రక్కకొత్తిగిల్లు' మని యొకచేతితో దానిని గొంచెము ప్రక్కకొత్తిగించితిని. ఆమె యంతట నదరిపడి యేమేమో తంబళమునఁ దిట్టుచుఁ గోపము పట్టఁజాలక చేతిలోని పుష్పములు మరువము మొదలగునవి నాపైఁ బడవైచెను. తీరఁ దేరిపాఱఁజూడఁగ నామె కన్య కాదు. వివాహిత సంతానవతి కూడను. పూలుకొనుటకు వెళ్లిననాపైఁ బుష్పవృష్టి యిట్లు కురిసినది. తిట్లవర్షము దానితోఁబాటు లేకుండునెడల సరసముగనే యుండును. అట్లు జరుగలేదు. ధనాగమనముతో మానసికాందోళనము రాకతప్పదు. కాంతాగమనముతో సంసారబాధ రాకతప్పదు. ఐహికసర్వసుఖములతోఁ గూడఁ గష్టములు మిశ్రమములు కాకతప్పవు. ప్రాపంచికసుఖస్వభావమదియేయని వేదాంతవిజ్ఞానమును దెచ్చుకొని యాకాంత చేతినుండిరాలిన పుష్పములెంత భోగ్యములో తిట్లుకూడ నట్లే యనుకొని కొనకుండ మీఁదఁబడిన పూలతో నవతలకుఁ బోవుచుఁ బుష్పలావిక కొకయణా విసరివైచితిని. సందడి మిక్కిలిగనుంటచే నీయపూర్వసరస మెవ్వరును జూడలేదు. కాని నేనిట్లు మోసపడుట కాశ్చర్యపడుచు ముందుఁ బోవుచుంటిని.

మనజిల్లాలలోని కన్యలకే యౌవనము శీఘ్రముగ వచ్చుచున్నది. అంతకంటె శీఘ్రముగ నిక్కడి కన్యలకు వచ్చునుగాఁబోలునని నే ననుకొంటిని. ఊదరకొట్టిన యరటికాయలవలె భూమధ్యరేఖాసమీపగతలగు నిక్కడికన్యలు బలాత్కారపరిపక్వదశ నొందుచున్నారు. ఆపిల్లకుఁ బన్రెండేండ్లకంటె నెక్కువలేవు. అయిననేమి? ఒకసంతానము కాంచినట్లు తిట్లలో వింటిని. రెండవ సంతానము నింక నాల్గుమాసములలోఁ గాంచవలసినట్లు దానివైఖరి చెప్పుచున్నది. స్త్రీలదేహములకు నతిశీఘ్రపరిపక్వదశ యెట్లిచ్చుట సిద్ధించుచున్నదో పురుషులబుద్ధులకుఁ గూడ

నట్లే సిద్ధించుచున్నది. మనజిల్లాలవారి దేహదార్ఢ్యము వీరియొద్ద లేదు. కాని మన పదునాలుగేండ్లబాలునికంటె నిక్కడి యావయస్సు బాలుం డధికవిద్యాన్వితుండై యున్నాడు. అధిక ప్రాపంచికజ్ఞాన యుక్తుండై యున్నాడు. ధనమును సంపాదించుట యందలి గుంటచిక్కు లెక్కువగం దెలిసినవాండై యున్నాడు. తల్లిదండ్రుల విడిచి దూరదేశమునకు నొక్కండు పోవుట కెక్కువసాహసము కలవాండయి యున్నాడు. మన దేశమువారికంటె వీరెక్కువ బుద్ధిమంతులని నాయభిప్రాయము కాదు. కాని వీరిబుద్ధి మనవారలబుద్ధికంటె నెక్కువ శీఘ్రముగ వికసించుచున్నది.

ఈయాలోచనములతో నిమ్మళముగ దారిచేసుకొనుచు ముందు నకుం బోవుచుండంగ టక్కున నేదియో కాలికిం దగిలినట్లు కాంగ ముందునకుం బడబోయి యాపుకొంటిని. కాలికిం దగిలినది స్వామిముఖ మండపపుటంచు. అదిదాటి మండపములోనికి నిమ్మళముగం బ్రవేశించితిని. దానికి ననేక స్తంభములున్నవి. దాని కిరుప్రక్కల బొమ్మల దుకాణములు నాలుగైదున్నవి. ఆబొమ్మలచుట్టుం జేరి వానిగరస్పర్శము లొనర్చుచు ముద్దిడుకొనుచున్న బంగరుబొమ్మలు గుంపుగుంపులయి 'కొర్నాటి' చీరల వారు జిలుంగురవికలవా రనేకులున్నారు. బండికందెన నలుపు మొదలు పదునారువన్నె బంగారు వఱకుండు నన్నివిధములగు రంగుల భేదము వారుకూడ నాకిచ్చటం గానంబడిరి. చెవులనవలదుద్దులకాంతులు చెక్కు లకు మంగళపుటారతు లిచ్చుచుండం గొందఱు, ముఖచంద్రికలు విద్యు ద్దీపికలకు విశదత్వ మిచ్చుచుండం గొందఱు, చిత్రచిత్రవర్ణములుగల చీర లకాలశక్రధనువులు గల్పించుచుండం గొందఱు, పిల్లలయేడుపు లూదుకొను గాలితిత్తుల కుపాంగము పట్టుచుండంగ గజ్జెలగుజ్జుములవలె పిక్కటిల్లి గంటలయొడ్డాణములగలగలతో కంకణములగణగణలతో నొయ్యారముగ నడచుచుండం గొందఱు నాకనులం బడి నన్నానంద సాంద్రునిం జేసిరి. దుకాణములోం గజ్జికృష్ణుడు మట్టిరాధ నట్టె ముద్దు పెట్టుకొనుచుండ నాప్రక్కనున్న బోదకాలి ముసలిమొదలారి తనపడుచు టిల్లాలినిం జేయిపట్టుకొని నిమ్మళముగ నడిపించుచుండె. స్తంభము లపైనున్న కాగితపుసీతారాములుకల్యాణమున తలంబ్రాలు వోసికొను చుండం బిళ్లగారొక్కండు తనభార్యకొప్పులోం బూలు ముడుచుచు న్నాండు. ఆషెం యీాతని నెత్తినున్న జిలుగు బెందుబుట్ట దీసి పిలకజుట్టున

మరువపు మొలకఁ బెట్టుచున్నది. అంగడివాండ్రు మృద్దారుపాషాణ పాంచాలికల దుకాణమందే యింతశోభగా నున్నదికదా! ఇందఱు బంగరుబొమ్మల నిట్టి రూపరేఖావయోవిలాసలావణ్య చాకచక్య చమత్కారజ్ఞాన కళాలాలిత్యాతి లక్షణభేదములతో సృజించిన యా పరమాత్ముని యాపెద్దదుకాణ మెంత శోభగనుండునో చెప్పవల యునా? అంగడిలోని మట్టిబొమ్మలకుఁ జైతన్యములేదు. కావున వాని నీబంగరుబొమ్మలు గూని లాలించుచున్నారు. వీరందఱు చైతన్యయుక్తు లగుటచేతఁ దాము మిగిలినబొమ్మలను స్పృశించుచున్నారు. ముద్దుబెట్టు కొనుచున్నారు. ప్రక్కలలోఁ దాఁచుకొనుచున్నారు. అలంకరించుకొను చున్నారు. బొమ్మలకుఁ బోలినబొమ్మలనుసృష్టింపఁ బ్రయత్నించుచున్నారు. విఱిగినబొమ్మలఁ బాఱవైచుచున్నారు. చేయఁదగిన యన్నిచిత్రములను జేయఁగూడని యన్నికార్యములను జేయుచున్నారు. పేదబొమ్మల యంగడివాఁడు కడుపుకక్కుర్తిచే నిట్లు చేసెనుగాని యాపెద్దయంగడి యాతఁ డేకక్కుర్తిచే నిట్లు చేసినాఁడో, అని తుదమొదలు సంగతి సందర్భములేకుండ నేమేమో మనసులో ననుకొనుచు మండపములో నుండి దేవాలయసింహద్వారమువఱకుఁ బోవఁ బ్రయత్నించుచుంటిని.

ఈప్రక్క నాప్రక్క బారులు తీర్చి బిచ్చగాండ్రు కూర్చుండి ధర్మము ధర్మమని కేకలు వేయుచున్నారు. ఇత్తడిపళ్లెరములో మట్టి మూకుళ్లో చేఁబూని వానిలో సీమ యినుపరేకుబుడ్లలో దీపముల నుంచి వానిపొగ గన్నులలోనికి దూరఁ గనులవెంట నీరుగార్చుచు ధర్మమో ధర్మమో యని మొఱ్ఱలిడుచున్నారు. ధర్మము! ఎక్కడి ధర్మము! ఏమిధర్మము? వానియెదుట దివ్యమంగళ విగ్రహులై యనేకు లుండ వారుమాత్రము మనుజకోటిలోఁ జేరియు వికలాంగులై యుండుట యెక్కడిధర్మము? వారియెదుటివారు సర్వసౌఖ్యములతోఁ గిలకిల లాడుచుండ వీరుమాత్రము కడుపుకూటికిఁగఱవై యిట్లువలవల నేడ్చుట యేటిధర్మము? వారు బంగారు వసనములతో వజ్రాభరణములతోఁ దళతళలాడుచుండ వీరుపుట్టగోచులతోఁ జింపిరితలలతో బెకబెకలాడుట యెట్టిధర్మము? సృష్టిలో నింతవైషమ్య మేటిధర్మము? ఈజలతారు పాగలవారు, వజ్రపుటుంగరములవారు, బనారసుకోకలవా రాముష్టి వాండ్రు కేమైన నిచ్చెదరేమో యని కనిపెట్టితిని. వారెవ్వరు వీరివంకఁ

జూడనయిన జూడలేదు. నేను నాయొద్దనున్న వేమో వారల కొక్కొక్క డబ్బుచొప్పున నిచ్చితిని. బిచ్చగాండ్రు మిగిలిరిగాని డబ్బు లయిపోయెను. అంత నొక ముష్టివానియొద్ద నూరక నిలువంబడితిని. ఆముష్టివాఁడు చిన్నవాఁడు. ఆతనితల్లి కాఁబోలు నాతనియొద్దను గూర్చుండి గ్రుడ్డివాఁడ నని యేడువవేమియని యొక్కపోటుపొడిచెను. అదివఱకు నన్ను నిక్షేప ముగఁ జూచుచున్నవాఁ డంతలోఁ గన్నులు గట్టిగ మూసికొని తనకంటి పోటుచేతనో తల్లి కాలిపోటుచేతనో గట్టిగ నేడ్వ నారంభించెను. అంత నొకకవి రచియించిన యొకపద్యము నాకట్టె స్మృతికి వచ్చినది.

కడుపుకక్కుర్తిఁ గలుగనికష్టజాల
మభినయమొనర్చి బీద మహార్తి నేడ్చు
సుఖి యనెడు కీర్తికై యెన్నొ సొగసు లెన్నొ
వగనగవు లేడ్వలేక సంపన్నుఁ డడరు.

గోచిపాతరాయని మొదలు కోటీశ్వరునివఱకు నభినయమేకాని యథార్థప్రాచుర్యము లేదు. జనులనుండి యప్పులు పుచ్చుకొనఁదలఁచు కోమటి మూఁడువేలరూపాయల విలువఁగలిగినవాఁడు మూఁడులక్షల వానియట్లు వైభవవిడంబన మొనర్చును. సుఖికి, దుఃఖికి, ధనికి, దరిద్రునకు, విద్యాన్వితునకు, విద్యావిహీనునకుఁ గూడ నీయెరువు కూనురాగములు తప్పవు. ఆహా! యథార్థ మెంతపనికిమాలినదై పోయినదో! అది నవ్వులోఁ బనికిరాదు. ఏడ్పులోఁ బనికిరాదు. మంచిలోఁ బనికిరాదు. చెడ్డలోఁ బనికిరాదు. సభలోఁ బనికిరాదు. రహస్యములోఁ బనికిరాదు. యథార్థముబలుకుట యిప్పుడు మోటుతనముగ Good manners యెఱుఁగకపోవుటగ Common sense లేకపోవుటగ నేర్పడినది. విచిత్ర దినములు ! ఎటులయిననేమి ? ఆయంధబాలపాత్రమునకు నేనేమైన నీయఁదలఁచితినిగాని డబ్బులేమియు లేవు. రొంటినున్న రూపాయల మార్చి యిచ్చెదనని రొంటిఁ దడుముకొంటిని. అంతట నెలులయంతయుఁ దడుముకొంటిని. రూపాయలు లేవు. వూలుకొనుటకు నంగియున్నప్పు డెవఁడో యామూటను దీసికొనిపోయినాఁడని యనుకొంటిని. ఇచ్చుటకు నాయొద్ద నేమియులేక యట్టెనిలువఁబడఁగ నాహృదయము గరఁగునంతసాపుగ సంతసగ నేడ్వలేదనుకోపముచేఁ గాఁబోలు తిరుగ నా బాలుని యావృద్ధవనిత కొట్టుచుండ నేను జూడలేక మఱియొక వైపు

నకుఁ జూచి సింహద్వారముగుండ నతికష్టమున దేవాలయము ముందు భాగమునఁ జేరితిని.

అక్కడ రెండు స్తంభములున్నవి. ఒక్కటి ధ్వజస్తంభము; ఒకటి గరుడస్తంభము. దానినిండ దీపములు ప్రకాశించుచున్నవి. ఈదీపముల కాంతిచే నాలుగువైపులను వెలుగువైద్యుతదీపికలకాంతిచే నచటచేరి గుంపులుగుంపులయియున్న కాంతలముఖబింబకాంతులచేఁ గన్నులు చీకటులు పడునట్లున్నవి. కొంచెమునేపు కనులను గాజుపఱచి చూడఁగ నొక్కటే కలువలవనము; ఎఱ్ఱకలువలు, నల్లకలువలు, తెల్లకలువలు, వింతరంగులకలువలు పండువెన్నెలలోఁ బ్రకాశించుచున్నవి. "కవిత్వ మెఱుఁగని నాకప్పుడు కవిత యుద్భవించునాయేమి" యను చిన్న సందేహము కలిగినది. అట్టిసందేహమునిచ్చు నాందోళనము కడుపులో మొదట గుబులువలె గలిగినమాట నిజము. అది కడుపునొప్పిగఁ బరిణమించుటచే నట్టిసందేహము వదలిపోయెను.

స్త్రీజనమంతయుఁ గలగలలాడుచు గరుడస్తంభమునొద్ద భక్తితోఁ జేరియుండెను. ఎందులకోయని యటకుఁ బోయితిని. అచ్చట నందఱుఁ జేరి దౌడలు నిమ్మళముగఁ గొట్టుకొనుచున్నారు. కణఁతలపై చిన్నమొట్టికాయలను వైచుకొనుచున్నారు. మోఁకాళ్లపైఁ గొంచెము వంగి చెవితమ్ములను లాగుకొనుచున్నారు.

తురకలు ధ్యానకాలమునఁ జెవులు మూసికొందురు. మనవారు ముక్కుమూసికొందురు. బ్రహ్మసమాజికులు కన్నులు మూసికొందురు. మఱికొందఱు నోరుమూసికొందురు. ప్రార్థనకాలమందలి దేహావస్థలు పలువిధములయియున్నవి. ప్రధానముగుభక్తి యున్నయెడల నివియెన్ని భేదములుగనున్నను బ్రమాదములేదు. దౌడలు గొట్టుకొనవచ్చును గాని మనసులోని యూఁపులాట లాపవచ్చునా? కణఁతలను బొడుచుకొనవచ్చును గాని దుష్టచింతలఁ బొడువవచ్చునా? మోకాళ్లపై వంగఁగలరుగాని మనోనైచ్యమున వంగవచ్చునా? తమ్ములను దిగలాగవచ్చును గాని యహంభావము నూడలాగవచ్చునా? బింకముగఁ బద్మాసనమునఁ గూర్చుండవచ్చును గాని గట్టిగ మనస్సును గట్టదగునా? దైహికావస్థలు మనోనిశ్చలత్వమునకు నందుమూలమున భక్తిజ్ఞానములకు సదుపాయములైయుండఁ బ్రధానములగునట్టి మనస్స్థితులఁగూర్చి మనవారికి

చింతయేలేదు. పైగతులే భక్తియనుకొనుచున్నారు. మతసంబంధమగు ప్రాశస్త్యముకాని మనస్సంబంధమగు నిశ్చలత్వముఁగాని మనకెక్కడఁ గనుపట్టుచున్న దనఁగా — నుదుట — ముక్కుచివర — పృష్ఠదేశమున — ఇట్లనుకొనుచు నేను వనితలుచేరిన యాప్రదేశమునఁ జేరితిని.

అచ్చట నొకవిగ్రహమున్నది. అది నూతనవస్త్రమాలాద్యలంకార సమన్వితమై యున్నది. దానియొద్ద నిద్దఱు శ్రీవైష్ణవార్చకు లున్నారు. వారు "సంతానగోపాలస్వామి" యని కేకలువైచుచుండిరి. ఇంతలోఁ బిల్లయేడ్పు విశేషముగా వినఁబడెను. ఆగుంపులోనుండి యొకకాంత యిట్లు పూజరితో గట్టిగఁ బల్కుచున్నది. "నేను గ్రిందటి సంవత్సరపుఁ బెరటాశినెలలో నీస్వామికి మ్రొక్కుకొంటిని. నాకుఁ దిరుగఁ బెరటాశి రాకుండ సంతానము గలిగినచో నేను స్వామికి వెండితొడు గిచ్చెదనని మ్రొక్కుకొంటిని. ఇదుగో నాకొడుకు; మూఁడుమాసములవాఁడు. ఈతని స్వామికర్పింతునని పిల్లవానిని స్వామికాళ్ళులయొద్దఁ బడవైచెను. అంత పూజరి "ప్రత్యక్షదైవము. ప్రత్యక్షదైవము!" అని కేకవైచెను. ఆమాటలు వినినతోడనే కాంతలందఱు నాదేవునకు మ్రొక్కుకొనిరి. "అక్కా! నీ వేల మ్రొక్కుకొనవు" అని చెల్లెలడుగ "తలతెగినదానను నాకేల" యని చెప్పఁగ నెల్లకాల మిటులేయుందువా యేమి? మ్రొక్కుకొనుము" అని మందలించెను. ఎల్లకాలమనునప్పు డుత్తరజన్మమని నా కర్థమైనది. "అమ్మా! మీరేల మ్రొక్కుకొనలేదు" అని యొకకాంతను బూజరి యడిగెను. ఆమె చిన్నదివలెనున్నది. సంతానవతిగఁ గానఁబడుట లేదు. ఆచిన్నది తలవంచుకొని కన్నుల నీరు నించెను. ఆమె నెఱిఁగిన యామె కాఁబోలు! ముందునకు వచ్చి పూజరి చెవిలో నేమియో చెప్పెను. అంతట నాతఁడు "సంతానమీయఁగలవాఁడు సమర్థుఁడఁ జేయ లేఁడా? సందేహ మొంతమాత్రము వలదు. వచ్చి మ్రొక్కుకొనుమని చెప్పు"మని యనియెను. అంతట నామె మ్రొక్కుకొనెను. మఱియొక యామె దూరమువనుండి చూచుచుండెను. ఆమెను బిలిచి మీరేల మ్రొక్కుకొనరు? అని పూజరి మొగమోటమి లేకుండ నడుగ "నాకుఁ బదుగురు కొడుకులండి! మీదేవునికంటె నాభర్తయే యెక్కువ సంతాన గోపాలస్వామి" యని పరిహాసముగఁ బల్కెను. అంతట పూజరి విసుగు

కొనెను. కాంతలకు సంతానము లేదను నాందోళనము వారికంటె పూజరి కెక్కువుగ నున్నదని నేననుకొంటిని.

“డప్హా”ననూడి “ఫట్ ఫట్”మని మూడుసారులు మంత్రించు సరికి సంతానము గలుగునని పలుకు మంత్రవేత్తను జనులు నిందించుచున్నారు, ఒక్కకషాయము లోపలికి, నొకకాటుక కంటికి, నొకరసాయనము పొత్తికడుపుమధ్యనమున కిచ్చి మండలములోపలఁ బిండోత్పత్తి కలుగఁజేసెదనని వాదించు నాయుర్వేద భిషక్చక్రవర్తిని జనులు మోసగాఁడని దిట్టుచున్నారు. కానియెట్టితప్పయినను దైవనామసంబంధయుక్తమగునెడల నది యాదరణీయమగును. దైవేచ్ఛకు వ్యతిరేకముగ నేదియుఁ జరుగదని వారి నమ్మకము. కాని రాధాదిగోపికాప్రియుఁడగు బృందావనగోపాలుఁడనియు అష్టదేవీభర్తయు పార్థసారథియునగు మధురాగోపాలుఁడనియు నేను వినియున్నాను. సంతానగోపాలుఁడని నేను వినియుండలేదు. ఇట్లు నే నాలోచించుకొనుచు నాలుగడుగులు ముందునకు వైవగ నీపూజరులలో నొక్కఁడును మఱియొకకాంతయుఁ దగవులాడుచుండిరి. నేను గొంచెము దూరముగనుండి వారి తగవు వింటిని. “రెండురూపాయ లిచ్చెదనని చెప్పి యొక్కరూపాయఁ జేతిలోఁ బెట్టెదవా” యని తీవ్రముగ నాకాంత యడిగెను. ఆమె మొగమును మాటను బరిశీలించితిని. “క్రిందటి పెరటాశికి మ్రొక్కుకొనఁగ నిప్పటికి మూఁడుమాసముల కొడుకు గలిగినాఁ”డని చెప్పిన యామెయే యిది యని గ్రహించితిని. ఈమాటలు చెప్పుటకుగాను రెండురూపాయ లిచ్చుట కొప్పుకొని యామెను బూజరి తెచ్చినట్లు నే ననుకొంటిని. ఈ గొడవలు వినకుండ లోనికిఁ బోవలయుననుకొంటిని. కాని స్వామికెదుట తెరవైచియున్నది. నివేదనము జరుగుచున్నదికాఁబోలు! ఎవ్వరిని లోనికి రానిచ్చుటలేదు; తరువాతివృత్తాంతము ముందులేఖలో వ్రాసెదను. జంఘాలశాస్త్రీ! నేను గవినిగాను. నాల్గుమాటలైన పొందికతో వ్రాయ శక్తిగలవాఁడనుగాను. ఇదివఱకెన్నఁడును వ్రాయలేదు. వస్తువులను వర్ణించుటకు శక్తిలేదు. వానివలన నేమైన నీతిని బోధించుటకు శక్తి చాలదు. భాష్యాదులలో నభిప్రాయమును జెప్పఁగలవాఁడను గాని— ప్రపంచతంత్రమునకు దండాన్వయము వ్రాయఁగలవాఁడను గాని—

చిత్తగించవలెను.

# సాక్షి

## పార్థసారథిస్వామి

---

జంఘాలశాస్త్రి పలికెను.

క్రిందటిసారి పెరటాశిమాసమున శనివారమునందుఁ బార్థసారథి స్వామి దేవాలయమున జరిగిన యుత్సవమునుగూర్చి యసంపూర్తిగఁ గాలాచార్యులు వ్రాసినయుత్తరమును జదివితిని. దానితరువాయి యుత్తరమిదిగో! చదివెదను వినుఁడు.

సాక్షికి—కాలాచార్యులు నమస్కారములు.

బొట్టియ్యసెట్టి కింక నారోగ్య మారంభింపలేదు. ఈనడుమ నొక్కయకార్యము జరిగియుండవలసినది. అది జరిగియుండినయెడల జంఘాలశాస్త్రికి వినాయకచతుర్థి దినమునఁ గలిగిన స్వప్నము సత్యమే యయియుండును. చర్మమునకు మర్దనముఁ జేయవలసినమందు లోనికిఁ బుచ్చుకొనవలయునని కొలతగాజుబుడ్డిలోఁ బోసి యాసీసాకు మూఁత బిగించుచుండఁగా నేనతనికొఱ కెందులకో పోయితిని. నన్ను జూడకుండ నే యాతఁ డామందును లోనికిఁ దీసికొనుటకు నోటియొద్ద కెత్తుకొనినాఁడు. నేను జూచి కెవ్వునఁ గేకవైచి యాతనిచేతిని గట్టిగఁ బట్టుకొంటిని. మందొలికి నాచేతులపైఁబడి వ్రేళ్లు గాల్చివైచినది. నేను రాకుండ నింతటినుండి మందు తీసికొనవలదని యాతనికిఁ జెప్పితిని.

ఈదేశమున నెట్టిపనిచేయుటకైన సేవకులు విశేషముగ దొరకుదురు. చేయవలసినపని యెంతనీచమైనదైనసరే? మనదేశమునఁ జిన్నపిల్ల లయిన సేవకులెత్తుకొని యాడించుటకు లజ్జపడుదురు. అట్లు చేయునెడల లంపతాలని బానిసలని యనిపించుకొందురని వారిభయము. ఇచ్చట నిట్టి

సందేహము లేదు. బోదకాళ్లచేఁ గాని యండవాతములచేఁ గాని మహా వికృతస్వరూపులగు మనుజులనైన "రిక్షా"లను బండ్లలోఁ బెట్టి యవలీలగ నానందముగ లాగికొనిపోవుదురు. ఇంతకంటె నధమాధమములగు పనులఁజేయుటకైన నిక్కడ సేవకులు పుష్కలముగ దొరకుదురు. దైవముచేసిన యూర్ధ్వాధఃకాయముల యేర్పాటు ననుసరించి యూర్ధ్వకాయమున కొక్కసేవకుని, నధఃకాయమున కొకని నినుపగోళ్లులతో సెట్టికి నిరంతరగాఢపరామర్శనము చేయుటకై నిర్ణయించితిని. పగలిద్దఱు పనిచేయుచున్నారు. రాత్రిభాగమందు జామున కిద్దఱు చొప్పున "పహరాబదలాయింపు" పద్ధతితోఁ బనిచేయుచుందురు. ఇత్తడి గోళ్లపని కంటె నినుపగోళ్లపని యెక్కువసాపుగ సరసముగ నున్నదని సెట్టి సంతోషపడుచున్నాఁడు.

సరి! ఈగొడవకేమి కాని క్రిందటి యుత్తరమున పార్థసారథిదేవాలయయాత్ర సంతానగోపాలస్వామియొద్ద నాగిపోయినది. శ్రీశ్రీస్వామి వారికి సెనగలసేవ యప్పుడగుటచేఁగాఁబోలు నాలయములోని వారి నందరును బూజరులు వెలుపలకుఁ గొట్టివైచి తలుపువైచినారు. ఈయవకాశము వృథపోవనీయ నేలయని యటునిటుతోచక చూచుచుంటిని. ఎడమవైపున దేవస్థానపువ్యవహారమును జూచు నుద్యోగి కొలువుజేసి యుండెను. అతనియొద్ద భత్యములో మరేమోతీసికొనుటకువచ్చిన వేశ్యలాతనియొద్ద నిలువఁబడియుండిరి. "నీవు నీవంతునకు వచ్చిన యాముదమును తీసికొందువా? దానికి బదులుగ డబ్బులు తీసికొందువా" యని యాతఁడావేశ్యలలో నొకదాని నడుగ "నాముదము తీసికొనఁదగిన జబ్బు నాకేదియు లేదు. డబ్బులే యిప్పించండిమీ" యని బదులుచెప్పెను. దాక్షిణాత్యశృంగారరస పరీతపరిహాసవచనరచనకై మిగుల నలరితిని.

అంత లోనుండి ఘంటానాదము వినఁబడినది. స్వామికి నివేదన పూర్తియగుటచే నందఱును ముందునకుఁ బోవసాగిరి. ఒకద్వారములో నుండి యందఱు పోవలయును. అప్పుడొక కొంతనలిగి యెటులయిన లోనఁ బడితిని. ఇచ్చట స్వామివారి దేవాలయపుఁ బ్రాకారములోనికి వచ్చితిని. ఇక్కడ నందఱితోఁగలసి శ్రీపెరుమాళ్లకు సాష్టాంగపడితిని. ఇక్కడకింక స్వామి అరువదిగజములకుఁ దక్కువదూరములో లేరు. నన్నుఁ జూచి తెలుఁగువైష్ణవుఁడని ద్రావిడీవైష్ణవులు కొంతనిరసనముగఁ

జూచినట్లు నాకుఁదోఁచినది. ఆంధ్రవైష్ణవులు వైష్ణవులుకారని వీరి నమ్మ
కము. "స్వామీ! దాసోహ" మ్మని నేనొక్క యాచార్యపురుషు ననఁగ
నాతఁడు నవ్వుచు "తెలుగువారా" యని యొకసక్కెములు చేయుచు
నానమస్కారములు బరిగ్రహింపకే జుట్టు ముడివైచుకొనుటయందు
నిరంకుశదీక్షచే వర్తిల్లినట్లు నటించుచుండెను. వైష్ణవునకుఁ బ్రథానమగు
శేషగుణము వీరికి నామమాత్రావశేషముగ నున్నది. ఉపపత్తి విశేషిం
చినకొలది శేషత్వము క్షీణించును; కడుపు బరువగుకొలఁది శేషత్వము
లఘువగును. ఎదుటి మండపమునకై నాలుగయిదు మెట్లెక్కుసరికి
నచ్చట శ్రీస్వామివారి యుత్సవవిగ్రహములు వేంచేయింపు చేయఁబడి
యున్నవి. అచ్చటి వైష్ణవులతోఁగలిసి నేను ద్రావిడ వేదమును బఠించి
తిని. మాటలాడుచున్న కాకినిఁ జూచి మనుజు లాశ్చర్యపడునట్లు వారు
నన్నుఁజూచి వింతపడిరి. వారిని నేను లక్ష్యపెట్టక ముందునకుఁ బోవ
నారంభించితిని. అంతట ముందుదారి కచ్చట వెదురుకఱ్ఱ లడ్డుగఁ గట్టఁ
బడినవని రక్షకభటుఁడు చెప్పఁగ వెనుకకు నడచి తిరుగ మెట్లుదిగి
ప్రక్కభాగమునుండి గర్భాలయమునకుఁ బోవ నుంకట్టితిని.

స్త్రీపురుషులు పడుగుపేకలవలె నున్నారు. పెనవైచుకొని
పోవుచున్నారు. పురుషులయజ్ఞోపవీతములు కాంతల కాసులపేరుల
నడుమను జిక్కుకొనుచున్నవి. పురుషులు స్త్రీలుకూడఁ దమచేతులను
ముందుకుంచి వీలగునంతవఱకు చేతులతో దారినిఁ జేసికొనుచున్నారు.
ఆఁడువారికాళ్లను పురుషులు ద్రొక్కుచున్నారు, పురుషుల బుఱ్ఱలు
స్త్రీలచేతి కొబ్బరికాయలతో ఢీడిక్కులు కొట్టుచున్నవి. "అమ్మణ్ణి!
అమ్మణ్ణీ" యని యొక మొదలారి తనకూఁతును గట్టిగఁ బట్టుకొనఁ
బోయి మఱియొకపిళ్లగారి విధవవదినెగారిని, వెనుకవైపునుండి పట్టు
కొనెను. అంతట నా కాంత శాంతమూర్తి యగుటచేతఁగాఁబోలు నూర
కయే యుండెను. కాని యామె మఱఁది కోపస్వభావుఁడగుటచే
మొదలారిని మోఁచేతితోఁ బొడిచెను. ఆపోటు పుణ్యపాపము లెఱుఁ
గని నాకుఁ దగిలెను. ఇచ్చటికాంతలు మనవైపు స్త్రీలవలె గేవలము
పిఱికిస్వభావముకలవారుకారు. అట్టి వెఱ్ఱి సిగ్గుగలవారుకారు. పురుషునిఁ
జూచి పరుగుపరుగునఁ బోయి 'పర్దా' చాటున దూఱువారుకారు.
వారితో మాటాడవలసివచ్చినను బెదవులు దడుపుకొనుచు గ్రుక్కలు

మ్రింగుచు నెట్లు మాటాడవలయునో తెలియక క్రిందిమీఁదగువారు కారు. భర్తలతో నిత్యము సముద్రతీరమునకుఁ బోవువారు. అచ్చట తోడిస్త్రీలతోఁగాని యట్టి తమపురుషులతోఁగాని బహిరంగముగ నాడు కొనువారు సముద్రపునీరు మీఁదఁ జల్లుకొనుచునో, యిసుక నెగర వైచుచునో భర్తల కన్నులకు గంతలుకట్టి యటునిటు పరుగెత్తుచునో, పల్లెవాండ్రతో వారు పట్టిన చేఁపలనుగూర్చికాని, కన్నపాపలను గూర్చికాని పరిహాసముగ నడుగుచు, నితరస్త్రీల సిగ్గుమాలినతనము నకో యితరపురుషుల భార్యాలోలత్వమునకో వెకవెకనవ్వుచుఁ నగలు గల స్త్రీలను జూపి భర్తలను బుగ్గలుఁబొడుచుచు ననుదినము సాయంకాల మునఁ గాలక్షేపము చేయువారు; వీరు విద్యనేర్చినవారు. వాక్చాక చక్యముగలవారు. చులుకఁదనముగలవారు. పురుషులతో నిర్భీతిగఁ గలిసిమెలసి ధైర్యమునఁ బ్రవర్తించుట కలవాటుపడినవారు. కొందఱు స్త్రీలు నామీఁదిమీఁదికి వచ్చుచుండ వారేమనుకొందురో యని భయపడి నేను దప్పుకొనుచుండువాఁడను. నిర్భాగ్యుఁడని చేతగానివాఁ డని కాఁబోలు, వారు నిందాసూచకముగ నవ్వుచుండెడివారు. ఇట్లు బహుకష్టముమీఁద దారిఁజేసికొని నడచుచుంటిని. ముందుగ నొకద్వార మున్నది. దానిగుండ దూరిపోయితిని. ఇప్పటికి గర్భాలయమునఁ జేరితిని.

ఎడమచేతివైపున "చిరియతిరువడి" వేంచేసియున్నారు. వారి ప్రక్కను బన్నిద్దఱాళ్వారు లవతరించియున్నారు. కుడివైపున శ్రీరంగ స్వామియు వారిప్రక్కను వరదరాజస్వామియుఁ బ్రకాశించుచున్నారు. పొగఁగమ్మిన దీపములు దీపములఁ గ్రమ్మినపొగ తప్ప నేమియుఁ గనఁ బడుటలేదు. మంచు విశేషముగఁ గురియుచుండ నడుమ మెరుగుడు పువ్వులు మిగులఁ బ్రకాశించుచున్నట్లున్నవి. వివిధపుష్పముల పరి మళము నారతికప్పూరపు ధూపములసౌరభము ఘ్రాణేంద్రియమునకు మత్తు గలుగఁజేయుచున్నవి. అచ్చటివాయువు మిగుల నుష్ణమైయున్నది. అచ్చట మిగుల నిరుకుగ నున్నది. గర్భదేవాలయమునొద్దనే యుంటిని. ఎందఱు జను లచ్చటనున్నారో లెక్కలేదు. బాగుగఁ గనఁబడుటయు లేదు. ఎదుటఁ బార్థసారథిస్వామి యున్నారనిమాత్రము తెలియును. ఆమూర్తి కనఁబడుటలేదు. బట్టలాఁగుచున్న యాతఁడు బ్రాహ్మణుఁడో

యబ్రాహ్మణుఁడో, ముందునకుఁ ద్రోయుచున్న వ్యక్తి యాఁడుదియో మగదో, బుజముమీఁదఁ జేయివైచినది పుణ్యస్త్రీయో పూర్వసువాసినియో, ఏమియుఁ దెలియుటలేదు. తెలిసికొనుట కూహార్థమైన లేదు. అంద ఱదృష్టియు, మనస్సూ నెదుటి లీలామానుషవిగ్రహామువంక నున్నది. ఆవిగ్రహ మింక నగపడుటలేదు. తలుపులు తెఱచియే యున్నవి. స్త్రీల చెవుల దుద్దులకాంతులు నడుమనడుమ జిగజిగలాడుచు దీపపుఁగాంతులకు నెఱ్ఱపచ్చనీలపు "మహాతాబు" రంగుల నొసంగుచున్నవి. అవిగో నివాళిపళ్లెమునఁ గప్పూరపుజ్యోతులు! అదిగో! శ్రీపెరుమాళ్లవక్షస్థలమున నివసించు మహాలక్ష్మి—అదిగో! తిరుమొగము. అదిగో తిరుభుజము. అదిగో తిరుకర్ణము. సరత్నకుండలమై ప్రకాశించుచున్నది. అదిగో! జగదానందకరమగు నేత్రయుగ్మము. అదిగో తిరుమణి! అదిగో దివ్యకిరీటము. అదిగో వైజయంతము. అదిగో కౌస్తుభము. ఆహా! స్వామి యేమిదివ్యదర్శనము సాయించుచున్నాఁడు! తడతడ తడతడ జనులందఱు లెంపలు వైచుకొన్నారు. చెవులులాగికొనుచున్నారు. పార్థసారథి! గోవిందా! శ్రీనివాసా! యని కేకలు సర్వతోముఖములుగ విజృంభించినవి. అంతటితో నాయారతి యావిగ్రహామునకు కుడివైపునఁ దిరుగుచున్నది. "అదిగో! రుక్మిణి! శ్రీమహాలక్ష్మి లోకమాత! అమ్మణ్ణి! అమ్మణ్ణీ! జగన్మాతా!" యనుచు నందఱు లెంపలు కొట్టికొనినారు. ఆహా! ఆహా! యేమి లోకమాతాపితల వైభవము! నాకుఁ దల్లిదండ్రులగు రుక్మిణీకృష్ణులు, నావంటివారికందఱకు నార్యావర్తమందలి స్త్రీపురుషుల కందఱకుఁ దల్లిదండ్రులు కారా! ఆహా! ఈ కుటుంబమంతయు వారిదేకదా! మనమందఱము సోదరసోదరీభావమున నుండవలసినవారముకదా! ఆహా! స్వామీ! మమ్మందఱను నీకటాక్షమున కర్హులమగునట్లు చేసికొనుము. నీయెదుట భాగ్యవంతుని దరిద్రుని భేదము నశించునుగదా! సుందరవికృతరూపభేదము నశించునుగాదా! పండితశుంఠభేదము నశించునుగాదా! జాతిభేదము నశించునుగాదా! నశింపని దొక్క సోదరభావముతప్ప వేరేదియు లేదుగదా! ఆహా! తల్లీ! తండ్రీ! మే మస్వతంత్రులము. కించిత్‍జ్ఞులము. ఇంద్రియవశ్యులము. పాపచిత్తులము. ఎట్లు రక్షింతురో! ఎట్లురక్షింతురో! ప్రపంచమున మీరు తప్ప మఱేమియు నాధారములేదు. ఆహా! మాధు

లమై జీవములు శాశ్వతమనుకొని ప్రపంచసుఖములు యథార్థమనుకొని మీపాదసేవ మఱచి పామరాధములమై చెడిపోవుచున్నాము. నిష్కారణకటాక్షముచే మీరు మమ్ము రక్షింపవలయునుగాని మాలో నట్టి రక్షణమును బొందుట కర్హత లేదు. రక్షించుఁడు రక్షించుఁ" డని నేనేమో లోపల నాడలు వెలిసియుఁ దెలియని యవస్థతో ననుకొనుచుండఁగ దిరుగ "అదిగో! మంగళపుటారతి అదిగో! పార్థసారథివదన పుండరీకము! నాయనా! నీముఖమండలము నిశ్చలభక్తితో నొక్కసారి చూచువానికిఁ బునర్జన్మభీతి యుండదని పెద్దలుచెప్పినమాట సత్యము కాదా! అదిగో! నాతండ్రి మందహాస మొనర్చుచున్నాఁడు. సత్యమే— నాయనా! నన్నొకసారి నిన్నుఁ గౌఁగిలింపనీయవా? కౌఁగిలింప నీయవా!నాజన్మము కృతార్థము కానీయవా?" యని పెద్దపెట్టున నొక్కసారి యేడ్చితిని. అంతలోనే యొడలు తెలిసి సిగ్గు తెచ్చుకొని నన్నేమనుకొందురో యని యటునిటుఁ జూచితిని. నాయేడు పెవ్వరును వినలేదు. ఎవనిచుట్టునకువాఁడే తదేకధ్యానమున మైమఱచియున్నాఁడు. ఇది యాఁడుది. వీఁడు మగవాఁడను భేదముకూడ నచ్చటనున్న త్రుటికాల మెవ్వరికి లేదని నాయభిప్రాయము. అందఱును మహానందమున స్వామితీర్థమును పుష్పములును శఠగోపమును స్వీకరించిరి. స్వామీ! పార్థసారథీ! తల్లీ! మహాలక్ష్మీ! యనుచు నందఱు మరలిరి. ఉష్ణవాయువుచే నందఱు స్నానమొనర్చినట్లు స్వేదపూర్ణులయి యుండిరి. కాళ్లతోఁ దడుముకొనుచు జాఱకుండ బింకముగనడచుచుఁ దిరుగ ద్వారమునొద్దకు వచ్చుచుండిరి. "నేనిచ్చినమూటయేది" అని ప్రక్కనున్న మనుజునిభుజమునుండి కొంతబరువు గలవస్తువు నొకఁడు లాగుకొనెను. ఆమూట కీచుమని ధ్వనియైనది. దానిలో నేమైన తోలుతిత్తియున్న దేమోయని యనుకొంటిని. ఆమూట నాతఁడు లాగినచోటి నుండి యమ్మయ్యో యని ధ్వనియైనది. అంతట నాతఁడు లాగుకొనుట మాని "అమ్మా! క్షమింపుము. నీవు నాసేవకుఁడ వనుకొంటిని. నీపిల్లను నామూట యనుకొంటి" ననియెను. అంత నాతఁడు సేవకుఁడు కనఁబడకపోవుటచే నాతనికిచ్చినమూట యేమైనదో యని తొందరపడి యటునిటు సంభ్రమమునఁ దిరుగ నారంభించెను. వారిని వీరిని ద్రోచి కొనిపోవ మొదలిడెను. ద్వారము దాఁటెను. నేనుగూడ నాతఁడుచేసిన

త్రోవవెంటనే వెలుపలకు వచ్చితిని. స్తంభముచాటున గ్రీనీడలో నెవఁడో ముసుగువైచికొని కూర్చుండెను. ఆతఁ డతనిసేవకుఁడని నిర్ధారణము చేసికొని "ముండకొడుక! మాట కాళ్ళక్రిందఁ బెట్టుకొని యిచ్చుటఁ గూరుచుంటివా?" యని యాతని రోషముతో గద్దరించెను. మాటయాతఁడు మాటలాడలేదు. అంత నాతఁడు కోపముతో సేవకుని లేవఁదీయఁగ "అతఁడు మూఁగవాఁడనియు నది యాతని ప్రభుఁడు కాదు-ప్రారబ్ధమిచ్చిన మాట" యనియు నెవరో జెప్ప నాతఁడు సిగ్గువడి ముందునకుఁ బోయెను.

మనస్సునగలిగిన మహాతేజ మింద్రధనువు రంగులవలె మారిపోవుచున్నది. దేహములగలిగిన స్వచ్ఛకాంతి దీపపుచాటుదొంగ కాంతుల దాగుడుమూఁతలలోనికి దిగిపోవుచున్నది. సోదరభావము, నిష్కలుషస్వభావము, యథార్థప్రేమము, మాయమై వంకచూపులు, ప్రక్కబారుచేతిజొనుపుటలు, త్రోపులాటలలోనికి దిగిపోయినవి. మా వెనుక స్వామి యిరువదిగజములలో నున్నాఁడు. మాకుఁ గలిగిన స్వచ్ఛభావము మాకిరువదిమైళ్లకు ముందుగఁ బాఱిపోవుచున్నది. ఇంతయే మనుజునిబుద్ధి! ఇంతయే సద్భావము! ఇంతయే వైరాగ్యబలము! ఇంతయే మనోనిశ్చలత! ఇదిగో తీర్థపానము! అదిగో అధరపానము! ఇదిగో గోముఖమందలి జపమాల! అదిగో కొప్పులందలి పూలమాల! ఇదిగో ప్రణామము! అదిగో పరిరంభము! అదిగో జన్మరాహిత్యప్రయత్నము! అదిగో చంకను గవలపిల్లలు! ఇంతే! అట్టె మెఱుపు! అట్టెగాఢాంధకారము! ఏమనిచెప్పుదును! జంఘాలశాస్త్రీ! నాకుఁ గవిత్వ ముండు నెడల నామనసునఁ గలిగిన తుపానెట్టిదో నీకుఁ గొంతవఱకయినఁ దెలియఁజేసియుందును. అట్లుజరుగుట కీజన్మమున నవకాశము లేదు. పోనిమ్ము!

ఏనుఁగుతొండమును చేతఁబట్టి కదలకుండ నాపగల బలశాలు లున్నారు. మోటారుబండ్లను బిగఁబట్టఁగల మహాశక్తిసంపన్ను లున్నారు. కాని మనస్సుకప్పుదాటుల నాపఁగలవారు లేరు. ఎముకలొమ్ము పయిన నాయసకణికల సమ్మెటలచే సాగఁగొట్టింపఁగలవా రున్నారు. లోని యరిషడ్వర్గమును జయింపఁగలవారు లేరు. పర్వతములఁ గఱగింపఁగల పండితశిఖామణు లున్నారు. ప్రాపంచిక కశ్మలతాకలితమగు

మనసును గలగఁజేయగలవారు లేరు. ఎటులయినను మన మొకందు లకు సంతసింపవలసియున్నది. ఇట్టి మహాదివ్యక్షేత్రము లుండుటచేతనే మనమందఱము సోదరసోదరీసహితముగఁ జేరుటయు, నేకకుటుంబము లోనివారము మన మగుదుమను యథార్థమును గ్రహించుటయు, స్వల్పకాలమైన నైహికసుఖవిరాగ ముదయించుటయు, దైవభక్తి మన సున నంకురించుటయు మొదలగు శుభలక్షణములు మనయందుఁ గనఁ బడుటకుఁ గారణమైనది. అట్టి సమంజసతాత్కాలిక మనస్థితి నభివృద్ధి పఱచుకొను భారము మనదై యున్నది.

ఇట్లనుకొనుచు దేవాలయమునకుఁ బ్రదక్షిణ మాచరించితిని. మనదేశమునఁ బ్రదక్షిణము ముందొనర్చి యటుపిమ్మట స్వామిదర్శ నము చేయుదుము. ఇచ్చట నట్టియాచార మంతగాఁ బరిగణింపఁబడుట లేదు. శ్రీయమ్మవారిదర్శనముచేసి యామె యాలయములోని తిరు చూర్ణమును దీసికొంటిని. ఆమెపేరు వేదవల్లి. అంతట వెనుకనున్న శ్రీనరసింహస్వామిని దర్శించితిని. అట్లు తిరుగుచుఁ దిరుగ ప్రధానా లయము ముందునకు వచ్చుసరి కచ్చట జనులు చాల మూఁగియున్నారు. అక్కడ నేమున్నదో యని యటకుఁ బోయితిని. అచ్చట స్వామి ప్రసాద ములనమ్ము నంగడి యున్నది.

స్వామిమండపమునఁ దిరుగ సాష్టాంగపడి వెలుపలకు వచ్చి గరుడ స్తంభమునొద్ద నిలువఁబడితిని. చెమటచే నాబొట్టంతయుఁ గరఁగిపోయి నది. నేను వడహాలనో తెంగలినో తెలిసికొనుట కవకాశము లేకుం డెను. ఒక్కవడహాలస్వామిని నేనచ్చటఁ జూచితిని. ఆతని నాదరముతో సమీపింపఁగ నాతఁడు నేనుగూడ "వడహాల" ననుకొనియుండెఁ గాఁ బోలు! తంబళముతో దేవాలయగర్భ మంత యిఱుకుగ నుండుటకుఁ గారణమేమియని నే నడిగితిని. జనులు విశేషముగ వచ్చి స్వామిని సులభముగ సేవింపఁదగిన యీగర్భాలయ మంతయిరుకుగ నుండునట్లు కట్టఁబడుట కేమి కారణము? ఈప్రశ్న మాతని నడుగఁగానే యాతఁ డేమో తంబళమునఁ దీవ్రకోపుఁడై యు త్తరమిచ్చినాఁడు. నాకుఁ దంబ ళము మాటలాడుటరాదు గాని మాటలాడినయెడల దానియర్థము నాకుఁ జాలభాగము తెలియఁగలదు. ఆ వడహాలస్వామి సాయించిన దే మనఁగా అరువదియేండ్లక్రిందటివఱకు నీదివ్యదేశము వడహాలదేశమై

యుండెను. స్వామికి దిక్కుమాలిన పాదము లేదు. ఏముండకొడుకో
దానిని స్వామికిఁ దగిలించి దివ్యక్షేత్రగుంతయుఁ దగులఁబెట్టినాఁడు.
స్వామి మొగముఁ జూచుట కిప్పుడు పరమాసహ్యముగ నున్నది.
అని యర్థమిచ్చుమాట లరవమునఁ జెప్పినాఁడు. అంతట నేమియు మాట
లాడక యటనుండి బయలుదేరి "ఆహా! ప్రపంచమున నెంతటి మూర్ఖు
లున్నారు! భక్తి ప్రధానమై పరమపవిత్రమైన రామానుజమత మెంత
ధ్వంసమై పోయినది!" అని కనులవెంట నీరు పెట్టుకొనుచు వెలుపలకు
వచ్చితిని. అంత నొక గుండ్రనివస్తువు నాబుజముపైఁ దాకినది. అదరిపడి
నేనట్టె వెనుకకుఁ జూచితిని. నన్ను పెండ్లిచేసికొనఁదలఁచిన వితంతువు
నవ్వుచు నిలువఁబడెను. నే నామెను జూచి కొయ్యయైపోయితిని.
"అన్నయ్యా! నీవంత తొందఱ పడనక్కఱలేదు! నేను తీర్థాటన మారం
భించి దివ్యక్షేత్రములఁ జూడ మొదలిడినకొలఁది నాపూర్వవాంఛ
లన్నియు నశించినవి" యని నవ్వుచుఁ బోయెను. నేనేమియు మాటలాడ
లేకపోయితిని. దివ్యక్షేత్రముల మహిమ యెంతయో వ్రాయుటకుఁ
గాదుకదా! ఊహించుటకైన వలనుపడదుగదా యని యనుకొనుచు
నింటికిఁ బోయితిని. దయయుంచవలెను.

ఇట్లు మిత్రుఁడు,
కాలాచార్యులు.

# సాక్షి

## కాలాచార్యుని వివాహ ప్రయత్నము

దాదాపుగా నయిదు మాసములనుండి మా సత్యపురసంఘ వ్యాపారములు చల్లఁబడినవి. సభాశాలతలుపులపై గొండ్లెము పడినది. జంఘాలశాస్త్రినోటికిఁ దాళము పడినది. కాలాచార్యులముక్కునకు దిబ్బడి పడినది. వాణీదాసుని కవితావనితాగండస్థలమకరికాపత్ర లేఖన సాధనమతల్లియగు 'జేపాళీ' మూలఁబడినది. బొఱ్ఱయ్యసెట్టి తామర కుష్ఠులోఁ బడినది. సువర్ణలేఖనుండి 'సాక్షి' యను నక్షరద్వయము తుడువఁబడినది. కోర్టునకు మే మీయఁదలఁచిన యర్జీకై యూరి మునసబునొద్ద చిన్నవ్యాజ్యము పడినది. అందఱి యదృష్ట మిట్లు పిట్ట తలలు పడినది.

బొఱ్ఱయ్యసెట్టియే యీసభకంతయు లక్ష్మీదేవిపటిక—అతనికిఁ దామర సోకినకొలఁది మాసిరి తగ్గిపోయెను. చెన్నపురివైద్యము నిష్ప్రయోజనమగుటఁ గాలాచార్యులు బొఱ్ఱయ్యసెట్టిని దీసికొని యింటికిఁ జేరెను. కండూతినివారణార్థమైన యాతని యిత్తడిచేతులు చెలరేఁగినకొలఁది దురాచార నిరాసన పరాయణమగు జంఘాల శాస్త్రి కంచుగొంతు బీఁటరేగ మొదలుపెట్టినది. సెట్టి యీనడుమ మాకేమియు ధనసాహాయ్యము చేయకుంటచే సభావ్యాపారములు జరుగుటకు బహుశ్రమముగ నున్నది. ఎటులయినఁ గష్టపడి సభలు చేయుదు మని యెంత ప్రయత్నించినను సాగినదికాదు. కాలాచార్యులు గ్రామాంతరము వెళ్ళవలసివచ్చెను. అతనికి సహాయుఁడుగ జంఘాల శాస్త్రి వెళ్ళవలసివచ్చెను. వారిరువురు పోయిన కొలఁదిదినములకు

నేను వారికై పోవలసివచ్చెను. ఈతొందరలో మేముంటచేత సభ కట్టువడినది.

మాయూరి రాజుగారి తండ్రిగారి యాబ్దికమునకుఁ గాలాచార్యునకుఁ గన్యాదానము క్రింద నయిదువందల రూపాయ లీయఁబడెను. ఈతఁ డస్ఖలితబ్రహ్మచారియనియు, సదాచారసంపన్నుఁడనియు, వేదాంతవిద్యాపారంగతుఁ డనియు, నీతని కీదానము మా ప్రభువుగారిచే నొసంగఁబడినది. ఆరూపాయలు తీసికొని యాతఁ డమితానంద మొందెను. రెంటఁ బోడుముపాత్రికలవైనవానికిఁ బ్రక్కలోఁ బడుచు పోలఁతి సందర్భమగు సన్నివేశము సంభవించెను. ఈనడుమఁ గొంత కాలమునుండి వివాహోద్దేశము మానిన యీయయ్యవారు లరసంచి రూపాయలు కనులఁ బడఁగానే నీరును జూచిన యేనుఁగువలెసంభోగ గంభీరవాంఛా సమారంభ విజృంభణాడంబరుఁడై ప్రకాశించెను. శీతకాలము గేదెలకు, వేసవికాలము గోవులకుఁ, జిత్తకార్తి కుక్కలకు ఋతుకాలమగునుగాని, నరునకుఁ గరమునఁ గాలు రూపాయ లెక్కువగ నెప్పుడుండునో యప్పుడే ఋతువు. అట్లు జనసామాన్యమునకుఁగాఁగ, నంగనాసంగమము కలలయందు, గ్రంథములయందుఁ దప్ప నెఱుఁగని యీయాచార్యశిఖామణి కయిదువందల రూపాయల మూట యసాధారణానంగసముద్దీపకము కాదా! ఈరూపాయ లేమి చేయవలసినదని యానాడు రాత్రి సభలో విచారించితిమి. సభకు మూలధనముగ నిమ్మని జంఘాలశాస్త్రులు చెప్పెను. శ్లేషకావ్యము చెప్పిన కవి కిమ్మని వాణీదాసుఁడు పలికెను. నేనేమియుఁ బలుకకూరకుంటిని. బొజ్జయ్యసెట్టి యభిప్రాయ మిందునుగూర్చి యడుగగ దేవరపల్లి తేనెబారు పాటిపొగాకుఁ దెప్పించి పొడుము దుకాణము పెట్టిన మంచిదని యాతఁడు లేఖఁబంపెను. బొజ్జయ్యసెట్టియభిప్రాయము కాలాచార్యునకుఁ గొంత రుచించెనుగాని ముక్కుబాధకంటె ముదితబాధ యెక్కువగుటచేఁ దుదకు నాతఁడు నిరాకరించెను. "పెండ్లియేయగు నెడలఁ బెండ్లియే యగునెడల" నని రెండుసార్లు పట్టువలతోఁ బలికి బల్లపై నాచార్యు లొకగ్రుద్దు గ్రుద్దెను. అప్పు డాతని వైఖరి చూడగ మా కందఱకుఁ గొంత భయముకలిగెను. అతఁడేదో దారుణోద్దేశములోనఁగలిగినవాఁడువలె మాకుఁ దోఁచెను. ఆమఱునాటినుండి జంఘాల

శాస్త్రియు, నాచారియు సభకు వచ్చుట మానినారు. కారణము తెలియ
లేదు. వారు తఱచుగ రహస్యముగ మాటలాడుకొనుచుండిరని నాకుఁ
దెలిసినది. అట్లు పదునైదు దినములు గడచినపిమ్మట నొకయుత్తరము
నాపేర వచ్చినది. అది జంఘాలశాస్త్రి వ్రాసినది. "కాలాచార్యులకుఁ
బెండ్లి తహతహ యెక్కువగా నున్నది. మనదేశములో నెక్కడను బిల్లలు
దొరకలేదు. దక్షిణదేశమున ద్రావిడకుటుంబములలోఁ బిల్లలు సులభ
ముగఁ జిక్కుదురు కావున నచ్చటకు మేమిద్దఱ మిప్పుడే పోవుచున్నాము.
క్షమింపవలయును" అని యాతఁడు వ్రాసినాఁడు. జంఘాలశాస్త్రి
దేశముల దిమ్మరి కావున నాతఁ డెక్కడెక్కడ కక్కుర్తి పెండ్లికొడుకులకు
కొక్కుపుఁ బెండ్లికూఁతులు దొరుకుదురో బాగుగ నెఱిఁగినవాఁడగుటచే
నాతఁ డీతని నిట్లు కన్యాఖేటమునందుఁ ద్రిప్పసాహసించెను. ఈయుత్త
రము వచ్చినపిదప నాలుగుమాసములు గడచినవి. శాస్త్రి వార్తయే లేదు.
ఆచార్యుల జాడయే లేదు. నేనేమియుఁ దోఁచక నస్థిమితతగ నుంటిని—
వాణీదాసునితో నాలోచింతమన్న నాతఁడు మసూచికపుగంగవెఱ్ఱు
లలో మనువసుచరిత్రలు తలక్రిందుగఁ జదువుచున్నాఁడు.

ఇట్లుండఁగ నొకదినమున నొకతంత్రీవార్త వచ్చినది. "మేము
చిక్కులలో నున్నాము. వెంటనే రావలయును" అని యాశోణపత్రమున
నున్నది. అది కాంచీపురమునుండి వచ్చినది. జంఘాలశాస్త్రి పేరు దాని
క్రిందనున్నది. ఆరాత్రియే బయలుదేరి కాంచీపట్టణమునకుఁ బోయితిని.
రైలుస్టేషనునొద్ద నాకొఱకు వేచియున్న జంఘాలశాస్త్రిని జూచి
"కాలాచార్యు లేఁడని యడుగఁ గారాగృహమున నున్నాఁడని గద్గది
కతో నాతఁడు ప్రత్యుత్తరమిచ్చెను. "ఎందుచేత?" నని దిరుగ నేనడుగ
"మామగారిని మేదరమంచముగ మోదినాఁ"డని యాతఁడు మాఱుపలి
కెను. "పెండ్లియైనదా" యని నేనాశ్చర్యమున నడుగ "శ్రాద్ధయోగ్య
ముగ" నని యాతఁడు జవాబుచెప్పెను. ఇట్లు మాటలాడుచుఁ గారా
గృహమునొద్దకు మేముపోవఁగఁ గాలాచార్యులు దానిలో దీనవద
నుఁడై కూరుచుండెను. నన్ను జూచి బోరున నేడ్వసాగెను. అంతట
నాతని నోదార్చి యేమిజరిగినదని యడిగితిని. అందున కాతఁడు మాఱు
పలుకక యెక్కడకయినఁ బోయి యొకచిటికెడు పొడుము తెచ్చిపెట్టు
మని నన్నుఁగోరగ నేనట్లు తెచ్చి యాతనికి రహస్యముగ నిచ్చితిని.

"మామగారేరి, పెండ్లికూతురేది కారాగృహమేల" యని యాతని నేనడుగ "శాస్త్రీ! నీవు చెప్పుమని యాతఁడు జంఘాలశాస్త్రిని బ్రోత్సహించెను. మాపరిషత్ప్రధాన వాదమూర్తుఁడైన జంఘాలుఁ డిట్లు చెప్పసాగెను.

ఈయూరుచేరకముందు పెరుంబుదూరు మొదలగు దివ్యదేశములకుఁ బెరుమాళ్లను జూచుటకొఱకుఁ గాక పిల్లలను జూచుటకై పోయితిమి. ఉచితవయసుగల కన్య యెచ్చటను దొరకలేదు. పెద్దపిల్ల దానిని చేసికొనుటకుఁ గాలాచార్యుని యూహమైయున్నది. అటుపైని నిచ్చటకు వచ్చితిమి. ఈగ్రామముననే పిల్లలకై రెండుమూఁడు మాసములు తిరుమాళిగ లన్నియు సేవించితిమి. పిల్ల లెచ్చటను దొరకలేదు. తుదకుఁ బ్రాణము విసిగి సత్యపురము పోవలయునని సంకల్పించుకొంటిమి. రైలుష్టేషనుకుఁ బోఁదలఁచియుండఁగా మేము బసచేసిన సత్రములోని కొకవైష్ణవుఁడు వైష్ణవియు వచ్చిరి. ఆవైష్ణవి కాలాచార్యునిజూచి కొంచెము జారిన మేలుముసుఁగు నిమ్మళముగ వైచుకొనఁగ నీతఁడు గట్టిగ లొట్టవైచెను. అది కాలాచార్యునకుఁ గంతుప్రకోపనచిహ్నము కాఁబోలు! ఆవైష్ణవినిదాను వివాహము చేసికొందునని యాతఁడు నాతో రహస్యముగ నప్పుడే చెప్పెను. ఆమె యావైష్ణవునకు భార్య కాఁబోలు"నని నేనంటిని. "కాదు మెడలోఁ బుస్తెలు లే"వని తిరుగ నాతఁడు గట్టిగ లొట్టవైచెను. ఈరెండవ లొట్టతో నావైష్ణవుఁడు మావంకకుఁ దిరిగి దాసోహమ్మని యాతనికి నమస్కరించి నన్నుఁ జూచి కొంత కొఱకొఱలాడెను. కాలాచార్యులు దాసానుదాసోహమ్మని యాతని సేవించి స్వకళ్యాణనాటకమునకు సూత్రధార పుష్పాంజలిగ నస్యభిక్షతోఁ బ్రస్తావన మారంభించెను. ఆపిల్లది యాతని కూఁతురనియుఁ దల్లిలేనిపిల్లయనియు మాకుఁ దెలిసెను. ఆపిల్లకు పదునాల్గు వత్సరములు దాఁటియుండవచ్చునని నాకుఁ దోఁచినది. కాని గోవగనెదిగిన పిల్లయని కాలాచార్యులు సమర్థించెను. పిల్ల నింతకాల మవివాహితగ నట్టిపెట్టియుంచినారేమని నేనడుగ దీనితల్లివంక నేమి తండ్రివంక నేమి పదునేడు సంవత్సరములు వచ్చువఱకు నాఁడువా రీడేరునాచారములేదని యాతఁడు చెప్పఁగఁ గాలాచార్యులు కొంతవిసుగుకొని

నన్నుఁ జూచెను. అది యెఱిఁగి యావైష్ణవుఁడు మాయింట నిషేకమే
యనూనాచారమని తిరుగ సాయింపఁగ నీమారు కాలాచార్యులు
లోకాతీతమైన యొకలొట్టను గటాక్షించెను. నేను సాయంకాలపచన
సామగ్రికై సంతలోనికిఁ బోయితి. నేను వచ్చులోపునఁ గాలాచార్యులు
నావైష్ణవుఁ డేమిమాటాడుకొనిరో కాని యాతనియొద్ద దారిఖర్చులు
పోఁగ మిగిలియున్న నాల్గువందలరూపాయలు నావైష్ణవునిచేతి కీయఁ
డిచ్చెను. ఆ రాత్రి రెండుయామములకు స్వామిసన్నిధిలోఁ బెండ్లి స్థిర
పడెను. నేనింటికి సంతనుండి వచ్చుసరికిఁ గాలాచార్యులు మహానందభరి
తుఁడై యుండెను. రాత్రి వివాహము జరిగినది. కాని యావైష్ణవుఁ
డామరునాటియుదయముననే ప్రయాణమనిచెప్పెను. పెండ్లికూఁతును
భర్తతో విడుచుటకే యేర్పాటుజరిగెను. ఉదయమున లేచి ప్రయా
ణమై పోవుచున్న కాలాచార్యుని మామను సాగనంపుటకయి మేము
కొన్నియడుగు లాతనితోఁ గూడఁ బోయితిమి. అంత నొక వడహాల
వైష్ణవుఁ డెదురుగవచ్చి కాలాచార్యుని మామను 'ఏమండోయిబావ
గారూ! యనిపిలిచి "నీగొంతుకఁగోయ! తెంగలికాపు చేసితివే"మని
యడిగెను. అంత నాతనిమాట వినిపించుకొనకుండఁ గాలాచార్యుని
మామ పోవుచుండఁగ నే నాతనిచేయిపట్టుకొని "మీరు తెంగలివారు
కారా" యని నేనడుగ "కామని" చెప్పెను. అంతట నెత్తినోరుకొట్టు
కొని కాలాచార్యు లేడ్వసాగెను. మాయింట నొంటలేనిదే ఏకాదశీ
శ్రాద్ధము, విధవాశిరోముండనము సిద్ధించినదా యని యరవసాగెను.
అంతటఁ గొందఱచ్చటమూఁగిరి. ఇచ్చట "నీ యిరుతెగలవారికి సంబంధ
ములు బాహాటముగ జరుగుచున్నవనియు తప్పులేదనియు వారు గాలా
చార్యుని మందలించిరి. "శిరోముండనముమాట యేమిటని" కాలా
చార్యులు గట్టిపట్టుదలతో నడుగ నదియు నాలోచింపవలసిన సంగతి
కాదనియు, నప్పటికి వీలు వెంబడిని యథోచితముగ జరిగింపఁబడుననియు
వారిలోఁ గొందఱు పలికిరి. వీథిలో నల్లరిగ నున్నదని భయపడి నేను
గాలాచార్యుని, శానని బిగియుచున్న యాతనిమామను నూతనముగ
వచ్చిన వడహాల వైష్ణవుని సత్రములోనికిఁ దీసికొనివచ్చితిని. ఈక్రొత్త
వైష్ణవునకు మిగులఁ జెవుడు. అతఁడీయల్లరేదో యిదివఱకు గ్రహింపనే

లేదు. ఆతనిపేరు కృష్ణమాచార్యులు; ఆతఁడు లోనికివచ్చి దూరముగ గూర్చుండు పెండ్లికూఁతును జూచి "ఏమే కన్నీ, దూరముగఁగూర్చుంటివి? వెలుపలనుంటివా" యని యడిగెను. అంత మొగము తెల్లబోవఁగఁ గాలాచార్యునిమామ పరుగెత్తుట కుద్యుక్తుఁడయ్యెను. అంత నాతని గట్టిగఁ బట్టుకొంటిమి. కృష్ణమాచార్యులు పెండ్లికూఁతునడిగిన ప్రశ్నమున కిప్పటి కర్థము తెలిసికొంబోలుఁ గాలాచార్యులు తీవ్రతతోఁ "పెండ్లికూఁతు రిదివఱకు రజస్వలయయినదేనా? యని యొడలు తెలి యని కోపముతో మామను సమీపింపఁగ నేనాతని నడ్డగిలితిని. ఈ గందరగోళమంతయును వెఱ్ఱిమొగము వైచుకొని కృష్ణమాచార్యులు చూచుచుండెను. ఈయల్లరియంతయుఁ దన కేట్లర్థమయ్యెనోగాని యాతఁడు "బావా! కన్నె ఱికముకొఱకు కీకుఱ్ఱముండ నింతదూర మెందులకుఁ దీసికొనివచ్చితివి. మీయూరు నీవారులోనున్న దేంద్రవాఁడందులకు సిద్ధపడఁగ నావాలాయత నచ్చుటఁ దీర్పింపలేకపోయితివా! కడుపుమమకారముచేత దేవులాడుచువుగాని యిందులకుఁగూడ శ్రీవైష్ణవుఁడే కాని పనికిరాఁడా? నీవుంచుకొన్న దీనితల్లి బెస్త! వీరికి మంగలివాఁడే కాఁడా కన్నె చెఱఁబాపినది" యనెను. ఆమాటలువిని కాలాచార్యులు రౌద్రమూర్తియై భార్యపైఁబడి పుస్తెలుద్రెంపి మామను మెదలనీయకుండ మాదిగమంచమువలెఁ బడఁగొట్టెను. పెండ్లికూఁతు రేడ్చెను. కృష్ణమాచార్యుల కిప్పటికైన నేమైనఁ దెలిసెనో లేదో తెలియదుగాని యాతఁ డల్లుఁడు మామలను వేఱుచేసెను. కాలాచార్యులిచ్చిన సొమ్మేమయ్యెనోగాని యాతని మామయొద్ద లేదు. అంత నాతఁడును గృష్ణమాచార్యులు గలసి పెండ్లికూఁతును వెంటఁబెట్టుకొనిపోయిరి. సాయంకాలమగుసరికిఁ గాలాచార్యునికొఱకు రక్షకభటులువచ్చి యాతనిఁ దీసికొనిపోయి యిటనుంచిరి. ఆతనిమామ రక్షకభటాధికారి కాళ్లపైఁబడి యాతనిప్రక్కలోఁ గాలాచార్యుని పెండ్లికూఁతునుఁ బడవైచి యింత పనిచేసినాఁడని కొంతపుకారు గానున్నది. తరువాత సబుమేజస్ట్రీటుగారేబదిరూపాయలను మామగారియొద్దదీసికొని యల్లుని గారాగృహమున నుంచినాఁడు. మూఁడుదినములు గారాగృహనివాసము గాని ముప్పదిరూపాయలు 'జరిమానా' గాని మామను కొట్టినందులకై దండ

నముఁ గాలాచార్యునకు విధింపఁబడినది. రూపాయ లేమియు నొద్ద లేకుంటచే నయ్యవారలగా రచ్చట వేంచేసియుండుటకే యంగీకరించినారు. ఱేపు విడుదలయని జంఘాలశాస్త్రి చెప్పి యూరకుండెను.

మఱునాఁ డుదయమునఁ గాలాచార్యునకుఁ బ్రాయశ్చిత్తాదుల జరిగించితిని. ఊరికిఁ బోవుటకుఁ జేతిలోఁ గ్రొత్తకాసు లేదు. అప్పుడు జంఘాలశాస్త్రి యరణా చా॥ టిక్కెట్లు పెట్టి యొకయుపన్యాసమిచ్చినాఁడు. సమకూడినసొమ్ము స్వల్పమగుటచే నందఱము చెన్నపట్టణము వచ్చితిమి. ఇచ్చటినుండి నేనుమాత్రము సత్యపురమునకుఁ బోవుచున్నాను. కాలాచార్యులు "ఆంధ్రద్రావిడీ వివాహనిషేధ" మను నొక గ్రంథమును వ్రాసెనని చెప్పినాఁడు. పేరు బాగుగ లేదని జంఘాలుఁడు చెప్పగ "విశాఖావిపరీతవివాహ విపద్విరోచన" మని దానికి సరసముగఁ దిరుగ నామకరణ మొనర్చెను. ఆగ్రంథ మెప్పుడు బయలుదేరునో చెప్ప లేము.

# సాక్షి

## కాలాచార్యుని వివాహప్రయత్నము

జంఘాలశాస్త్రి యిట్లుపన్యసించెను.

కాలాచార్యుని యకాలవివాహ శ్రాద్ధతంత్రమును నిర్వహించుటకై నిమంత్రింపఁబడిన భోక్తనగు నేనును స్వతంత్రకర్మకర్తయగు కాలాచార్యులును గలిసి యనంతర కర్మపరిపూర్తికై చెన్నపట్టణమున బసచేసితిమి. అక్కడకూడ నితరస్థలముల యందువలెనే వధ్వన్వేషణాభిలాషచేఁ గొన్నిదినము లుంటిమి. పార్థసారథిస్వామి కోవెలప్రక్కనున్న కోమటిబంగాళాలో బసచేసితిమి. మామూటలను జిన్నమేడ మీఁది యొకగదిలో నే నింకఁ బెట్టుచుండఁగనే కాలాచార్యులు మేడ క్రిందకుఁ బోయి నీటిగొట్టమునొద్ద నిలువఁబడి యప్పుడే వధ్వన్వేషణ కార్య మారంభించినాఁడు. ఉదకయంత్రమునొద్ద బట్టలుజాడించుచున్న యొకవైష్ణవిని జూచి "నీకుఁ బిల్లలున్నారా" యని యరవమున నడిగెను. ఆచారిమాటల నామె లక్ష్యపెట్టక నిరుత్తరయై యుండెను. ఆఁడుపిల్లలు దనయొద్దనుండుటచేతఁ జెప్పుట కావైష్ణవి కొంత బెట్టుచేయుచున్నట్లు గ్రహించి "పిల్లలున్నారా" యని తిరుగఁ బ్రత్యుత్తరస్వీకరణబద్ధదీక్షాపటిష్ఠతాపరిపాకుఁడై యాతఁ డడిగెను. ఆమె యాతని వంకఁ గన్ను లెఱ్ఱచేసిచూచి యట్టె ధుమధుమలాడుచు నట్టె రొసరొసలాడుచుఁ దల నడ్డముగ నూఁపెను. అంతట నాచారి 'పిల్లలులేకేమి' అని యామె నెగదిగఁ జూచి 'ఉండఁగ లేరనుట న్యాయమా' యని 'నాలుక తప్పాడిన నోడలు తప్పాడునా' యని తనశారీరశాస్త్రసాహితీ సమగ్రతను సంకోచశూన్యముగ సంక్షేపముగ వెల్లడించెను. అంత నావైష్ణవిరోష

కషాయితలోచనయై "నీతలపగుల; నీ వాఁడుతోఁడునఁ బుట్టలేదా? నీ రూపు కాలిపోను" అని యింకేమో నోట వచియింపరానితిట్టులు తిట్టుచు లోనికిఁ బోయెను. ఈకోపాటోపోద్దీపిత రూపవతీ శాపాలాప కలాపము నాకర్ణములను బడఁగనే నేను మేడనుండి దిగి క్రిందకుఁ బరుగెత్తుకొని వచ్చితిని. కాలాచార్యులు మొఱడువలె నిలువఁబడి యున్నాఁడు. మొగము సంకుచితమైయున్నను నోరుమాత్రము తెఱచి యున్నది. ముక్కుఱములగుండ శ్వాస మాడకుండుటచే నోరే నాసికా కర్మకర్తృత్వమును మీఁదవైచుకొని సన్నిహితసామగ్రి సానుభూతిచేఁ బ్రకాశించుచున్నది. "ఇప్పుడు నిన్నుఁ దిట్టినవారెవ్వరు" అని నేనాచారిని గంతోక్తిగ నడుగ నాతఁడు నామాట వినిపించుకొనక "సంతానవతియెవతెయో కానిదెవతెయో దేహసోధననుబట్టి సుళువుగఁ జెప్పలేమా" యని నన్నడిగెను. ఆప్రశ్నమును నేను వినిపించుకొనక "నిన్నుఁదిట్టిన యాఁడుదెవ్వతె" యని నేనడుగ నాతఁడు నామాటను పాటింపక "కొంచెము నస్యము తెచ్చిపెట్టఁగలవా" యని నన్నుఁ గోరెను. అంతట నేనతనికిఁ గొంచెము పొడుము తెచ్చియిచ్చితిని. దాని నత్యాతురతతో గ్రహించి యుపదేశముద్రను వహించి శ్యామాశ్యాప సంవిధానోపాఖ్యానమును సమగ్రముగ సాయించెను. వివాహితయై సంతానవతియగు ప్రతివైష్ణవియుఁ దనకత్తగారుగను పాలుద్రాగుచున్న బాలిక మొదలు బదుమూఁడేండ్లవయసుగల పిల్లవఱకు బ్రతికన్యను దనకుఁ బెండ్లికూఁతుగను భావించుచున్న కాలాచార్యుఁడు వివాహైక దృష్టిచే నిశ్చలుఁడై యున్నాఁడు. మదపుపిచ్చివంటి మనువుపిచ్చి యాతని నావేశించినట్లు కనఁబడుచున్నది. ఒక్కొకపుడు కడుపులో నున్నపిల్లలఁగూర్చి పెండ్లిమాటలాడ మొదలుపెట్టును. ఈకల్యాణోన్మాదముచే నతనిపూర్వవ్యక్తి కొంతనశించినట్లు స్పష్టముగఁ గనఁబడుచున్నది. పెరుమాళ్లు దివ్యమంగళవిగ్రహమునుగూర్చిన చింతపోయి పెండ్లికూఁతు చామనచాయరూపు చింతలోఁ బడినది. పన్నిద్దరాళ్వారల ప్రభావమును గూర్చిన శిరఃకంపము పండ్రెండేండ్లపిల్లల యొడలి పొంకపుదనములఁగూర్చి నిట్టూర్పులోనికి జారినది. ఒకటియా రెండా మను వేదాంతవిచారణము నాలుగా యయిదా యను పెండ్లికట్నపు సాపత్యశతమును గూర్చిన మీమాంసలోనికి జారినది. శంకరసూత్రార్థ

ఖండనచింత మంగళసూత్రాంక బంధనములోనికి భేదించినది. ఇట్టిపిచ్చి నేను గనిపెట్టి దీనిని వదలుకొనుమని యాతని కెన్నిమారులు చెప్పి నను, "పెండ్లితో నన్నివెఱ్ఱులు వదలు"నని యాతఁడు నన్నోదార్చు చుండెను. మేమావైష్ణవిని గూర్చియే యట మాటాడుకొనుచు దంత ధావనము చేసికొనుచుండఁగా నింతలో నిద్దఱు రక్షకభటులు నొకరక్షక భటాధికారియు మేమున్నకడకు వచ్చి నిలువఁబడి మీరెవ్వరని మమ్మడి గిరి. మేము పరదేశవాసులమని చెప్పి యూరకుంటిమి. "చూడమ్మ"గా రీప్రక్కకొట్టులో నున్నారాయని రక్షకభటాధికారి కాలాచారి నడుగ "నాకేమి తెలియును. నీవేచూడమ్మా" యని కొంతచచ్ఛ్లేషతో జవాబు చెప్పెను. అంత రక్షకభటాధికారి యాగది తలుపునొద్దకుఁ బోయి "చూడమ్మా" యని తట్టుచుఁ బిలిచెను. ఎవరు మీరు? ఇక్కడ మగవా రెవ్వరు లేరు?" అని లోనుండి యొకయాఁడుదానికంఠరవము వినఁబడెను. "మీకొఱకే వచ్చినాము తలుపు తెఱవుఁ" డని యారక్షకభటాధికారి తిరుగ ననఁగ "ఆఁడుదాన నొక్కతె నున్నాను. తలుపుతెఱువవీలులేదు" అని లోనుండి తిరుగ ధ్వని వినవచ్చెను. "తలుపుపగులఁగొట్టి లోనఁ బ్రవేశింతు"మని యారక్షకభటాధికారి యాధికారికారవవైఖరిని బెద రింపఁగ నేడ్చుచు నొకవనిత తలుపు తెఱచెను ఆమెను వెలుపలకు రమ్మని యధికారి కోరెను. కాని యామె రాకపోవుటచే నాతఁ డామెను వెలు పలకీడ్చి చేతుల కరదండములు వగిలించెను. అంత నావైష్ణవి చూడమ్మ నామక కామినీచూడామణి హాహాయని యేడ్చుచు నీకాకిముండ కొడుకు నాకొంప దీసినాఁడని బిగ్గఱగ నఱచుచుఁ గాలాచార్యుని జూపుచు వారివెంటఁ బోవుచుండెను. "కాకి" శబ్దము కాలార్థబోధక మగుటచేఁ గాఁబోలు నట్లామె మనయాచార్యపురుషు నభివర్ణించెను. ఆ మాటలు వినుటతోడనే రక్షకభటాధికారి యిసుమంతయాగి కొంత యాలోచించి కాలాచార్యునిబట్టుకొని తీసుకొనిరండని తనతోడ నున్న రక్షకభటుల కాజ్ఞాపింపఁగ వారు గౌరవపూర్వకముగఁ గాలాచార్యుని ముందునడిపించుచుఁ దాము వెనుక నేగ మొదలిడిరి. రెండవ యర దండలజోడు లేకుంటచేఁ గాఁబోలు గాలాచార్యులు రిక్తహస్తుఁడై పోవుచుండెను. "ఇదియేమి? ఎందులకు? అని కాలాచార్యు లెంత యఱచినను వారెవ్వరు మాటలాడకుంటచే నేను దిరుగ నిరుప

యోగప్రశ్నలను జేయక చప్పున మేడమీఁదికిఁ బరుగెత్తి నూతన గృహప్రవేశముహూర్తఫలము మంచిదేయనుకొనుచు మాక్రొత్తగదికిఁ దాళమువైచి దిగివచ్చి కాలాచార్యుని వెంబడించితిని. ఇట్లు మేము నగర రక్షకభటాలయమునొద్దకుఁ దీసికొనిపోఁబడితిమి. చూడుకుడు తమ్మువా రొకకొట్టులో నుంచఁబడిరి. కాలాచార్యులు సగౌరవమున నరుగుపై గూర్చుండఁ బెట్టఁబడెను. తోడుపెండ్లికొడుకు నగు నేను గొలఁడిదూరమున నాయంత నేనే నిలువఁబడియుంటిని. ఇట్లొకయర గంట జరిగినపిదప నారక్షకభటాధికారి కాలాచార్యునియొద్దకు వచ్చి యాతనితో నిట్లనియెను. నేనుగూడ నటకు రావచ్చునని యధికారి యతీసంజ్ఞయగుటచేఁ బోయితిని. "అయ్యా! ఆచార్యులుగారూ! నన్ను క్షమించుఁడు; మీకు వృథగ శ్రమనిచ్చితిని. ఈవైష్ణవితిరుచూర్ణ ధారిణియయ్యును కరపదకటకాభిరామయయ్యును గళభూషాకలిత యయ్యును వితంతువు. అందులో బాలవితంతువు. ఈమెభర్త తలఁ బ్రాల సమయముననే మరణించెనని ప్రతీతి. ఆతఁడీమెకుఁ దలబ్రాలఁ బోయుచుండఁగ నామె జడచుట్టునున్న మొగలిపువ్వుమీఁద బ్రామా దికముగఁ బైనుండిపడిన యొంటిపూసతేలితని నంటఁబోడుచుటచే స్థాలీపాకపువేళకే కాష్ఠపుటపాకదశ నొందెనఁట. వివాహపరిపూర్తి కాకుంటచేఁ దిరుగ వివాహము చేసికొనవచ్చునని పండితులు నిశ్చ యించిరి. కాని ప్రాణమందలితీపిచే నెవ్వ రందులకు సాహసింపలేదు. ఇదియెంతసత్యమో మనకు తెలియదు. కొన్నిగడియలు హెచ్చుతగ్గు మాటయే కాని "యామె కులదేవతారాధనానాథ" యనుటకుఁ దగి యున్నది. ఆమె తిరువళ్లూరువాస్తవిని. అక్కడ నామెమోక్షసాధన మగు నాచార్యాభిమానమును బరిత్యజించి, వ్యభిచారాభిమానమును స్వీకరించెను. ఆమెకులముమాత్రము వదలుకొని బహిరంగముగ దుష్ట వృత్తిఁజేయలేదు. ఇట్లు కొంతకాలము జరుగ నక్కడ గర్భవతి యయ్యెను. అంతట నామె యీయూరికి వచ్చి మైలాపురములో నొకస్థల మున నివసించి పుణ్యస్త్రీవలెనే ధారాళముగఁ బిల్లనుగని దానినిజంప జేతులురాక యాస్వామికుంటయొద్దఁ బడవైచి యటనుండి పారిపోయి తిరువలిక్కేణిలోనున్న కోమటిబంగాళాలో బసచేసెను. ఈయంశము లన్నియు మాకిప్పుడు తెలిసినవి. మైలాపురము మంతురసాని మాల

ముగఁ గొన్ని జాడలు కనిపెట్టి తుద కిక్కడ నామెను బట్టుకొంటిమి. ఈకాకిముండకొడుకే నాకొంపఁ దీసినాఁడని యామె మిమ్ముఁజూచి యఱచుటచేత నామెకుఁ బుట్టినయాఁడుపిల్లకు మీరు తండ్రియగుదు రేమో యని భ్రమపడి మిమ్మిటకుఁ దెచ్చితిమి. ఆమె మిమ్మట్లు తిట్టుటకుఁగారణమేదియో యామెవలననే వింటినికాన క్షమింపవలెను" అని తటాలున లేచిపోయెను. అంతట 'బ్రతికితిమిరా' యని యనుకొనుచు నింటికి మఱలి వచ్చుచుండగఁ దేరువీథికి సమీపముననున్న వీథిలో నొక గొప్పసభ జరుగుచుండగఁ దానిలోనికిఁ బోయితిమి. అక్కడఁ జీనా దేశమున నెక్కడనో భూకంపమువలనఁ గలిగిన జనోపద్రవమును గూర్చి యొక యుపన్యాసకర్త మాటలాడుచుండెను. ఆయుపన్యాసము దీర్ఘమైనది. దానికిఁ బ్రత్యుత్తరము నేనుగూడ నాసభలోఁ జెప్పవలసి వచ్చెను. కావున నవి రెండును పైరాత్రిని జెప్పెదను. ఇద్దఱయుపన్యాసానంతరమున బంగాళాలోనికి వచ్చితిమి. అతఁడు తలిహా యారంభించెను. నేను వంటపూటింటికిఁ బోయితిని.

# సాక్షి

## దాక్షిణాత్యోపన్యాసము

---

జంఘాలశాస్త్రి యిట్లు పలికెను.

కన్యాన్వేషణపుఁదొందరచేఁ దిరుగఁ గాంగాగృహమునకు వేంచేయవలసినకాలాచార్యులు నాతని యనుగ్రహమునైన నేనుఁ దేరువీథిని జరుగుచున్న సభలోనికిఁ బోయితిమి. అచ్చటి సభ్యులు మమ్ముజూచి కొంచెము వెగటుపడినట్లు నానమ్మకము. నిష్కంచుకుఁడై పోతవిగ్రహమువలెనున్న యాచార్యస్వామిని జూచి "నాన్సెన్సు, గెటవె" యని వారిలోఁ గొంద అనినట్లు నాకు స్వల్పముగ వినఁబడెను. నన్నుఁజూచి "లాంగ్ షాంక్సు" అని "క్యామెలు" అని యేమేమో యనిరి. కాని నాకప్పటికి వానికర్థము తెలియలేదు—ప్రపంచములోఁ దిట్లుదిననివాఁ డెవ్వఁడు—భగవంతుని మొదలు పాకివానివఱకుఁ బ్రజచే మాటఁబడనివాఁ డెవ్వఁడు—జనులు కొందఱును బ్రత్యక్షమున ద్రావిడీస్తనగతిఁ దిట్టుదురు. కొందఱు గోడచాటున "ఘూర్జరీకుచయుగ క్రియ" గూఢముగాఁ దిట్టుదురు. కొందఱు "నాంధ్రవధూటి చొక్కపుంజనుఁగవఁబలె" నరచాలుగఁ దిట్టుదురు. ఎటులయిన, నెవ్వరికయిన నూపిరి ముక్కునబట్టియున్నన్ని నాళ్లు తిట్లుతప్పవు. కాని ముసుగులోని తిట్లకంటెను దోఁబుచ్చితిట్లకంటె ప్రత్యక్షపుదిట్టులే యుభయతారకములని నామతము—తిట్టవలసినవాని నెదుట నిర్భీతిగఁ దిట్టితినిగదా యని సంతుష్టియు నాంతరాగ్రహ భారమోచనము నొందుటచే హృదయబాధోపశమనమును దిట్టిన యతఁడు పొందును. తిట్టఁబడిన యాతనికి స్వలోపజ్ఞానము, కోపనిరాసనము శాంతివృద్ధియుఁ గలుగును. [illegible] నీసబాజనశాపాలాపములు మన సదుపయోగములే యని

నాలో నేను సంభావించుకొనుచు సమీపమున నున్న బల్లపైఁ గూరు చుంటిని. కాలాచార్యులు నిలుచుండియే యెడమయరచేయి విప్పి దక్షిణ హస్తతర్జన్యగ్రమున మూడుమారులుపొడిచి భీకరభేకాభనాసికో ద్రేకుఁడగు నొక్క విశ్వబ్రాహ్మణున కీ సవ్యాపసవ్యకరసమావేశసన్ని వేశమును గనఁబఱచెను. అంత నాతఁడాసంజ్ఞ కర్థము తెలియక కుడిచేతి ముష్టిని తనచెవినొద్ద పెట్టుకొని దానిని ముందునకు వెనుకకు నూఁపెను. కాలాచార్యులసంజ్ఞను గాంచి యాతఁడు మూఁగవాఁ డనుకొని యీవిశ్వబ్రహ్మ తిరుగ సంజ్ఞ చేసెనని నే ననుకొంటిని. అంతట "నన్య మయ్యా" యని గాలాచార్యులు గట్టిగ నఱచెను. మాఁరేడుకాయ యల వాటులేని యాదేశమునఁ గాలాచార్యుని హస్తాభినయనము దురవ గాహమైయుండదా! ఆకేకవిని సభయంతయు వెనుకకుఁ దిరిగి కాలా చార్యుని జూచెను. "సై లెన్సు" అని కొందఱు "నా స్తరన్ ఫూల్సు" అని కొందఱు మహదాశీర్వచనపుఁ బరసతో నక్షతలఁగాఁదలఁచిన పెండ్లికొడుకుపైఁ జల్లిరి. కూరుచుండుమనకుండఁ గాలాచార్యుని గట్టిగ లాగి కూర్చుండఁ బెట్టితిని. అంతకుఁ బూర్వ మచ్చటి యుపన్యాస కర్త యేమిచెప్పుచుండెనో కాని మేము కూర్చున్నపిమ్మట ఇట్లు చెప్ప సాగెను. అతఁ డొకపిళ్లె—కళ్లెపిరాంపిళ్లె" యాతనిపేరని తరువాతఁ దెలిపెను. అతఁడు కొంతకాలము రాజకీయశాసనసభలో సభ్యుఁ డుగా నుండెను. ఆంధ్రదేశమునందు రాజకీయోద్యోగములఁజేసి గౌరవ వేతనమును దీసికొనుచున్నాఁడు. ఆంధ్రభాషాభిమానము పూర్ణముగఁ గలవాఁడు. ఆంధ్రులఁ గూర్చి యేసభజరిగిన నీతఁడే సభాధ్యాకవాట నోచకునికంటె ముందువచ్చును. తోఁచినదేదో లగ్గుబిడియము వదలి మాటలాడును. ఆతఁ డిట్లు చెప్పసాగెను.

"చీనావారేమి మన మేమి అంతావకటే. భ్రాతృత్వము మన దేశములో నవతారంచేసిన బుద్ధుఁడే అంగెవూడ్చినాఁడు. (నో నో యను సభలోఁ గొందఱకేకలు) హుర్రా! ఏమి బుద్ధుఁడు! అందఱి సోదరత్వమును ప్రపంచముకు విడమరచినాఁడు. అతని మోహామత మను తణ్ణి యార్యవర్తపు గుండెకాయలోఁబుట్టి బుస్సుమని పైదిక్కు వారిని చీనావఱకేమి జపానువఱకేమి పూడ్చి జనుల మనస్సులను తన త్వమునుండి (selfishness) యూడ్చి వేసెను! (హియర్ హియర్)( తన

త్వముకాదు తెలుఁగుభాషా గుడ్డివ్వమని నాయొద్దఁగూరుచుండిన కృష్ణా జిల్లా బాలకుఁ డొక్కఁ డఱచెను.) అతని మతపంచదార పానకము ప్రపంచమంత వ్యాపించి ఎల్లవేర్ హృదయములలో ఒక్కకుటుంబత్వ కండచక్కెరగింజలను కిందికి డిస్టిలు చేసెను. (క్లైవండిదు) మంచుకొండల గొలుసుమ్యాలలో పండుకొన్న చీనాబిడ్డపాపఁడు మనచేతికై చూచు చున్నది, హిందూదేశ మొక్కపీకెతో తనధ్వనియొక్క పెద్దమేర కిట్లు అవవలసి యున్నది. (నీవు నోరుమూయకున్న నీగొంతు గోయవలసి నది యని యెవ్వఁడో పిల్లవాఁడు నిష్కళముగ ననెను.) ఓసోదరచీనా! నీహృదయము నల్లలాడించివేసిన భూకంపము మాతలలకు తాకు డిచ్చుచున్నది. అందులో శత్రువూడ్చిన నీమహాబిడ్డల రక్తముతో ప్రపంచపుగాలియంత పీల్చఁబడి (Saturate) అయినది. నీతిత్తులనుండి పైకియెగురుచున్న వేడిగాల్లు కొండరాజములమంచుగడ్డలను నీరుచేయ యోగ్యమై యుండుచున్నది. భూకంపించుసట్టి (Crisis) లో నీవిచ్చిన మూలుగు నాచెవిని నాతమ్ములచెవిని బడి కన్నులగుండగా కారిపోయి నది. ప్రపంచమొగముమీఁద ప్రక్కవేసిన నీసోదరుల కందఱకు వారి వారిహృదయానుభవిత నొప్పులను నీకు విప్పిచూపింప విధియైయుండి యయినది. మాకన్నీళ్లు నీపుండ్లను గడిగి మాడూరకొట్టిమాటలు నీకు మెత్తనిమలామాపట్టుమాటవలసినది. ఓనాగరిక చీనాతమ్ముఁడా! నేనిక్క డేడ్చు సర్వజనయేడుపులను నీవు స్వీకారింప చేయవలెను అని మొద లైనమాటలతో యీ మనతల్లి నేల యేడ్వవలెను.

ఓసభాపతీ! ఓసభ్యతమ్ములారా! మీచెవులకు విప్పవలసిన కొన్నమాటలు నానాలుక కలిగియున్నది. ఏడ్చుటకు మీకిదికంటె దొడ్డఅదను లేదు. (సత్యము సత్యము అని యొకయుత్తరదేశ బాలకుఁ డఱచెను.) ఉపద్రవమునకు మీకన్నులదెఱచి ఉపాదానమునకు మీ సంచు దెఱవవలెను. మీచేతులను బొడుగుగా చాపి పిల్లరహితగతికై యేడ్చుచున్న మీపినతల్లి గాగరయొడిలో మీశక్తికొలఁది వెండి, బంగారములను కురిపించవలసిన వేళ యిది. జాతీయసాయముచేగాని యెత్తుపడిన చీనా లేవదు. అది లేచినగాని శక్తితులాచిప్పలు సరిగ నల్లలాడవు. మనమిచ్చుట తలలను మనసులను జేబుసంచులను గలపి ఉత్తరక్రియలు మొదలుపెట్టవలెను. తల్లి నేలయంతయు గంభీర

గొంతుకలో నాగుండా సాయముచేయమని యరచుచున్నది. మనిషి ప్రకృతి నాలోనుండి సహస్రనాలుకలతో సాయము చేయమనుచున్నది. దేశభ్రాతృత్వముగా జాతిభ్రాతృత్వము నాద్వారముగా సాయము చేయుమని మొఱపెట్టుచున్నది. ఇదిగో చందాపట్టీ శక్తి యంగీకరించు మేరకు సాయముచేయవలెను" అని చెప్పి యాతఁడు కూరుచుండు సరికిఁ గరతాళధ్వను లెగసెను. అంతట సభాధ్యక్షుఁడు లేచెను. అతఁడు మహమ్మదీయుఁడు. ఆతఁ డిట్లు చెప్ప నారంభించెను. Is there any other man coming forward to speak on the Subject ? యని యడుగ నేను లేచితిని. "నీ కింగ్లీషు వచ్చునా?" యని కల్లెపిరాం పిల్లగారు నన్నడుగ "నింగ్లీషు వచ్చినఁగాని తెలుగు మాటలాడ వీలు లేదా" యని నే నడిగితిని. ఇంగ్లీషువచ్చినవారుగాని యీవిషయముల యొక్క యాత్మలో దూరలేదు. గనుక యిట్లు పలికితిని" అని కల్లెపి రాంపిల్లగారు తిరుగఁ బలికిరి. నీపేరెవరని సభాధ్యక్షుఁడగు మహమ్మదీయుఁడు నన్నడుగ "జంఘాలశాస్త్రి" యని నేను చెప్పితిని. అప్పుడు సభాధ్యక్షుఁడు నవ్వుచుఁ "జంగల్ శాస్త్రి కోన్ హారే" అని తనయొద్దఁ గూరుచుండిన పిల్లిగడ్డపువాని నడిగెను. నాపేరు వినుసరికిఁ గొందఱు నావంకఁజూచి చిరకాలమిత్రుని జూచినట్లు సంతోషపడి "జంఘాలశాస్త్రి ముఖ్యముగ మాటలాడవలయును. ఆతని నెవ్వరు నడ్డుపెట్టఁగూడదు జంఘాలశాస్త్రిగారూ! ఉపన్యాసపీఠమునకు దయచేయుఁడు" అని సభలోఁ గొంచెము హెచ్చుతగ్గుగ నందఱు పలికిరి. నే నట్లు ప్రోత్సాహింపఁబడి పీఠ మెక్కితిని. నాయుపన్యాస మిప్పుడు చెప్ప మిగుల నాలస్యమగును గాన మఱియొకసారి చెప్పెదను.

# సాక్షి

## జంఘాలశాస్త్రి యుపన్యాసము

అగ్రాసనాధిపతీ! దాక్షిణాత్యసోదరులార! ఇంతకుముం దుపన్య
సించిన యీ నాయఁడుగారి (కాదు—కాదు—పిళ్లగారు—కళ్లెపిరాం
పిళ్లగారని సభలోఁ గేకలు) నాయనలారా! కళ్లెపిరాం పిళ్లగారి
యుపన్యాసమును సావకాశముగ వింటిని. తదర్థభేదనమునకై తలఁజింపు
కొంటిని! ఉహూ! అంతయు విడలేదు. కొన్నికొన్ని వ్యాసఘట్టములు
దురవగాహదుశ్ఛేద్యదుర్గ్రాహదురవస్థాధురంధరములై యున్నవి. మన
కందఱకుఁ దెలియుటకొఱకే మాటలాడినారుకద; వారుపన్యసించిన
దాంధ్రభాషయేకద! అంతవఱకు మీ కెవ్వరికిని సందేహము లేదుగదా!
మీకందఱకు లేనప్పుడు పైయూరనుండి యొకటి రెండురోజులు
మాత్రమే యిటనుండఁదలఁచిన నాకేల యుండవలయును? నేదెదూడ
లను బెంచుట బహుకష్టము. వానికిఁ బాలెక్కువ విడిచినఁ గష్టమే—
తక్కువ విడిచినఁ గష్టమే. అది చావఁగ దానిస్థాన మలంకరించుటకుఁ
జేతపెయ్య నొకదానిఁ జేయుట యాచారమని మీకంద ఱెఱుఁగక
పోరు. "చెఱుపుటకుఁ జేతపెయ్య చాలదా" యనులోకోక్తి యున్నది.
కాని యథార్థలోకోక్తి యదికాదు. "చేపుటకుఁ జేతపెయ్య చాలదా"
యనునది నిజమైనసామెత—ఎటులయినను జేతపెయ్య యనఁగ నేమో
మీ రెఱుఁగుదురు. ఈనడుమను మాతూర్పుసోదరులు గొందఱాంధ్ర
భాష చచ్చిపోయినదని సెలవిచ్చియున్నారు. దానిని మాదాక్షిణాత్య
సోదరులు సరస్వతీస్తన్యగ్రహణార్థమై చేతపెయ్యఁగఁ జేసి వాడుచున్నా
రేమో యను సందేహము మనపిళ్లగారి విచిత్రవిపరీతాంధ్రభాషోపన్యా

సాక్షన్నమున నాకుఁ గలిగినమాట సత్యము. నేను బుద్ధిహీనుఁడనైనఁ గావచ్చును. కాని గడ్డిదూడను జూచి కాసమలపగేదె చేసిన ట్లీకృత్రిమాంధ్రభాషను జూచి వాణీమహాదేవి మోసపోయి భ్రమపడి సారస్వతరసమును జేపునంతటి బుద్ధిహీనులారా ! (well go on, Enter into the Subject) అని కేకలు (Do not hurry him please) అను మాఱుకేకలు.

నాయనలారా ! నామాటలు వినుట మీకంతకష్టముగానున్నదా? మా యాంధ్రభాషను మీ రిట్లు మాదిగమంచముగఁ జేయుట నాకుఁ గష్టముకాదా ? శిరీషకుసుమపేశలమై, పుట్టతేనెవలె నుట్టిపడుచు, స్వచ్ఛమయి, సరళమై, సకల ఫలచంపకమువలె, సర్వసౌగంధ్యసన్నిపాత సముద్గారిణియై, యశేషజనశిరఃకంపన కారణధోరణి విరాజమానమైన మాయాంధ్రభాషను—మా తేట తెనుఁగుబాసను—మీరేమిచేయుచున్నారు! ఆహా! మీరేమిచేయుటకు సాహసించినారు. దానిని ధ్వంసముచేసినారా ! దానిని గుజూపను జేసినారా ! దాని హంసయానమును ధ్వంసపఱచి కప్పదాఁటుక్రింద ద్రొప్పుచున్నారా! ఆంగ్లేయభాషావాక్యముల బందుకట్టుతో దానిని బిగఁగట్టి చెడఁగొట్టుచున్నారా ? ఆంగ్లేయభాషయెక్కడ? ఆంధ్రభాషయెక్కడ? దానికి దీనికి మంజులతలో, మధురతలో, మార్దవములో నెంతవ్యత్యాసమున్నది. ఆంగ్లేయులే యాంధ్రభాషవంటి మృదులమగు భాషలేదని వేనోళ్ళ దానిని స్తుతించుచుండఁగా మీరు దాని ఝుళంఝుళారవ నూపురాలంకృతము లగు పాదములఁ గణ్ణజ్వరకారకములగు పాశ్చాత్యచర్మపాదరక్షలను దగిలించితిరా! మొలనూలుగంటలచే విలసిల్లు దానిసనసన్నత్యావస్థాస్థానమగు మధ్యమునకు "మొరాకో" తోలుతో మోటుపట్టిని బిగించితిరా ? (Kindly get into the subject అను కేకలు) అనిన మీకుఁ గోపముకాని "Oh sons of the soil" అనఁగ నోమట్టికొడుకులారా! యని యాంధ్రమునఁ బలుకుచున్నా ? (Never mind please అను కేకలు) ఇంతకంటెఁ జెప్పనీయరా ? పోనిండు! మీ యిష్టమువచ్చినట్లే కానిండు! మీ దేశము-మీ దేశస్థులు మీసభ, మీయాలోచనము!

సరే—చీనా దేశమున నెచ్చటనో భూకంప మొకటి కలిగినదనియు నందువలన ననేకకుటుంబము నశించినవనియు మఱికొన్ని

కుటుంబము లన్నశూన్యములై యగతికములై యసాధారణబాధావళీ విధేయములై యున్నవనియును మనమందఱ మిచ్చటనుండి కొంతధనము ప్రోగుఁజేసి చీనాదేశమున కంపి వారి దురవస్థఁ దొలఁగింపవలయు ననియుఁ బిళ్ళగారియుపన్యాసమునకు సారాంశమని నే ననుకొంటిని. అదియే యగునా కాదా—అదే యగునెడల ముందుఁ జెప్పవలసినది చెప్పెదను. కానియెడల నదియేదో సెలవిచ్చితిరేని ముందుఁ జెప్పవలసినది మార్చుకొని చెప్పెదను. (అదే అదే అని సభలోఁ గేకలు)

మంచిది. ఆహా! నేఁడుగదా మహాసుదినము! ఇట్టి మహాపర్వదినమును జూచుటచే మనము మనపూర్వులకంటె మహాదృష్టవంతులము గదా! ఆర్యావర్తదేశ మధిక భాగ్యవంతమైన దేశమను సమీచీనాభిప్రాయము—మీ చీనా విషయకోపన్యాసమువలనఁ దేలుచున్నది. ఆహా ? హిందూదేశము కృతార్థమైనదిగదా ! ఆహా ! తనబాధలను దాను స్వశక్తిచే నివర్తింపఁ జేసికొని ప్రపంచమునసున్న యితరదేశముల బాధలను తనఁజేతనైనంతలో నెగరఁగొట్టఁజాలియున్నది. స్వపోష్య పరపోషణప్రజ్ఞాసాధారణమైయున్నదే! మేలు. అంత మహాశక్తిసంపన్నమైన దెప్పుడైనది. ఇంతయాకస్మికముగ నంతభాగ్యవతి యైనదగుటకు హిమాలయపర్వతపంక్తి యొకసారి హేమాలయపర్వతపంక్తి యయినదా ? కస్తూరివారొక రజతపర్వతము గడచినరాత్రి పరమార్థ రజతపర్వతమైనదా? గోదావరీతీరమునఁ గోహినూరునూరులు బయల్పడెరినవా ! ఊహు! ఏమియు లేదే! కొండలలో వంచుగడ్డలకు సమృద్ధి! నదులలో బొమ్మరాలకు సమృద్ధి! మన్నెములలో శీతజ్వరసమృద్ధి ! శీతల ప్రదేశములలో మహామారికాసమృద్ధి! మహోష్ణప్రదేశములలో మసూచివ్యాధి! మధ్యకాలములో మరిడమ్మ! సర్వదేశ సర్వకాల సర్వావస్థలయందును క్షామసమృద్ధి ! కాని సభలలో మహోపన్యాస పీఠములపై స్వప్నభాగ్యసమృద్ధి! హే! హే! పూర్వపు పూలవరాల సంచులు, రామమాడల గోతము లిప్పుడా మెకుఁ బ్రక్కయెత్తులక్రిందఁ దలయెత్తులక్రింద నుపయోగపడుచున్నవి. పురాతనపు రత్నహిరణ్య నిక్షేపము లిప్పుడు పాతఱఁగోతులక్రింద నోరలనూతులక్రింద నుపయోగపడుచున్నవి. పూర్వపుగొగజ కంఖాణలక్ష్మీసమృద్ధి యిప్పుడు పాల గొట్టములక్రింద బొగ్గు గాలిబండ్లక్రిందను బూర్వపక్షమయినది. రూపాయ

మున కరణావంతున వడ్డితోఁ దెచ్చిన ఋణముతోఁ గట్టిన యగ్గిపుల్లల శాలలోని వ్రాఁతపుల్లల శాలలోని సబ్బుబిళ్లల శాలలోని కత్తకంపసరకు లింటి చలిమంటల క్రింద వీథిగోఁతిపెంటల క్రింద నుపయోగపడుచున్నవి.

దేశభాగ్యసౌష్ఠవ మిటులున్నవి. అదృష్టదినములు గడచిపోయి నవి—బహుదరిద్రస్థితి నది యనుభవించుచున్నది.

ఇంగ్లాండుదేశములోఁ జనసంఖ్యలోఁ దలకొకటి మొత్తముమీఁద దినమున కాదాయ మేదో కొన్ని పెన్సులయిన నుండునుగాని అట్టి దార్యావర్తదేశమునఁ బైసలోఁ బదిలక్షల వంతయిన నుండదని యను కొందును. **The balance is even minus** అని సభలోఁ గేకలు) ఎడమచేతలో రాగిముష్టిచెంబు కుడిచేతిలో నవనవాన్నసత్రశంకుస్థాప నోపయోగమగు వెండితాపియునా? కట్టుబట్టకై యొకచేత జండా పట్టియు నొకచేత భూహిరణ్యదానశాసనపత్రమునా? కాలుకుంటి ఆకాశగమనోపదేశమా?

తానుఁ దరించినతరువాతకదా, యొకనిని దరింపఁజేయుట! తనకుఁ బుట్టగోచిదైన యున్నతరువాతఁగదా యొకని కొక్కనూలుపోఁగయిన నిచ్చుట—తనకుఁ దనవారికొక్కపూటదైన నర తృప్తియినఁదీఱుట కన్న మున్నపిదపకదా యన్యదేశమున కన్నప్రదాన మొనర్చుట—మనకున్న కాసంతసొమ్ము—మనకొఱఁతల దీర్చుటకు—మనబాధలఁ బాపుటకు—మనకడుపుమంటలఁ జల్లార్చుటకుఁ గొంచెమైనఁ జాలియున్నదా? మనలోఁ గోటీశ్వరులు లేనే లేరు—లక్షలకొలది రాబడి వచ్చువారు మిగులఁ గొలఁదిగ నున్నారు—వారిలోఁ గొందఱు ఋణాక్రాంతులై యున్నారు—మిగిలినవారు సామాన్యమధ్యమధ్యామధ్యాధమాత్య ధమావస్థలో నున్నారు. అద్యశనశూన్యులగువార లనేకులున్నారు. అవయవగోపనసాధనము లేనివార లనేకులున్నారు. అట్టి వీరందఱకు సాహాయ్య మొనరింపవలసినవారు మనలోని ధనవంతులే కారా? అట్లు సాహాయ్యమును జేయుచున్నారా లేరా యని విచారింపనక్కఱలేదు. చేయవలసినవారు వారు—చేయఁదగినవారు వారు—పొందఁదగిన వారు దేశస్థులలో మహారిక్తులు. అట్టిసాహాయ్యము లేకుండునేడలఁ జచ్చుటతప్ప గత్యంతరములేని మనదేశస్థులలోని మహాపన్నులు—ఎటులయిన నన్నదానమున మనయార్యావర్తమే యన్యదేశములకంటె

నధికమనుటకుఁ దగియున్నది. ఎచ్చటనో కాశీక్షేత్రమున సత్రము లున్నను, రామేశ్వరమున నన్నదానశాలలున్నను, బ్రజకు విశేష ప్రయోజనమేమి? అక్కడకు క్షుధార్తులు ప్రయాణమగుసరికి వారి దేహములనుండి ప్రాణములు ప్రయాణమగునుకదా! కావునఁ గొంత సొమ్ము చందాలు వేసికొని యట్టి యన్నశాల లచ్చటచ్చట దట్టముగ నుండునట్లు చేయుట కొంతయావశ్యకమైయున్నది.

మనలో నక్షరాస్యులు నూటికిఁ బదుగురైన సరిగలేరు. శేషించిన యశేషజనులు వట్టిశుంఠలని వేఱే చెప్పవలయునా? విద్యాగంధశూన్యులయి, సదసద్విజ్ఞానశూన్యులై, కల్లుపాకలలోనో, కాంతాపరీరంభములలోనో, కలహములలోనో కాలక్షేపము చేయుచున్నారు. వీరికి విద్యఁగఱపినయెడల వీరిలో నెందఱు మంత్రియౌగంధరులుందురో, యెందఱు రామమోహనరాయలుందురో యెవరు చెప్పఁగలరు? దేశక్షేమమునకై పాటుపడు ధీశాలులెందఱుందురో, అట్టివా రజ్ఞానమున నడఁగియుండుట దేశమున కెంతయరిష్టమో చెప్పవలయునా? అట్టి వారిని విద్యాన్వితులఁజేసి వారిమూలమునఁగూడ దేశోద్ధరణముఁ జేయించుట మనదేశమందలి ధనవంతులు చేయదగినకృత్యము కాదా! మన పరిపాలకులగు వారిందువిషయమై యెన్నిపాఠశాల లుంచినను వారు ప్రత్యేకముగ నేమిచేయఁగలరు—సర్కారువా రిట్లు చేయుచున్నపనికి మన ధనయుక్తులు తగువిధములఁ దోడ్పడి యాపనిని విపులతమముగఁ జేయవలసియున్నది.

ఇక నెన్నెన్ని దురాచారములు మాన్పుటకుఁ బ్రయత్నింపవలసియున్నది. ఒక్కటిమాత్రమే సంకుచితముగఁ జెప్పెదను—ఈనడుమ వంగదేశమున 'స్నేహాలత' యేల మరణించెనో మీరందఱెఱిఁగియే యుందురు—పిశాచికంటె, మహామారికంటె భయంకర స్వరూపిణి యగు వరశుల్కమహాశక్తి కగ్నిముఖముగ నీయఁబడిన యాకన్య బలి వార్త ఫిరంగిగుండు ప్రేలుకంటెఁ బిడుగుపాటుకంటె, మహాదారుణముగఁ బడఁగ దేశస్థుల హృదయసీమలఁ గలిగిన భూకంపముకంటెఁ జీనాదేశమునఁ గలిగిన భూకంపము మనకు దుస్సహతరమా?

ఇట్లు మనదేశములోని దురాచార మహాభూత సంక్షోభము వలనఁ గలిగిన తుపానులు—క్షోణీకంపములు—ఆగ్నేయపర్వతజ్వాలా

మాలికావిజృంభణములు — సంఘమరణములు — మొదలగు మహోత్పాతములకంటె, నాయనలారా! చీనాదేశపు భూకంపము మన కెక్కువది కాదు — తలుగని తలమునిఁగిన మహాచింతలు మనకుండ మన దేవులాటయేదో మనము చూచుకొనక యితరుల చింతాలేశములకై కూనురాగములతోఁగూడిన పరామర్శలు పనికిరావు — మనకొంపలు నాల్గు చూరు లంటుకొని కాలిపోవుచుండఁగ వాని నార్పుటమాని పొరుగూరనున్న మఱియొకని వరికుప్ప నార్పుటకై నీటిమోత తగునా? భూమిగలయంతవట్టు కంపములు సిద్ధించుచునేయుండును. సముద్రమున్నంతవట్టు తుపానులు గలుగుచునేయుండును. మహాపాపము పండినప్పుడెల్ల నిట్టి మహోపద్రవము లేవో సిద్ధించుచునే యుండును — ప్రాపంచికావస్థలో సమత్వమును స్థాపించుటకొఱ కవి ప్రకృతిచే నుద్దేశింపఁబడిన సాధనములు — వానికొఱకు మనమిచ్చుట సభచేసి నచ్చియురాని తెనుఁగుతో శోభింప నక్కఱలేదు. పిళ్లగారుచెప్పినట్లు 'తలలను జేబుపంచులను' మైదాపిండిగ లట్టించనక్కఱలేదు — ఐహిక మహోన్నతదశామగ్నతను' బొంది దానితో నత్యంత పాప పరిపక్వతనొంది "Babylon, Ninevao" మొదలగునవి నామావశిష్టముగ నశించినవి — కాని యప్పటి మనదేశస్థులు వానిని దిరుగఁ గట్టుటకుఁగాను మట్టితట్టల నిక్కడినుండి పంపియుండలేదు.

చీనాకేమి! అది స్వతంత్ర దేశము — ఏదయిన నట్టి యుపద్రవము దానిలోఁ గొన్ని పట్టణములకు సిద్ధించినయెడల నందువలనఁ గలిగిననష్టమును దానే కూడ దీసికొనఁగలదు — అధికధనము కావలసినయెడల నదియే యనేక సాధనము లందుకొఱకాలోచించుకొని వాని నాచరింపఁగలదు. దానికి మనసాహాయ్య మనావశ్యకము — పరదేశమున కిట్టి యాపదలలో సాహాయ్యము చేయఁగూడదని చెప్పువాఁడను గాను — మీరు నాయుద్దేశమును బాగుగఁ గనిపెట్టవేడుచున్నాను — ముఖ్యముగ మనము సాహాయ్యము చేయవలసినదే — ఎప్పుడు — మనకు మనము సాహాయ్యము చేసికొన్నతరువాత — మనచిక్కులను మన మూడఁదీసి కొన్నతరువాత — మనపిశాచములను మనము వదలుచుకొన్నతరువాత — మనయేడుపులేవో చల్లాఱినతరువాత — అంతే కాని మనయూఁడువారు, నంతకంటె నేడాకులు తక్కువయగు మనవారిలో

గొందఱు ప్రబలతమాజ్ఞానసముద్రమున మునిఁగి కెక్కు— కెక్కుమనుచుఁ గొట్టుకొని పోవుచుండఁగ జీనాలోని వానలలేమికై మన కిచ్చట వారుణపూజలు—సహస్రఘటాభిషేకము లెందులకు? మన దేశప్రజలు కడుపులు కాలి, కొంపలు కాలి మదులు కాలి యేడ్చుచుండగ మనము చీనా వారి తేయాకుపంట నష్టములకో రైలుప్రమాదమునకో బారుమని విలపించి చేతులతోఁ జెంబులమ్ముకొని చందాపట్టీలను జూపించు టెందులకు? "స్వయంతీర్ణః పరాన్ తారయతి" యను లోకోక్తి వినియుందురా-పరులఁ దరింపఁజేయకుఁడని నేను జెప్పుటలేదు—ముందు మనము తరించి యా పనిఁ జేయుదమని జెప్పుచున్నాను—

అని యూరకుంటిని. అంతట నగ్రాసనాధిపతి లేచి "జంగల్ శాస్త్రీజీ ఫర్మాయించినది బలేగావుంది—చందాపట్టీఫోడ్ డాలో— సచ్చీమాట శాస్త్రీజీ శలవిచ్చాడు. మాకీ లేనప్పుడుబస్—చీనాజాన్తా నహీ—జపాన్కీ జాన్తానహీ" యని గంభీరకరతాళధ్వనుల నడుమఁ గూర్చుండెను—

ఎవయిన దురాచారములఁగూర్చి నన్ను మఱి రెండుపన్యాసము లిమ్మని సభవారందఱు కోరగ నటులేయని యుంటిని

# సాక్షి

## సభా స్వకీయాంశములు

---

మదరాసులోని కల్లైపిరాంపిళ్లగారి యాంధ్రభాషోపన్యాసమును ఖండించిన జంఘాలశాస్త్రి వాగ్ధాటినిఁ జూచి యచ్చటియాంధ్రులు దాక్షిణాత్యులుకూడ మఱిరెండుపన్యాసము లిమ్మని శాస్త్రిని బ్రార్థించిరి. ఆయుపన్యాసము లేవియో తెలియదు. రాజుగారిచ్చిన కన్యాదానధనమును "గేవుమారి" మామగారి యొడిలోఁ బోసి తనభార్య తన వివాహశ్రాద్ధమునకుఁ బూర్వమే యీడేరి గడఁదేరియున్నదను కోపమున మామగారిని జెప్పుదీసికొనికొట్టి రక్షకభటులచేఁ గారాగృహమున బెట్టఁబడిన కాలాచార్యులకుఁ జేజారిపోయిన ధనమును డిందు కొనుటకు మిగులఁ గుతూహలముగ నుండెను. ఇనుపసంకెలలు పడిన గాళ్లింటి వైపునకు మఱలుటకు సంకోచించుచుండెను. ఏదైన నొకవృత్తి జేసికొని మదరాసునందే కొంతకాలముండుటకుఁ గాలాచార్యులు నిశ్చయపఱచుకొనెను. అతఁడొక్కఁ డెక్కడనున్న నేమివినియోగమున్నది? పొడుముఁ దెచ్చి ముక్కుక్రిందఁ బెట్టినఁగాని యెగఁబీల్పలేని శుద్ధసత్వస్వరూపమయిన యాతఁ డేవృత్తి చేసికొనఁగలఁడు. కావున జంఘాలశాస్త్రిని గూడ దనతో నుండుమని ప్రార్థించెను. జంఘాలస్త్రి కేమున్నది! ఆతని కావూటకున్నఁ జాలును. ముందువూటమాట దేవుఁడెఱుఁగును. ఆతఁడు సర్వజనసోదరుఁడు. సర్వదేశనివాసి; ముక్కులకొఱకు నెవరితోనైన మూడుమాటలతో నేస్తమొనర్పఁగలఁడు. వట్టిమడతమనుష్యుఁడు. ఎక్కడ కక్కడకే యిమిడియుండఁగల మనస్సంధులుగలవాఁడు. కావున శాస్త్రికూడ నాచార్యునితో మదరాసున నుండుట కొప్పుకొనెను.

రామానుజకూటములో నాచారి తళిహాకైంకర్యముఁ జేయుచుండఁగా పూటకు మూడణాలన్నర పుచ్చుకొనుచున్న కృష్ణాచారి యన్నసత్రమునందు శాస్త్రి "కొళంబు" కైంకర్యముఁ జేయుచుండెను.

ఏదియోయొకవృత్తి చేసికొనవలయును గాన నేది చేసికొందమని వారాలోచించుచుండిరి. "సుగంధముక్కుపొడి" వర్తకము బహుళముగఁ జేయు నొకమహమ్మదీయుఁ డున్నాఁడని తెలిసి యాతనియొద్దకు వీరుపోయిరి. ఆతనియొద్ద కమీషను ఏజంట్లుగఁ బనిచేయవలయునని కొంతప్రయత్నించిరి. వీరివికృతవేషములు చూచి యామహమ్మదీయుఁడు వీరినిఁ జేర్పకపోవుటచేఁ గాఁబోలు నాతనికి "సలాము" చెప్పి సముద్రపుటొడ్డునకుఁ బోయిరి. అచ్చట నొక వైష్ణవుని గాంచిరి. అతఁ డింగ్లీషు మర్యాదననుసరించి దుస్తులుధరించి కంటికి జోడుపెట్టుకొని చేతితో కఱ్ఱనుబుచ్చుకొని యటునిటు దిరుగుచుండెను. ఆతఁడు నవ్వు మొగముగలవాఁడగుటచే నాతనియొద్దకుబోయి మనవారు నిలువబడిరి. well Good Evening, What can I do for you? అని మృదులముగ నాతఁడుపల్క దానికర్థము కాలాచార్యునకుఁ దెలియలేదు. "మీవలననే మేలుకోరి యుంటి" మని జంఘాలశాస్త్రి ప్రత్యుత్తరము చెప్పెను. అతఁడు తెనుఁగు బాగుగవచ్చినవాఁడగుటచే సరే మీకేది కావలయునో యిదివఱకు చూచుకొంటిరా? యని వారి నడిగెను. "ఇది వఱకు చూచుకొంటిమి. కాని మాకు నచ్చలేదు. మీరే యేదయిన నాలోచించి మాబాధ దొలఁగింపవలయును" అని జంఘాలశాస్త్రి తిరుగఁ జెప్పెను. సరేయని యాతఁడు కొంతసేపాలోచించి జేబుగడియారము నకై జేబును దడుముకొనెను. పొడుముపొత్తికొఱకు వెదకుకొనుచున్నాఁడని కాఁబోలు కాలాచార్యు లూర్ధ్వశ్వాసపురస్సరముగా నెడమచేయి చాచెను. చేయిముడుచుకొమ్మని యర్థమిచ్చున ట్లాతని కాలిపై శాస్త్రి ప్రచ్ఛన్నముగఁ దన్నెను. "మీకు దెలుఁగువారు కావలయునా? అరవలు కావలయునా? యని యాతఁడు మనశాస్త్రినడుగ నెవ్వరయిననేమి మాకు సగౌరవముగా జరుపువారయిన జాలునని శాస్త్రి బదులుచెప్పెను. well give me an advance of two rupees అని యాతఁడు చేయిఁచాచెను. మనవారిద్దఱవద్దను గలిసి యేడణాలున్నవి. "మీకిచ్చుటకు మాయొద్ద నేమున్నది?" అని శాస్త్రిచెప్పెను. కొంచె

మర్థ మెట్లు తెలిసెనో కాని రెండురూపాయ లున్న బొడుము వస్తకమే మొదలిడియుండుమని కాలాచార్యులు దరిద్రతాసూచన నస్యవాంఛా పరిపోషకమగు వాక్యమును జెప్పెను. 'పోడామున్గాళ్' అని యాతఁడు గిరుకు—మని దిరిగి కట్టను జక్రాకారమునఁ ద్రిప్పుచు నీలవైచుకొనుచుఁ బోయెను.

జంఘాలశాస్త్రి భుజించుచున్న యన్నసత్రమున కధికారియగు కృష్ణాచారి యటకు వచ్చి హేళనముగ వెకవెకలాడుచు "శాస్త్రీ! అవర గళుకు" సరసము కావలసివచ్చెనా యని జంఘాలశాస్త్రి వీఁపుపైఁ దట్టుచు ననెను. అంతట శాస్త్రి "ఆకట్టుచేతి పెద్దమనుష్యుఁ డెవఁడని కృష్ణాచార్యులు నడిగెను. అతఁ డీపట్టణమున "లంజలయేజంటని" వంట పూటిమేనేజరు బకులు చెప్పెను. అంతట మనవారు లెంపలు వైచికొని యానాటి కింటికిఁ బోయిరి. ఆరాత్రియంతయు నిదురలేకుండ నేవృత్తి చేయవలయునో యోచించిరి. తుట్టతుదకు "కాఫీ హోటలు" పెట్టిన మంచిదని నిశ్చయించిరి. కాలాచార్యుల మామగారు తనవివాహ కర్మా చరణసమయమునఁ దనకొసఁగిన దర్భముడియుంగరము కృష్ణాచారి కమ్మి పదిరూపాయలనుఁదెచ్చి మరునాఁటిసుదయమునసే సన్నిధి వీథిలో Victoria Coffee Hotel (విక్టోరియా కాఫీ హోటలును) స్థాపించిరి. గాలాచార్యులే యీసంస్థానమునకు నలుఁడు, జంఘాలశాస్త్రియే కోశాధికారి. ఇట్లు మూడుమాసము లగుసరికి ఓ! దివ్యభవనము ఎక్కడఁజూచిన నిలువుటద్దములే! రవివర్మపటములే, కుర్చీలే, బల్లలే, నివాడ వెండితోఁ జేసిన గరిటెలే, వాలుకుర్చీలే! వంటవాండ్రు వడ్డన వాండ్రందఱు దాతీణాత్యులే. వారిపని పెళపెళలాడిపోయినది. ఊరి వారినుండి రావలసినసొమ్ము మూడువేలున్నది, మనవారు కోమట్ల కీయ వలసినది నాల్గువేలున్నది. సాయంకాలమున వారంటువచ్చినది. సూర్యో దయ మగుసరికి "హోటలుతో" గూడ మనవారు మాయమైరి. వీరొక మాసము వఱకుఁ బ్రచ్ఛన్నముగ నెటులోఁ గాలక్షేపము చేసి (George Town) జార్జిటవునులో చెంగాయంగడి సమీపమున (North and South) నార్తు అండు సౌతు అను కాఫీ హోటల్లును దిరుగఁ బెట్టిరి. ప్రచ్ఛన్నతకై జంఘాలశాస్త్రి గడ్డము పెంచెను. కాలాచారి గడ్డము గొరిగించెను. ఇట్లు క్లిష్టముగ బాధుకొని కొంతధనము సేకరించి కొలఁది

రోజులక్రిందటనే మాసత్యపురమున కాకస్మికముగ వారు వచ్చిరి. వారు తెచ్చినసొమ్ము నూటయిరువదిరూపాయలు. దీనిని సాక్షి సంఘమునకు మూలద్రవ్యముగ నొసఁగిరి.

వాణీదాసుఁ డీనడుమ గవిత్వమును మాని గ్రామ్యగ్రాంధిక వాదములలోఁ జిక్కుపడి తూర్పుననే పడియుండెను. జంఘాలశాస్త్రియుఁ గాలాచార్యులు వచ్చినారని తెలిసి యాతఁడుకూడఁ బదిదినముల క్రిందటనే యిటకు వచ్చినాఁడు. పరమపదించిన బొఱ్ఱయ్యసెట్టి రాఁగలిగి యుండునెడల తిరుగ నయిదుగురము పూర్తియయి యుందుము బొఱ్ఱయ్యసెట్టి స్థానమున నెవరినైన సభ్యుని జేర్చుకోవలసియున్నది దరఖాస్తు లంపుకొనువారు పంపుకొనవచ్చును.

తిరుగ నుపన్యాసము లిమ్మని గ్రామస్థులు కోరుచున్నారు. సాధ్యమైనంత త్వరలోఁ బూర్వపద్ధతి నవలంభింప వలయునని చూచుచున్నాము.

చెన్నపురి: వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్‌వారి
'వావిళ్ల' ప్రెస్సున ముద్రితము—1954.